భాగవత కథా గ్రంథమాల 14, 15 పుష్పములు



# జడభరతుడు

రచన:- శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిజీ

అనువాదము:- శ్రీ రామ శరణ్





కథా గ్రంథమాల

మచిలీ పట్టణము

బ్రాంచీలు:- బుద్దాం :: బాపట్ల

వెల 4-50

శ్రీ రామ శరణ్

# కుందుర్తి వేంకట నరసయ్యగారి ప్రచురణలు

| | |
|---|---|
| శ్రీరామ మంత్రానుష్ఠానము | 2-50 |
| భాగవత కథ 1వ భా॥ నుండి 12 భా॥ వరకు భా॥ 1కి | 2-50 |
| నవవిధ భక్తులు | 2-50 |
| కలిసంతరణోపనిషత్తు (వ్యాఖ్యానము) | 1-50 |
| సంకీర్తన మీమాంస | 0-10 |
| భారతీయ దర్శనము | 1-50 |
| పరమార్థ తత్త్వము | 0-75 |
| అర్థ పంచకము | 0-75 |
| నరసదాసు కీర్తనలు | 0-75 |
| ధ్యానపద్ధతి | 0-50 |
| ప్రణవ ప్రభావము | 0-50 |
| శ్రీరామనామ ప్రభావము | 0-50 |
| బ్రహ్మచర్యము | 0-37 |
| ఆధ్యాత్మిక సాధనచరిత్రము (1వ సం) | 1-00 |
| అనుష్ఠానక్రమము | 0-25 |
| భగవన్నామ ప్రభావము | 0-40 |
| శ్రీరామ పటలము | 0-40 |
| తత్త్వత్రయము | 0-20 |
| గురుపూజా విధానము | 0-20 |
| శ్రీరామ పూజావిధానము | 0-25 |
| ప్రశ్నోత్తరి | 0-15 |
| శ్రీకృష్ణ పూజా విధానము | 0-30 |



శ్రీ రామ శరణ మందిరము
బుద్దాం, కర్లపాలెం పోస్టు
(గుంటూరు జిల్లా)

# పురంజనోపాఖ్యానము



## ప్రియవ్రత చరిత్రోపోద్ఘాతము



శ్లో॥ ప్రియవ్రతో భాగవత ఆత్మారామః కథం మునే ।
గృహేఽరమత యన్మూలః కర్మబంధః పరాభవః ॥
శ్రీమద్భాగ. ౫ స్కం. ౧. అ. ౧ శ్లో.

“వ. మునీంద్రా! పరమ భాగవతుండు నాత్మారాముండు నైన ప్రియవ్రతుండు గృహంబున నుండి యెట్లు రమించెఁ గర్మబంధంబులును పరాభవంబులుఁ గల గృహంబులయందు ముక్త సంబంధులైన మహాత్ములకు సంతోషంబు గానేరదు.”

శ్రీమదాంధ్ర భాగవతము.

అనాది కాలమునుండియుఁ బ్రవృత్తిమార్గము, నివృత్తి మార్గమని రెండు మార్గములున్నవి. ప్రవృత్తి మార్గనిష్ఠుఁడు స్వర్గాదిలోకములను బొందినఁ బొందును గాక, అతఁడు జనన మరణములను నానాగమనములనుండి విముక్తుఁడు కాఁజాలఁడు. ఆతనికి పార్థివ విషయముల మీఁదఁగాని, స్వర్గాదివిషయముల మీఁదఁగానిందు కొంచెమో గొప్పయో ఆసక్తి యుండును. ఆయాసక్తివలనఁ బుణ్యము క్షీణింపఁగా మరల జన్మింప వలసియుండును. నివృత్తి మార్గనిష్ఠుఁడు శరీరమున్నంత వఱకు ప్రారబ్ధకర్మల ననాసక్తిభావముతో భోగించు

చుందురు. ప్రారబ్ధ క్షీణము కాఁగానే వారికి పరమపదప్రాప్తి కలుగును. వారు సత్స్వరూపులగుదురు, ప్రవృత్తి మార్గమునే నివృత్తిమార్గ సాధనముగ భావించి, వాసనాక్షయము కావించుటకును అంతఃకరణమును నిర్మలము గావించుకొనుటకును స్వీకరించిన, వారికి సాంసారిక వాసనలెచ్చట శాంతించునో అచ్చటనే వారు సమస్తమును త్యజించి భగవదారాధన తత్పరులగుదురు. ఇట్టివారికి ప్రవృత్తిమార్గము బంధనముగాక నివృత్తి మార్గ సహాయకులగుదురు.

శ్రీశుకుఁడిట్లనెను:– "రాజా! స్వాయంభువమనువు పుత్రుఁడును, పుణ్యశ్లోకుఁడునగుఁ బ్రియవ్రతుఁడు గొప్ప ధార్మికుఁడు, భగవద్భక్తుఁడు, స్వాత్మారాముఁడు. ఆతఁడు చిరకాలము గృహస్థధర్మమును మిక్కిలి నేర్పుగఁ బరిపాలించెను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- ప్రభూ! పరస్పర విరుద్ధములగు నీ వాక్యములు వినఁగానే నామనస్సున సందేహముదయించుచున్నది. ప్రియవ్రతుఁడు పరమభాగవత భగవద్భక్తుఁడనియు, ఆత్మారాముఁడనియు ముందుగఁ జెప్పితిరి. తర్వాత నేర్పుగ గృహస్థాశ్రమమును బాలించెనని చెప్పితిరి. స్వామీ! మనస్సొకటియే. మానవుఁడొకే విషయమున నేర్పుగఁబూర్ణముగ నడువఁగలఁడా? సాంసారిక విషయవాసనలయందును వ్యవహారములందును కుశలత్వముగ నడుచువాఁడు పూర్ణముగఁ బరమార్థ సాధన మొనర్పఁజాలడు. పరమార్థ చింతనమందుఁ జిత్తమును లగ్నముచేసినవానికి సాంసారిక

ప్రపంచముననుండదు. ఒక్కసారిగా రెండుకార్యములు కుశల ముగ జరుగఁగలవు? ప్రియవ్రతుఁ డాత్మారాముఁడయ్యు గృహస్థాశ్రమ మందెట్లు ప్రవృత్తుఁడైనాఁడు? ఏలననఁగా నసంగుఁడైనవానికి గార్హస్థ్యమువీఁద నభిమానముండదు. అభిమానము లేకున్న గార్హస్థ్యము నడువదు."

శుకుఁడిట్లనెను:– "ఏలనడువదు? గృహస్థాశ్రమ మందును సాధన జరుగును. అచ్చట మాత్రము ప్రయత్న మొనర్చిన సిద్ధింపదా? ఎచ్చటనైన నుండుఁడు. పృథివ్యాప స్తేజో వాయురాకాశములుండనే యుండును. సమీపమునఁ జీమలు, దోమలు, పురుగులునుండును. గృహస్థాశ్రమములో సిద్ధింపని దేమున్నది?

రాజిట్లనెను:– "స్వామీ! ఇది నిజమే. ఎచ్చటనున్నను బంచభూతములుండనే యుండును, కాని స్త్రీ, పుత్ర, ధన. ధాన్య, గృహారామక్షేత్ర వాహనాదులందాసక్తి యుండును. మరలఁ జిత్తమా చింతనుండి యీవలకురాదు. చిత్తమా చింత యందే ఆసక్తమైయుండిన నది పుణ్యకీర్తియగు శ్రీహరి చరణ శీతల ఛాయలకుఁబోవుట కిచ్చయుండదు. శాంతి సుఖముల ననుభవించుటకు వానికవకాశమే యుండదు భగవద్భక్తిరసా స్వాదన మొనర్చిన వారికి నీరసమును, దుర్గంధయుక్తము నగు నీకుటుంబమను మురుగుగుంటపై నాసక్తియుండదు.

ఇది విని నవ్వుచు శుకుఁడిట్లనెను:– "రాజా! నీవు యథార్థమునే చెప్పుచున్నావు. వాస్తవిక విషయమేమనఁగా శ్రీహరి రూపమాధురి యందాసక్తియుండిన స్త్రీ పుత్రాదు

లంపాసక్తి సర్వథా వీడిపోవును. కాని రాజా! ఎవఁడైన నొక్కసారియేదైన పుణ్యపథమునుగాంచి పోవుచుఁబొరపాటున నేదైన కుమార్గమునఁబడిన వెంటనే సావధానుఁడై తన గంతవ్య మార్గమిది కాదని తెలిసికొనును. ఆతనికట్టిచైతన్యము కలుగఁగానే ఆతఁడట్టి మార్గమును బరిత్యజించి రాజపథమున మరలఁబోవును ఇదే విథముగఁ గమలాకాంతుఁడగు శ్రీహరి చరణారవింద మకరందాసక్తుఁడగు వానికేవైన విఘ్నములు ప్రాప్తించినచో సాధారణముగ వాసుదేవ భగవానుని భవ భయహారి కథారూప పథమును బరిత్యజింపఁజాలఁడు. భగవద్భక్తియనునది ఒకజన్మలోని సుకృతఫలముకాదు. అనేక జన్మములు పరమ పుణ్యాకర్మలొనర్పఁగా నొనర్పఁగా సమస్త పాపములు క్షీణించును. అట్టి నిష్పాపపురుషుల హృదయమందు ప్రభుకృపచే భక్తిబీజములంకురితము లగును. అది వెంటనే కలుగదు. అది జన్మసిద్ధము మధ్యనేమైన విఘ్నము కలిగిన నల్పకాలముననే ఆవిఘ్నము శాంతించును.

ప్రియవ్రతుఁడు జన్మతోడనే భగవద్భక్తుఁడు. ఆతనికి శ్రీహరి పాదపద్మములందు స్వాభావికమగు ననురక్తికలదు. అదృష్టమున భక్తిమార్గమునకుఁ బరమాచార్యుఁడగు నారదుఁ డాతనికి సద్గురువుగ లభించెను. ఆతని పాదపద్మ పరిచర్యా ప్రభావమున సుగమముగఁ బరమార్థ తత్త్వమాతనికి బోధపడెను, నారద చరణారవిందములం దాతనికి దృఢమగు ననురాగముకలదు. గురుశిష్యులిద్దరును బరస్పరము ఆత్మచింతనముఁ జేయుచుండెడువారు. సత్సంగ సరిత్ప్రవహించుచుండెను."

పరీక్షిన్మహారాజిట్లనెను:— "స్వామీ ! ఈ బ్రహ్మరతి యింటిలోనే జరుగుచుండెడిదా ? ఆతఁడిట్లు నిరంతరమాత్మ చింతనములో నిమగ్నుఁడగుటచే నాతని తండ్రి యభ్యంతర పెట్టలేదా?"

ఇది విని శుకుఁడు లోలోన నవ్వుకొని యిట్లనెను:— "రాజా ! తనవలెఁ దనపుత్రుఁడును వివాహమాడి కులవంశ పరంపర అవిచ్ఛిన్నముగ నుంచుటకుఁ గాంక్షించుచుండును. అందువలననే తనపుత్రుఁడు సాధుసాంగత్యమున నుండుటను గాంచి యీతఁడును సాధువగునేమోనని భయపడుచుండును. మంచి త్యాగియగు మహాత్ముని గాంచి రేని వృద్ధులిట్లందురు:— "ఇట్టి భగవద్భక్తుని బుత్రునిఁగఁగన్న తల్లిదండ్రులు ధన్యులు. అట్టివాఁడు తనభక్తిచే నిరువదొక్క తరమును దరింపఁజేయును." కాని అట్టివానితో నీపుత్రునట్టి సాధువునొనర్చి ౨౧ తరముల నేలధన్యుల జేయగూడదని యెవ్వరైన నడిగినచో నిట్టిమాట వినఁగానే ఆతఁడు దిగజారిపోయి, యిట్టిసాధువులకు మావాఁడు దూరముగనుండుట మంచిది. ఎచ్చటను వారిస్పర్శ తగుల రాదనును. దీనినే మోహమందురు. రాజా ! స్వాయంభువ మనువు తనపుత్రుఁడిప్పుడు యువకుఁడై, పృథ్వీపాలనమునకై రాజులో నెన్ని సద్గుణములుండ వలయునని శాస్త్రములలోఁ జెప్పఁబడినదో అవియన్నియుఁ బూర్ణముగ నీతనిలోనున్నవని తెలిసికొని ఒకదినమునఁ గొడుకుతో నిట్లనెను:— "నాయనా ! నీవింకను జిన్నవాఁడవుకావు యువకుఁడవైతివి. హితాహితములనెఱుఁగుదువు. నాయనా ! నీవిప్పుడు ధర్మముగఁ బ్రజా

పాలనము చేయుము. గృహభారమును వహించుము. నాబరువును దింపుము. నా కార్యములలో సహాయపడుము. నేనింకఁ గూర్చుందును. వెనుకముందు కార్యముల నన్నిటిని నిర్వహింపుము."

మాయామోహపూర్ణమగు తండ్రివాక్యములు ప్రియవ్రతునకు రుచింపలేదు. ఏలననఁగా నాతఁడు తన సమస్తేంద్రియ క్రియాకలాపములన్నిటిని వాసుదేవ భగవానుని చరణారవిందములపై సమర్పించెను. సమాధియోగము ద్వారా ఆతఁడు పరమార్థ పథానుసరణము జేయ సిద్ధపడుచుండెను.

ఆతఁడు తన మనస్సులో నిట్లనుకొనెను:— "నేను రాజకార్యములలో నిమగ్నుడనైతినా నాయాత్మస్వరూప మసత్ప్రపంచముచే నాచ్ఛాదితమగును. అప్పుడు నాకు సత్స్వరూప విస్మృతి కలుగును." అనుకొని యాతఁడు తన తండ్రియాజ్ఞను మన్నింపలేదు. సత్పుత్రునకు పితాజ్ఞ నుల్లంఘించుట అత్యంతానివార్య కార్యమైనప్పటికి, ఆతఁడేమిచేయగలఁడు. అట్లు చేయుటకు వివశుఁడయ్యెను.

ఇంతటి యోగ్యుఁడగు పుత్రుఁడు తనయాజ్ఞనవహేళనము సేయుటనుగాంచి స్వాయంభువ మనువు మిక్కిలి దుఃఖించెను. తనవంశమెట్లు వృద్ధిచెందునో, సృష్టిక్రమమెట్లు నడచునో. ఈతఁడు సాధువగునేమో ! బ్రహ్మవలన నేర్పడిన యీ సృష్టి వృద్ధియెట్లు కాఁగలదు? ఇచ్చట మనువిట్లు చింతించుచుండ నచ్చట లోకపితామహుఁడగు శుభవుఁడిట్లు చింతించుచుండెను. "నా మానసిక పుత్రులలో సనకసనంద

నాదులును, నారదుఁడును, విరాగులైరి. వారంతట వారెట్లైన బాగుండెడిది. మానవుల స్వభావము తామెట్లుండిరో మిగిలిన వారిని నట్లు చేయఁజూతురు. తనకుఁబ్రియమగు వస్తువును నితరులకును నాస్వాదింపఁజేయ జూచును. ఈ నారదుఁడు తిరుగుచు, దిరుగుచు నందఱకును నివృత్తిమార్గము నుపదేశించుచున్నాఁడు. అందఱును నివృత్తి మార్గనిష్ఠులేయైనచో నీత్రిగుణాత్మిక జగత్తెట్లు వృద్ధి కాఁగలదు?" అనియాలోచించి యాతఁడు తన మనుమఁడగు బ్రియవ్రతునకు గృహస్థధర్మము నుపదేశింప నిశ్చయించెను. ఇటు నారదుఁ డేకాంతమునకుఁ దీసికొనిపోయి నివృత్తిమార్గమునకు బలము కలిగించుచుండెను. అతఁడీ సాంసారిక పదార్థములన్నిటి నసారముగఁ జెప్పుచుండెను. సంసారమును వీడి ప్రభుపాదపద్మముల నేవిధముగ నాశ్రయింపనగునో ఆ రహస్యమును జెప్పుచుండెను.

ఏకాంతములో గురుశిష్యులిద్దరును బరమార్థ రహస్యములను దెలిసికొనునపుడు చిత్తమేవిధముగఁ దన్మయమగునో, వారీ దృశ్యజగత్తు నేవిధముగ మఱచియుందురో ఆ యనిర్వచనీయానందము నెవరు వర్ణింపఁగలరు?

శుకుఁడిట్లనెను:- "రాజా ! ఇచ్చట ప్రియవ్రత నారదులు పరమార్థచింతనమున నిమగ్నులైయుండ, బ్రహ్మయాతని గృహస్థునిగాఁజేయ నిచ్ఛించి యాతనికడకు వెళ్ళుటకు హంసను సిద్ధపఱచుచుండెను. మరీచాది మానసపుత్రులిట్లనిరి:- "స్వామీ! మేమును మీ వెంటవచ్చెదము. అందఱమును గలిసి చెప్పిన

దానివలన ఫలముండును." ఇదివిని మరీచాది మునులు మూర్తీ భవించిన వేదస్వరూపుఁడగు బ్రహ్మతో బయలుదేరిరి.

## బ్రహ్మ ప్రియవ్రతుని కడకువచ్చుట

౩౦౮

శ్లో॥ నిబోధ తాతేదమృతం బ్రవీమి
మాసూయితుం దేవమర్హస్యప్రమేయమ్।
వయం భవస్తే తత ఏష మహర్షి
ర్వహామ సర్వే వివశా యస్య దిష్టమ్ ॥

శ్రీభాగ. ౫ స్కం. ౧ అ. ౧౧ శ్లో॥

కం॥ హరి నా ముఖమున నికుమ
గరమెఱిఁగింపఁగఁ బనిచెఁగావునవిదె సు
స్థిరమతి వినుమంతయు శ్రీ
హరివాక్యముగా నెఱింగి యవనీనాథా ॥

ఆ॥ కొడుక నేను నీవు నారదుండును నేను
నందనులు నీశ్వరాజ్ఞఁబూని
యుండగ నెప్పుడుఁ జేయ నున్నవారము గాన
నతని యాజ్ఞదప్ప నలవి గాదు ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

మహాపురుషులు దయచేయుట ఒక విధమగు మహోత్సవము. విద్యలోను, వయస్సునందును, బ్రహ్మభావమునందును, తపమునందును, కీర్తియందును, పదప్రతిష్ఠయందును, శ్రేష్ఠులైనవారు వచ్చుటయొక విధమగు సానందమునుగూర్చును. వారి దర్శనమునకై స్వాభావికముగ నుత్కంఠత చెందియుం

డును. వారికిచ్చు స్వాగత సత్కారమందొక విధమగు నభిన
వోల్లాసముత్పన్నమగును వారి యాగమనమున యథాశక్తి
సామర్థ్యములతో శ్రద్ధాంజలిని సమర్పించుటకు లాలస బల
వత్తరముగనుండును, కొన్ని స్వాగత సత్కారముల నిచ్ఛా
పూర్వకముగ వివశతతోఁ దప్పనిసరిగఁ జేయఁబడును. వానిలో
నానందమురాదు. నిర్బలులై వివశతతోఁ జేయవలసివచ్చు
టొక విధమగు నన్యాయమే. స్వాభావికమగు ప్రవృత్తికలిగి,
రోమరోమమునఁ బ్రఫుల్లిత మొనర్చునదియే నిజమగు
స్వాగతము.

శుకుఁడిట్లనెను:— "రాజా! లోక పితామహుఁడగు
బ్రహ్మ రాజకుమారుఁడగు ప్రియవ్రతునకుఁ బ్రబోధింప
సత్యలోకమునుండి క్రిందకు భూమిపైకి దిగఁగా నాతనిచుట్టును
మరీచ్యాది మునివరులువచ్చిరి. నాలుగు వేదములు మూర్తి
మంతమ్ములై యాతని ననుసరించెను క్రిందిలోకములలో
విరించి యీ మార్గమున వచ్చుచున్నాఁడను విషయము
తెలియఁగానే అన్ని లోకములలోను నిశ్చితమార్గమున కటు నిటు
నా యాలోకములలో దేవగణములు స్వాగత మొసంగుటకు
సిద్ధపడిరి అందఱు హస్తములలో దివ్యపత్రి, పుష్ప, ఫలము
లను సత్కారమునకుఁగావలసిన వివిధ సామగ్రులను బట్టుకొని
నిలుచుండిరి అందఱును విధికి సుస్వాగతమిచ్చుట కువ్విళ్ళూరు
చుండిరి. ఆతఁడెచ్చటినుండి బయలుదేరెన నచ్చటివారు వివిధ
పూజలొనర్చుచుండిరి. అందఱును దివ్యపుష్పములను వర్షింప
జేసి తమతమ హర్షములను బ్రకటించుచుండిరి. చతురాననుని

సన్నిధిని సిద్ధ, సాధ్య, గంధర్వ, చారణ, ముని గణములాతని సుయశమును గానము చేయుచుండిరి. అప్సరసలు నృత్యము చేయుచుండిరి. ఉపదేవులు వివిధవాద్యములను వాయించు చుండిరి. శంఖాభమగు శ్వేతహంసనెక్కి ఋషిముని గంధర్వా దులచేఁ బరివృతుఁడైన బ్రహ్మగ్రహాతారా పరివృతుఁడగు శరత్కాల చంద్రునివలెఁదన దీధుతులను వెదఁజల్లుచుండి నట్లుండెను.

స్వాయంభువమనువు చింతలోఁబడియుండెను. ఆతని సమీపముననే రాజకుమారుఁడగుఁ బ్రియవ్రతుఁడు దత్త చిత్తుడై నారదుని పారమార్థికోపదేశములను శ్రవణము చేయుచుండెను. గంధమాదన పర్వత కందరములు స్వయం ప్రకాశములయ్యెను. ఉల్కాపాతమున నేవిధముగ నుజ్జ్వల ప్రకాశము కలుగునో అట్టి ప్రకాశము గగనమండలమునఁ గనఁబడెను. అందఱాశ్చర్య చకితులై యాదృశ్యమును జూచుచుండిరి. కొద్ది క్షణములలోనే అందఱకును జతురాన నుని వాహనమగు హంస పక్షములు కదలుట కనఁబడెను. హంసను జూడఁగనే లోకపితామహుఁడగు బ్రహ్మవచ్చుచున్నాఁ డని యందఱును గ్రహించిరి. నారద స్వాయంభువులు తమ తండ్రి వచ్చుటనుగాంచి, వెంటనే సంభ్రమముతో నిలుచుం డెను. ప్రియవ్రతుఁడును సత్కారము నిమిత్తమై అందఱితో బాటుగా నిలువఁబడెను. దగ్గఱకు రాఁగానే అందఱును బ్రహ్మ పాదపద్మములకుఁ బ్రణమిల్లెను. ఆయనవెంట వచ్చిన ఋషు లును బరస్పరము కుశలప్రశ్నలు చేసికొనిరి. ప్రణామ నమ

స్వీకారమ్మైన తర్వాత నారదుఁడు పూజా సామగ్రిలతోఁ బితామహుని విధ్యుక్తముగఁ బూజించెను. మరల వివిధ వైదిక స్తోత్రములచే నాతనిస్తుతించి. యాతని యవతారోత్కృష్టతను గూర్చి వర్ణించి. మఱల నాతని చరణ కమలములకు బ్రణమిల్లెను. నారద స్వాయంభువమనువుల పూజనుఁగ్రహించి బ్రహ్మ ప్రసన్నుఁడై, నవ్వుచు ప్రియవ్రతునివైపు దయా దృష్టితోఁ జూచుచు "వత్సా నీవేమి చేయుచుంటివనెను."

చేతులు జోడించుకొని లజ్జావనత శిరస్కుఁడై కుమార ప్రియవ్రతుండిట్లనెను:— "స్వామీ ! నేను గురుదేవుఁడగు నారదుని యుపదేశమును శ్రవణముచేయుచున్నాను."

నవ్వి బ్రహ్మ తన తెల్లని గడ్డమునందు జేతిని నిమురుచు నిట్లనెను. "మంచిది, నారదునివలన నీవు చాలావినియున్నావు. నావికూడ రెండుమాటలు వినెదవా?"

సిగ్గుపడుచుఁ బ్రియవ్రతుఁడిట్లనెను:— " స్వామీ ! మీరట్లనెదరేల ? మీ రెట్లు జ్ఞాపించినను నట్లు దానిని శ్రద్ధా పూర్వకముగ స్వీకరించెదను."

బ్రహ్మయిట్లనెను:— "నా వాక్యములు నారదుని వాక్యములకుఁ గొంచెము ప్రతికూలముగ నున్నట్లుండును. దానివలన నీవు బ్రహ్మయేదో విపరీతోపదేశమొనర్చి యన్య మార్గమును గొనిపోఁజూచుచున్నాఁడని భావింపరాదు."

తలవంచుకొని రాజకుమారుఁడిట్లనెను:—'కాదుస్వామీ! అట్లెందులకు జరుగును? మీరేది చెప్పినను నా మేలునకే చెప్పెదరు. మీ యుపదేశము మంగళకారియే కాఁగలదు."

బ్రహ్మ యిట్లనెను:- "నాయనా ! నేను నా స్వంత యభిప్రాయ మేమియును జెప్పను. నాకు నా తండ్రి యొసంగిన యుపదేశమును నీకుఁ జెప్పెదను నేను కేవలము భగవత్సందేశ వాహకుఁడను ఆతని యాజ్ఞచే మనువు దేంద్రాదులును సమస్త ప్రజాపతులును మేమందరమును వివశులమై కార్య మొనర్చుచున్నాము."

ప్రియవ్రతుఁడిట్లనెను:- "అవును స్వామీ! ఆ సర్వాంతర్యామి ప్రభుప్రాప్తియే జీవునకుఁ బరమ సాధ్యమనియు, నాతనిఁ బొందుటయే పరమ పురుషార్థమనియు నారదమహర్షి చెప్పుచున్నాడు."

బ్రహ్మ యిట్లనెను:- 'నీ సంకల్పమును భగవత్సంకల్పములోఁ గలుపుమనియు, నీ యిచ్ఛను భగవదిచ్ఛలో సమావేశ మొనర్పుమనియుఁ జెప్పుటకే నేను వచ్చితిని. ఆతఁడేదిచేసిన దానిలో నీకు కల్యాణము కలదని భావింపుము. భగవద్విధానమును నుగ్రతపస్సుచేతను, విద్యతోడను, యోగబలమునను, బుద్ధిబలమునను ధర్మార్థాల ద్వారమునను లేక పములద్వారానో దిరస్కరింప వలయునని యేప్రాణియైనఁ స్వయముగనో, దలఁచినయెడల నది ఆతనివలనఁగాఁబోదు."

అంత రాజకుమారుఁడగుఁ బ్రియవ్రతుఁడిట్లనెను:- "అయితే, పురుషార్థమేమున్నది?"

బ్రహ్మ యిట్లనెను:- "నాయనా ! పురుషార్థము దైవ సంయోగముద్వారానే కాఁగలదు. ఎట్లు జరుగనున్నదో

దానికి తగినట్లుగనె సాధన సమకూడును. అట్లే విధానమగును. పూర్వజన్మ కృత కర్మానుసారముగ ప్రారబ్ధవశమున నట్టి కులమందే జన్మకలుగును. ప్రారబ్ధకర్మ క్షయమేకాలమున నెచ్చట పూర్తియగునో ఆకాలమందచ్చట మృత్యువుకలుగును ఎచ్చట యెవనిద్వారా యేకార్యమువలన నవశ్యము శోక, మోహ, భయములు సంభవింపవలసియున్నవో అచ్చట వాని ద్వారా ఆ కార్యమువలన నవశ్యము శోక మోహ భయములు సంభవించును. జీవుఁడు దేహముతో నెన్ని దినములు దైవవశమున సుఖదుఃఖము లనుభవింపవలయునని వ్రాయఁబడియున్నదో అన్ని దినము లవశ్యము భోగింపవలయును.

ప్రియవ్రతుఁడిట్లనెను:- 'స్వామీ! అయితే యిది మిక్కిలి వివశతా విషయమే. తనకిష్టముగాని కార్యము నెవఁడైన జేయుట కిష్టపడకుండినవో?

సరళముగ బ్రహ్మయిట్లనెను:- "చేయకుండుటెట్లు? అందఱును జేసి తీరవలసినదియే. ఒంటెకు ముక్కునకుదాళ్లు వేసి యజమాని యిష్టము వచ్చినచోటకు గొనిపోవునట్లును, ఎద్దులకు ముక్కురంధ్రములు బొడిచినట్లును వేదరూపమగు త్రాడుతో సత్త్వ రజస్తమస్సులను త్రివిధకర్మ రూపమగు దుస్తరబంధనములలోనలిగి బంధింపఁబడినట్టాతని యిచ్ఛకు విరుద్ధముగ నావగింజంతైన నెవ్వరును నిటునటుఁ గదలలేరు."

ప్రియవ్రతుఁడిట్లనెను:- "ప్రభూ! వ్యాకరణాది శాస్త్రములలోఁ గర్తకు స్వతంత్రత చెప్పఁబడినది. మనుష్య జన్మచేఁ గాంక్షించినచో ముక్తినిఁ బొందవచ్చునని శాస్త్ర

ములు మాటి మాటికి చెప్పుచున్నవి. మీారనినట్లు జీవుఁడ వశుఁడగుచో వానికిచ్ఛ లేకున్నను వివశుఁడై గుణకర్మాధీనుఁడై నానాయోనులఁ బ్రవేశింప వలసియుండును.

బ్రహ్మ యిట్లనెను:- 'కర్త స్వతంత్రుఁ'డని చెప్పఁబడిన చోట జీవుఁడు కర్తకాఁడు. ఆ శ్రీహరియే కర్త, హర్త, భోక్త, రక్షకుఁడును, మానవజన్మ మోక్షద్వారమనుట నిజమే, కాని అందఱును ముక్తులుకారు. భగవత్కృపాపాత్రులే కర్మబంధ విముక్తులగుదురు. వారే యెనుబది నాలుగులక్షల జీవచక్రమునుండి బయట పడఁగలరు. భగవంతుఁడు పక్షపాతము వహించుననియుఁ, గొందఱ ననుగ్రహించి జనన మరణములనుండి బయవేయుచుఁ గొందఱను నెనుబదినాలుగు లక్షల జన్మ సంసారచక్రమునఁ బడవేయుచుండిన భగవంతునకు నైర్ఘృణ్యాదోషము సంభవించునని నీవనవచ్చును. ఆతని కృప అందఱయందును సమానరూపమునఁ గలుగుచుండును. త్రివిధ కర్మరూపబంధనము వీడిపోయినవారే దీని యనుభవమును గమనింపఁగలరు. ఒకానొక దినమున నందఱమును త్రిగుణాతీతులము కావలసినదే వెనుక ముందుల విషయము వేఱు. భగవంతుఁడందఱకు నొక్కసారియే ముక్తి నేల నీయఁడని మీారిప్పుడడుగవచ్చును. అట్లిచ్చిన నీసృష్టి క్రమమెట్లు నడుచును? ఈ భగవత్క్రీడ యెట్లునడుచును? వాస్తవమున బంధమును లేదు మోక్షమును లేదు ఇదంతయు నాతని మాయగారడీ ఆటవంటిది. ఆతనిని శరణుజొచ్చిన నేమియును లేదు. ప్రేక్షక స్థానములో దూరముగ నున్నంతవఱకు గారడీ

వాని యిష్టానుసారముగ నడుచవలసినదే. ఆతఁడేమిపలికించిన దానినిఁబలుకవలసినదే లేపిన లేవవలయును, బడవేసినఁబడి పోవలెను. కూర్చుండఁబెట్టినఁ గూర్చుండవలయును. కన్నులున్నవాఁడు గ్రుడ్డివానినిఁ బట్టుకొని యెచ్చటికిఁ దీసికొని పోయిన నచ్చటికావిధముగనే మన గుణకర్మానుసారముగ మనలను శ్రీహరి యేజన్మకు నియోగించునో ఆయాజన్మల నంగీకరించి, ఈశ్వరునిచే నియతమైన సుఖదుఃఖములను భోగించుచుందుము. అన్నియు నాతని యిచ్ఛప్రకారమే జరుగును. భగవత్కృపా సాక్షాత్కారమును బొందినవారును, ఆతని యనుగ్రహమును బొందినవారును నాతని యాజ్ఞలననుసరించి కార్యములొనర్పవలయును.

శుకుఁడిట్లనెను:- "రాజా! బ్రహ్మయిట్లు పలుకఁగా రాజకుమారుఁడగుఁ బ్రియవ్రతుఁడు కొంచెము సేపు దీర్ఘ చింతలోఁబడిపోయెను.

## బ్రహ్మాజ్ఞచేఁ బ్రియవ్రతుఁడు గృహస్థుఁడగుట

౩౦నా

శ్లో॥ భయం ప్రమత్తస్య వనేష్వపి స్యా
ద్యతః స ఆస్తే సహషట్సపత్నః ।
జితేంద్రియస్యాత్మరతేర్బుధస్య
గృహాశ్రమః కిం ను కరోత్యవద్యమ్ ॥

శ్రీభాగ. ౫స్క. ౧అ. ౧౭ శ్లో॥

"మోక్షార్థియైన సుజ్ఞానవంతుఁడు ప్రారబ్ధ సుఖదుఃఖంబు లనుభవించుచు దేహాంతరారంభక కర్మంబులం జేయ నొల్లఁడు వనవాసియైనను

జితేంద్రియుండు గామండై నేని గామాది సహితుండగుటం జేసి సంసార బంధములు సిద్ధించు, గృహస్థాశ్రమంబందును జితేంద్రియుండై యాత్మ జ్ఞానంబుగల పురుషునకు మోక్షంబు సిద్ధించు, శత్రువుల గెలువ నిశ్చయించిన పురుషుండు దుర్గంబాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థియగు నీవును గృహాశ్రయుండవగుచు శ్రీనారాయణ చరణారవిందంబులను దుర్గంబాశ్రయించి యరిషడ్వర్గంబుల జయించి ముక్తసంగుండవై యీశ్వర కల్పితంబులగు భోగంబులననుభవించి ముక్తింజెందుము

ఆంధ్రమహాభాగవతము.

సాధనకు వీలుగానుండుటకై దేశ, వర్ణాశ్రమాదులేర్పడినవి. వాస్తవికముగ బాహ్యవస్తువులలో బంధములేదు. ఏవస్తువును మనలను బంధింపఁజాలదు. మనస్సువలననే బంధము, మనస్సువలననే ముక్తి. మనస్సు దేనిని సుఖముగ భావించునో అది సుఖమగును, దేనిని దుఃఖముగ భావించునో అది దుఃఖమగును. జీవుఁడు ప్రారబ్ధ కర్మాధీనుఁడై కర్మలొనర్చి ఆ కర్మలం దెట్టి యాసక్తికలుగునో, అట్టి సుఖదుఃఖానుభవమును మనస్సుపొందును. కర్మమూడు విధములు జన్మ జన్మాంతరములలోఁజేసిన అనంత కర్మసమూహమునకు సంచిత కర్మయందురు. ఆ సంచితకర్మనుండి ఒక జన్మమునకు భోగింపవలసిన దానినిఁ దీయఁగా నాజన్మలో ననుభవింపవలసినదానికి ప్రారబ్ధమందురు. ప్రారబ్ధకర్మను భోగించునప్పుడు దానిలో నాసక్తివలనఁ జేసిన కర్మలు సంచితములోఁబోయి కలియును. ఒకనివద్ద లక్షరూపాయలున్న వనుకొనుఁడు, అది అతనిమూలధనము. దానిలోనుండి జీవన నిర్వాహమునకుఁ

దీసినదియే ప్రారబ్ధము. మూలధనమున్నంతవఱకు నిరంతరము వడ్డీపెరుగును. మూలధనమంతయు దివాలా యెత్తినపుడు పోవును. వడ్డీయు నాఁగిపోఁగలదు. కాని మనచేతికివచ్చిన ధనము ఖర్చుకానంతవఱకు సమాప్తముకాదు. అదే విధముగ సంచితకర్మ యున్నంతవఱకు అది నిరంతరము పెరుగుచునే యుండును. జననమరణములలోఁ బడుటతప్పదు. సంచితకర్మ జ్ఞానముచేఁగాని, భగవద్భక్తిచేఁగాని నష్టముకాఁగా క్రియమాణమగు కర్మయు ననఁగా నాగామియుచుండదు. ప్రారబ్ధమున్నంతవఱకు భోగించి జననమరణ బంధనమునుండి బయటపడి పరమపదమును బొందును.

శుకుఁడిట్లనెను:- "రాజా! బ్రహ్మ గుణప్రవాహరూపకర్మలం దత్యధిక ప్రాధాన్యమీయుటచేఁ బ్రారబ్ధముననే ప్రాధాన్యత నొసంగెను. అంతఁజాలగా నాలోచించి రాజకుమారుఁడగుఁ బ్రియవ్రతుఁ డిట్లడిగెను "స్వామీ! మీరు ప్రారబ్ధమును దుర్నివారముగాఁ జెప్పుచున్నారు. అట్లయినఁ బ్రాణులందఱును బ్రారబ్ధాధీనులే కదా! జీవన్ముక్తులకుఁ గర్మబంధములుండవని మేము వినియుంటిమి. వారులోకములో స్వచ్ఛందులై తిరుగుచుందురు. వారికి దుఃఖానుభవముగాని సుఖానుభవముగానిలేదు. వారికి దుష్కర్మ దుఃఖమును దీసికొని రాఁజాలదు, సత్కర్మసుఖమును దీసికొనిరాఁజాలదు, వారు ద్వంద్వాతీతులై బాలురవలె సంచరించుచుందురు."

బ్రహ్మయిట్లనెను:- 'అవును, అదినిజమే. జీవన్ముక్తులకుఁ గర్మబంధనములుండవు. వారు సర్వదా సుఖదుఃఖముల

కర్తృత్వాతీతులై యుందురు. వారి సంచిత కర్మయంతయు నశించి పోవును, వారికి ఆగామికర్మ లేదు. అది బంధింపదు. ఇట్లున్నను ప్రారబ్ధ కర్మానుభోగమును జీవన్ముక్తులును ననుభవించి తీరవలెను. కర్మల ద్వారా వారికి సుఖదుఃఖానుభవము లేదనుట సత్యమే కాని వారికిని ప్రారబ్ధకర్మము భోగించిననే తీరఁగలదు. ధనుస్సునుండి విడువఁబడిన బాణము దానివేగ మున్నంతవఱకు క్రిందబడక వెళ్ళుచునేయుండును. ప్రారబ్ధాను సారముగఁ గర్మ యంత్రమువలె నడుచునుకాని వారికి ఆగామికర్మ యేర్పడదు వేయించిన శనగలు మామూలు శనగలవలెనే కనబడునుగాని అంకురింపవు. జీవన్ముక్తునకు గర్మలలోని సుఖదుఃఖములు సమానముగనుండును. మంచి కమ్మని సుగంధయుక్తమగు పాయసము వచ్చినట్లును, ఎవఁడో వచ్చి కఱ్ఱతోఁ దలను బగులఁగొట్టినట్లును కలవచ్చిన దను కొనుఁడు. నిద్రలేవఁగానే ఆపాయసమునులేదు, తలబ్రద్దలును గాలేదు. మేల్కొన్నతర్వాత దీనిని స్మరించిన నెట్లు నవ్వు కొనునో. వానికి క్షీరాన్న సుఖముగానీ, తల బ్రద్దలైన దుఃఖముగాని నిజముగఁదోఁచక మిథ్యలుగఁదోఁచును. అదే విధముగా జ్ఞానికి ప్రారబ్ధము మిగిలినంతవఱకు దానిని భోగించుటకు దేహమును ధరించును. దానియందు నిజత్వాభిమానముండదు. అన్యదేహమును బొందుటకుఁ గావలసిన సంస్కారములను స్వీకరింపఁడు.''

ఇది విని రాజకుమారుఁడగుఁ ప్రియవ్రతుఁడిట్లనెను:—
"ఈసమస్త బంధనములను వదలుకొని శాంతచిత్తముతో

నేకాంతమునకుఁబోయి సర్వేశ్వరుఁడగు శ్రీహరి భజనచేయు ుయే శ్రేష్ఠమైనది. ఈ గృహస్థరూపమగు వలలోఁబడరాదు. దీనిలో నానావిధములగు క్లేశములుకలవు, వివిధ బంధనములు కలవు."

ఇది విని బ్రిహ్మానవ్వి యిట్లనెను:- "నాయనా ! వెళ్లఁగానే వనమునఁ జిత్తశాంతి లభించుట కచ్చట గారడీ యేమియునులేదు. ఇంకను నేకాంతమునఁ గామ వాసనలత్యంత ప్రిబలములగుటను మనము గాంచుచున్నాము. నాయనా ! ఎచ్చటను నేమియునులేదు. మనస్సు స్వాధీనమైనచో మఱి మంత్ర తంత్రిములేల? ఇంద్రియములను జయించియుండినచో వనమున నివసించినను నొకటే, గృహమున నున్నను నొక్కటియే. రెంటిలోను నా న ం ద ము క ల దు. మనస్సు చంచలమై ఇంద్రియములు స్వాధీనము కాకున్నచో నీవు లక్షవనములకుఁ బోయినను బతనము తప్పదు. ఏలననఁగా విఘ్నములు గలిగించు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను నార్గురు శత్రువులు మన వెంటనేయుందురు. ఎచ్చటికి వెళ్ళినను నవి మనలను వదలవు. కామ క్రోధాదులను జయించినచో నెచ్చటనైనను నానందమే".

ప్రియవ్రతుఁడిట్లనెను:- "ప్రభూ ! మానవుఁడు జితేంద్రియుఁడు కానంతవఱకు, కా మ క్రో ధా ది శత్రువులను జయించనంత వఱకు వాని కేకాంతవాసమును, జప, తప, పూజాపాఠాదులును, వేదాధ్యయనము వ్యర్థములనుట నిజమే; కాని గృహస్థాశ్రిమమునందు నల్దిక్కులను కామక్రోధాదులు

నిండియుండుటచే దానినిఁద్యజించి, యే కాంతమున సాధన ద్వారమున నీ శత్రువులను జయించి జీవన్ముక్తి సుఖము నాస్వాదించుట మేలుగదా! వీటిని జయించుటకైనను గృహము ను ద్యజించుటయు నత్యంతావశ్యకము గదా!"

బ్రహ్మయిట్లనెను:- "వత్సా! గృహస్థాశ్రమమును వీడియు షడ్రిపులను జయించ వచ్చుననుట నిజమేకాని నాయనా! ఇది మైదానమునఁజేయు రణమువంటిది. ఇది మిక్కిలి సాహసకార్యము. యుద్ధము రెండు విధములు. ఒకటి మైదానములోని యుద్ధము. మఱియొకటి కోటలోనుండి యుద్ధముచేయుట. శత్రువు నిర్బలుఁడై తాను సబలుఁడగుచో మైదానమున యుద్ధముచేయవచ్చును. కాని సబలుడవైనను మైదానముమీఁది యుద్ధమున విజయము సందేహాస్పదముగనే యుండును. కోటలోని యుద్ధమున సదాసురక్షితముగనే యుండవచ్చును. కోటలోనుండి యుద్ధముచేయుటచే శత్రువు ప్రబలుఁడైనను విజయమున సందేహములేదు, ఏలననఁగా శత్రువుక్రిందనున్నాఁడు. వానికి నల్దిశలను నడ్డులేదు. తాను కోటలోనుండుచో సురక్షితముగ నుండవచ్చును. తాను పైన నుండి క్రిందనున్న శత్రువులపై బాణప్రయోగము కావింప వచ్చును; వారిని సులభముగ సంహారము చేయవచ్చును, వారు తమ ప్రయోగమును బైకిచేయను లేరు; అట్లు ప్రయోగించినను గోటలో దాగియున్నవారి కవి తగుఁను దగులఁ జాలవు. ఇట్టి యుద్ధములోఁ బరాభవమనునది యుండఁజాలదు. అదియును గోట గట్టిగానుండవలెను. జీవితావసరవస్తువులు

పూర్తిగా సంగ్రహించుకొని యుండవలయును. ఈ విధముగా గృహస్థాశ్రమములోనుండి సాధనమొనర్చుట కోటలోనుండి యుద్ధము చేయుటవంటిది. గృహస్థుగానుండి కామవిజయమును బొందు సాధనమొనర్పవలయును. పొరపాటున జారిపోవుచో ధర్మపత్నియందు గామతృప్తిని జెందుట అంతగా పాపముకాదు. త్యాగిలేక సన్న్యాసి నిగ్రహించుకొనఁజాలక విచలితుఁడగుచో వానికి సర్వనాశనమే కాఁగలదు ఘోరపతనమే కాఁగలదు. తర్వాత దానిని నిగ్రహించుటచాల కష్టము. అట్టివాఁడు రౌరవాది నరకములలో ననేక యాతనలు పడవలసియుండును. అదే విధముగ క్రోధము వచ్చిన దనుకొనుఁడు. అట్టి క్రోధోద్రేకమును పిల్లలపైఁ జూపించుకొనును. లోభ మద మత్సరాదుల సంయమమును గృహస్థాశ్రమమందుండియే బాగుగా సాధింపవచ్చును. ఇది సరళ సుగమ మార్గము. మనోవాసనలు శాంతింపవలెను. చిత్తచంచలతను వీడవలయును. మనస్సిప్పుడెక్కడవగ దూకదని తెలియఁగానే గృహత్యాగము కావించి యేకాంతమున భజనమొనర్పవలయును. నాయనా ఇది రాజపథము. కన్నులు మూసికొనిపోయినను భయమును లేదు చింతయును లేదు."

ప్రియవ్రతుఁడాత్మగ్లాని స్వరమున నిట్లనెను:-"స్వామీ! నా చిత్తము చాల చంచలమైనది. మీరు నన్ను గృహస్థాశ్రమమును స్వీకరింపుమని చెప్పుచున్నారు. మీరు గురువులకు గురువులరు పూజనీయుఁడగు తండ్రికిని బూజనీయులు, మీయాజ్ఞను దిరస్కరింప వీలులేదు; కాని గృహస్థుఁడనైె

నేనింకను వివేకమును బోగొట్టుకొందును. విషయసుఖము లలోఁ బడిపోఁగలను."

బ్రహ్మ అత్యంత స్నేహస్వరమున నిట్లనెను:—"వత్సా! అట్లు మాటలాడెదవేల ? నీవు కామాది శత్రువులకు వశుఁడ వెట్లయ్యెదవు? నీవు పరమారాధ్యుఁడగు ప్రభు పాదపద్మరూప కర్ణియను దుర్గము నాశ్రయించి కామక్రోధాది శత్రువుల నిదివఱకే జయించితివి. కావున నీకు బంధమోక్షము లేమి కలవు? నీవు భగవత్కృపాపాత్రుఁడవు. సృష్టిని వృద్ధిచేయుటకే నీవీ పృథివియందుద్భవించితివి. నీవు నిస్సంగభావమున ననాసక్తుఁడవై సాంసారిక భోగములను భోగింపుము. వివాహముచేసికొనుము. సంతానమును గనుము. సృష్టివృద్ధిని గావింపుము ఈ నారదుఁడు సన్న్యాసి. ఒక విధవకు సధవయగు స్త్రీ నమస్కరింపఁగా నావిధవ "అమ్మా ! నీవును నావలెనే కమ్మని యాశీర్వదించినదఁట. ఈ నారదుని స్థితియు నింతే. అందఱకును దలలు గొరిగించి సన్న్యాసులఁ జేయఁజూచుచుండును. ఈ శుష్కసన్న్యాసములో నేమున్నది నాయనా ! పెండ్లిచేసికొని, పిల్లలను జల్లలనుగని అప్పుడు నీకిష్టముండిన నప్పుడేకాంతమునకు బోయి జపతపములొనర్చుకొనుము. ఇప్పటినుండియే యది బాగుండలేదు నేను మీతండ్రికిని దండ్రిని నామాటను వినవా?"

ఇదివిని ప్రియవ్రతుఁడు లోలోన నవ్వుకొనెను. ఇప్పుడాతఁడేమి చెప్పఁగలఁడు? బ్రహ్మ బ్రహ్మాండాధిపతి, పూజనీయుఁడు పితామహుఁడు ఆతని యాజ్ఞనుల్లంఘింప వీలు

లేదు. ఆతని కెదురు చెప్పుటయు ధృష్టతయే కాఁగలదు. అందు
వలన మహాభాగవతుఁడగు బ్రియవ్రతుఁడు తనను జిన్నవానిగా
నెంచుకొని, పెద్దల యాజ్ఞను శిరసావహించుటయే ధర్మమను
కొని, లజ్జచే నమ్రతతోఁ దలను వంచి, మిక్కిలి సంకోచముతో
మెల్లఁగా నిట్లనెను:– "స్వామీ ! మీ ఆజ్ఞప్రకారమే జరుగఁ
గలదు" ఇదివినఁగానే బ్రహ్మ శరీరము పులకించెను. స్వాయం
భువమనువుయొక్క ఆనందమునకు మేఱయే లేదు ఆతఁడిట్లను
కొనెను:– "మంచిదేయైనది. పాముచావను లేదు బడితవిఱుగను
లేదు పని అయినది. నేను మావానికి చెప్పనవసరము లేకయే
బ్రహ్మ చెప్పఁగా దోవకువచ్చినాఁడు." ఇటకొని యాతఁడు
శీఘ్రముగ లోకపితామహుని విధ్యుక్తముగఁ బూజించెను.
మనువు పూజను స్వీకరించి బ్రహ్మ నవ్వి నారదునిట్లడిగెను:–
"భక్తరాజా ! నేను చెప్పినదానికి వ్యతిరేకముగ నీ బ్రహ్మ
చెప్పినాఁడని నీకు కోపము లేదుగదా?"

నారదుఁడు నవ్వుచు నిట్లనెను:– "స్వామీ ! ఏమిచెప్ప
దును? పెద్దలకు పెద్దమాటలుండును. చిన్నవారమే యిట్లుచేసి
యుండినచో, చూచితిరా వీఁడితరుల శిష్యులను బోధించి
త్రిప్పివేసినాఁడనియందురు. స్వామీ ! పెద్దవారి నెవరేమనఁ
గలరు? మంచిది, ఆతఁడు నాశిష్యుఁడు కాఁడు, నాసోదరుఁడే"

ఇదివిని బ్రహ్మనవ్వి యిట్లనెను:– "అట్లు కాదయ్యా !
ఆతఁడు నీ శిష్యుఁడే, ముందును నీకు శిష్యుఁడుగనే యుండఁ
గలఁడు వీనిద్వారా మేము సృష్టికార్యమును వృద్ధిగావింప
వలయును. వీనిద్వారా ద్వీప, సముద్ర, దేశాది రచనకావల

యును. ఇది సాధారణులవలనగాదు. ఇట్టిత్యాగియు. విరాగియు మాత్రమే యిట్టిపనిని జేయఁగలఁడు. ఈ పనియంతయు కాఁగానే యాతఁడు నీమార్గమునే అనుసరింపఁగలఁడు."

నారదుఁడు నవ్వియిట్లనెను:- "లేదు స్వామీ! అదేమియునులేదు. మీరు ప్రవృత్తి నివృత్తులరెంటిని ధ్యానమందుంచుకొనవలెను."

శ్రీ శుకమహర్షి యిట్లనెను:- "రాజా! ఈ విధముగఁ బ్రియవ్రతునకుపదేశించి బ్రహ్మ అవాఙ్మానస గోచరుఁడును, వ్యవహార శూన్యుఁడును, స్వాశ్రయుఁడును, నిర్గుణ, నిరాకార, విశుద్ధ బ్రహ్మను జింతించుచు సర్వశ్రేష్ఠమగు బ్రహ్మలోకమునకుఁబోయెను.

బ్రహ్మ వెడలిపోఁగానే నవ్వుచు నారదుఁడు స్వాయంభువమనువుతో నిట్లనెను:- "రాజా! మా ప్రయత్నము వృథాకాఁగూడదు. పుత్రుఁడుకాకున్న తండ్రియైన సరియే. ఇప్పుడు నీకు వృద్ధావస్థ. ప్రియవ్రతుఁడు సర్వసమర్థుఁడు. ఆతఁడు రాజ్యపాలనముచేయ సమర్థుఁడు. నీవు నీ భారమునంతను వీనికి వప్పగించి, యేకాంతమునకుఁబోయి శ్రీహరినారాధించుటలో నిమగ్నుఁడవు కావలయును. ఇప్పుడీ భూమండలము భారమునంతను రక్షించుభారమును వప్పగింపుము."

సంతోషమును బ్రకటించుచు మనువిట్లనెను:- "నారదా! ఇది లక్షరూపాయలమాట తపోవనమునకు వెళ్లుటకిది సమయమే ఈరాజ్యకార్యముల నన్నిటిని జక్కఁ పెట్టుకొనినచో

నేనిప్పుడే మీ వద్ద దీక్షను దీసికొని వెళ్ళెదను ” ఇట్లు పలికి మనువు వెంటనే మంత్రి పురోహితులను, ప్రజలను బిలిచి ప్రియవ్రతునకు రాజ్యమొసంగి తాను విషసదృశములగు విషయభోగములను త్యజించి తపోవనమునకుఁబోయెను.

ప్రియవ్రతునకు విషయసుఖములు ప్రియములు కాకున్నను ఆతని యంతఃకరణములోని సమస్తవిషయవాసనలు నిరంతరము ఆది పురుషుఁడగు శ్రీమన్నారాయణుని యుగళ చరణ కమల మకరంద పానమొనర్చుటచే క్షీణమ్మలై, సమస్త ప్రపంచముయొక్క జననమరణ బంధములను దెగఁగొట్టి సమర్థమ్ములైన ఆది పురుషు నఖిలేశుని పాదపద్మ ధ్యానకారణమున నాతని యంతఃకరణము విశుద్ధమయ్యెను అయినను గుర్వాజ్ఞను శిరసావహించి యాతఁడు సమస్త భూమండలమును ధర్మపూర్వకముగ శాసించుచుండెను.

కొంతకాలమైన తర్వాత నాతఁడు సుందరియగు విశ్వకర్మయొక్క కుమార్తెను వైదికవిధిచే విధ్యుక్తముగ వివాహమాడెను సర్వగుణ సంపన్నయు సుందరియునగు భార్యను బొంది ప్రియవ్రతుఁడు పూర్వవిషయములను మఱచియే పోయెను. ఎప్పుడు తెల్లవారినదో యెప్పుడు ప్రొద్దుక్రుంకినదో కూడ తెలియనంతగ నాతఁడు సాంసార నిమగ్నుఁడయ్యెను. ఆతఁడు గృహస్థాశ్రమములోఁ బూర్తిగా మునిఁగిపోయెను.

# ప్రియవ్రతుని ప్రభావము

౩౦౦

శ్లో॥ నైవం విధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదంఘ్రిరజసా జితషడ్గుణానామ్ ।
చిత్రం విదూర విగతః సకృదాదదీత
యన్నామధేయ మధునా స జహాతి బంధమ్॥

(శ్రీభాగ. ౫ స్కం. ౧ అ. ౩౫ శ్లో॥

క॥ హరిసేవ నాప్రియవ్రతుఁ
డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే
ధరఁ జండాలుండైనను
హరినామస్మరణఁజెందు నవ్యయ పదమున్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

విషయాసక్తులరై జ్ఞానియు నజ్ఞానియు నిద్దరును నొక్కే విధముగఁ గనఁబడుచుందురు. కాని జ్ఞానికి వివేకము లుప్తము కాదు ఆతఁడు సాంసారిక కార్యములలో నిమగ్నుఁడైనను వానికంటక యేయుండును. ఆతఁడు వివేకమును బోనాడివిషయములనే సర్వస్వమనుకొని విషయాసక్తులవలె స్త్రీలకుఁగ్రీడా మృగమైనాఁడని యనుకొనుచుందురు. కాని యాతని కత్యంత ప్రియములుగ భావింపఁబడుచున్న పదార్థములను తృణప్రాయముగఁ త్యజించి పోయినప్పుడాతని వివేక విశేషములు లోకమునకుఁ దెలియఁగలవు.

(శ్రీ) శుకమహర్షి యిట్లనెను:- 'రాజా! బ్రహ్మ యొక్క యాజ్ఞను శిరసావహించి ప్రియవ్రతుఁడు గృహస్థాశ్రమమునఁ బ్రవేశించెను. ప్రాణప్రియయగు నాతని భార్య బర్హిష్మతి మిక్కిలి జాగ్రత్తగఁ ద్రికరణశుద్ధిగ సర్పించి భర్తకు సేవచేయుచుండెను. తనసేవా వినయములద్వారా మహారాజు ప్రాణములకంటె నధికముగ తనను ప్రేమించునట్లామె ఆతనినిఁ దనవశము మొనర్చుకొనినది. నారీ సులభ సంకోచమయ మధురమందహాసముద్వారా నాతని వైపామె చూచినప్పుడును, లజ్జావనత ముఖారవిందయై యనురాగముతోఁ గ్రీగంటఁజూచినపుడును, మహారాజామెకుఁ దన సర్వస్వము నర్పించెడువాఁడు. ఆమె మృదుమధుర వినోదము లొనర్చుచు మధ్యమధ్య నవ్వినప్పుడు శరత్కాల చంద్రుని నుండి ముత్యములు రాలినట్లుండెడిది. ఆమె అట్టహాసముచే మహారాజు తన్నుఁదాను మఱచి పోయెడువాఁడు ఈవిధముగఁ దనప్రాణప్రియయగు బర్హిష్మతితోఁ గ్రామాభివృద్ధినిఁ జెందుచున్న నిత్యనూతనామోద ప్రమోద క్రీడాకారణమున నాతఁడు తనను దేవేంద్రునికంటెను సుఖవంతునిఁగ భావించుకొనుచుండెడువాఁడు. ఆతఁడు తనధర్మపత్ని యందింతటి యనురాగమును గలిగియుండుటనుగాంచి యవివేకులిట్లను కొనుచుండిరి:- "నారదుఁడు బోధించిన ధ్యానజ్ఞానము లిప్పుడు పోయినవి. ఇప్పుడీతఁడు విషయాసక్తుఁడును, స్త్రీ లంపటుఁడునునగు నజ్ఞాని వలె నైనాఁడు," కాని వాస్తవిక విషయమదికాదు. ఆతని పూర్వనిష్ఠకేమాత్రమును భంగము కలుగలేదు.

మహారాణియగు బర్హిష్మతీ గర్భమున మహారాజుకు పదుగురు కొడుకులును, నొకకన్యకయు నుద్భవించెను. ఆపదుగురు పదిఅగ్నుల పేరున లోకమున విఖ్యాతులైరి. ఆ పదుగురి పేర్లు వరుసగా అగ్నీధ్ర ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేత, ఘృతపృష్ఠ, సవన. మేధాతిథి, వీతిహోత్ర, కవులు. కన్యక పేరు ఊర్జస్వతి

ఈ పదుగురిలో నేడుగురు భూమిమీఁద సప్తద్వీపములకును రాజులైరి, మిగిలిన ముగ్గురిలోఁగవి, మహావీరుఁడు, సవనుఁడు వీరు గృహస్థాశ్రమును స్వీకరించలేదు. వీరవివాహితులై నైష్ఠిక బ్రహ్మచారులైరి. వీరు ప్రవృత్తి మార్గానుసరణముగావించి, మహర్షులచేఁ బ్రశంసితులై నివృత్తి మార్గము ననుసరించిరి. ఆ మార్గములో భవభయ భీతులైన వారి కాశ్రయ స్వరూపమును, సమస్తజీవులకు నిజమగు సుహృదుఁడునగు వాసుదేవుని చరణారవిందములు సర్వదా చింతింపఁబడుచుండును. ఆ యాశ్రమమందు అఖండోత్కృష్ట భక్తియోగముద్వారా విశుద్ధమైన యంతఃకరణమందు ప్రత్యగాత్మ స్వరూపుఁడగునా యఖిలేశునిఁ జింతించుచు నవిశేష రూపమునఁ దాదాత్మ్యమును బొందుచుందురు. అట్టి పరమహంసాశ్రమమున వారు దీక్షితులైరి. వారు సంసార సాగరమును దాటిరి. ఈ శరీరముచేతనే వారు పరమపదమును బ్రాప్తించిరి. మిగిలిన యేడుగురు మహారాజు నాజ్ఞానువర్తనులై పృథివీపాలన కార్యములందు తోడ్పడుచుండిరి. తన పుత్రికయగు నూర్జస్వతిని యసురగురువగు శుక్రాచార్యుల

కొసంగి పెండ్లియొనర్చెను. ఈమెకు దేవయానియను కన్యక యుదయింపఁగా నామెను యయాతి పాణిగ్రహణ మొనర్చెను.

ప్రియవ్రతున కింకొక భార్యయుఁగలదు. ఆమెవలన నుత్తమ, తామస, రైవతులను ముగ్గురు ప్రభావశాలురగు బుత్రులుదయించిరి. ఈ ముగ్గురును మన్వంతరాధిపతులగు మనువు లైరి. ముగ్గురుపేర్లతో వేఱు వేఱు మన్వంతరములు ప్రసిద్ధములయ్యెను. వారు తమతమ మన్వంతరముల పర్యంతము మూఁడులోకములను శాసించిరి. మహారాజు తన బాహు బలముచే నవ్యుదవర్షము లీసమస్త భూమండలమును బుత్రుల వలెఁబరిపాలించెను.

శుకుఁడిట్లనెను:- ' రాజా ! ప్రియవ్రతునితో సమానుఁడగు తేజస్వియు, ప్రతాపవంతుఁడునగు రాజింతవఱకు లేఁడు. ఉండఁగలండను నమ్మకమును లేదు ఆతఁడు బ్రహ్మతో సమానుఁడగు శక్తిశాలి పరాక్రమ వంతున కేదియో యాల్లోచన తట్టుచునేయుండును. ఒక దినమున మహారాజిట్లను కొనెను:- 'మరీచి మాలియగు నీ సూర్యభగవానుఁడు సర్వదా సుమేరు పర్వతమును బ్రదక్షిణము చేయుచుండును. ఆతఁడెచ్చటికిఁబోవునో అచ్చట ప్రకాశము కలుగుచుండును. ఆతఁడు లేనిచోట నంధకారమే కలుగును. ఇట్లు సగము భూభాగముపైఁ బ్రకాశమును మిగిలిన యర్ధభూభాగముపై నంధకారమునుండును. నేను నా ప్రయత్నముచే నెచ్చటను జీఁకటి లేకుండ జేయుదును. ఎప్పుడును బగలేకావలయును.

ఇట్లాలోచించుకొని యాతఁడు సూర్యునికివలె జ్యోతిర్మయ దివ్యరథమును నిర్మించుకొని, దానిపై నెక్కి యాకాశమున సూర్యునికి విరుద్ధముగ సుమేరు ప్రదక్షిణము చేయుచుండెను. ఇప్పుడెచ్చటను రాత్రియే లేకుండెను ప్రాణులందఱును దుఃఖితులైరి. రాత్రులందు ప్రాణులు నిద్రించి శ్రమను బాపుకొనుచుండెడువారు. కాని యిప్పుడు రాత్రియే లేకుండెను. మహారాజుయొక్క రథచక్రములు భూమిమీఁదనుండియే ఆకాశమున సూర్యునివలె మెఱయునంతటి దివ్యమైనవి. మహారాజీ విధముగ రథము మీఁద భూమి కేడు ప్రదక్షిణములొనర్చెను. అప్పుడు మధ్యలో బ్రహ్మవచ్చి అడ్డగించి యిట్లనెను:- "నీవు రద్దిచేయుచున్నావేమి ? నీ ప్రభావము నిట్టు ప్రదర్శింపరాదు. దినరాత్రులు రెండు నుండవలెను." అనఁగా బ్రహ్మమాట అను రాజు మన్నించెను. ఆతఁడేడుసార్లు" తిరుగుటచే పడిన గాడియే యేడు సముద్రములుగ నేర్పడినవి.

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా ! ఈ విషయము మాకు విభ్రాంతిని గలిగించుచున్నది. రథపు చాళ్లవలన నేడు సముద్రములేర్పడినవనుట ఆశ్చర్యకరముగనున్నది. ఇదంతయు అతిశయోక్తిగఁ గనఁబడుచున్నది. మాకు సప్తసముద్రములు కనఁబడుటలేదు ఇది మాబుద్ధికి నెక్కుటయునులేదు ఇదెట్లున్నదనఁగా మదిరాపానమొనర్చి మా నాయన యిట్టివాఁడు అట్టివాఁడు, వేయిమణుగుల దూదితోఁ జేయఁబడిన తలపాగ చుట్టుకొనెడువాఁడు. లక్షమణుగుల ధాన్యమును వెదపెట్టెడు వాఁడు. కోటిమణుగులు పండెడిది. ఒక అద్భుతము జనులు

తినుచుండెడువారు. అతని ముక్కునుండి ఒక ఖర్వము ఏనుఁగులు వచ్చుచుండెడివి. ఇట్టి తలతోఁకలేని మాటలవలె నున్నవి."

ఇదివిని నవ్వుచు సూతుఁడిట్లనెను:- "స్వామీ ! ఋషులయ్యును మీరిట్లు పలికెదరేల ? భగవంతుని యపరిమేయ శక్తి మీఁద విశ్వాసములేని నాస్తికులకిట్టి శంకలుప్పతిల్లుచుండును. ఈ నదీనదములు, సాగర పర్వతాదులు ఎవనిచేతనైన నేర్పడియుండవలయును."

శౌనకుఁడిట్లనెను:- ఇవన్నియు స్వతః ప్రకృతిద్వారా తమకుఁదామే యేర్పడియుండవలెను."

సూతుఁడిట్లనెను:- "స్వామీ ! ఏవస్తువైనను దానంతట అదియేర్పడదు. ప్రకృతి జడమైనది. దానిలోనికి చైతన్య సమావేశముకానిది ఏవస్తువైనను దానంతట అదియేర్పడు టెట్లు ? దానికొక నిమిత్తముండవలెను. ఉపాదానముండవలెను. అన్నిటికిని నిమిత్తము, ఉపదానము శ్రీహరియే. అతఁడే నిమిత్తమై ఎవనిచే నేకార్యమును జేయింపవలయునో ఆపనినిఁ జేయించు చుండును. ఎవనివలన నీసముద్రము లేర్పడినవో అతడే యీప్రియవ్రతుఁడు. వీనికి ఆధ్యాత్మిక అర్థములు కూడకలవు. ఇచ్చట నీ కథా ప్రసంగములో దానినివిస్తరింపఁదలఁచలేదు."

శౌనకుఁడిట్లనెను:- "సరియే, ఈ విషయములనుగూర్చి సమయానుసారముగ శంకా స మా ధా న ము లు జరుప వచ్చును. ప్రస్తుతము కథా ప్రసంగమును బూర్తికావింపుము

సప్తసముద్రములు, సప్తద్వీపములు ఏవేవి ? ప్రియవ్రతుండు వాని కేయేపుత్రుని నేయేద్వీపమున కధిపతిగాఁ జేసెను. ఈ విషయమును జెప్పవలయును."

ఇదివిని సూతుండిట్లనెను:- "స్వామీ ! ఈ విషయములను గూర్చిన విశద వివేచనము భూగోళ వర్ణనములో జరుపఁగలను. ఇప్పుడు మీకు మాగురుదేవుండు చెప్పినద్వీప సముద్రముల నామమును జెప్పెదను."

పరీక్షిన్మహారాజడుగఁగా శుకుండిట్లనెను:- "రాజా ! సప్తసముద్రముల మధ్యమధ్య నేర్పడిన భూమియే సప్తద్వీపములయ్యెను అవి జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలీ దీపము, కుశద్వీపము క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కర ద్వీపము."

పరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ ! ఈ ద్వీపములన్నియు పొడుగు వెడల్పులోను విస్తీర్ణములోను సమానములా ? లేక న్యూనాధికములుగ నున్నవా?"

శుకుండిట్లనెను:- "లేదు, మహారాజా ! ఇవన్నియును సమానముగలేవు. ఒకొక్కటి రెట్టింపు రెట్టింపుగనున్నవి. అనఁగా జంబుద్వీపముకంటెఁ ప్లక్షద్వీపము రెట్టింపు, ప్లక్షద్వీపముకంటె శాల్మలీద్వీపము రెట్టింపు, ఇట్లేఅన్నియును. ఇప్పుడు మనమున్న ద్వీపము జంబూద్వీపము, దీనికి నాల్గుదిక్కులఁ నొక్కొక్క సముద్రమున్నది ఇది ఇతరమైనవాటికి వేఱుగ నున్నది. యోగులుతప్ప యింకెవరును నొకద్వీపమునుండి యింకొక ద్వీపమునకుఁబోఁజాలరు. అందువలన నాస్తికులు

ద్వీపములు కావనియే యనుచుందురు ఇవి అతిశయోక్తులు, కల్పనలందురు ఎవ్వరైనంగూర్చుండి వ్యాసములు వ్రాసినట్లు అన్నిటిని త్రివ్వరందురు. వారికి మనమేమి చెప్పవలసి యుండును."

రాజిట్లడిగెను:- "స్వామీ ! సప్త సముద్రముల పేర్లేవి? అవియిప్పుడేయేద్వీపములను జుట్టుకొనియున్నవి?"

శ్రీ శుకమహర్షి యిట్లనెను:- "రాజా ! ఈ యేడు సముద్రముల పేర్లివి:- ఉప్పుసముద్రము, ఇక్షుసముద్రము, సురాసముద్రము, ఘృతసముద్రము, క్షీరసముద్రము, దధి మండసముద్రము, శుద్ధజలసముద్రము, ఇవి క్రమముగ సప్త ద్వీపములను జుట్టుకొనియున్నవి. జంబూద్వీపమునకు నలువైపు నుల ఉప్పుసముద్రమున్నది. ప్లక్షద్వీపమునకు నలువైపులను ఇక్షుసముద్రము (చెఱకురసము) కలదు. శాల్మలీద్వీపమునకు నలువైపుల (సురా కల్లు) సముద్రమున్నది. ఇట్లే అన్నియును

రాజిట్లడిగెను:- "స్వామీ ! ఈ విషయ మర్థము కాలేదు. పాలు, నెయ్యి, పెరుగు, కల్లు, చెఱకురసపు సముద్రములేమిటి? వీనిలో నేయి, పాలు నిండియుండునా?"

ఇదివిని సూతుండిట్లనెను:- "లేదు, రాజా ! వీనిలో నుండునది జలమే; కాని ఆయా జలములలో నాయావస్తువుల తత్త్వమధికముగనుండును. ఎట్లనంగా-మనజంబూ ద్వీపమునకు నలువైపులను లవణ సముద్రమున్నది. ఇందులోఁ గేవలము లవణములేదు. నీటిలో నుప్పు యెక్కువగాఁగలదు. ఈద్వీప

ములోనుండు వారల యాహారములో లవణపదార్థముల బాహుళ్యముండును. మనము ప్రత్యక్షముగ నుప్పును దిన కున్నను కూరలలోను, ఫలములందును, అన్నాదులలోను అన్యద్వీపములకంటె లవణాంశము నెక్కుడుగనుండును. ఇదే విధముగ పాలు, పెరుగు, నేయి, కల్లు మొదలగు సముద్రములు చుట్టుకొనఁబడిన ద్వీపములలోనుండు వారిచుట్టును నీరేయుండును, కాని క్షీరసాగరజలమందు పాలరుచియుండును పాలవలెనే నీరుఁడును. ఘృతసాగరమందు నేయివలె గుణము నొసంగు స్వాదిష్టజలముండును. క్షార సముద్రి జలమును ద్రాగిన నోరంతయు నుప్పగానుండునట్లు, ఆయాద్వీపముల జలములను ద్రాగిన నోటికి ఆయారుచి వచ్చును. ఈసముద్రము లన్నియు నాయాద్వీపముల ననుసరించియేయున్నవి. రాజుల కోటలకు చుట్టును బెద్ద పెద్దలోతగు కందకములుండును. వాటి నిండ జలముండును. అట్లే యీద్వీపములను కోటలకు ఆయా సముద్రములే కందకముల వంటివి. ప్రియవ్రతుఁడా సప్త ద్వీపములకు తన పుత్రుల నేడ్వురను రాజ్యాధిపతులుగ నొనరించెను. జంబూద్వీపమునకు నగ్నీధ్రుని, ప్లక్షద్వీపమునకు ఇక్ష్మజిహ్వుని, శాల్మలి ద్వీపమునకు యజ్ఞవాహుని, కుశద్వీపమునకు హిరణ్యారేతుని, క్రౌంచద్వీపమునకు ఘృతపృష్ఠుని, శాకద్వీపమునకు మేధాతిథిని, పుష్కరద్వీపమునకు వీతిహోత్రుని రాజులుగ నొనర్చెను."

పరీక్షిన్మహారాజిట్లనెను:— "రాజా ! ఈ విధముగఁ బ్రియవ్రతుఁడు సప్తద్వీపములను నిర్మించి, సప్తసముద్రముల

నేర్పఱచి, వాటిని తన యేడ్గురు కుమారులకును బంచి, రాజ్యభారమునంతను వారి భుజస్కంధములపై నిడగానే ఆతనికి వైరాగ్యముకలిగెను. వైరాగ్యము కలుగఁగానే ఆతఁడు మరల నారదోపదేశమును స్మరించెను.

## ప్రియవ్రతుని గృహత్యాగము

౩౧౧

శ్లో॥ ప్రియవ్రతకృతం కర్మ కోను కుర్యా ద్వినేశ్వరమ్ ।
యో నేమి నిమ్నైరకరోచ్ఛాయాం ఘ్నన్సప్త వారిధీ॥

(శ్రీభాగ. ౫. స్కం. ౧ అ. ౩౯ శ్లో.

వ. ఇట్లు దనరథ మార్గంబులు సప్తద్వీప సాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతి సూర్యుండై సరిద్గిరి వనాదులచేత భూత నిర్వృతికొఱకుఁ బ్రతిద్వీపంబునకు నవధులు గల్పించి ద్వీపవర్ష నిర్ణయంబులం బుట్టించి పాతాళ భూస్వర్గాది సుఖంబులు నరక సమానంబులుగాఁ దలంచి విరక్తిం బొంది నిరంతర భగవద్ధ్యాన విమలీకృతాశయుండగుచు హరిభక్తి ప్రియుం డయిన ప్రియవ్రతు చరిత్రంబు నీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబు గాదని మహాత్ములు నేఁడునుం గొనియాడుదురు.

శ్రీమదాంధ్ర భాగవతము.

ఎంతటి బలవంతుఁడైనను, శూరుఁడైనను పరాక్రమవంతుఁడైనను, యశస్వియుఁ, దపస్వియుఁ దేజస్వియునైనను నీ భూమిమీఁదగల సమస్త సాంసారిక భోగములను త్యజింపవలసియుండును. ఈభూమిలోని భోగములన్నియు ననుభవింపవలయుననిన నది యెన్నటికిని జరుగని మనోరథమే. ఎప్పుడో

ఒకప్పుడు వివశుఁడ్వై త్యజింపవలసియుండును. బుద్ధిమంతుఁ డగువాఁడు దానిని స్వయముగఁద్యజింపవలయును. అందుకనియే వర్ణాశ్రమ ధర్మ మందొక నియమముకలదు. పుత్రునకుఁ బుత్రుఁడు కలుగఁగానే గొప్ప గొప్ప చక్రవర్తులుకూడ సమస్తమును ద్యజించి వనవాసులై వానప్రస్థ ధర్మమందు దీక్షితులగుదురు. వారు గ్రామ్యాన్నమును ద్యజించి, వనములలోని కందమూల ఫలాదులను దిని యుందురు. రాజస వసనములను ద్యజించి చీరవల్కలములను ధరించి తపస్సునందు నిమగ్నులగుచుందురు.

(శ్రీ) శుకమహర్షి యిట్లనెను:— "రాజా ! ప్రియవ్రతునకు వృద్ధావస్థ ముంచుకొని వచ్చుచుండుటనుగాంచి యాతని చిత్తము సాంసారిక విషయభోగములనుండి తొలఁగెను. పుత్రులకు రాజ్యమునొసంగి, తన హృదయమును దాను బరీక్షించు కొనసాగెను. తన గురుదేవుఁడగు నారదుని చరణా సన్నిధానమునఁగూర్చుండి పమార్థ చర్చచేయుచుండిన యాదినము లాతనికి స్మరణమునకు వచ్చెను. అవి యెంతటి మంచి రోజులు ! ఈ దృశ్యము ప్రాపంచిక దృష్టికల వారలకుఁ గనఁబడదు. అప్పుడే చింతయును, శోకమును నుండదు. సర్వేశ్వర ధ్యానములో నిమగ్నులై సమాధిసుఖమందు నిమగ్నులై యుందురు. ఆస్థితిని వీడి గృహస్థాశ్రమమును స్వీకరించినప్పటి నుండి ఒక దినమైనను నా సుఖానుభవము కలుగలేదు.అట్టి సుఖమొక్కక్షణము దొరకినను జాలును. ఆ దినములు జ్ఞాపకమునకు వచ్చునప్పటికి ఆతనిహృదయము కదలిపోయెను. ఆతఁడు

పశ్చాత్తాపమును జెందుచు లోలోన నిట్లు విచారింపసాగెను:—
"అయ్యో! పథకము చెడినది. నేను విషయములలోఁబడి నాసపోయితిని. నాకు సదసద్విచారణశక్తి నశించినది. గుడ్డి వానివలె నేనవిద్యాజనిత విషమ విషయ రూపమగు నంధకారకూపమున నాకు నేనే దుమికితిని. నా స్వతంత్రబుద్ధినిఁ బోనాడి పరాధీనుఁడనైతిని. సర్వసమర్థుఁడనైనను వనితకుఁ గ్రీడా మృగమునైతిని. ఛీ! ఛీ!! మందమతినిగూడ జ్ఞానరహితుఁడను, మూఢుఁడనగు నా బ్రదుకు పాడుగాను. ఇఁక నేనీ గృహస్థాశ్రమ రూపమగు నంధకార కూపమున నిఁక నెన్నో దినములు అచేతనుండనై పడియుండఁజాలను. ఇపుడిఁక శక్తిహీనుఁడనై సంసార సాగరమందు మునిఁగి తేలుచుండను"
ఇట్లాలోచించి యాతఁడు తనతనపుత్రులను బిలిచి, తనమనోగత సంకల్పమును జెప్పెను. వినియందఱు నధీరులైరి. రాజమహిషియగు బర్హిష్మతి తనపతి రాజ్యాదులను త్యజించివనములకు వెళ్ళుచున్నాఁడను సంగతిని దెలిసికొని తానును ఛాయవలె నాతని వెనువెంటనే బయలుదేరెను. మహారాజు తనపుత్రులు, ప్రజానీకము దుఃఖించుచుండ తనభూమండల రాజ్యమునంతను మృత శరీరమువలెఁ త్యజించి, హృదయమునఁ దీవ్ర వైరాగ్యమును ధరించి భగవంతుని మధురాతిమధురసులలిత లీలా చింతనము గావించుచుఁడన గురుదేవుఁడగు నారద మహర్షి చెప్పిన చొప్పున మరల ననుసరించెను. ప్రాతః కాలమున తప్పిపోయి మరల సాయంకాలమునకు ఇంటికి వచ్చుచో నది తప్పిపోవుటకాదు. అదేవిధముగ గృహస్థా

శ్రీమమందింతటి యంతరాయము కలిగినను ఆతని త్యాగ మందు విశేషాంతరము లేనేలేదు. ఆతఁడు తన వివేక వైరాగ్యములద్వారా ఈయగాధ సంసారసాగరమును నిమిషములోఁ దరించెను.

శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో నిట్లనెను:—"రాజా! సత్యవ్రతుఁడగు నా ప్రియవ్రతుని గుణముల నెవరు వర్ణింపఁ గలరు? ఆతఁడు తన పురుష ప్రయత్నముచే పృథివిని బుద్ధ్యా ప్రదమగు ద్వీపములుగా విభజించినాఁడు. రథచక్రముల చే సముద్రములుగ నొనర్చెను. సూర్యునివలె నాకాశమున నుద యించి సూర్యునకుఁగూడ తన ప్రభావమును జూపించెను. నద నదీ, గిరి, పర్వత, వనోపవనములకు హద్దులొనర్చెను. ఇంతటి వైభవశక్తులున్నను జివరకు పృథ్వీ స్వర్గాది లోక సుఖములను నిరయ సమానముగ నిస్సారముగ, దుఃఖదముగ భావించినాఁడు. అట్టివాని నీశ్వరునిగ భావింపవలయునుగాని సాంసారికునితోఁ బోల్పవీలులేదు. ఆతని ప్రభావమిప్పటికిని వ్యాప్తమైనది. ఆతఁడు ప్రజాపతులకును బూజ్యుఁడు, మను వులకును మాననీయుఁడు, దేవతల కాదరణీయుఁడు"

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:— "స్వామీ! మీరు మను పుత్రుఁడగు ప్రియవ్రతుని సంక్షిప్త చరిత్రమును జెప్పితిరి. ఇఁక నిప్పుడాతని పుత్రుల వంశములనుగూర్చి వినఁదలఁచు చున్నాను."

ఇదివిని శుకుఁడిట్లనెను:- "రాజా! ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కర ద్వీపములను బ్రియవ్రతుని

పుత్రులేలిరిగదా ! వారి నొకవిధముగ స్వర్గములోనియింద్రుని వలె భావింపవలయును. ఏలననగా జంబూద్వీపముతప్ప మిగిలిన ఆఱు ద్వీపములను భౌమ స్వర్గములందురు. వీనిలోని మానవులు కేవలము భూమిపైఁగల దివ్య భోగముల ననుభవించుటకే వచ్చుచుందురు. కర్మకొఱకును, బరమార్థ సాధనకొఱకు నీ జంబూద్వీపమేకలదు. జంబూద్వీప మంతయునుగాదు దీనిలోఁ దొమ్మిది ఖండములుకలవు. ఎని మిది ఖండములు స్వర్గసమానములు. కేవలము భరతఖండమే కర్మభూమి. ఈ భరతఖండమందే-మానవుఁడు శుభాశుభ కర్మలొనర్చి స్వర్గ నరకములకుఁ బోవుచుందురు. జ్ఞానానంత రము మోక్షమును బొందవచ్చును. కావున జంబూద్వీపాధి పతియును బ్రియవ్రతుని జ్యేష్ఠ శ్రేష్ఠ పుత్రుఁడునగు నగ్నీ ధ్రుని గుఱించియు నాతని వంశమును గుఱించియు విశేష వివరణము కావించెదను. ఆతర్వాత మిగిలిన ఆఱుద్వీపముల రాజులను గుఱించియుఁ జెప్పెదను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "సరియే, మీరు ముందుగాఁబ్రియవ్రతుని ప్రథమ పుత్రుఁడను బుణ్యశ్లోకుఁ డునునగు నగ్నీధ్రుని చరిత్రమును జెప్పుడు. ఆతఁడెట్లు రాజ్య మొనర్చెను? ఆతనికిఁ బుత్రులెందఱు?"

అంత శుకుఁడిట్లు చెప్పఁదొడఁగెను:- 'రాజా ! ప్రియ వ్రతమహారాజు రాజ్యమును ద్యజించి వనమునకు వెళ్ళఁగానే అగ్నీధ్రుఁడీ క్షారసముద్ర పరివృతమగు జంబూద్వీపమునకు రాజయ్యెను. ఆతఁడు జంబూద్వీపములో నివసించు ప్రజల

సందఱను బుత్రులవలెఁ బరిపాలించెను. ఆతఁడు తనవంశము నక్షుణ్ణము గావించుటకై పుత్రులు కావలయునని కోరు కొనెను. తనకు మనోను రూపమగు భార్యలభించినప్పుడే పుత్రుఁడు కలుగును. అందువలన నాతఁడు తన భార్యకొఱకై ప్రజాపతి పతియగు బ్రహ్మనారాధింపఁదలఁచెను."

అంతఁబరీక్షిత్తు ఇట్లు ప్రశ్నించెను:- స్వామీ! నేఁటి దినములలో రాజు లెన్నో వివాహములను జేసికొనుచున్నారు. శ్రీకృష్ణ పరమాత్మ పదునాఱువేల నూటయెనిమిది మందినిఁ బెండ్లాడెను. ఆతఁడు సాక్షాజ్జగదీశ్వరుఁడు కావున వదలి వేయుఁడు. రాజులలో వివాహము కొఱకు తపస్సుచేయువారి నొక్కనినైనను జూడము. పైగాఁదమ కన్యకలకు యోగ్యుఁడగు వరుఁడు కావలయునని ఆతురత పడుచుందురు. ప్రాచీన కాలమున ఫలాని ఋషి వివాహమునకై యింతతపస్సు చేసెను, ఫలాని రాజు భార్యకొఱకిన్ని వర్షము లారాధనము చేసినాఁడు, కర్దమునివంటి మహాముని వివాహముకొఱకు వేలకొలఁది సంవత్సరములు తపస్సుచేసెననియు, బ్రచేతసులును ప్రజా వృద్ధికై భార్యకొఱకు తపంబొనరించెను. ప్రియవ్రత మహా రాజు కుమారుఁడగు అగ్నీధ్రుఁడును సత్పుత్రప్రాప్తి కొఱ కును, పితృలోక ప్రాప్తికొఱకును గమలాసను నారాధించె నెందులకు? "

ఇదివిని శుకదేవుఁడు నవ్వియిట్లనెను:- "రాజా! భగవ ద్భక్తుఁడును, దానశీలుఁడును, శూరవీరుఁడునగు పుత్రుఁడే పుత్రుఁడు. కుక్కలవలెను, బిల్లులవలెను, ఎలుకలవలెను

తొమ్మిది నెలలకుఁబుట్టు చిక్కని బక్కగానుండి మానవాకృతితో నున్నను వారు నిజముగఁ బుత్రులుకారు. మాతృమెచ్చట నుండి వెలువడునో పుత్రుఁడు నచ్చటినుండియే వెలువడును. వాఁడు ధార్మికుఁడై, ధర్మాచరణముచేఁ దన పితరులను బున్నామ నరకమునుండి యుద్ధరించువాఁడే పుత్రుఁడు. లేకున్నచో నాతఁడు మాతృమండలి పురుగే. యోగ్యమగు భార్యవలననే యోగ్యుఁడగు బుత్రుఁడు కలుగును. అందు కనియే ఆర్యధర్మమందు వివాహమునకుఁ బూర్వము కన్య యొక్క కుల, గోత్ర, శీల, స్వభావములయందు విశేషముగ ధ్యానముంచెదరు. కులీన కన్యను వివాహమాడుటచేతనే సుయోగ్య సంతానము కలుగును. అందువలననే పూర్వకాలమున నెవతె చిక్కిన నామెను వివాహమాడుటలేదు. ఇంకొక విషయమేమనఁగా సృష్ట్యాదియందు స్త్రీలు చాలతక్కువగ నుండిరి. మర్త్యలోకమున స్త్రీలకంటెఁ బురుషోత్పత్తి అధికముగ నుండెడిది. దివ్యలోకములందు తమకుఁదాము పుట్టు పరమసుందరులగు నప్సరసలుకలిగెడువారు. వారు దేవతలను వదలి మర్త్యలోక మానవులతో సంబంధము నేర్పఱచు కొనుట అవమానముగ భావించెడువారు. అందువలనఁ గులీన పురుషులు భూమియందు ఉచ్చకులమందుత్పన్నమై, దోష రహితమగు బరమసుందరులగు కన్యకలను గాంక్షించుచుండిరి; లేదా స్వర్గాది యూర్ధ్వలోకములలో నివసించు స్వర్గరమణులను గోరుచుండిరి. స్వర్గీయరమణులు ఘోరతపస్సుచేయక లభించెడువారుకారు అందువలన వారుతపస్సు చేయుచుండెడు

వారు. తనకుఁబ్రియమగు నిష్టవస్తువు నెంతగాఁ బ్రతీక్షించిన, దానిప్రాప్తి యందంత యధికమగుఁ బ్రసన్నతకలుగును. కావునఁ బ్రతీక్షావృద్ధిచేఁ బ్రేమభావమభివృద్ధి చెందుటకై తపస్సు చేయుచుండెడువారు."

పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ ! ఆతఁడు బ్రహ్మనుగూర్చి ఆరాధన యేలచేసినాఁడు ? దేవాధి దేవుఁడగు విష్ణ్వారాధనము చేయవచ్చునుగదా ! "

ఇదివిని శుకుఁడిట్లనెను:- "రాజా ! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులా హరి స్వరూపములే. దేవతలు నాతనిరూపములే, ఆకాశమునుండి వర్షించిన జలము సముద్రమునఁ జేరినట్లు ఏ దేవతకు నమస్కారమొనర్చినను శ్రీమన్నారాయణునికే చేరును. అయినను వేఱువేఱు కోరికల కొఱకు వేఱు వేఱు దేవతారాధన మొనర్చెదరు. తేజము కావలసినవారు సూర్యునారాధించినట్లును, ధనేచ్ఛ కలవారు వసువుల నాశ్రయించినట్లును, స్వర్గకాముకులు దేవతలను, రాజ్యాకాంక్ష కలవారు విశ్వేదేవతలను, ప్రతిష్ఠాకాంక్ష గలవారు పృథివిని, రూపేచ్ఛకలవారు గంధర్వుల నుపాసించినట్లు ప్రజాకాముకులు ప్రజాపతియగు బ్రహ్మనారాధింపవలయును. అందువలన అగ్నీధ్రుఁడు సురసుందరీ క్రీడాస్థానమగు మందరాచల పర్వత కందరములకుఁబోయి, వివిధ పూజాసామగ్రిలను సేకరించి ఏకాగ్రచిత్తముతోఁ దపో నిష్ఠుఁడై లోకపితామహుఁడగు బ్రహ్మనారాధింపసాగెను.

ఆతని ఘోర తపస్సుచే బ్రహ్మసింహాసనము కదల సాగెను. ఆతఁడు అగ్నీధ్రమహారాజు యొక్క మనోభిలాషను నెఱవేర్చుట కాలోచించుచుండెను. ఆతని సభయందు సర్వ శ్రేష్ఠ సుందరియగు పూర్వచిత్తి యను నప్సరస తాలస్వర లయాదులతో గానమొనర్చుచుండెను ఆమెయొక్క అనింద్య సౌందర్యమునుగాంచి కమల గర్భుఁడత్యం తానందమునుజెంది, ఆమె ఆగ్నీధ్రున కనురూపమైనదని భావింపసాగెను.

## ప్రియవ్రతపుత్రుఁడగు నాగ్నీధ్రుఁడునుఁ పూర్వచిత్తియు

3౧౨

శ్లో॥ కాత్వం చికీర్షసి చ మునివర్య శైలే
మాయాసి కాపి భగవత్పర దేవతాయాః ।
విజ్యే బిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థే
కిం వా మృగాన్మృగయసే విపినే ప్రమత్తాన్ ॥

(శ్రీ)భాగ. ౫ స్కం. ౨ అ. ౭ శ్లో

ఆగ్నీధ్రుఁడు పూర్వచిత్తితో నిట్లనెను;-

క॥ సతి నీ వెవ్వతె వీ ప
ర్వతిముల కేమేనిఁ గోరి వచ్చిన వనదే
వతవో శారదవో రతి
పతి పంచిన మాయావో తపస్సారమవో ॥

ఉ॥ అంగజుఁ డెక్కుడించిన శరాసనయుగ్మ ధరియించి యంత నా
యంగజువేఁట మానవ మృగావళిఁ జూచుచు నున్నదానవో

నంగను నీనిజాకృతి తెఱంగెఱుఁగంగ నిజంబు పల్కుమా
యంగన నిన్నుఁ గన్గొనిన యంత ననంగుఁడు పంపడించెడున్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

రూపాకర్షణము మానవుని స్వాభావిక చేతనమును నశింపఁజేయును. ఎంతటి జ్ఞానియు, ధ్యానియు, వివేకియునగు వాఁడైనప్పటికి రూపగంధము వచ్చెనా, సౌందర్య మాదక సుధను బానమొనర్చినచో మత్తుఁడైపోవును. చరాచర విశ్వ మందు అట్టివానికి తన ప్రియవస్తు ధ్యానమేయుండును. సాధారణముగ నెవ్వరి మీఁదనైనను నెవ్వరికైన నత్యధిక ప్రేమయుండదు. ప్రారబ్ధవశమున నట్టిప్రేమకలిగెనా అది వానికిఁ బ్రాప్తించి తీరవలయును. ఒకవేళ నట్లు ప్రాప్తింప కున్నచోఁ బ్రాణములనైన నర్పించుచుందురు.

శుకుఁడిట్లనెను :- "రాజా! ప్రియవ్రతుఁ డచ్యుతభక్తుఁ డయ్యెను. ఆతని పుత్రుఁడో అప్సరాభక్తుఁడయ్యెను. ఆతఁడు మందరాచల గుహాయందు సంతానేచ్ఛచేఁ గమలాస నారాధ నమునందు నిమగ్నుఁడైనపుడాతని కచ్చట వసంతశోభ గోచ రించెను, పర్వతమంతయు నలంకరింపఁబడినట్లు కళకళలాడుచుఁ గనఁబడెను. ఆతని యాశ్రమ ప్రాంతమున పెద్దపెద్ద దట్టమైన చెట్లు అనియమిత పంక్తులలోఁ గనఁబడెను. ఫలపుష్ప సమ న్వితములగు వృక్షములతోడను, సువర్ణకాంతులుగల లతలతో ప్రేమభరిత హృదయముతోఁ దమప్రియతముని గాఢాలింగ నము చేసికొనినట్లుండెను. ఆలతలపై శుక, శారిక, పారావత, మయూరాది ఖగములు కలరవ మొనర్చుచు నెగురుచుండెను.

అవి తమ ప్రియలతోఁ గిలకిలారవము లొనర్చుచు శరీరమున ముక్కులతోఁ బొడుచుచుఁ బ్రేమకలహమునఁ దమ్ముఁదాము మఱచుచుండెను. సమీపముననుఁగల సరోవరమందు వివిధ కమలములు వికసించెను వాటిపై హంస, సారస, జల కుక్కుట, కారండ వాది జలచరపక్షులు మధుర వాక్కులతో గూయుచుండెను. ఇది యీ సరోవరము కమలరూపమగు ముఖమును దెఱచి, తన శుభ్రదంతములను జూపించుచుఁ గిల కిల నవ్వుచున్నట్లుండెను. వనశ్రీ సజీవమై పర్వత ప్రాంత మున నూగుచున్నట్లుండెను. ప్రకృతి స్తబ్ధముగను, శాంత ముగనునుండెను ఇట్టి సుఖద సమయమున యీవనమదముచే మత్తిలి, కటిభారముచే నూగుచు నా పూర్వచిత్తి యను నప్సరస ఆశ్రమ నికటవర్తియగు నుపవనమున నిటు నటు చరింపసాగెను. ఆమె తన సులలిత గతిచేతను, పాద విన్యా సముచేతను, విలాసముచేతను, కంకణ, కింకిణి, నూపుర సుమధుర ధ్వనిచే మోహింపఁజేయుచు రాజకుమారుఁడగు నగ్నీధ్రుని చిత్తమును దన వైపున కాకర్షించుటకుఁ బ్రయత్న మొనర్చుచుండెను.

విజన వనమందు మధుర మధుర నూపుర ధ్వనిని వినుటచే రాజకుమారుని సమాహిత చిత్తము చంచల మయ్యెను. సామాధియోగముద్వారా మూసిన తన కమల నయనములను గొంచెము గొంచెముగఁ దెఱచి చిత్రర జింక వలెనున్న దేవవధూటిని నెమటఁగాంచెను. భ్రమరము ఒక పుష్పమునుండి మఱియొక పుష్పము కడకుఁబోయి రసపానము

గావించి మరలఁబరిత్యజించి వచ్చునట్లు ఆమె ఒకపుష్పము నుండి మఱియొక పుష్పముకడకుఁ బోవుచుండెను. ఆమెనడక దేవ, దానవ, మానవులమనస్సులను, నయనములను నాహ్లాద పఱచునట్లుండెను. ఆమె బాలసులభ చంచలత్వముచేఁ జంచలయై క్రీడించుచుండెను. ఆమె వైఖరిలో లజ్జా, వినయములు కలిసియుండెను. ఆమె మృదుమధురస్వరము వీణాతరంగ సుమధుర ధ్వనిని నిందితమైయుండెను. ఆమె అంగప్రత్యంగముల నిర్మాణము సుగఠితమై, సుందరమ్ములై, యే యవయవ మెట్లుండవలయునో అట్టి మనోహరముగనుండెను. ఆమె కామక్రీడా స్థలమువలెఁగాముకులను దనవైపున కాకర్షించుచుండెను.

ఆమె మర్త్యలోక భామినికాదు. బ్రహ్మలోకామృతపానమొనర్చిన సురసుందరివలె నామె పవిత్రులకును, బుణ్యాత్ములకును నుపభోగవస్తువుగనున్నది. ఆమె తనకుఁదానే నవ్వెను, నవ్వినా నామెయొక్క అమృతమయ మాదకగంధము దశదిశలు వ్యాపించుచుండెను. ఆ సుందరమదగంధముచే నాకర్షింపఁబడి భ్రమరగణము కమలభ్రమచే నామె ముఖకమలముచుట్టును మూఁగుచుండెను. ఆ భ్రమరములను దన కరకమలములచేఁ దోలుకొనుచు, వ్రీడా భావమును గనపఱచుచు, పాదపద్మములను శీఘ్రముగ నెత్తుచు, వక్షస్థలభారమును గదలించుచు, సర్పిణివలెఁ బొడుగుగ వ్రేలాడుచున్న వేణినూగించుచు మొలకుఁగట్టుకొనిన మువ్వలు గణగణధ్వనులొనర్ప నిటునుండి యటకును నటునుండి యిటకును నర్తకివలె నాట్యముచేయుచుండెను.

ఇప్పుడు రాజకుమారుఁడు ధ్యాన ధారణములను మఱచిపోయెను. ప్రజాపతి ధ్యానమందేకాగ్రమైన చిత్తము ఇప్పుడు భావీ ప్రజావతీ సతీధ్యానమున నిమగ్నుఁడయ్యెను. ఆతఁడు రూపాసవమును బానమొనర్చుచుఁ బిచ్చివానివలె సంజ్ఞాశూన్యుఁడయ్యెను. జడునివలెఁ జైతన్యమును గోల్పోయి తలతోఁక లేని మాటలు మాట్లాడుచుండెను. ఆ సురసుందరిని లక్ష్యమునఁ బెట్టుకొని ఆతఁడిట్లనెను:- "తేజస్వినీ! నీ వెవతెవు? ఇచ్చటికి నీవే ప్రయోజనము కొఱకు వచ్చితివి? ఓ! హో! నీవు పరాత్పరుని మాయగాఁదోచుచున్నావు. నీవే యీ చరాచర విశ్వమును వశముగావించుకొని మోహింపఁజేయుచున్నావు అందుకనియే నేను నిన్నుఁ జూచుటచేతనే మోహితుఁడనైతిని. నిన్నుఁగాంచి నన్ను నేను మఱచితిని, దేవీ! నీవు తపస్వివా తపస్వినివా? నీవు మృగయాపేక్షగల ప్రబల పరాక్రమముగల శూరవీరుఁడవనుకొనుచున్నాను"

ఆమెయిట్లనెను:- "నీవు నన్ను జీవులను వధించువధికగాఁజెప్పెదవేల"

వ్యగ్రతతో నగ్నిధుఁడిట్లనెను:- "శూరవీరా! నేను నిన్నవమానించుటకై యిట్లు పలుకలేదు, క్షమింపుము. నీయీ భృకుటి నాకు ధనుస్సుగా గోచరించినది. కమలదళములవలెనుండి ఱెప్ప వెండ్రుకలతోఁగూడి నీకన్నులు నాకు రెండు బాణములుగఁదోఁచినవి. ఈ భావాటవియందు మృగరూపులగు విషయాసక్తులను గొట్టుటకు నీవు వచ్చినట్లు నాకుఁ

దోఁచుచున్నది. ఓహో ! నేను మఱచితిని. ఇది తపోవనము. ఇచ్చట మృగయా వినోదముల కేమి పని ? నీవేమైనఁ దపస్విని వేమోనని తోఁచుచున్నది ? ”

ఇదివిని పరీక్షిన్మహారా జిట్లనెను:— “స్వామీ! పూర్వచిత్తి స్త్రీ కదా ! అగ్నీధ్రుఁడామెను బురుషరూపమున నేల సంబోధించెను ? ”

ఇది వినగాఁనే శుకుఁడు నవ్వుచు నిట్లనెను:— “రాజా ! మానవుఁడున్మత్తుఁడైనప్పుడు వివేక విహీనుఁడగును. అట్టియెడ నెదుటనున్నది స్త్రీయైనదియుఁ బురుషుఁడైనదియు తెలియదు. ఉన్మత్తతకు నొక విషయమును జెప్పుచుందురు. అప్పుడప్పుడు మదమును బ్రావువానికి శరీరము కొంచెము తెలియుచునే యుండును. ఇదివఱకభ్యాసము లేక క్రొత్తగా మితము లేక త్రాగినవానికిఁ బ్రపంచమంతయుఁ దిరుగుచున్నట్లు కనఁబడును. నవ్విన నవ్వుచుండును. ఏడ్చిన నదేపనిగ నేడ్చుచుండును. ఎవరి వైపునైనను జూచుచుండినఁ జూచుచునే యుండును. స్త్రీనిజూచి పురుషుఁడనును, బురుషునిగాంచి స్త్రీ యనును. ఇప్పుడొకటి మాటలాడిన, చిత్తమింకొకచోటకుఁ బోయెనా యింకొకటి మాటలాడుచుండును. అదేవిధముగా మహారా జింతవఱకు మృగయాప్రియుఁడని సంబోధించుచు నిప్పుడు కులపతియనియు, వేదపాఠియగు ఋషియనియు సంబోధించు చుండెను. నాకీ గానముయొక్క అర్థము తెలియకున్నను ఇదే దియో అవ్యక్త రహస్యమయ సామవేదస్వరముగ గానము చేయుచున్నట్లు తోఁచుచున్నది. ఆ గానముద్వారముననే

ఋషిపరిణీతులు తమ తమ శాఖలను సేవించుటచే నీశ్వరా రాధనము చేయుచున్నారు.

కొంచెము సేపాలోచించి యిట్లనెను:- "తైత్తిరీయ శాఖా శిష్యులును గాళ్ళమీఁదఁబడి నీవద్ద పారమొనర్తురని తోఁచుచున్నది. తిత్తిరి పక్షుల స్వరమువలె కమ్మకమ్మని ధ్వనులతో నది వినఁబడుచున్నది. కాని దాని రూపము కనఁ బడుటలేదు. నిశ్చయముగ నీవు తపస్వివి, తేజస్వివియగు ఋషివే కాని నీ నితంబముల మీఁదఁగల పసుపుపచ్చని కాంతియున్నదే అది నీతపస్తేజమని తోఁచుచున్నది; కాని వల్కల వస్త్రములు లేక పోవుటచే నగ్నునివలెఁ దోఁచు చున్నది. నీ నడుము కడనుండివచ్చిన గణగణధ్వనియేమిటి?"

ఇదివిని పూర్వచిత్తి యిట్లనెను:- "రాజా! నేను ఋషినిగాను, తపస్వినిగాను, సాధారణజీవిని"

అదరిపడి అగ్నిధ్రమహారాజిట్లనెను:- నీవే జంతువవు? పశువుల శిరస్సులపై కొమ్ములుండును. నీకు వక్షస్థలమున నున్నవే. వీటి యందెట్టి నెట్టిని బురద తగుల్కొనియున్నదే. ఈ బురదచే నా యాశ్రమమంతయును సుగంధితమైనది. నా చిత్త మీగంధముచేఁ జంచలమైనది. అత్యంత మనోహర మును, మధురమునగు నీ ముఖకమలము అద్భుత హావభావ కటాక్ష కారణమున నేను విహ్వలుఁడను, వికలుఁడనైతిని. ఈ యనుపమాన యావలోకనముచే నాకు శరీరము తెలియుటలేదు. నీయధరసుధారస పానముచే నధీరుఁడనైతిని."

అంత నాయప్సరస యిట్లనెను:- "రాజా ! నేను దేవలోకములోని వారాంగనను. నేను బురుషుఁడనుగాను, ఋషిని గాను, మునినిగాను, కొమ్ములును దోఁకయుగలిగిన జంతువును గాను!

రాజదరిపడి యిట్లనెను:- "ఓహో! ఇప్పుడు తెలిసినది. నీవు మానవస్త్రీవికాదు, దేవతవు. నీవు భౌతికపదార్థములను దినక దివ్యామృత పానమొనర్చు వారాంగనవు నీవు విష్ణు భగవానుని కమనీయ కళవు. మనోహరములగు నీ చెవులకుఁ గల మకర కుండలములును, ఱెప్పపడని నీ కన్నులనుగాంచిన నీవు పృథ్వీసంబంధమగు స్త్రీవికావనియు నమర లోక స్త్రీవనియు గ్రహించితిని."

అదివిని పూర్వచిత్తి నవ్వుచు నిట్లనెను:-"మహారాజా! మీరు కావ్యమును సృష్టించుచున్నట్లున్నారే ? అనుపమాన మగు నుపమానములను బ్రయోగించుచున్నారే."

శుభ్రదంతములను, మెఱయుచున్న కన్నులనుగాంచి అగ్నిధ్ర మహారాజిట్లనెను:- "ఆహా! నీముఖమునేమని వర్ణింపఁగలను? సుందర స్వచ్ఛ సలిలయుక్తమై, సకలశోభాయుక్తమైన సరోవరముగనున్నది. దానిలో నీరసయుక్తములగు భీసనేత్రములు చంచలములై రెండు మత్స్యములవలెనున్నవి. నలువైపులనున్న హంసావళి సరోవరశోభ ననుమడించుచున్నట్లు నీ దంతావళి నీముఖశోభను ననుమడించుచున్నవి. ఉంగరములు తిరిగిన నీయలకావళి కమలమునందు మూఁగిన భ్రమరావళివలె శోభాయమానముగ నున్నవి. వాయువు

నీయెడల నశిష్టవ్యవహార మొనర్చుచున్నను నీవు కుపితవుకాక కోపపడకున్నావు. ఈ ధూర్తుని సాహసమును జూడుమాతఁడు నీ జటాజూటముఁ నూడదీసి చిందరవందర చేసినాఁడు. పట్టువలె మెఱయుచున్న కోమల శాలకచము నూగించుచున్నాఁడు. నీక్షీణ కటిప్రదేశము వస్త్రమును దొలఁగించుచున్నది. నీవు చూచుచుండియు నేల యుపేక్షించుచున్నావు?"

ఆయప్సరస నవ్వి యిట్లనెను:- "రాజా! నన్ను బ్రహ్మ పంపినాఁడు ఆతని యాజ్ఞను శిరసావహించి యీ తపోవనమున నీతో నుండుటకు వచ్చితిని."

రాజీమాటను వినఁగానే మరలఁ దికమకగ మాటలాడ సాగెను:- "నీవు తప మొనర్పవచ్చితివా? అయితే నీవుకూడ గొప్పతపోధనవే. ఇదివఱకుకూడ నీవిట్టి తపం బొనరించి యుందువు. ఆతపమువలననే నీకిట్టి త్రైలోక్యమోహనమగు ననవద్య సౌందర్యము ప్రాప్తించినది. ఆ తపోదీక్షను నాకును నొసంగుము. నేను నట్టి తపంబొనర్చి నీరూపమువంటి రూపమును బొందెదను. మిత్రవరా! ఏకాకినై దీనహీన సాధనవిహీనుఁడుగనున్న నావెంటచుండి నాకు సాహసమును గలిగింపుము. నన్ను నీకు మంత్రదీక్షిత శిష్యునిఁగ నొనర్చుకొనుము. మనమిద్దరమును గలిసి తపంబొనర్చి ఆనందముగ నుండెదము. మనమిద్దరమునుగలిసి ఒక్క మనస్సుతోడను, ఒక్కప్రాణము తోడను నా ప్రజాపతి పతియగు బ్రహ్మ నుపాసించినచో నాతఁడవశ్యము మనకిష్టవస్తువును బ్రాప్తింపఁజేసి, మనకు మనోవాంఛిత ఫలము లొసంగఁగలఁడు."

అంత నప్సరస యిట్లనెను:- "రాజా! నీవు ప్రకృతిస్థుఁడవ్రకమ్ము. మోహమును వీడుము. నీయారాధనము సఫలమైనది. లోకపితామహుడగు బ్రహ్మ నీయెడల సంతుష్టినిఁజెందినాఁడు. ఆతడేనన్ను నీకుదాసిగా నుండుమని పంపినాఁడు"

రాజిదివినఁగానే కిల కిల నవ్వి యిట్లనెను:- "స్వాగతము ! సుస్వాగతము! ! చతురాననుఁడు నాపై నింతటికృపఁ జూపినాఁడు. నిన్ను నాతో నుండఁబంపినాఁడా ? అయితే నాజీవన సర్వస్వమా ! నేను నిన్నెదశలోను విడువఁజాలను. నీవు నాకడనే కాలమును గడుపుచు నీ విరహవ్యథావ్యాచిత విరహుని శరీరతాపమును బోఁగొట్టుము. నా పాణిగ్రహణము కావించి నన్ను నీవానిఁగాఁజేసికొనుము. ఇంక నేడ్పింపకుము. నా యీ చంచల నేత్రములు నీ యనూప రూప దర్శనమునఁ దృప్తిచెందుటలేదు. నీ శరీరమందు లగ్నమైన నాదృష్టి యింకెచ్చటికినిఁ బోవుటలేదు. అది నీ విషమశరీరముపై లగ్నమై ఏకాకారమును జెందినది. చిత్తమింకొకదానినిఁ జింతింపక నీ యంగములందే చిక్కుకొనినది. ఓ సుందరీ ! నా కన్నిటికంటె నీ యీ శృంగములు నచ్చినవి వీనిపై నలఁదఁబడిన గంధము నా నిర్బల మానసమున నుత్సాహము నొసంగుచున్నది. ఓ శృంగీ ! నేను నీ పాదములమీఁదఁబడితిని. నీవు నన్ను స్వీకరించినను సరియే లేక కాలఁ దన్నినను సరియే. నన్నిచ్చటనుంచినను సరియే లేక యెచ్చటికైనను గొనిపోయినను సరియే. సర్వథానేను నీ యధీనుఁడను. నీ పాదధూళి

నిచ్ఛించుచున్నాను నేను నీదాసీలకును దాసుఁడను. నీవు నీ దాసదాసీ జనమునుగూడ వెంటఁగొనిపొమ్ము."

శ్రీశుకమహర్షి యిట్లనెను:- "రాజా! ఈ విధముగ ననేక విధముల ననునయ వినయములు కావించి రాజా పూర్వచిత్తినిఁ దనప్రేమ పాశమున గట్టిగబంధించెను. ఆమెను బ్రసన్న మొనర్చుటకుఁ గాముకులవలె నత్యధిక దీనతను బ్రక టించుచు నాకాశ పాతాళముల వఱకు నొక్కటిగఁ జేయసాగెను.

పరీక్షిత్తు కొంచెమాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను:- "స్వామీ! ఇంతటి మోహమా? రాజుగదా! పిచ్చివానివలెఁ దనను దాను మఱచినాఁడే. ఇట్టి యవక తవక మాటలు మాటలాడినాఁడేమి? దీనిలో నాకుఁగొంచెముగ నతిశయోక్తి గోచరించుచున్నది"

అంత నవ్వుచు శుకుఁడిట్లనెను:- "రాజా! కాలికి ముల్లుగుచ్చుకొననివాఁడు పరాయిపీడ నెట్లెఱుఁగఁగలడు? కామినీ కటాక్ష బాణములు, భ్రుకుటీ చాపమునుండి లక్ష్య ముంచి వదలినచో నా బాణములకు వ్యథితుఁడై, సంజ్ఞాశూన్యుఁ డైన వానికి; ఆతురావస్థయందు వ్యథితుఁడై ప్రలాపించు వాని మర్మమందఱకును దెలియదు. ఇది యనుభవగమ్య విషయము. భగవంతుఁడిట్టి యవస్థ యెవ్వరికినిఁ గలిగింప కుండుఁగాక! నీ వెప్పుడు నిట్టి మాయలోఁ బడనట్లు తోఁచు చున్నది. అందుకనియే తెలియని వానివలె నమాయకునివలె మాటలాడుచున్నావే."

లజ్జా భావమును బ్రదర్శించుచు నుత్తరాతనయుఁడిట్లనెను:- "లేదు స్వామీ ! మానవుఁడు మోహమునఁబడుఁడని నా యభిప్రాయముకాదు ఇంతగొప్ప తేజస్వియగు రాజున కిట్టి సంజ్ఞాశూన్యత కొంచెమనుపయుక్తముగఁ దోఁచుచున్నది."

ఇది విని నవ్వి శుకదేవుఁడిట్లనెను:- "మహారాజా ! అసలేదో కొద్దిగా జరిగియుండును. కవులు దానిలోఁగొంచెముప్రాకారమును జేర్చి దానినింతగాఁ జేసినారు. ఈ కవుల కిదియేపని. వీరి దృష్టివేఱు. సాంసారిక విషయములొకరకముగానుండిన, ఈ కవులు దానిలో సౌందర్యము నన్వేషించుచుందురు. రసాన్వేషణ మొనర్చుచుందురు ఉపమానములను వెదుకుచుందురు. రసాత్మకమై, సమస్త వర్ణనములు సరసముగనుండిననే కావ్యమగుచున్నది. నవరస సంచారముండవలయును. కవుల కందఱు లొంగవలసినదే. "రవికాననిచోఁ గవి కాంచునే భువిన్" ఇదంతయుఁ గవులయొక్క సుఖద కల్పనయే. భావజగత్తే అనుపమమైనది. రాజా ! అగ్నీధ్రుఁడా పూర్వచిత్తి యప్సరయందు విముగ్ధుఁడయ్యెననియే సారాంశము.

మహారాజిట్లనెను:- "స్వామీ ! తర్వాత నేమైనది?

అంత శుకుఁడిట్లనెను:- "ఈ విషయమును రాఁబోవు నధ్యాయమునఁజెప్పెదను." ఇతి శ్రీ భాగవత కథాగ్రంథే అగ్నీధ్రి వివాహ ప్రస్తావనామకాధ్యాయః సమాప్తః.

శ్రీహరయేనమః. శ్రీరాధే ! శ్రీరాధే !

మగువలేక నిలమగఁడు సగంబే."

# అగ్నీధ్ర పూర్వచిత్తుల వివాహము-పుత్రప్రాప్తి



శ్లో॥ న త్వాం త్యజామి దయితం ద్విజదేవదత్తమ్
యస్మిన్మనో దృగపి నో న వియాతి లగ్నమ్ ।
మాం చారు శృంగ్యర్హసి నేతుమనువ్రతం తే
చిత్తం యతః ప్రతిసరంతు శివాః సచివ్యః ॥

(శ్రీ) భాగ. ౫ స్క. ౨ అ. ౧౫ శ్లో॥

వ......పద్మాసనుండు నాకుం బ్రత్యక్షంబై నిన్ను నిచ్చినవాఁడు గావున నిన్ను విడువం జాలను నీ పక్షిజనంబులు నా వాక్యంబులకు ననుకూలింతురు గాక నీవు ననుచోటికి నన్నుం దోడ్కొని చనుము."

శ్రీమదాంధ్ర భాగవతము.

దత్త చిత్తుఁడై యఖిలేశు నారాధించిన వానికిని, తన యిచ్ఛాపూర్తికి క్షుద్రమరణ శీలురగు మానవుల నాశ్రయింపక పరమేశ్వరు నాశ్రయించిన వానికి నెఱవేఱని కోరికయే ముండును. సమస్త విభవస్వామినిఁ బ్రసన్నుని గావించుకొనిన తర్వాత దుర్లభమగు నప్రాప్యవస్తు వింకేముండును. మనోరథములకు ఉన్నతమస్థానమును జేరుకొనినతర్వాత నెఱవేఱని మనోరథమేమియుండును జీవునకు విశ్వాసము లేదు, శ్రద్ధలేదు. తన క్షుద్రహృదయముతో క్షుద్రజీవుల సమ్ముఖమున క్షుద్రాతిక్షుద్ర మనోరథములను బ్రకటించి విఫలుఁడగుచుండును.

నోటితోఁదాఁకిన వస్తువింకొకరికి పనికిరాదు; కాని శంఖము శల్యమే. దాని నందఱును నెంగిలిచేయుదురు. అది పవిత్రము. సువర్ణముద్ర చండాలుని కడనున్నను, ద్విజునికడనున్నను బవిత్రమే. దూడ యెంగిలిచేసినపాలును నందఱునుద్రావెదరు. మధుకరముల నోటినుండియేర్పడిన తేనె నందఱునుద్రావెదరు. దేవతాభిషేకమునకుపయోగించుచుండెదరు. భ్రమరము లెంగిలి చేసిన పూలను దేవతలకర్పించెదరు. పురూరవుఁడూర్వశీ సాంగత్యముచేఁ జంద్రవంశమును వృద్ధిగావించెను. స్వర్గము, దేవలోకములలోని స్త్రీలు అనఁగ నప్సరసలు సువర్ణశంఖముల వలెఁ బవిత్రులే. అందులోఁ బూర్వచిత్తి అన్నిటికంటె శ్రేష్ఠమైన బ్రహ్మలోకమునకు సంబంధించినది. పితామహుఁడగు బ్రహ్మచేఁ బంపఁబడినదగుటచే నామెను బాణిగ్రహణ మొనర్చుట శాస్త్రవిధి విహితమైనది. మర్త్యలోకములోని పరభోగ్యభామినివలన ద్విజాతులు వివాహమాడి సంతానముఁగనిన నా సంతానమొసంగిన పిండ జలములు పితరుల కందవు. అది ధార్మికసంతానముకాదు. వైషయికసంతానము.

ఇదివిని రాజిట్లడిగెను:- "స్వామీ! పూర్వచిత్తవలన నగ్నీధ్రున కెందఱు సంతానము కలిగిరి?

అంత శుకుఁడిట్లు చెప్పదొడఁగెను:- "స్వామీ! పూర్వచిత్తితో నానందవిహార మొనర్చుచుఁ జాలవర్షములు గడువఁగా నామె గర్భమునుండి గొప్ప పరాక్రమవంతులును, శూరవీరులును, దృఢ ప్రతిజ్ఞ కలవారును, పరమ యశస్వులు నగుఁ దొమ్మిదిమంది పుత్రులుద్భవించిరి. వారి పేర్లివి:- నాభి,

కింపురుష హరివర్ష, ఇలావృత రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాలులు.

ఆరోజులలో జ్యేష్ఠునకే రాజ్యమీయవలయుననునాచారము లేనట్లుగఁ దోఁచుచున్నది. అగ్నీధ్రుఁడీ జంబూద్వీపమును నవఖండములుగ నొనర్చి, తొమ్మిదిమందికి తొమ్మిది ఖండముల నొసంగెను. అందువలన జంబూద్వీపము తొమ్మిది ఖండములయ్యెను. ఈ ఖండములన్నియు నగ్నీధ్రుని పుత్రుల పేరులతోడనే విఖ్యాతినిజెందెను. నాభిఖండము, కింపురుష ఖండము. హరివర్షఖండము, ఇలా వృతఖండము, రమ్యక ఖండము, హిరణ్మయఖండము, భద్రాశ్వఖండము, కేతుమాల ఖండము. మనమున్న ఖండము అజనాభివర్షము లేక ఖండము. నాభి మనుమఁడు ఖండమునకు రాజగునప్పటికి దీనికి భరత ఖండమను పేరువచ్చెను. భరతవర్షమనియుఁ బ్రసిద్ధి చెందెను.

ఈ విధముగ నాయప్సరస తొమ్మిదిమంది పుత్రులను గని యొకదినమున నకస్మాత్తుగ బ్రహ్మలోకమునకు వెడలి పోయెను. ఆమె బ్రహ్మాజ్ఞచే నగ్నీధ్రుని వంశపరంపను నక్షుణ్ణము కావించుట కొఱకై వచ్చినది. ఆమె శరీరమునుండి యెన్నడును భూలోకసుందరులకువలె స్వేద ముద్భవించుటగాని, యే రకమైన దుర్గంధమువచ్చుటగాని లేదు. భూమిపై నుండుఁగా నన్నపానాదులను గ్రహించెడిదికాదు కేవలము ఘృతపానము చేయుచుండెడిది. ఆమె పుత్రులును నామె యమృతపాన మొనర్చుటచే మాతృసంబంధమున సుదృఢశరీరములుకలవారు గను, బలశాలురుగను నుండిరి. వారు పెద్దవారగుట కెంతో

కాలముపట్టలేదు. వారికి తండ్రియిచ్చిన తమతమ వర్షము లందు సుఖపూర్వకముగ రాజ్యమును భోగించుచుండిరి.

ఇచ్చట పూర్వచిత్తి అగ్నీధ్రునివిడిచి బ్రహ్మలోకము నకు బోఁగానే, రాజు విరహమున మిక్కిలి యధీరుఁడై యుండెను. ఆతనికింకను భోగములందు తృప్తిలేదు. పూర్వ చిత్తి సౌందర్యము నందతనికి మనస్సు పూర్తిగలగ్నమయ్యెను. ఆమె లేక ప్రపంచమంతయు శూన్యముగఁ దోచుచుండెను. ఆతని వైదిక కర్మలన్నియు సకామములుగనుండెను. ఆతఁడు రాత్రింబవళ్లు అప్సరసా చింతనమునే చేయుచుండెను. చచ్చి నను మఱచునట్లులేదు. ఆమెనే తలఁచుకొనుచు నాతఁడు తన పాంచభౌతిక దేహమును త్యజించెను అంత్యకాలమున నాతఁ డప్సరసనే చింతించుచుఁ జచ్చుటచే నాతనికి దివ్యమగు నప్స రాలోకమే ప్రాప్తించెను. సకామకర్మలొనర్చువారు పోవు లోకమునకుఁబోయెను

తండ్రి పరలోకగతుఁడైన తర్వాత సోదరులందఱును పరస్పర ప్రేమతోనుండుచు ధర్మముగ జంబూద్వీప ప్రజలను పాలించుచుండిరి.

ఇదివిని పరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ! నేనగ్నీ ధ్రుని పుత్రుల వృత్తాంతమునుగూడ వినఁదలచుచున్నాను. దయయుంచి యా రాజర్షి వంశవర్ణనమును నాసమ్ముఖమున జేయవలెను."

రాజునకుఁగల జిజ్ఞాసను గ్రహించి శుకమహర్షి యిట్లనెను:- "రాజా! అగ్నీధ్రుని పుత్రులందఱును గొప్ప తేజస్వ

లైరి. వారందఱిలో జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుడు నైనవాఁడు నాభి. ఈతనిచరిత్ర చాల సుందరమైనది. ఈతనికడనే సాక్షాత్తుగ భగవంతుఁడు నరరూపమున నవతరించెను. ఆతని యశస్సౌర భముచే నీజగత్తంతయు నేఁటివఱకును సువాసితమైనది. కావున ముందుగ నేను నాభిమహారాజు చరిత్రమునే చెప్పె దను. నీవు దీనిని సమాహిత చిత్తుఁడవై వినుము”.

## నాభి చరిత్ర

౩౧౪

శ్లో॥ బ్రహ్మణ్యోఽన్యః కుతో నాభేర్విప్రా మంగలపూజితాః।
యస్యబర్హిషి యజ్ఞేశః దర్శయామాస తేజసా ॥

(శ్రీ భాగ. ౫ స్కం ౪ అ. ౭ శ్లో॥

చ॥ సరసత నేనృపాలకుని జన్మము నందును భూసురోత్తముల్
సతిసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి (యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె నా
నరపతి నాభికిన్ సరియనం దగు నే నరనాథ యన్యులన్॥)

శ్రీమదాంధ్ర భాగవతము.

శాస్త్రకారులు కామక్రీడను నిందించిరిగాని శాస్త్ర విహితకామము, ధర్మావిరోధమగు కామము శాస్త్ర సమ్మతమే. ధర్మమునుకూర్చి వ్యాసుఁడు చేతులనెత్తి, గొంతెత్తి యిట్లుచెప్పెను. “సోదరులారా! మీరు నామాటను వినుటలేదు, నేను మీకు కామోపభోగము లక్కఱలేదనుట లేదు. మీ వద్ద నొక్కపైసనైన నుంచుకొనక బైరాగులు

కమ్మనియు నేననుటలేదు. మీరు అర్థకామముల నుపార్జింపుఁడు. అయితే ధర్మపూర్వకముగ, ధర్మమునఁ బ్రాప్తమైన అర్థకామములు స్వర్గహేతువులు. ధర్మవిరుద్ధమైన నివియే నరక హేతువులు. స్త్రీపైఁగోరిక యుండినచో వివాహము చేసికొనుము, ధర్మముగ దానిని సహధర్మచారిణియగు పత్నిగా నొనర్చుకొనుము. పుత్రేచ్ఛకలుగుచో వేదవిధి చెప్పిన భగవాను నుపాసించి, పుత్రునికొఱకు ప్రార్థింపుము. నీకు ధనాభావమై, అదిలేక గృహస్థకార్యములు నడువకున్నచో లక్ష్మీపతినారాధించుము. ఆతని శరణుజొచ్చిన వారికేపదార్థమును గొదువలేదు. అన్నియు సులభమే.

శుకుఁడిట్లనెను:— "రాజా! పరలోకమందు అగ్నీధ్రుఁడు పూర్వము తనకు పత్నియగు పూర్వచిత్తినే పొందెను. తన సుకృతముచే నేలోకములలోఁ బితృగణము, ప్రభుగణము నివసించుచుండిరో ఆలోకములన్నిటిని అగ్నీధ్రుఁడుజయించెను. తండ్రి పరలోక గతుఁడు కాఁగానే తొమ్మిదిమంది పుత్రులును రాజులైరి కాని రాణిలేకున్న నందఱకును నర్థసింహాసనము ఖాళీయే. పురుషుఁడొంటరిగ పురుషుఁడుకాఁడు. స్త్రీతోఁ గలిసియుండిననే పూర్ణపురుషుఁడు. అందువలననే పురుషశబ్దమందఱకును వ్యవహరింపఁబడును. అందువలననే పత్నికి 'అర్ధాంగిని' యను పేరునుగలదు. బ్రహ్మయు సృష్ట్యాదియందు తనశరీరమును రెండుగాఁజేసికొనెను. ఎడమభాగము స్త్రీ, కుడిభాగము పురుషుఁడు. అందుకనియే

స్త్రీ దేవతనుగానిడు, రాజు రాణినిగానిండు వామభాగమున గూర్చుండఁ బెట్టుకొందురు.

అగ్నీధ్రుని తొమ్మిదిమంది కుమారులు మనమెట్లొకే తండ్రికి కొడుకులమో అట్లే ఒక్కనికే తొమ్మిది మంది కూఁతుండ్రుండినచో మనమును గ్రమానుసారముగఁ బంచు కొన వచ్చుననుకొనిరి. వెదుకఁగా మేరుప్రజాపతికడ తొమ్మిది మంది కన్యకలు కలరనియు, వారందఱును వివాహయోగ్యల నియుఁ దెలియవచ్చెను. ఇంకేమున్నది? తొమ్మిదిమంది రాజ కుమారులు తొమ్మిదిమందిని వివాహమాడిరి. అందఱికంటెఁ బెద్దవాఁడగు నాభి మేరుదేవిని వివాహమాడెను. రెండవవాఁడు కింపురుషుఁడు ప్రతిరూపను, మూఁడవవాఁడగు హరివర్షుఁడు ఉగ్రదంష్ట్రను, నాల్గవవాఁడగు నిలావృతుఁడు లతను, ఐదవ వాఁడగు రమ్యకుఁడు రమ్యను, ఆఱవవాఁడగు హిరణ్మయుఁడు శ్యామను, ఏడవవాఁడగు కురువు నారిని, ఎనిమిదవవాఁడగు భద్రాశ్వుఁడు భావరను, తొమ్మిదవవాఁడగు కేతుమాలుఁడు దేవవాణిని వివాహమాడిరి. ఈ విధముగా నీ తొమ్మిది మంది కిని విధ్యుక్తముగ వివాహమయ్యెను.

పరీక్షిన్మహారాజిట్లడిగెను:- "స్వామీ ! యశస్వులగు తొమ్మిదిమంది భూపతుల చరిత్రమును నాకుఁజెప్పుఁడు"

ఇదివిని శుకుఁడిట్లనెను:- "భరతర్షభా ! నేనందఱికథను విస్తారముగఁ జెప్పుచో దీనితోడనే కథ పూర్తి కాఁగలదు. వ్యవధి ఏడుదినములేకదా ! కావున నేను వీరిచరిత్రములను

సంక్షిప్తముగఁజెప్పెదను. ముందుగా నాభిచరిత్రమును వినుము."

తండ్రి చనిపోయినతర్వాత నాభి జంబూద్వీపములోని నాభివర్షము (భరత వర్షము) ను ధర్మముగఁ బాలించుచుండెను. ఆతఁడు తనప్రజలను బుత్రులవలెఁ బాలించుచుండెను. ప్రజలకుఁగూడ ఆతని మీఁద నత్యంతానురాగము. ఆతనికి సాంసారిక భోగములన్నియును బ్రాప్తించినవి. కాని ఆతఁడు నిరంతరము చింతించుట కొక్కటే దుఃఖముకలదు. తన తర్వాత రాజ్యపాలన మొనర్చుచు, నాతనికి పిండప్రదాన మొసంగఁగల పుత్రుఁడు లేకుండెను. సమస్తకోరికలును శార్జ్గపాణివలననే నెఱవేఱఁగలవని యజ్ఞపతియగు విష్ణుని వైదిక యజ్ఞములద్వారా ఆరాధించెను. భగవంతుఁడు యజ్ఞముల కొఱకే కనిపెట్టుకొని యున్నాఁడు ఏదోచేసినచాలదా యన రాదు. లోకములో నన్నిటికంటెఁ బ్రియమైనది ధనము. అట్టి ధనమును శ్రద్ధగా నెవఁడు సత్కార్యములయందు వినియోగించునో ఆతని విశుద్ధ భక్తికి భగవంతుఁ డనుగ్రహించును. ఆతఁడు యజ్ఞ వశ్యుఁడుకాఁడు భక్తివశ్యుఁడు. ఆతఁడు. ద్రవ్య, దేశ, కాల, మంత్ర, ఋత్విక్, దక్షిణా, విధియను నీ సప్తాంగములుండియు శ్రద్ధా విహీనమగుచో నాతఁడు లభింపఁడు. భక్తిభావముతో శ్రద్ధాపూర్వకముగ నొక్కపుడిసెడు జలము నర్పించినను నాతఁడు వానియెదుట ప్రత్యక్షమగును. అందు కనియే భగవంతుని భక్తవత్సలుఁడనిరి. నాభి పరమభక్తితో యజ్ఞముచేయుచుండెను, యజ్ఞచేయుచున్నప్పుడంతటను యజ్ఞ

పతినే చింతించుచుండెను. ఆమహాయజ్ఞమందు "ప్రవర్గ్య" యను కర్మానుష్ఠాన మొనర్చుచున్నప్పుడు భక్తవత్సలుఁడగు భగవంతుఁడు సాకారరూపమునఁ బ్రత్యక్షమయ్యెను, ఆసమయమున నాతనికా సుందరమనోహరమూర్తి మనస్సునకును, నేత్రములకును బరమాహ్లాద ప్రదాన మొనర్చుచుండెను. ఆతని యవయవములన్నియును సుందరముగను, గోమలముగను, బలిష్ఠముగను, మనోహరముగనుండెను చతుర్భుజములందును అప్రతిమములగు శంఖ, చక్ర గదా, పద్మా ద్యాయుధములు శోభించుచుండెను. వక్షస్థలమున మనోహరమగు శ్రీవత్స లాంఛనము శోభాయమానముగనుండెను. గళమున వనమాలయు, హార, కౌస్తుభమణులును మెఱయుచుండెను. శిరమున మకుటమును, గర్ణముల కుండలములును, కటియందు మొలనూలును, కరములఁ గేయూరములును, జరణములందు నూపురములును గణగణ శబ్దమొనర్చుచుండెను.

తన యజ్ఞములో వెంటనే యజ్ఞపతి ప్రత్యక్షమగు నప్పటికి సమస్త ఋత్విక్కులుఁ హోత, ఉద్గాత, సభ్య, సదస్యాదులు, యజమానురాలు, యజమాని, వీరందఱును దప్పిక గొన్న వానికి నీరులభించినట్లును, ఆఁకలిగొన్న వాని కన్నము దొఱకినట్లును, శీతార్తున కగ్ని కనఁడినట్లు, కాముకునకుఁ గామిని చేకూరినట్లును, గృపణునకు ధనమబ్బినట్లును, యాత్రికునకు యానమున స్థలము లభించినట్లును, సంవాద దాతకు తీవ్రతరవిచిత్రఘటనను గాంచినపుడును, బంధితునకు విడుదలపత్రము వచ్చినట్లును, పరీక్షనిచ్చిన విద్యార్థి పేరు

ఈ త్రీర్థాల పట్టీనుండుటను గాంచినపుడును, అపుత్రికునకుఁ బుత్రుఁడు జన్మించినప్పుడును, నిర్ధనునకు నిధిదొరికినయెడల నెంతటి సంతోషముకలుగునో అంతటి సంతోషముకలిగెను. యజమానుఁడు శ్రద్ధతో శిరస్సునువంచి సర్వేశ్వరుని సమస్త సామగ్రిలతోడను విధ్యుక్తముగఁ బూజించెను.

పూజానంతరము సమస్త ఋత్విగ్గణము నానాస్తోత్రములద్వారా పరమపురుషుని స్తుతింపఁదొడగిరి:- ఋత్విజులిట్లనిరి:- "ప్రభో! మీరు పరమపూజనీయులు. మేము మీకు అనుగత భక్తులము. మీ యందలి శ్రద్ధాభక్తులతో మిమ్ములను బూజింపవలయును; కాని మీ రెంతటి శ్రేష్ఠులో అంతటి శ్రేష్ఠ సామగ్రిలను మేమెచ్చటనుండి తేఁగలము? పూజావిధివిధానము నెట్లెఱుఁగఁగలము? మేము కేవలము మీ పునీత పాదపద్మములకు పునః పునః ప్రణామము మాత్రి మొనర్పఁగలము."

భగవానుఁడిది వినినవ్వి యిట్లనెను:- ఏమి బ్రాహ్మణులారా! దూరమున నుండియే ప్రణామమిడి తప్పించుకొని పోఁదలఁచితిరా? కొంచెము ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, పూగీఫలము, దక్షిణాదులుకూడ ఉండుటవుంచిది"

ఋత్విజులిట్లనిరి:- "పూజ్యతమా! ఈ ప్రాకృత పదార్థములతో మిమ్ములను బూజించుటయును హాస్యాస్పదముగనే యుండును. ఏలననఁగా మీరు ప్రకృతికతీతులు. పోనిండు

పూజచేయక నీమంగళమయ దివ్యగుణగానమైనను జేయుద మన్నచో నదియును జేయఁజాలము."

భగవంతుఁడిట్లనెను:- "నాల్క మీసొత్తుగదా, గుణగానమువలనఁ గష్టమేమున్నది?"

ఋష్యొక్కలిట్లనిరి:- "స్వామి ! కష్టమేమియునులేదు. ఆగుణగానము మీకను రూపముగనుండదు. ఏలననఁగా మీరు ప్రాకృతులుగాక ప్రకృతి పురుషులకును బరుఁడవైన పరమేశ్వరుఁడవు. మా బుద్ధి ప్రకృతి జన్యగుణ కార్యప్రపంచమందు బడుటచే నది మాయిక పదార్థముల వర్ణనమును జేయునుగాని, ప్రాపంచిక మాయాతీతుఁడవును మాయాపతియునగు మీగుణగానమొనర్చుటకు మా ప్రాకృత లౌకికబుద్ధి యెట్లు సమర్థమై యుండును? ప్రాకృతరూప రహితుఁడవును, పరమేశ్వరుఁడవును, సత్స్వరూపుఁడవునగు నీయొక్క దివ్య నామరూపముల నెట్లు నిరూపింపఁగలదు?"

భగవానుఁడిట్లనెను:- 'నా భక్తవత్సలతా గుణములు జగద్విదితములు, వాని వర్ణన మొనర్చవచ్చును గదా?

ఋషులిట్లనిరి:- "స్వామీ ! నీ కర్మలు కొన్ని విదితమనుటనిజమే, నీ గుణము లిన్నియున్నవని లెక్కలేదాయెను. సముద్రములోని ఒక బిందువువంటివి నీగుణములు సముద్రమువలె ననంతుఁడవు నీవు. నీగుణము లన్నియునుగలిసి యేకప్రదేములేక దా ! ఒకవేళ నీ గుణవర్ణనమును గావించుచో సింధుబిందువలె నేకదేశీయమే కాఁగలదు. ఇంతటి య స మర్థ త

యున్నను నీవు భక్తులందు అపారమగు( గృపనుంచి వారితొక్క పలుకులకుఁ బ్రసన్నుఁడవగుచుందువు. సముద్రము వలె సమస్త రత్నరాసులకును స్వామివయ్యును నీవు శ్రద్ధగా నొసంగిన పుడిసెడు జలమునకును, నొక్క తులసీదళమునకును సంతుష్టుఁడ వగుచుందువు."

భగవంతుఁడిట్లనెను:- "బ్రాహ్మణులారా! మీరందరును వేదజ్ఞులు. వైదిక విధి విధానమును దెలిసినవారు. నానా విధములగు సామగ్రులతో శాస్త్రీయపద్ధతిని నన్ను యజించుచున్నారు. మీ కందఱకును బూజయే గొప్పది."

ఋత్విజులిట్లనిరి:- "స్వామీ! నీకు గొప్పయేమున్నది? నీవు పరమానంద స్వరూపుఁడవు సమస్త పురుషార్థదాతవు అభిన్నభావమునసీవే నీకు స్పృహయేలేదు. కాని ప్రాకృత పురుషులమగు మా హృదయములందు నానావాసనలు నిండియున్నవి. అందువలననే మేము సకామభావముతో నిన్నుఁ బూజించుచుందుము. ఇచ్ఛాపూర్తికొఱకు ఆరాధనమును జేయుచుందుము. మా క్షుద్రతను, కామాది దోషములందు దృష్టియుంచక దయావశమునఁ బరువిడివచ్చునంతటి దయాసాగరుఁడవునీవు. నీవు మోక్షదాతవయ్యు మాకు తుచ్ఛ సాంసారిక పదార్థములనుగూడ యిచ్చుటకు మా యెదుటఁ బ్రత్యక్షమైతివి. ఇప్పుడేమి చెప్పఁగలము?"

భగవంతుఁడిట్లనెను:- "మంచిది. మీ యిష్టమువచ్చిన వరమును గోరుకొనుఁడు."

ఋత్విజు లిట్లనిరి:- "ప్రభూ! సమస్త పురుషార్థస్వామి వగు నీవు స్వయముగ మాకుఁ బ్రత్యక్షముకాఁగా, మీ దర్శనముకాఁగా నింకమాకు అడుగవలసిన దేముండును?........ అయినను......

భగవానుఁడిట్లనెను:- "అయినను ఏమిటి ? స్పష్టముగ చెప్పుఁడు."

ఋత్విజు లిట్లనిరి:- "స్వామీ ! ఏమి చెప్పుదుము? మేము దెబ్బతగిలి క్రిందఁబడినను, వర్షపు బురదలో జారిపడినను, ఆఁకలి దప్పికలుచెంది స్పృహతప్పియున్నను, ఆలస్యముచే నావలించినను, వివిధ సంకటములలోఁబడి దుఃఖపడుచున్నను, సకల మలవినాశకముఁడును, భక్తవత్సలుఁడును, అశరణశరణుఁడును, దీనబంధువునగు నీ సుమధుర నామోచ్చారణము చేయుచుండవలయును. మా జిహ్వలు నీ మంగళమయ నామములను వదలకుండవలయును. ప్రాకృతులమగు మా విషయమున నేమున్నది? రాగద్వేషాది మలరహితమగు మీతో సమానమగు గుణములుగల ఆత్మారాములగు మునులును నీ గుణగానముచేయుచుందురు; నీ రూపమును జింతించుచుందురు. నీ నామోచ్చారణమును గావించుచుందురు. ఈ యిచ్ఛ పూర్తికావలెను. ఇంకొక యిచ్ఛ మాకులేదు.

భగవంతుఁడు నవ్వియిట్లనెను:- "మీరు సంకోచింపకుఁడు. మీ యథార్థమగు నభిప్రాయమును జెప్పుఁడు. మీ మనోగత భావములను జెప్పుఁడు".

ఋత్విక్కులిట్లనిరి:- "ఏమి చెప్పుదుము స్వామీ ! మాకు సిగ్గగుచున్నది. ఇంతటి గొప్పవాఁడవగు నిన్ను క్షుద్ర వస్తువులకు యాచించుటయా ? చక్రవర్తి ప్రసన్నుఁడై నీకేమి కావలయునో కోరుకొమ్మనఁగా నాతఁడు తిన్న దానిలోఁ బాసిన, మాడినయన్నము నీయుమని యాచించి నట్లగును." అట్లడిగినవాఁడు బుద్ధిమంతుఁడని యెవరనఁగలరు? అర్థిదోషమును జూడఁగు ఈ రాజర్షి పుత్రహీనుఁడు నీవు స్వర్గాపవర్గములొసంగ సమర్థుఁడవగు నప్పటికి మహారాజు నీవంటి ఒక పుత్రునిఁ గోరుచున్నాఁడు. పుత్రేచ్ఛచే తనే యాతఁడు నీకు సకామ పూజనొనర్చుచున్నాఁడు. పుత్రుఁడై నను సాధారణుఁడు కాఁడు నీవంటివానినే కోరుచున్నాఁడు."

భగవంతుఁడు నవ్వి యిట్లనెను:- "అయితే దీనికింతటి తలక్రిందులుగ మాటలాడుచుంటిరేల. దీనికింత సంకోచింపఁ బనియేమున్నది. నేను సర్వము నీయ సమర్థుఁడనే."

ఋత్విజులిట్లనిరి:- "స్వామీ ! నీవు సర్వ సమర్థుఁడ వైనను విషయరూప విషవేగముచే దూషితమైన స్వభావము గల సకామ మందబుద్ధులు తుచ్ఛ సాంసారిక వాసనలకు వశీ భూతులై నిన్ను యజించుచుందురు. వారికోరికలను నెఱవేర్చు టకు నీవు రావలసివచ్చును. ఇట్టి క్షుద్రకామములకై నిన్నా హ్వానించుట నీకు ఘోరావమాన మొనర్చుటయే. మేమిట్టి యిచ్ఛచేఁ బూజించి నీకనాదరమును గావించితిమి. నీకృపావశ మున క్షమించి యీ రాజర్షి కోరికను నెఱవేర్చుము."

భగవంతుఁడిట్లనెను:- "బ్రాహ్మణులారా! మీరు చాల చతురులు. ఆ మాటలీమాటలు తీపితీపిగా మాట్లాడి నన్ను మాయలోఁ బడవైచి నావలన వరములను బొందితిరి. నావంటివారలు పదిమందియో యిరువదిమందియో యున్నచో వంశములో నొకనిని రాజర్షి యగు నాభికి పుత్రుఁడుగా నొసంగి యుందును; కాని నాకనురూపుఁడను నేనే. నావంటి వాఁడింకొకఁడు లేఁడు. నేనే యీ రాజర్షికిఁ గుమారుఁడ నయ్యెదను. ఇప్పుడు బ్రాహ్మణులగు మీరేమి పలికిరో అది సిద్ధాంతము కాఁగలదు. అది యెన్నటికిని నశింపదు. అది మిథ్య యెన్నటికిని గాఁజాలదు."

శ్రీ శుకమహర్షి యిట్లనెను:- రాజా! భగవంతుని యీ వాక్యములనువిని ఋత్విక్కులు, సదస్యులు యజమాని, యజమానురాలు మొదలైన వారందఱు ముఖకమలములు వికసించెను. మేరుదేవియొక్క ఆనందమునకు మేఱలేకుండెను, ఆమె కడుపున భగవంతుఁ డుద్భవింపఁగలఁడను విషయముకంటె నానందకరమగు విషయమింకేమి యుండును అందఱును గొప్ప యుత్సాహముతోఁ దదేక ధ్యానముతో భగవంతునివైపు చూచుచుండెను. ఇంతలోనే భగవంతుఁ డంతర్ధానమయ్యెను. అందఱును నాస్థలమునకు శిరస్సాష్టాంగ నమస్కారమొనర్చిరి. తదనంతరము యజ్ఞముయొక్క పూర్ణాహుతి వైభవముగ జరిగెను. బ్రాహ్మణులకు భోజనము, యథేష్ట దక్షిణలీయఁబడెను. బ్రాహ్మణగణము రాజుచేసిన సత్కారమునకు సంతుష్టులై, అతనికి లోలోన నాశీర్వాదములు కావించుచుఁ

దమతము యిండ్లకుఁబోయిరి. ఇచ్చట మహారాణియగు మేరుదేవి శుభముహూర్తమందు దన పతియగు నాభినిఁగూడి గర్భమును ధరించెను. మహారాణియొక్క యాగర్భము శుక్లపక్షచంద్రుని వలె దిన దిన ప్రవర్ధమానమగుచుండెను.

## ఋషభదేవుని చరిత్ర

౩౧వ

శ్లో॥ కోను తత్కర్మ రాజర్షేర్నాభేరన్వాచరేత్పుమాన్।
అపత్యతామగాద్యస్య హరిః శుద్ధేన కర్మణా॥
(శ్రీభాగ. ౫. స్కం. ౪ అ. ౬ శ్లో)

చ॥ (నరపతి నే నృపాలకుని జన్మమునందును భూసురోత్తముల్
పరసిజనాభునిం దగఁబ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి) యీ
శ్వరుఁడు దినంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె నా
నరపతి నాభికిన్ సరి యనంగను నే నరనాథ యన్యులన్॥
శ్రీమదాంధ్ర భాగవతము.

పుత్రప్రాప్తి పూర్వపుణ్య ఫలవిశేషముననే కలుగును. అట్టి పుత్రుడుగఁ బరమేశ్వరుఁడే తన పత్నిగర్భమునఁ బుట్టుచుఁ బ్రేమను బ్రదర్శించుచుండ నాతని సౌభాగ్యము నెన్న నెవరితరము? అనేక కోటిజన్మలలోని పుణ్యముదయించినఁ గాని శ్రీహరి దర్శనము కాదు. దర్శనమైనతర్వాతఁ బుత్రుఁడై తన భక్తునిఁ జిలుక పలుకులతోఁ బిలుచుచుండిన నాతనితో సమానుఁడెవఁడుండఁగలఁడు. ఇట్టివాఁడీ లోకములో మాననీయుఁడును, బూజనీయుఁడును నభినందనీయుఁడును బాత్రస్మర

జేయుఁడునగుచున్నాఁడు. ఇట్టి సౌభాగ్యమే నాభికిని ప్రాప్తిం చినది. ఋషభదేవుని తండ్రియగుటచే నాతఁడు జగద్వంద నీయుఁడగుచున్నాడు.

శ్రీ శుకమహర్షి యిట్లనెను:- "రాజా! భగవంతుఁ డంతర్హితుఁడైన తర్వాత నాభియజ్ఞమునుండి నివృత్తుఁడై తన భార్యయగు మేరుదేవితో సుఖముగ సర్వసుఖములను భోగిం చుచు నానంద పూర్వకముగఁ దనరాజభవనమున నివసించు చుండెను. కాలాంతరమున నామెకొక పుత్రరత్న ముదయిం చెను. తండ్రి పుత్రునియొక్క జాతకర్మాది సంస్కారములను వైదికముగ మిక్కిలియుత్సాహముతో నొనర్చెను. సాముద్రిక లక్షణముల నెఱిఁగినవారు ఆతని శ్రీ యంగములనుగాంచి అందుగల వజ్రాంకుశాది బాహ్యచిహ్నములను గాంచియు, సమత, ఉపశమ, వివేకవైరాగ్యైశ్వర్యాది మహావిభూతులను గాంచియు నాతఁడు సాక్షాద్భగవదవతారమని తెలిసికొనిరి. ఆతని సుందర సుదృఢ శరీరమునుగాంచి, భవ్యాకృతి, మహాకీ కృతి అనపాయినీ శ్రీ, తేజో, బలైశ్వర్య యశోవీర్య శూరవీర త్వాదులనుగాంచియుఁ దండ్రి యాతనికి ఋషభుఁడు అనఁగా శ్రేష్ఠుఁడని పేరుపెట్టెను. తనయిచ్ఛచే మానవశరీరమును ధరిం చిన యాపురాణపురుషోత్తముని నాభి తన పుత్రునిఁగనే భా వించు చుండెను ఆతఁడు తన యథార్థరూపమును మఱచి పో యెను. ఆతని మాయావిలాసముచే భ్రాంతచిత్తుఁడై యాతఁడు జగత్పాలనకర్తను ప్రేమతోఁ బోషించుచుండెను. జగత్పితను బుత్రునిఁగ లాలించుచుండెను. నా బిడ్డఁడు, నాపుత్రుఁడు,

మహారాజు అనుచు నీవిధముగ మధురవాక్యములతోఁ బలుకుచు నాతని ముఖకమలమును ముద్దుపెట్టుకొనుచుండెను. తానెంత గఁడనపుత్రునిఁ బ్రేమించునో ప్రజయు నాతని నంతగాఁ బ్రేమింమింతురని తెలిసికొనెను అందఱు నాతనినిఁ దనపుత్రుల కంటెను బ్రాణములకంటెను నెక్కుడుగఁ జూచుకొనుచుండిరి. దరిద్రుని మొదలుకొని ధరాధిపుని వఱకును, సిపాయి మొదలుకొని సచివునివఱకును, చండాలుని మొదలుకొని వేదజ్ఞుఁడగు విప్రునివఱకును అందఱును నాతనిఁ గంటికి ఱెప్పలవలె నెఱుగుచు, మన్నించుచు, ననురాగము చూపుచుండ నాతఁడు బ్రాహ్మణులను, బురోహితులనుబిలిచి ఋషభదేవుని రాజ్య సింహాసనమునఁ గూర్చుండఁబెట్టెను ఆతని రాజ్యమును గుమారునకు ఒప్పగించి తన భార్యయగు మేరుదేవిని వెంటఁదీసికొని నాభి తపోవనమునకుఁబోయెను. ఉత్తరదిశయందు హిమాలయ శిఖరముల నన్నిటినిదాఁటి యాతఁడు గంధమాదన పర్వతమున నున్న నరనారాయణ నివాసస్థానమగు బదరికాశ్రమమందు నివసింపసాగెను. అచ్చట నాతఁడు యమనియమములను బాలించుచు వాసుదేవారాధనమునందు తత్పరుఁడై యాతని రూపమును జింతించుచుండెను కాలక్రమమున సమయము రాఁగానే ఆతఁడాతని స్వరూపమునందు లీనమయ్యెను.

తన భుజస్కంధములందు రాజ్యభార ముండుటను గాంచి ఋషభదేవుఁడు లోకవిధి ననుకరించుచు మానవులట్లె వర్తించుచుండెను. ఆతఁడు కొంతకాలము గురుకులమందు నివాస మొనర్చుచు వేదవేదాంగముల నధ్యయనము కావిం

చెను. గురు శుశ్రూషనుగావించి గురుశిష్య సంబంధ మహాత్వ మును నాదర్శముగఁ బ్రదర్శించెను. గురుకులమునఁ గాలమును విధి పూర్వకముగఁ గడపి, గురువునకు దక్షిణ నొసంగి యాతఁడు స్నాతకవ్రతమును గావించుకొనెను. స్నాతక వ్రతానంతరము నాతఁడు గృహస్థాశ్రమమునఁ బ్రవేశించెను. దేవేంద్రుఁడాతని ప్రభావమును గ్రహించి యాతని సమ్ముఖ మున లజ్జితుఁడై తనకుమార్తెనిచ్చి పెండ్లియొనర్చెను.

అంతఁ బరీక్షిత్తుఁ డిట్లనెను:— స్వామీ ! ఋషభ దేవుఁడో సామాన్య నరపతి, ఇంద్రుఁడు త్రిలోకాధిపతిగదా, అట్టివాఁడు ఋషభ దేవునకుఁ దనకుమార్తె నెట్లొసంగినాఁడు. దేవలోక కన్యక మర్త్యలోకమున నెట్లు వివాహమాడినది?''

ఇదివిని శుకుఁడిట్లనెను :- "మహారాజా ! ఋషభ భగవానుఁడు సమస్తలోకములలోని సమస్తైశ్వర్యములకును నధిపతి. ఆయనకు భూమి యెంతో స్వర్గమంతియే. కాని యింద్రుఁడు తానమరపతినను నహంకారమున మదోన్మత్తుఁడై యుండును. ఋషులును తమతపోమహిమమునుగూడ భగవం తుని పైఁజూపఁజూచిరి. అట్లే పొరపాటును నది అంటఁకును గలదు. అట్లే ఋషభుని యెడలను జూపింపఁగా మొగము మొత్తినది."

ఇదివినఁగానే ఉత్సాహమును బ్రకటించుచుఁ బరీక్షిత్తు ఇట్లు ప్రశ్నించెను:— ''ప్రభూ ! ఋషభ భగవానుని యెడల నింద్రుఁడుచూపిన మహిమమేది? ఆతఁడెట్లు పరాజితుఁడై నాఁడు? ఈ వృత్తాంతమును వినుటకు నాకు మిక్కిలియిచ్ఛ

ప్రౌఢముచున్నది. దయచేసి దీనినిఁ గృపతో విస్తారముగఁ జెప్పఁగోరుచున్నాను."

రాజిట్లడుగఁగా శుకమహర్షి యిట్లనెను:— "రాజా ! ఋషభదేవుఁడు రాజుకాఁగానే ప్రజాకార్యముల నన్నిటిని దానే చూచుట కారంభించెను. ఆతఁడు సర్వత్ర సురక్షితముగ నుండుట కేర్పాటుచేసెను. ఆతని రాజ్యవ్యవస్థయు, శాసన ప్రణాళికయు, శ్లాఘనీయముగను, అనుకరణ నీయముగను, అభినందనీయముగనునుండెను. ప్రజలందఱాతనినిఁ దండ్రికంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండిరి. అందఱు నాతనిని భగవంతుని వలె భావించుచుఁ బూజించుచుండిరి. ఇట్టి యాదర సత్కారములను గాంచియుఁ, బ్రజలద్వారా యీ విధముగఁ బూజింపఁబడుటనుగాంచి యింద్రునకుఁ జాల యీర్ష్యకలిగెను. మహారాజా ! సమ్మాన ప్రతిష్ఠలను గాంక్షించువారు, ఇతరులున్నతిని జెందుటను గాంచఁజాలరు. ఇతరులకు యశః ప్రతిష్ఠలు కలిగిన నట్టి వారు మిక్కిలిగమానసిక సంతాపమును జెందెదరు. అట్టివారితర్గుల నెక్కి రానీయరు ఇంద్రుఁడిట్లనుకొనెను:— "నేను త్రిలోకాధిపతినే. అందఱకును జీవదానమొనర్తునే. వర్షమునుగురిపించి యందఱను బోషించుచున్నానే అట్టినన్ను వీరందఱును నాదరింపకున్నారు. నామీఁద నీతని మీఁదనున్నంత శ్రద్ధలేదే. మర్త్యలోకాధిపతి యింత ప్రజాప్రియుఁడేల కావలయును? ప్రజలీతనినిఁ బరమేశ్వరుని వలె నేలఁబూజింపవలెను? చూతమీతని ప్రభావమేమో ! ఈతని రాజ్యములో వర్షమును గురియనీయను ఈతఁడెట్లు

ప్రజలను బోషించునో చూతము. రాష్ట్రమున దుర్భిక్షము రాజుయొక్క పాపమువలన వ్యాపించుచుండును. దేశములో దుర్భిక్షము వ్యాపించినచోఁ బ్రజలందఱు ప్రసన్నులై నానా మాటలందురు. ఈతనిప్రతిష్ఠ అప్పుడు ధూళిలోఁగలసిపోవును" అని యిట్లాలోచించి యింద్రుఁడొక సంవత్సరము రాజ్యమందు వర్షమును గురిపింపలేదు.

ఇంద్రున కత్యభిమానము కలిగినదని ఋషభుఁడు గ్రహించెను. తాను వర్షము గురిపింపకున్నఁ బ్రజాపాలనము జరుగదని ఆతనిగర్వము, తన ప్రభావమును దేవేంద్రునకుఁ జూపవలయునని తనయోగబలముచే జలయుక్తములగు మేఘములను సృజించి సమస్తభూమియు సస్యశ్యామలమగునట్లుచేసెను. దీనినిఁ గాంచఁగానే ఇంద్రుని మదమణఁగి ఆతనిగర్వమంతయు నశించెను. ఆతఁడు ఋషభదేవుని ప్రభావమును గ్రహించి, అత్యంత సుందరియగు జయంతియను దనకుమార్తెను ఆతనికిచ్చి పెండ్లిచేసెను. ఆతని కనురూపమైనదని తెలిసికొని ఋషభదేవుఁడు వైదికవిధిచేఁ బాణిగ్రహణమొనర్చెను. ఆతఁడు ధర్మపూర్వకముగ గృహస్థాశ్రమ నియమములను లోకమర్యాదకొఱకు పాలించెను. మహారాణి జయంతియొక్క గర్భమునుండి పరమయశస్వియగు తండ్రినిఁ బోలినవారు నూఱుగురు పుత్రులుద్భవించిరి.

ఇదివిని పరీక్షిన్మహారాజిట్లనెను:- "స్వామీ! ఋషభదేవుని నూఱుగురు పుత్రులేయేదేశములకు రాజులైరి?"

అంతటశుకుఁడిట్లనెను:- "కురువంశావతంసా! రాజా! ఋషభదేవుని వలన జయంతియందుఁబుట్టి నూర్గురు పుత్రులు

జాయమానులాకేయబడిరి. వీరందఱిలో భరతుండు శ్రేష్ఠుడు. ఈయజనాభఖండము భరతఖండమని యిప్పటివఱకును నతని పేరనే పిలువబడుచుండుటచే ప్రసిద్ధమయ్యెను. భరతుని తర్వాత తొమ్మిదిమంది కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు మలయ, కేతు, భద్రసేన, ఇంద్రస్పృక, విదర్భ, కీకటయను వారలు ప్రసిద్ధులు కలరు. వీరందఱును భరతవర్షాంతర్గతమగు వేఱువేఱు రాష్ట్రములకు రాజులైరి ఎవరి దేశములు వారివారి పేర్లతో విఖ్యాతమయ్యెను.

ఈ విధముగ భరతుండును, ఈ తొమ్మిది మందియును గలిసి పదుగురైరి. మిగిలిన తొంబదిమందిలో దొమ్మిదిమంది వివాహమును జేసికొనక, ఊర్ధ్వరేతస్కులై, మునివ్రతమును ధరించి పరివ్రాజకులైరి. అందువలన వారు నవయోగేశ్వరులని పిలువబడిరి. వారి సంవాదమును ముందు ప్రసంగానుసారముగ నారద వసుదేవ సంవాదావసరమున వర్ణించెదను ఇంక నెనుబదొక్కమంది మిగిలిరి.

వీరు క్షత్రియ ధర్మము హింసాప్రధానమని తెలిసికొని, దానినివీడి, అందఱును వేదజ్ఞులును, కర్మిష్ఠులును, సదాచారులును, మాతృపితృ భక్తులును వినీతులును, శాంతులును, మహాత్ములునైరి. వారు స్వాధ్యాయయజ్ఞయాగ పూజా పారాయణములను, దేవార్చనమును జేయుచుండిరి. నిరంతరము పుణ్యకర్మానుష్ఠానము నొనర్చుటచే గర్మణా బ్రాహ్మణులైరి. వారే దేశరాజ్యమును స్వీకరింపలేదు. "రాజా! ఈ విధముగ నేను నీ కత్యంత సంక్షేపమున ఋషభదేవుని నూర్గురు పుత్రుల వృత్తాంతమును జెప్పితిని. ఇంక నీకేమి చెప్పవలయును?"

ఉత్సాహమును బ్రకటించుచు రాజిట్లనెను:- "దీన బంధూ ! మీరు ఋషభుని జ్యేష్ఠపుత్రుఁడగు భరతునిగూర్చి విశేషముగఁ బ్రశంసించియుండిరి నిజమున కతఁడట్టివాఁడే. ఏలననఁగా నాతని కారణముననే నేటికిని ఈభూఖండము భరత ఖండమను పేరఁబ్రసిద్ధినిజెం దెను. ఆతనికీర్తి యిప్పటి నక్షుణ్ణముగనున్నది. నేనా రాజర్షి చరిత్రమును విపులముగఁ జెప్పఁగోరుచున్నాను. దయతో నాకు భరత చరిత్రమును జెప్పుఁడు."

ఇదివిని శుకుఁడిట్లనెను:- "రాజా ! యథార్థముగ భరతుని చరిత్రమలౌకికము. అది సమస్త సిద్ధులను, మోక్షమును బ్రసాదించును. భరత చరిత్రమును సావధానముగ విన్నచో మోహమనునదియుండదు." ఇట్లు పలికి శుకుఁడు భరతచరిత్రము జెప్పదొడఁగెను.

## ఋషభదేవుఁడు తన పుత్రుల కుపదేశించుట

౩౧౬

శ్లో॥ నాయం దేహో దేహభాజాం నృలోకే
కష్టాన్కామానర్హతే విడ్భుజాం యే ।
తపో దివ్యం పుత్రకా యేన సత్త్వమ్
శుద్ధ్యేద్యస్మాద్బ్రహ్మ సౌఖ్యం త్వనంతమ్॥
(శ్రీ భాగ. ౫. స్కం. ౫ అ-౧ శ్లో.)

ఆ॥ తనయులార వినుఁడు ధరలోనఁబుట్టిన
పురుషులకును శునకమునకు లేని
కష్టములను దెచ్చుఁగాన కామంబుల
వలన బుద్ధిసేయ వలదు మీరు ॥

చ॥ నరులకు వే తపంబున ననంత సుఖంబులు గల్గుచుండు శ్రీ
కరమతి నా తపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు దుష్టవర్తనన్
జరుగుచు నుండు కాముకుల సంగతిఁ బోకుఁడు మీఁద మేలగున్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

భగవంతుఁడును, భగవదీయులును సమదర్శనులుగను, సమభావముతోడను నుండెదరు. కాని శ్రేష్ఠులైనవారియెడలను నెవరియందు మమకారము వారికి కలిగినదో, గుణాధిక్యము వలన వాత్సల్య కారణమునఁ బక్షపాతముండును. ఇంతకు మన వారైనవారు సర్వథా శుద్ధముగను సదాచారులుగను నుండ వలయుననియు వీరు సర్వదా ప్రపంచమునఁ బూజితులై ప్రతిష్ఠితులై యీ లోకమున సుఖమునుబొంది, పరలోకమున శాశ్వతశాంతి ననుభవింప వలయుననియుఁ గోరుచుందుము. ఆహారపానీయముల విషయములలోఁగల ప్రేమ అందఱకును సామాన్యమే. మనయాశ్రితులను మృత్యుముఖమునుండి రక్షించుటయును, వారిని విషయములలోఁ బడకుండఁ జేయుటయే నిజమైన ప్రేమయగును అట్లివారు పరమార్థమునుండిచ్యుతులు కాకుండుటకుఁ బ్రయత్నింపవలయును.

శుకమహర్షి యిట్లనెను:— "రాజా! ఋషభదేవుఁడు తన పుత్రులందఱకును సుత్కృష్టమగు పారమార్థికోపదేశమును గావించెను. ఆతఁడతని పుత్రులకుపదేశించిన గూఢాతిగూఢ మర్మ విషయములను గమనించి శ్రవణముచేయుచో నీ సంసారబంధముల నవశ్యము భిన్నభిన్నములై పోఁగలవు"

పరీక్షిన్మహారాజిట్లనెను:- గురుదేవా! ఋషభదేవుఁడు భగవంతుఁడే యైనప్పుడింక గృహస్థాశ్రమములోఁ బడవలసిన పనియేమున్నది వీరు తనపుత్రులనియు వారన్యులనియు నాతని కేల యుండును? ఈసకామకర్మాచరణము అజ్ఞానము వలనఁగాని జరుగదు. అట్లే యేదో లోకప్రాప్తి కొఱకు యజ్ఞయాగాదు లందు నిమగ్నులై కర్మకాండలలోఁ బడుటయునంతే."

అంతనవ్వుచు శుకుఁడిట్లనెను:- "రాజా! నీ వనునది యథార్థమే ఆతనికిఁ గర్మచేయవలసిన పనిలేదు. ఆతఁడు స్వభావముచే నిత్యము అనర్థ పరంపరారహితుఁడును, కేవలా నందానుభవ స్వరూపుఁడును, సర్వస్వతంత్రుఁడునగు నీశ్వరుఁ డైనను నాతనికి అజ్ఞానుల నుద్ధరించుటయందే సంకల్పము. జీవిపుట్టినప్పుడే నేర్చుకొనిరాలేదు శ్రేష్ఠులైనవారేమి చేయు చుందురో చూచి యా ప్రకారము చేయుచుందురు. జనులు ధర్మరహితులై విషయములలోఁ బడినచో సదా యెనుబది నాలుగులక్షల జీవరాసులలోఁ దిరుగవలసియుండును. కామ భోగముల ననుభవింపఁదలచిన ధర్మముగ నొనర్పవలెను. పూర్వము ఋషులు నివృత్తిమార్గమును బ్రవృత్తి కావించిరి. దానిమూలమునఁ గ్రమక్రమముగఁ గర్మలుపోయి నైష్కర్మ్య మునకుఁబోవును. అందువలనఁ గాలక్రమమున నశించిన ప్రవృత్తి మార్గమును బునరుజ్జీవనము కావించుటకై సమభావ మును, శాంతి, సుహృద, కారుణిక భావములనుంచుకొని, తన యాశ్రితులందఱకును గృహస్థాశ్రమమును నాదర్శముగఁ జూపించి, తాను ధర్మముగ గృహస్థాశ్రమసుఖముల ననుభ వించుచు వానిమీఁద నాసక్తియున్నట్లు కనఁబడుచు ననాసక్తుఁ

డుగ నుండెను రాజా ! ప్రపంచములో బ్రహ్మానందము, విష యానందమని రెండే యానందములు కలవు. బ్రహ్మానందము త్యాగవైరాగ్యములద్వారా యే కొలది మందికో కాని లభింపదు; కాని విషయభోగములు ధర్మపరిత్యాగము కావించి చేయకుండుచో, నిత్యము ధనప్రాప్తియందును, శరీరారోగ్యము నందును, బుత్రపౌత్రాదులతోఁగూడి యానందము చెందుట యందును, సహధర్మచారిణికొంగు ముడివైచుకొని ధార్మిక కృత్యము లొనర్చుటయందును, ఆమెతో మృదుమధురముగ మాటలాడుటయందును, పరోపకార్యములొనర్చి యశః కీర్తి కార్యములొనర్చుట యందును నేయానందము కలుగునో,, దానివలన శరీరముయొక్క రోమ రోమయు వికసితమగును చిత్తము ప్రసన్నమగును. ఆ సుఖమును నీజటా జూటములను రంగుగుడ్డలను ధరించు సాధువు లెట్లెఱుఁగఁగలరు? అజ్ఞానులకీ సుఖములే సర్వస్వమును, అందుకనియే ఆతఁడు గృహస్థాశ్రమ మును స్వీకరించియున్నాఁడు.

ఆతఁడీశ్వరుఁడయ్యును మర్యాదాపూర్వకముగ రాజ్య శాసనమొనర్చెను ఆతని రాజ్యమందఱకును సుఖమే ఎవ్వరికి నెట్టి వస్తువునకును కొదువలేదు. ప్రజలు తమప్రభువు నంద త్యధిక భక్తికలుగవలెనని ప్రార్థించుటయేతప్ప యింకొక వస్తువు మీఁద కోరిక లేకుండిరి. తాను స్వయముగ సర్వజ్ఞుఁడయ్యును, వేదములలోని గూఢరహస్యముల నెఱిఁగిన వాఁడైనను మర్యాద రక్షణముకొఱకు సమస్తకర్మలు బ్రాహ్మణుల నడిగియే చేయు చుండెడువాఁడు. సామ, దాన, భేద, దండోపాయముల నెవరి

యెడల నేవిధముగ నెప్పుడు ప్రయోగింప వలయునో ముందుగ
మంత్రుల సమ్మతినిఁగొని చేయుచుండెడువాఁడు.

ఆతఁడు దేవతలందఱకు నధిపతియు, సర్వేశ్వరుఁడై
యుండియు లోక సంగ్రహార్థము దేవతలనుద్దేశించి ద్రవ్య,
దేశ, కాల, వాయ, శ్రద్ధా, ఋత్విక్సదస్యాదులతోఁ గూడి
యజ్ఞయాగములను మిక్కిలి శ్రద్ధాభక్తులతో శాస్త్రీయ
విధిచేఁజేయుచుఁ బురాణపురుషుఁడగు యజ్ఞేశు నారాధించు
చుండెడువాఁడు.

ఒకానొకప్పుడాతఁడు పర్యటన మొనర్చుచుఁ దనవర్షము
లోని సమస్త దేశములను దిలకించుచు, భూమండలమున సర్వ
శ్రేష్ఠమని చెప్పఁబడినదియు, నిత్యము బ్రహ్మర్షులు నివాస
మొనర్చుటచే బ్రహ్మర్షి దేశమని పిలువఁబడునదియు, నాతని
తృతీయ పుత్రుఁడగు బ్రహ్మావర్తుఁడు పాలించుటచే నాతని
పేరనే బ్రహ్మావర్తమని పిలువఁబడుచుండినదియు గంగాయము
నలకు మధ్యనున్నదియు నగు నాప్రదేశమునకువచ్చెను.

అచ్చట గొప్ప గొప్ప బ్రహ్మర్షులుండిరి. వారిలో
వినీతులు సుశీలురునగు నాతని పుత్రులును గూర్చుండియుండు
టను గాంచిరి. ఇది మంచి యవకాశమని భావించి ఋషభ
దేవుఁడు తనపుత్రులను లక్షించి వారికుపదేశము చేయఁగోరి
అందఱనుద్దేశించి యిట్లనెను.

అచ్చట సమాహిత చిత్తుఁడై కూర్చుండిన తర్వాతఁ
ఋషులచే విధ్యుక్తముగ సత్కృతుఁడై, పుత్రులనందఱను
సంబోధించుచు నిట్లనెను:- "పుత్రులారా ! మీరందఱు
నిచ్చట నీ బ్రహ్మర్షులమధ్యలో నేల కూర్చుంటిరి?"

వారిలో భరతుఁడు వినీతభావముతోఁ జేతులను జోడించి యిట్లనెను:- 'తండ్రీ ! మా కందఱకును బ్రహ్మానందప్రాప్తి యెట్లు కలుగునని యీ బ్రహ్మర్షుల నడుగుచున్నాము. ఈ విషయమునఁ గృపతో మీరము గొంచెముగ నుపదేశింపుఁడు''

ఋషభదేవుఁడిట్లనెను:- నేనీ మహాత్ముల సమ్ముఖమున నేమి చెప్పఁగలను? అయినను నాకు తెలిసినది చెప్పెదను. మానవదేహమునుబొంది యీ సాంసారిక తుచ్ఛభోగములఁ బడుట యుచితముకాదు. ప్రపంచములో నైదే సుఖములు కలవు. చూచుసుఖము, వినెడుసుఖము, ఘ్రాణేంద్రియసుఖము జిహ్వాసుఖము, స్పర్శేంద్రియ సమాగమ సుఖము. ఈసుఖములను బొందుటే పురుషార్థమనుకొనిన శ్వానసూకరకాకఘూకాది మలభక్షక జంతువులే సుఖముకలవి. ఏలననఁగా మీకు లడ్డు, పాల్పాలు తినుచున్నప్పుడు కలుగుసుఖమే వానికి మలమును భక్షించునపుడు లభించుచున్నది. స్త్రీ పురుషుని వలనను, పురుషుఁడు స్త్రీవలనను నే విషయసుఖము ననుభవించుచున్నాఁడో అట్టిసుఖమునే కుక్క ఆడుకుక్క వలనను, పంది ఆడుపందివలనను కాకి ఆడుకాకివలనను బొందుచున్నది దీనినిఁ బట్టి విషయ సేవనమువలన బ్రహ్మానంద ప్రాప్తికలుగదని తేలుచున్నది. అది విశుద్ధాంతః కరణము కలవారికే లభించును. అట్టి విశుద్ధాంతః కరణము తపస్సుచేఁగాని కలుగదు. కావున నిరంతరము తపస్సునందే యుండవలయును శుద్ధాంతఃకరణముగల తపస్విలే మోక్షమున కధికారులు."

అంతఋషభ దేవుని యొక్క ఒకపుత్రుఁడిట్లనెను:- "తండ్రీ! మోక్షప్రాప్తికి సాధనమేది? ఏపనిచేసిన మోక్షము ప్రాప్తించును?"

మిక్కిలి దృఢముగ ఋషభదేవుఁడిట్లనెను:- "నాయనలారా! మోక్షప్రాప్తికి ముఖ్యమగు నుపాయము మహాపురుషులను శ్రద్ధతో సేవించుటయే "త్రిజగతి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవ తరణే నౌకా" త్రిలోకములలో సజ్జన సాంగత్యమొక్కటే సంసారసముద్రమును దాఁటుటకు నౌకయగును" భగవద్భక్తుల ధనము శ్రీహరియే. లోభివాఁడు తన ధనమును మిక్కిలి సురక్షితముగ నెట్లు దాఁచుకొనునో తమ హృదయములో భగవద్భక్తులగు మహాపురుషులు భగవంతుని దాఁచుకొందురు. ఎంతటి హృదయహీనుఁడగు పురుషుఁడైనను సేవచే వశమైతీరును. అందులో మహాపురుషులు గొప్ప కృతజ్ఞులుగను, గుణగ్రాహులుగను, పరోపకారులుగను నుందురు. ఎవరు వారిని శ్రద్ధాభక్తులతో, నిష్కపటులై, ఛలఛిద్రరహితులై సేవించెదరో వారలాసేవకు తమహృదయ ధన సర్వమునగు (శ్రీ)హరి నొసంగెదరు. తమవారినిఁగాఁ జేసికొందురు. పరశువేది లోహమును బంగారముగ నొనర్చును. కాని మహాపురుషుఁడగు భగవద్భక్తుఁడు తమసేవకులను బరశువేదిగ నొనరించెదరు. కావున సాధుసంగమే మోక్షమార్గము."

ఇంకొకఁడిట్లడిగెను:- "తండ్రీ! సాధులక్షణములేవి? ఏ చిహ్నములచే మీరు సాధువులని గ్రహింపనగును. ఆ సాధు

వులు చాలమంది సాధువేషముతోఁ జరించుచుందురు. అట్టి వారి సాంగత్యమువలన మోక్షము రాదుకదా ! ”

అంత ఋషభదేవుఁడిట్లనెను:— “నాయనలారా! బాహ్యచిహ్నములవలన సాధువు లభింపఁడు. సాధువులను గుర్తించుట మిక్కిలి దుర్లభము. సాధువు వారి కృపవలననే కనుఁగొనఁబడవలెను వారెవరి ననుగ్రహించెదరో వారికి వారిరూపమును జూపించెదరు. అయినను గొన్ని సాధు లక్షణములను జెప్పెదను వినుఁడు. సాధువులు సమాన చిత్తముతోనుండు వారును, శాంతచిత్తులును, కోపమెవరి మీఁదనైన నెన్నఁడు పడనివారును, అందఱను స్వభావమునకు వశీభూతులని తెలిసికొని క్షమించువారును, సదాచారమును విడువనివారును, సదా శ్రేష్ఠపథము ననుసరించువారును, సుహృదులును, అకారణ బంధువులును, పరోపకార పారీణులును, సదాచార సంపన్నులును, భగవంతునే తమ సర్వస్వముగ నెంచుకొను వారును, ఆతని ప్రేమలో నిరంతరము తన్మయత్వమున నుండు వారును, జహాస్యావస్థలను జయించినవారును, స్త్రీ, పుత్ర, ధన, కనకవస్తు, వాహనములందును, భోగసామగ్రిలందును, సంపన్న గృహములందు నాసక్తిలేనివారును, కేవలము లౌకిక నిర్వాహము కొఱకును, బరోపకారము కొఱకును లౌకిక కార్యములలోఁ బ్రవృత్తులగు మహాపురుషులు సాధువులనఁ బడుదురు. అట్టివారి సాంగత్యముచే మోక్షము లభింపఁగలదు.

ఇదివిని యింకొకఁడిట్లనెను:— ‘‘తండ్రీ ! లోకములో నన్నిటికంటె నోటిలోఁ బడవేయు వస్తువేది?”

అంత ఋషభ దేవుఁడిట్లనెను:- "అన్నిటికంటె గోతిలోఁ బడవేయునది దుర్మార్గునితో సాంగత్యము. భ్రష్టురాలైన స్త్రీ యింకొక స్త్రీనిగూడ భ్రష్టురాలనొనర్చును. చరిత్ర విహీనుల సాంగత్యమొనర్చినచో వీఁడును జరిత్ర విహీనుఁడు కాఁగలఁడు. ఎట్టి సాంగత్య మొనర్చిన నట్టి ప్రభావముపడును. ఏదితినినఁ ద్రేపును నదియేవచ్చును. తెల్లనిగుడ్డ నేరంగులో ముంచిన నారంగుగల వస్త్రమగును. కావున మోక్షమార్గము నపేక్షించువారు సదా సర్వథా స్త్రీలంపటులతోడను, విషయాసక్తులతోడను సాంగత్యమును మానవలయును.

శుకమహర్షి యిట్లనెను:- "రాజా ! ఈ విధముగ ఋషభ దేవుఁడనేక యుక్తులతోడను, దృష్టాంతముల తోడను, గథలతోడను బిడ్డలకు వివిధోపదేశములను గావించెను. మొట్టమొదట సంసారాసారతను జెప్పి, మానవజన్మ శ్రేష్ఠతను బోధించి, జీవుని పరమ పురుషార్థమును గూర్చి చెప్పెను. ఏజీవి శ్రేష్ఠుఁడో చెప్పుచు నీతారతమ్యములో బ్రాహ్మణులు సర్వశ్రేష్ఠులని చెప్పెను. అన్నికార్యములను బుద్ధిమంతులును, సదాచారులును ధర్మాత్ములగు బ్రాహ్మణుల సమ్మతిని గ్రహించి చేయవలసినదని తనకుమారుల కాదేశించెను. చిట్టచివర కిట్లుచెప్పెను:- "నాయనలారా ! మీరీ చరాచర ప్రపంచమును శ్రీహరి స్వరూపమని భావించుచుఁ బ్రతిజీవి యందును నాకువలెఁ బూజ్యబుద్ధినుంచి, అందఱకు శ్రద్ధాపూర్వకముగ సర్వదా సేవచేయుచుండవలెను. సాధు

నందఱను బూజించుటయే నాకుఁ జేయు గొప్పపూజ. మనో వాక్కాయముల సర్వభావములచే నా భక్తవత్సలుఁడగు భగవానుని అందఱిలో సమానముగ వ్యాపించియున్నాఁడని తెలిసికొని ప్రణామమొనర్పవలయును, నమస్కరింపవలెను. అట్లుచేసిన నీ మహామోహమునుండి బయటఁబడఁగలరు అని ఈ విధముగ సదాచారులును యోగ్యులునగు దన పుత్రులకు బాగుగానుపదేశించి, సమస్త సందేహములను నివారించెను.

## ఋషభదేవుని అవధూత వృత్తి.

౩౧౨

శ్లో॥ అథాను వంశో యశసావదాతః
ప్రైయవ్రతో యత్ర పుమాన్పురాణః ।
కృతావతారః పురుషః స ఆద్యః
చ చార ధర్మం యదకర్మ హేతుమ్ ॥

(శ్రీ)భాగ. ౫ స్కం. ౬ అ. ౧౪ శ్లో॥

వ॥ - - - - ఎవ్వని యంశంబున నతికీర్తి మంతుండగు ప్రియవ్రతుండు గలిగె నెందు జగదాద్యుండగు పురాణ పురుషుండవతారంబు నొంది కర్మ హేతుకంబు గాని మోక్షధర్మంబుం దెలిపె"-

శ్రీమదాంధ్ర భాగవతము.

సుఖముకానిండు, దుఃఖము కానిండు, మానముగానిండవ మానముకానిండు సత్కారముకానిండు తిరస్కారముకానిండు, శరీర భావమున్నంతవఱకు మానముండియే తీఱును. ద్వంద్వములందు సామ్యబుద్ధి లేనంతవరకు కైవల్యప్రాప్తి అసంభవము,

అశక్యమును. జ్ఞానదృష్టిచేఁ జూచినచో మలమునకును జందనము
నకును భేదమేమున్నది? మలమును వ్యక్తియొక్క వికారమే
చందనము నంతియే. సుగంధ దుర్గంధ కల్పన మనముచేసికొని
నదే. అట్లే జ్ఞానదృష్టిచేఁజెప్పినచో నన్నింటిలో హరియొక్కఁడే
యున్నాఁడు. జగత్తాతని రూపము, కాని మనగళమునఁ
బ్రమదా సుఖస్పర్శినీ బాహువు పడినచో నానందమున మన
శరీరమున రోమరోమము నిక్కఁబొడుచును; కాని సర్పమును
వేసినచో భయముచే గడగడ వణఁకుదుము. అప్పుడు మన
సమస్త జ్ఞానము, ధ్యానము ఎచ్చటికి పారిపోవునోగాని
ఆపామును మెడనుండి తీసిపాఱవైచి పరువిడెదము. వాస్తవ
ముగఁ జూచినచోఁ బ్రమదా బాహువునకును సర్పమునకును
నేమియును భేదములేదు. రెండును బంచభూతములే. రెండింటి
లోను జైతన్య సత్తా వ్యాపించియున్నది. రెండును సచ్చిదా
నంద స్వరూపములే కాని పూర్తిగా నిర్భయపదమును బొంద
నంతవఱకును, శరీరముండఁగనే జీవన్ముక్తావస్థ స్థితి రానంత
వఱకు భేదభావముండియే తీరును. భేదభావమే బంధనము.
అదియే మనలను వివిధలోకములలోఁ ద్రిప్పుచున్నది. ఈభేద
భావము పరమహంస వృత్తిధారణ కావింపనిది నశింపదు.
ఇదియే అంతిమస్థితి. ఇదియే పరాగతి. ఇదియే కాష్ఠ.

పరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ ! ఋషభదేవుఁడు
తన కుమారులకు శిక్షణ నొసంగిన తర్వాత నేమిచేసెను?
ఆతఁడే యాశ్రమమును బాలించెను?"

అంత శుకదేవుఁడిట్లనెను:- 'రాజా ! ఋషభదేవుఁడీ
యనర్థ పరంపరాగతమగు జగత్తును మిథ్యగాభావించి, తన

జ్యేష్ఠపుత్రుఁడగు భరతునిఁ జక్రవర్తిగా నొనర్చి, మిగిలిన వారికి చిన్న చిన్న రాజ్యములనొసంగి వనమునకుఁ బోయెను. అతఁడింటిలో నుండఁగనే ఆవహనీయాది సమస్తాగ్నులను ఆత్మారోపణము కావించి నిరగ్నికుఁడయ్యెను. జ్ఞానము కలుగుటచే నాతఁడగ్నిహోత్రమునుగూడ త్యాగము నొనర్చెను. జ్ఞానము కలిగిన, తర్వాత నాతఁడెట్లొనర్చెననుటయు నసంగతమే. ఆతని నజ్ఞానము స్పృశింపనే స్పృశింపదు. ఆతఁడు సదా జ్ఞానస్వరూపుఁడు. కాని లౌకికదృష్టిచేఁ బ్రాణులకు శిక్షణ నొసంగుటకును, బరమహంస ధర్మ శ్రేష్ఠతను జెప్పుటకును నాతఁడు మహామునులచే ననుమోదితమై పూజితమై, భక్తి, జ్ఞాన వైరాగ్యరూప పరమాశ్రమ మహాత్మ్యమును జూపుటకై యున్మత్తులవలె వేషధారణము కావించుకొనెను. ఆతనిలో జ్ఞానజ్యోతి వెలుగుచున్నను పైకి యజ్ఞానివలె నాచరణ మొనర్చుచుండెను. ఆతఁడు బాహ్యముగనున్న గుడ్డల నన్నిటిని విప్పిపాఱవైచి, పిచ్చివానివలెను, పిశాచమువలెను కేశములను విఱియఁబోసికొని మొండిమొలతో నేలక్ష్యమును లేక తిరుగుచుండెను.

ఆతని దేశమగు బ్రహ్మావర్తమునుండి బయలుదేరి, ఆతని ముఖ మేదిక్కునకుండిన నా దిక్కునకుఁ బోవుచుండెను. బుద్ధికి నిలయమైయుండియు బుద్ధిహీనుఁడగు మూర్ఖునివలె నయ్యెను. దివ్యదృష్టిని గలిగియుండియు నాతఁడంధునివలె వృక్షములకుఁ గొట్టుకొనసాగెను. దివ్యవాణిని గలిగియుండియు నెన్నిసార్లు పిలిచినను బలుకకుండెను. ఆతఁడు మూఁగవాఁడని

భావించి వెంటఁ బిల్లలు పెద్దలు పడిపిలిచినను, గేకలు వేసినను, తాళాలు తప్పెట్లు కొట్టి హోహూ, హూహోయని పిలిచినను వెనుదిరిగి చూడకుండ పోవుటనుగాంచి యీతఁడు చెవిటి వాఁడనియు భావించిరి. వెండ్రుకలు విఱియఁబడియుండెను. శరీరము ధూళిధూసరితమయ్యెను. ఆతని శరీరమునకు గడ్డి పోఁచయంటుకొనెనా ఆతఁడు చేతులను జాడించుచుఁబరువిడును. పిశాచోన్మత్త వేషమునుగాంచి కుక్కలు మొఱుగుచుండెను. పిల్లలు చప్పట్లు చఱచుచుండిరి. ఈతఁడుమాత్రము మానవ్రత మును ధరించి తనధ్యానములోఁ దానుండి సింహమువలెఁ బోవుచుండెను. ఒక్కొక్కప్పుడు పురములలోనికిఁ బోవును, ఇంకొక్కప్పుడు గ్రామములలోనికిఁబోవును. వెండి బంగారు పళ్ళెములలో భోజనము చేయువాఁడు సాధారణ జనముసఁ గలిసియుండెను. ఒక్కొక్కప్పుడు రైతులతోఁ జేలలోను, కూరగాయల తోటలలోనుండి కూరగాయలను దినియుండెడు వాఁడు. ఒక్కొక్కప్పుడు పర్వతప్రాంత గ్రామములలో దిరి గెడువాఁడు. ఒక్కొక్కప్పుడు సైనిక శిబిరములకుఁబోయి, సైనికులతోనుండ వారీతనిని బట్టుకొని వివిధప్రశ్నలను వేయు చుండిరి. కొందఱు వేగులవాఁడను చుండిరి. మఱికొందఱు సిద్ధపురుషుఁడనుచుండిరి. ఈతనికి హర్షశోకములు లేవు. పట్టు కొనినచోఁ గూర్చుండును, వదలిపెట్టినచోఁబోవును. ఒక్కొ క్కప్పుడూరి వెలుపల గోశాలల సమీపమున నావుదూడలమధ్య పండుకొనును. దూతలతో మాట్లాడును. ఒక్కొక్కప్పుడు గొల్లల యిండ్లకుఁబోయి వెన్నను దినును, మజ్జిగనుద్రావును, మీఁగడనుదినును. మందముగానున్న ఱొట్టెలను దీసికొ

పోవును. ఎచ్చటనైన యాత్రికులగుంపు కనఁబడునో నెలల కొలఁది వారివెంటఁ బోవుచుండును. తిరిగివచ్చినఁ దిరిగి వచ్చును. ఉత్తరదిక్కుగాఁబోవుచుఁ బోవుచు మరల దక్షిణపు దిక్కునకుఁ దిరుగును. ఒక్కొక్కప్పుడు కొండ కొనలకెక్కి, అచ్చట రాళ్ల మీఁదఁబండుకొనును. ఒక్కొక్కప్పుడు దట్టమైన యరణ్యములకుఁ బోవును. మఱొకప్పుడు జ్ఞానులు, మహాత్ముల యొక్క ఆశ్రమములకుఁబోయి, అచ్చట వారిచే సత్కృతు లందును.

అజ్ఞానులగు మూర్ఖులకు ఇతరులను బాధించుటలోనే ఆనందము - ముఖ్యముగ వారు మహాత్ములను నధికముగ బాధించెదరు. విషయాసక్తులంతటను విషయాసక్తులుగనే చూతురు. అకారణముగఁ పరీక్షించుటకు వివిధములగు క్రూర కార్యములొనర్చెదరు. దుష్టులు కుతూహల వశమున మహాత్ములను గొట్టుచుందురు. వారి మర్మస్థానములను వేధించెదరు. అవమానించుచుందురు. నిజమైన మహాత్ముఁడో మోసకాఁడో పరీక్షించెదరు. వాస్తవమున వారితరులకు బాధకలిగించుట యందే యానందము ననుభవించెదరు.

తల విఱియఁబోసికొని దిగంబరుఁడై వెళ్ళుచున్న ఋషభదేవునిఁగాంచి దురాత్ములాతనినిఁగాంచి నవ్వుచుండెడు వారు. కొందఱు మోసగాఁడనియు, గొందఱు మహాత్ముఁడనియు, గొందఱు విరోధించుచుందురు, గోఁచీని పాఱవైచి దిగంబరియైనంతనే మహాత్ముఁడగుచో నందఱును దీసిపాఱ వేయవచ్చుననుచుండిరి. ఒకఁడితఁడు సమదర్శియనును. ఇంకో

కఁడు దుష్టుఁడనును, మంచిదెబ్బపడినచో సమదర్శిత్వము బయట పడునందురు. కొందఱీ విషయములోఁ బరీక్షింపఁ దిగుదురు. కొందఱాతనిని బూతులు తిట్టుచు నిట్లందురు:—"ఓరీ! ఓ దిగంబరి బాబా ! నిలునిలు. చాలధూర్తుఁడవు పాషండివి. దిగంబరిగాఁ దిరుగుటకు నీకు సిగ్గు కల్గుటలేదా ? ఇంతలో నింకొకఁడువచ్చి రెండు దెబ్బలుకొట్టును. దుష్టులుపెట్టు యాతనల కాతఁడు కూలఁబడును. అంతినాతని మీఁదఁ గొందఱు మూత్రవిసర్జనము చేసెడువారు. కొందఱు మలవిసర్జనమును జేసెడువారు. కొందఱుమియుదురు. మఱికొందఱు ఱాళ్ళతోఁ గొట్టుచుందురు. ఆ దెబ్బలకాతని దేహమునుండి రక్తము స్రవించెడిది కొందఱు మూఁగ మూఁగయని యాతనిపై దుమ్మును జల్లుచుందురు. కొందఱు దుష్టులు కాళ్ళెత్తియాతని ముఖమున నపానవాయువును బెద్దగవిడుచుచు నవ్వినవ్వి క్రిందఁబడి దొర్లుచుందురు. కొందఱు చెడ్డతిట్లు తిట్టెడువారు. ఇంత జరుగుచున్నను ఋషభదేవుఁడేమియుచు మాట్లాడెడువాఁడుకాఁడు. ఆతనికి శరీరమునందాసక్తియును లేదు, తాను రాజనను నభిమానమును లేదు. ఎవఁడైనను గొట్టినచో సహించును. కూర్చుండఁబెట్టినఁ గూర్చుండును. తఱిమినఁ బరువిడును. ఈ విధముగ నిరుద్దేశ్యుఁడై ద్వంద్వములను సహించుచుఁ దిరుగుచుండెను.

శరీరమునందు ధూళి యంటుకొనియున్నను, వెండ్రుకలు విఱియఁబడి, జడలు కట్టినప్పటికిని శరీరముమీఁద వస్త్రభూషణాదులు లేకున్నను నాతఁడు మిక్కిలి సుందరుఁడుగఁ

గనఁబడెడువాఁడు. మట్టిలోఁబడినను మణి మణియేగదా ? ఆతఁడు కులీన వంశములోఁ బుట్టినవాఁడు ఆతఁడు చూచుటకు మిక్కిలి రూపవంతుఁడు. ఆతని యంగములన్నియును సుందరములు, సుకుమారములు, హృష్టపుష్టములు, లావణ్యయుక్తములు, ఆతని యఱచేతులును, అఱకాళ్ళును, కనుగొలుకులును నరుణవర్ణముగనున్నవి. బాహువులు, వక్షస్థలము విశాలముగనుండెను. వృషభస్కంధమువలె స్కంధములును, సింహము నడుమువంటి నడుమును, గంభీరముగ శంఖమువలె రేఖలుగల కంఠమును, చిలుక ముక్కునుగలిగి మనోహరముగ నుండెను. ఆతని ముఖము కమలమువలె మందహాసయుక్తమై లావణ్యమయమై ఆకర్షకముగనుండెను. పుర, నగర, గ్రామాదులకుండ వెళ్ళుచుండిన సందఱ మనములను హరించుచు, కామ బాణములచే కామినీ గణములను వేధించుచు, మంద సుగంధిత పవనమువలె సందఱ చిత్తములను బ్రసన్నములొనర్చుచు వెళ్ళుచుండెను. కపోలములనువంచిన నేలమీఁదకు వ్రేలాడుచు భ్రమరావళినున్న యలకావళి జడలు కట్టెను. ఆ జటాభారమును ధరించుచు నాతఁడు స్వచ్ఛంద హరిణమువలెను, మదోన్మత్త గజమువలెను దిరుగుచుండెను. జనులాతని గడ్డలు, ఱాళ్లు మొదలగు వాటితోఁ గొట్టుచుండిన వారి వైపు పునఃజూడనైనఁ జూచుటలేదు ”

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:— “స్వామీ ! ఇంతటి గొప్ప మహాపురుషుఁడును, నీశ్వరావతారమును, జ్ఞానియుఁ, బరమహంసయునగు నీతనినేల వీరందఱును గష్టపెట్టుచుండిరి.

ఆతఁడు శారీరకముగ దిగంబరి. మాటలాడఁడు, ఎవ్వరికి నపకారముచేయఁడు, అట్టి వానిని వీక్షించుటచే వారికేమి లాభము ? ” అంత శుకుఁడు నవ్వుచు నిట్లనెను:- “రాజా ! దుష్టులు లాభమునకై పనులుచేయరు. సాధువులను బాధించుట దుష్టుల స్వభావము. ఏనుఁగులు దారినే వెళ్లుచుండును కాని కుక్కలు దానినిఁజూచి మొఱుగుచుండును. సింహము స్వచ్ఛందముగ వనమునఁబోవుచుండును. ఈగల కది యేమి యపకార మొనర్చినది? అవి దానినిఁగుట్టును. ఇదేవిధముగ దుష్టులు సాధువులను జూడఁగనే ద్వేషించుచుందురు. వారిని బాధించుటకు సమస్త విధములగు ప్రయత్నముల నొనర్చుచుండును.”

శుకుఁడిట్లనెను:- “ఇదే విధముగ రాజా ! ఋషభదేవుఁడు స్వచ్ఛందముగఁ జరించుచు జీవన్ముక్తానందమును జూరఁగొనుచుండెను. పారమార్థిక పథికులకు దనయాచరణము ద్వారా పరమహంస ధర్మమును బోధించుచుండెను.

## ఋషభదేవుని ఆజగర వృత్తి

౩౧౮

శ్లో॥ కోన్వస్య కాష్ఠామపరోఽను గచ్ఛే
ద్మనోరథేనాప్య భవస్య యోగీ ।
యో యోగమాయాః స్పృహయత్యు దస్తా
హ్యసత్తయా యేన కృత ప్రయత్నాః ॥

(శ్రీభాగ ౫. స్కం. ౬ అ. ౧౫ శ్లో॥

వ॥ - - - -భగవదంశయైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధింబొందిన వైహాయస మనోజవ పరకాయ ప్రవేశాంతర్ధాన దూర గ్రహణ శ్రవణాది యోగసిద్ధులు దనంత వచ్చి సంప్రాప్తకొనక యుండె

శ్రీమదాంధ్ర భాగవతము.

సంకల్పము లేకున్న శరీరక్రియ యేదియునుండదు. అందువలన సంకల్పరహితులగు మహాపురుషుల మనస్సులందే సంకల్పములుండవు. వారు సంకల్పముచే జరింపరు, సంకల్పముచే నాహారపానీయములను గొనరు. శ్వాసప్రశ్వాస గతి స్వభావానుసారముగ జరుగుచుండును. ఎవఁడెంత సంకల్ప విహీనుఁడుగనుండిన నంత జ్ఞానిగనుండును. జ్ఞానమునకేడు భూమికలుకలవు. జీవన్ముక్తావస్థ చతుర్థభూమికలోఁ బ్రాప్తించును. జీవన్ముక్తుఁడైనవాఁడు సమస్త వ్యవహారమును జేయవచ్చును, గృహస్థ సుఖములను భోగింపవచ్చును. రాజ్యము చేయవచ్చును, సంతానోత్పత్తిని గావింపవచ్చును. ఈ కార్యములన్నిటినిఁ జేయుచున్నను నిర్లిప్తుఁడుగనే యుండును. వానికి విషయబంధనములేదు. అతఁడన్నిటిని జేయుచున్నను నకర్తగనే యుండును జనకాదులీ భూమికలోనుండి, సమస్తకార్యము లొనర్చుచును నిర్ద్వంద్వులుగనుండిరి. నాల్గవభూమికకు పైన నున్న మూఁడు భూమికలయందును గేవలము తితిక్షాభ్యాసము వృద్ధియగుచుండును; ఏలననఁగా నంత్యకాలమున నేమాత్రము శరీరాసక్తి యున్నను నేదో శరీరమునుధరించి తీరవలయును. చివరకు శరీర భానముండరాదు. మలమునందును మధుర

పదార్థములందును, స్త్రీయందును బురుషునియందును, సర్ప మందునను మాలయందునను, సువర్ణమందును మట్టియందు నను, తత్త్వతః కలిగిన జ్ఞానమేకాదు దృష్టిచేతను, వ్యవహా రముచేతనుగూడ భేదముండదు. ఇది గొప్పస్థితి. కొందఱు దంభాచారులీస్థితి నడ్డముపెట్టుకొని, తామజ్ఞానినని చెప్పు కొనుచు లోకులనుమోసగించి, తన విషయవాసనలను నీ మిషతోఁదీర్చుకొందురు.

ఋషభదేవుఁడు చతుర్థభూమిక యందుండి గృహస్థ ధర్మమును బాలించెను. పంచమభూమిక యందుండి దిగంబర వేషముతో నవధూతయై భూమిపైఁ జరించుచుండెను. ఇప్పు డాతఁడు పంచమభూమికనుగూడ త్యజించి షష్ఠమ భూమిక యందుఁ బ్రవేశించెను.

శ్రీ శుకుఁడిట్లనెను:— "రాజా! దుష్టులు ఋషభ దేవుని ననేకవిధముల బాధించినను నతనికి క్షోభకలుగలేదు. అప్పుడాతఁడిట్లు తిరుగుచుండుటయు దుష్టులవలన తాడనాదు లును దనయోగమునకు విఘ్నములని భావించెను. అప్పు డాతఁడు తితిక్షా మాత్రమునుబెంచెను. అవధూత వృత్తితర్వాత నాతఁ డజగరవృత్తి నవలంబించెను.

రాజిట్లడిగెను:— "స్వామీ! అజగరవృత్తి యననేమి? దానిలో నేమిచేయవలసియుండును?"

అంతశుకుఁడిట్లనెను:— "స్వామీ! చేయునదేమున్నది? దైవాధీనమని యుండవలెను తనను సర్వథా ప్రారబ్ధమునకు వదలివేయవలెను. యోగక్షేమము విషయమైన ప్రయత్నమే

యుండదు. ఎచ్చటికిని వెళ్ళుట వచ్చుటయుండదు. లభించిన దానితోఁ దృప్తిపడుచుఁ బ్రారబ్ధమునకుఁ బ్రతీక్షించు చుండ వలెను. ఋషభదేవుఁడు తాను మనుష్యుఁడనను సంగతిని మఱచిపోయెను. ఆతఁడు పశువులవలె నీరుద్రావ మొదలిడెను. ఎవ్వరైన దేన్నైన నొసంగినచోఁ బరుండియే తినుచు. ఈయ కున్నచో నాఁకలితోడనే పడియుండును పశువులుపరుండియు, నిలుచుండియు నెచ్చటనైన మలమూత్ర త్యాగము నెట్లు కావించునో అట్లే ఆతఁడును బిల్లలవలె నట్లే మలమూత్ర త్యాగమును గావించును. తన మలముతోఁ దనశరీరమంతయు నలఁదుకొనును. ఆమలము మీఁదనే కూర్చుండును. దాని మీఁదనే పరుండును. అసహ్యాకరమగు నీతని వ్యాపారమును గాంచి యెవ్వరు నాతనికడకు వెళ్ళెడువారుకారు. ఆతని మహా త్మ్యమును దెలిసినవారే ఆతని కడకుఁబోయెడువారు. దుష్టులు భ్రష్టుఁడనిభావించి యాతనికడ నిలువనే నిలిచెడువారుకారు. ఈ మూలమున నాతఁడు బ్రహ్మానంద సుఖమును ఆనంద ముతో ననుభవించుచుండెను.

అంతఁబరీక్షిన్మహారాజిట్లడిగెను:- "ఇంతటి జ్ఞానియు, ధ్యానియు నీశ్వరుఁడేయయ్యును ఋషభదేవుఁడిట్టి ఘృణిత బీభత్స ఆచరణమేల యొనర్చెను? దీనివలన సాధకుల యెడల చెడ్డ పరిభావము పడునుగదా. ఇదియే చివరమెట్టని భ్రష్టాచా రము నాచరించుచుందురు. ఆతఁడు సమదర్శియని నేనొప్పు కొందును. కాని లోకసంగ్రహార్థమిట్టి సదాచార హీనకార్య మును జేసియుండరాదు."

అంత శుకదేవుఁడిట్లనెను:- మహారాజా ! నీవు చెప్పి నది నిజమే. సాధారణులు బాహ్య విషయములనే కాంచి అట్లే తామాచరించుచుందురు. కాని సత్యముదాఁగదు. మోసము చిరకాలముదాఁగదు. చందన మలములందు మనస్సుతోఁ గాదుగాని వ్యవహారములో భేదమును బోగొట్టుకొనుట చాల కష్టము. దీనినందఱు నాచరింపఁజాలరు."

నైమిశారణ్యమందు ఋషుల మధ్యలో గూర్చుండిన శౌనకుండు సూతుని నిట్లనెను:- "సూతా ! ఋషభదేవుఁడు తన మలమును శరీరమునకు రాచుకొనఁగా నాతని కడకెవరును వెళ్ళియుండరు"

అంత సూతుఁడిట్లనెను:- "స్వామీ! సాధారణులాతని సేవగించుకొనెడువారు కాని జ్ఞానులాతని మర్మమును దెలిసి కొనిరి. అతఁడట్టి దశలోనున్నను నారాతనిని మిక్కిలిగ నాదరిం చెడువారు "

శౌనకుఁడిట్లనెను:- "సూతా ! పశువులునట్లే చేయును, పిచ్చివాఁడును, జిన్నపిల్లలును నెచ్చట్నైన మలమును విడుచు చుందురు. అట్టియెడ నాతనికిని వీరికిని భేదమేమున్నది?"

అంతసూతుఁడు నవ్వి యిట్లనెను:-"స్వామీ! మీకంత యును దెలియును. వీరజ్ఞానమున నట్లుచేయుదురు, జ్ఞానులకు జ్ఞానముయొక్క పరాకాష్ఠను జెందినతర్వాత శరీర మోహమును నశింపఁజేసి కొనుటకును, సమత్వమందు చిత్తమును స్థిర మొనర్చుటకును నిట్టివిచేయుదురు. కొందఱు మోసముగఁ గీర్తికాంక్షతో నిట్లు చేయుచుందురు. కాని చివరకు వాని

మొనర్చు చుండెడువాఁడు. ఎచ్చటనో బయటనుండి వారణాశి కొక రాణివచ్చెను. ఆమె గొప్ప విదుషీమణి, జ్ఞాన సంపన్న. ఎవరో వెడలి ఆమెతో నీయవధూత విషయమును జెప్పి ప్రశంసించిరి. ఆమెయు మిక్కిలి భక్తిశ్రద్ధలతో నాతనిదర్శన మునకుఁబోయెను. సమీపమున మూర్ఖ యాత్రికులు మూఁగి యుండిరి. పరమహంస బాబా బట్టగొడ్డువలె నచ్చటనే పడి యుండి తినుచుండెను. రాణియుఁ బ్రణామమొనర్చి కూర్చుం డెను. ఇప్పుడు పరమహంస బాబాయొక్క ఆనందమునకు మేఁర లేకుండెను. అతఁడు లేచి కుతూహలవశమున రాణి వడిలోఁ గూర్చుండెను. ఆమెయొక్క బహుమూల్యమగు వస్త్రముల నుండి వచ్చు అత్తర్లవాసనకు పరమహంసకు మత్తెక్కెను. రాణి మిక్కిలి గౌరవముగ నాతనికి మిఠాయిలను దినిపించు చుండెను. తినుచుఁ దినుచుఁ బరమహంస యామె వస్త్రము లపై మలవిసర్జనము కావించెను. మురిగిన పేడవలెనున్న నాదుర్గంధము ఆమె చిత్తమునకు మిక్కిలి క్షోభనుగలిగించెను. ఈ మూలమున నాతనివృత్తిమీఁద నామెకు సందేహము కలిగెను. ఆమె వానిని బరీక్షించుటకై మిఠాయినిఁ బెట్టుచు. నందులో నొకముక్కను మలములో మెదపి నోటిలోఁ బెట్టఁ బోగా నాఁడు ముఖమును ద్రిప్పుకొనెను. అప్పుడీతఁడు దాంబిక పరమహంసయని యామెగ్రహించి గట్టి రోషస్వర మున నిట్లనెను:- "పరమహంస బాబా! ఇది స్త్రీయా, పురుషుఁడా, రాణియా రంగప్పాయని తెలియుటలేదా? మల మూత్ర త్యాగమెచ్చట చేయవలయునో యెచ్చట చేయ

రాదో నీకు తెలియుటలేదుగాని ఇది మిఠాయి, ఇదిమలము, దీనినిఁ దినవచ్చును దీనినిఁ దినరాదనుజ్ఞానమున్నదా ? దాన్నికై ముఖమును దిప్పుచున్నావా? దయచేసి లోకులను మోసగించుటను మానుము. పొట్టకొరకై యిట్టిపాపము నొనర్పకుము. గుడ్డను గట్టుకొని సరళముగా సాధన మొనర్పుము"

భగవదనుగ్రహమో, తితిక్షాఫలమో కాని యాతని కామెమాటవలన మంచిబుద్ధికలిగి వస్త్రములను ధరించి, సరళముగ భగవద్భక్తి సాధన చేయసాగెను."

సూతుఁడిట్లనెను:- "మునులారా ! అజగరవృత్తిని జీవనమును గడుపుటయును, మలమునందును భేదభావము నుంచకుండుటయు నది మిక్కిలి యుచ్చస్థితి. అందువలన ఋషభదేవుని స్థితినివిని పరీక్షిన్మహారాజు చకితుఁడయ్యెను. మాటిమాటికి మా గురువగు శుకదేవుని నాతనిగూర్చి ప్రశ్నించుచుండెను.

శౌనకుఁడిట్లనెను:- 'సూతా ! పరీక్షిన్మహారాజు తర్వాత నేమని ప్రశ్నించెనో దయచేసి చెప్పవలయును."

ఇదివిని సూతుఁడిట్లనెను:- "మహాభాగా! మహామాత్రములు వ్రాసికొనిన విషయమునువిని పరీక్షిన్మహారాజిట్లడిగెను:- మలము శరీరమునకుఁ దగిలిన నాతనికి దుర్గంధము వేయలేదా? మల దుర్గంధము చాలదూరము వఱకు వ్యాపించునుగదా!"

అంత శుకుఁడిట్లనెను:- "రాజా ! ఆతని శరీరము చిన్మయము, దివ్యమునయ్యెను. దానిలోదుర్గంధ మెచ్చటనుండును? ఇంతేకాదు. ఆతని మలమునుండి మలయగిరి చందనముకంటె

మిక్కిలి సుగంధము వెలువడినది. ఆ సుగంధము నలుబది క్రోసులవఱకు వ్యాపించెడిది."

ఈ విధముగ రాజా! మోక్షపతియగు ఋషభ దేవుఁడు నానావిధములగు యోగచర్యల నాచరించుచుండెను. ఆతఁడుత్కృష్టమగు సర్వోపరి నిత్యానందమున నిమగ్నుఁడై యుండెను. ఆతఁడు సమస్తప్రాణుల యంతరాత్మయందు అభిన్న భావముచే వాసుదేవుని రూపమందుండుటచే సమస్త పురుషార్థములచేఁ బరిపూర్ణుఁడయ్యెను. ఆతని కేవస్తువునందును నాకాంక్షయును లేదు. అభిలాషయును లేదు. ఆతనికివచ్చినవస్తువు వలన హర్షమును, బోయిన వస్తువువలన శోకమును లేదు. ద్వంద్వాతీతుఁడై సుఖదుఃఖములందు సమానముగ నుండుచు బ్రహ్మానంద రూపరసాస్వాదనము చేయుచుండెను.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:— "మహారాజా! ఈ విధముగ ఋషభదేవుఁడీ శరీరమందే త్రిగుణాతీతావస్థను బొందెను.

## ఋషభుఁడు స్వయముగవచ్చిన సిద్ధులను బరిత్యజించుట.

౩౧

శ్లో॥ న కుర్యాత్కర్హిచిత్సఖ్యం మనసి హ్యనవస్థితే
యద్విశ్రంభాచ్చిరాచ్చీర్ణం చస్కంద తప ఐశ్వరమ్॥
శ్రీభాగ. 5. స్కం 6. అ. 3 శ్లో॥

క॥ చిరకాల తపము నైనను
హరియింపఁగ నోపుఁ జిత్తమని పెద్దలు స

మ్మరు జారుఁ గాక జారిణి
కరణిని సదరించు మనసు కామములకు ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

మానవుఁడు ద్వంద్వాతీతుఁడు కానంత వఱకును, శారీరక సంకల్పములనుండి పైకిఁబోకున్నంత వఱకు మనస్సుండి సంకల్ప వికల్పము లొనర్చుచుండును. కావున శరీరధారి చాల జాగ్రత్తగ నుండవలయును. తన మనస్సును దాను నమ్మకూడదు. యోగారూఢుఁడై యోగియుఁ బతనమగుచుండును. సాంగత్యమునను, ఆసక్తిచేతను యోగియునప్పుడప్పుడు విషయములలోఁబడుటను గాంచుచున్నాము ఎక్కడ యే కొంచెము విషయ సంసర్గమున్నను బరమార్థ పథికుఁడగువాఁడు వెంటనే అచ్చటనుండి తొలఁగి పోవలయునని శాస్త్రకారులచ్చటచ్చట మిక్కిలిగఁ జెప్పియున్నారు. కాకున్న దాని వాసనచేతనే వాని సాధనకు విఘ్నము కలుగును, విషయేంద్రియ సంసర్గముచేఁ గోరికలు బలవత్తరములగును. జ్ఞానులకును, భక్తులకును వారికి స్వయముగఁ గోరికలేమియునుండవు. వారన్నిటిని సర్వేశ్వరునకే యర్పించెదరు. అయినను లోకసంగ్రహార్థముగ నాతఁడుఁ బొరపాటుననైనను విషయములందాదర బుద్ధియున్నటులఁ బ్రదర్శింపరాదు శరీరభావములేకున్న చెప్పఁబనిలేదు; కాని శరీర స్పృహయున్నంతవఱకు, భోజనపానాది యావశ్యకత యున్నంతవఱకు విషయములకు దూరముగ నుండవలెను. వాటినేస్థితిలోను స్వీకరింపకఁబోవుటయే మహాపురుషుల లక్షణము.

శుకుఁడిట్లనెను:- "రాజా! ఋషభదేవుఁడు జీవన్ముక్తావస్థలోఁగల సుఖము ననుభవించుచుండి నాతఁడాఅవ భూమిక యందుండి జగన్మిథ్యాత్వము ననుభవించుచుండెను ఆ సమయమున సమస్త సిద్ధులు మూర్తిమంతములై యాతనికడకు వచ్చెను. వాని సహాయమున నాతఁడునిమిషములో నదృశ్యమైపోవచ్చును. నేలమీఁదవలె నీటిమీఁదఁగూడ నడువవచ్చును. ఆకాశముమీఁద కెగురవచ్చును. ఇతరుల శరీరములోఁ బ్రవేశింప వచ్చును. కావలయునని నూతన సృష్టిసి గావింపవచ్చును.

సిద్ధులన్నియు వచ్చి యిట్లనెను:- "దేవా! దాసీలమగు మా కవకాశ మొసంగుఁడు, కైంకర్యము నొనర్చెదము."

వారిమాటలను విని ఋషభదేవుఁడు నవ్వెను. ఆతఁడు సిద్ధుల నంగీకరింపలేదు. స్వీకరింపక పోవుటయేగాదు తన్నువైచి, అచ్చటనుండి వెళ్లవలసినదని యాజ్ఞాపించెను.

అంతఁ బరిక్షిన్మహారాజిట్లనెను:- స్వామీ! ఋషభదేవుఁడు సిద్ధులను దిరస్కరించి యుచిత కార్యమొనర్పలేదు. ఆతనికిఁ బ్రియాప్రియములు, సుఖదుఃఖములు. హానిలాభములు, జీవనమరణములు, కీర్త్యపకీర్తులు, శత్రుమిత్రత్వములు, స్వాదు అస్వాదువులు, శోకానుగ్రహములు, స్తుతినిందలు మొదలగునవన్నియును సమానములు, ఆతఁడు భూమిమీఁద నివసించుచున్నాఁడు, వాయువును బీల్చకుండుటయును లేదు: సూర్యప్రకాశమువలనఁ గార్యములు జరుగుచున్నవి: నేలమీఁదఁ బ్రవహించు నీటినిఁద్రాగుచున్నాఁడు,

పరేచ్ఛచే నన్నము గూడ తినుచున్నాఁడు; మలమూత్ర
త్యాగ మొనర్చుచుండెను; ఆకాశము క్రింద నివసించుచున్నాఁడు.
అట్టియెడ నాతనికి సిద్ధులను దిరస్కరించుటెందులకు?”

అంత శుకదేవుఁడిట్లనెను:— “మహారాజా! సాధువులకు
లకు సిద్ధులెందులకు? అవి గారడీవానిపనులు. సిద్ధులొనర్చి
యితరులను బ్రభావితులనుగావించి దాని మూలమున యశః
ప్రతిష్టలును, ధనమును సంపాదించుట వారిపని, కాని సాధువు
నకు సద్ధనము లక్ష్మీపతియగు శ్రీహరియే. 

పరీక్షిన్మహారాజిట్లనెను:— “లేదుస్వామీ! ధన యశః
కీర్తులవసరము లేదు. సిద్ధులుండినచోఁ గోరినప్పు డాకాశమున
నెగిరిపోవచ్చును. దీనులకు దుఃఖితులకుపకార మొనర్పవచ్చును.
ఇందులో హాని యేమికలదు?” 

అంత శుకమహర్షి యిట్లనెను:— “హాని లేదు గాని
యిష్టమువచ్చినట్లు వర్తించినచో మెల్లమెల్లఁగా విషయముల
లోనికి జారవచ్చును. పరోపకార మొనర్ప వచ్చునుగాని మన
స్సున నహంకారము ప్రబలును. యోగారూఢుఁడైనను పతన
భయముకలదు.” 

రాజిట్లనెను:— ‘స్వామీ! ఈ యనుమాన మితరుల
విషయములో నుండవచ్చునేమో కాని, జ్ఞానాగ్నిచే కర్మ
బీజములను వేయించిన యాత్మారాములను సిద్ధులేమి చేయఁ
గలవు? వారిమీఁద వాని ప్రభావమెట్లు పడఁగలదు? అదియును
గాక ఆ సిద్ధుల కొఱకు బ్రయత్న మొనర్చినచోఁ బతన భయ
ముండవచ్చును. తమంతట తాముగావచ్చిన సిద్ధులను ద్రోసి
వేయుట నాకంత సమంజసముగఁ దోచుటలేదు.”

ఇదివిని శుకుఁడిట్లనెను:— "మహారాజా! ఋషభ దేవుఁడు సిద్ధులకు సిద్ధుఁడు, అతనిని సిద్ధులేమి చేయఁగొట్టఁగలవు? ఈ చంచలమనస్సు నెన్నటికి నమ్మరాదని యాతఁడు మనకు గుణపాఠము చెప్పుటకట్లు చేసినాఁడు. నాకు సిద్ధులు ప్రాప్తించినవి, ఈ విషయములు నాబోటివాని నేమి చేయఁగొట్టఁగలవని పొరపాటునన్నైన విషయప్రవేశము కావింపరాదని మనకు గుణపాఠము నేర్పినాఁడు. గొప్ప గొప్ప జ్ఞానులు, ధ్యానులును, యతులును, యోగులును నీ చిత్తమును విశ్వసించి మతులు చెడి లక్ష్యచ్యుతినిఁ జెందిరి. ఒకానొకప్పుడు శివుని భగవానుని దైత్యులను మోహపెట్టిన యామోహినీ రూపము నొక్కసారి చూపింపుమని కోరెను." ఇదివిని భగవంతుఁడు నవ్వుచు నిట్లనెను:— భోళాశంకరా! నీవేల మాయలోఁ బడెదవు? తెలిసి తెలిసి నీ కాళ్ళమీఁద నీవు గొడ్డలితో నేల కొట్టుకొందువు? తేనె తుట్టెలోఁ జేతుల నుంచనేల? పనిలేక మత్త మాతంగము దరిచేరనేల? సింహము గడ్డమును సవరింప సాహసమేల? హాయిగా రామరామ యనుకొనుము. ఈవ్యర్థ విషయములందుఁ గుతూహలము పడనేల? నేను దైత్యులను మోసగించుటకై దానిని దర్శించితిని. దానినిఁజూచుటవలనఁ గామవృద్ధికాఁగలదు, చిత్తము చంచలము కాఁగలదు. కుడిచి కూర్చుండక యుపద్రవమేల కొని తెచ్చికొందువు?"

ఇదివిని యోగేశ్వరేశ్వరుఁడును, త్రినేత్రుఁడును, మదన దహనుఁడును, శూలపాణియు, పినాకియునగు శివుఁడు దృఢ స్వరమున నిట్లనెను:— "స్వామీ! నేను చాల యవతారము

లను దర్శించితిని. మత్స్యకూర్మ వరాహ నారసింహ, వామన పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యాది యవతారములను గాంచి నేత్రములను సఫలము కావించుకొంటిని ఈ యవతారమును గూడ దర్శింపఁగోరుచున్నాను.''

భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "భోళాశంకరా! ఈ యవతారమువలన నేత్రములు సఫలములగునో కావో తెలియదుకాని ముక్కంటివి నాల్గు కన్నులవాఁడవై చంచల చిత్తుఁడవు కాఁగలవు. నిన్ను నీవు మఱవఁగలవు. తర్వాత గోవిందాయ నమోనమః కాఁగలదు. పార్వతికి చాలచింత కలుగఁగలదు.''

శివుఁడిట్లనెను:- "స్వామీ! మన్మథుని నేనిదివఱకే భస్మమొనరించితిని. నా పై నాతని యాటలు సాగనేరవు. పిచ్చుకలు పోసికొని పోవుటకిచ్చట ధాన్యములేదు."

శివుని బలవంతమున భగవానుఁడు మోహినీరూపమును జూపించెను. దానివలన శివునకే స్థితి కలిగెనో దానినిచ్చట చెప్పఁదగదు. రాజా! సిద్ధుఁడు సిద్ధుల వలలోఁబడరాదు. భగవద్భక్తులకు సిద్ధులు సదా కింకరజనమై యుండును, కాని వానిని స్వీకరింపవలెనుగాని ప్రకాశిపరుపరాదు. చక్కెరగట్టినా మూఁతఁబెట్టి దాచి యుంచినంతవఱకు సురక్షితముగనుండును. అది బయటపడి మూఁతనుదెఱచి యుంచినచోఁ జీమలు గుంపులు గుంపులుగావచ్చి తినివేయఁగలవు. సిద్ధుఁడొక సిద్ధినిఁ గనఁబఱచెనా యీ సాంసారిక కాముకులు వానికడకుఁ జేరఁ బ్రయత్నింతురు. నాకు పిల్లలు కావలెను, ధనము కావలెను,

అందమైనభార్య కావలెను, రోగమును బోఁగొట్టవలెను, స్వాజ్యమును గెలిపింపవలెను. జీవితచర్యను జెప్పవలయును అని కోరికలనుగోరుచు, సట్లుచెప్పుచు నానావస్తువుల నడుగుదురు. దీనివలన యోగమునకు విఘ్నము కలుగును గుడ్డలకు బురదచేసి కొని దానినుదుకు కొనుటకంటె నాబురదజోలికే పోకుండుటే మేలు. ఈచిత్తము చాలచెడ్డది దీనినెప్పుడును విశ్వసింపరాదు. జారిణియగు స్త్రీ మొదట భర్తయెడలఁ బ్రేమ విశ్వాసములను జూపించి, మఱపించి, తర్వాత జారునితోఁ జేరి వానిమాటలను విని వానినెట్లు చలపునో అట్లే మనస్సును గామమును, దాని మిత్రులగు లోభక్రోధములకు నవకాశ మొసంగి మానవుని తపస్తేజః ప్రభావ సదాచారములను నాశముగావించి భ్రష్టునిఁజేయును.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య అసూయాదంభ ద్వేషాదులకీ మనస్సే మూలకారణము; మనస్సునకు వీనితో స్వాభావిక మిత్రత్వముకలదు. ఇట్టి దుష్ట మనస్సును నెవఁడు విశ్వసింపఁగలడు, ఈ చపలపు గురక నెట్లు పట్టవలెను? కావున రాజా ! ఋషభదేవుఁడు సిద్ధులను స్వీకరింపలేదు. వాటినిఁ దిరస్కరించెను. ఏదైన వస్తువును గ్రహించుటలో నెంత యానందము లభించునో దానిని వదలుటలో నంతకంటె నూఱురెట్లానందము లభించును. అందువలన యోగులు సంగ్రహింపక త్యాగమునం దేతత్పరులై యుందురు."

శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! ఈ విధముగ ఋషభదేవుఁడు దేహమున జీవన్ముక్తుఁడై పరమమోక్షప్రాప్త సుఖ

మును భోగించుచుండెను. బాలవత్క్రీడ లొనర్చుచుండెను. అజగరునివలె నిశ్చేష్టుండై కాలయాపన మొనర్చుచుండెను.

## ఋషభదేవుని దేహత్యాగము

3-౨౦

శ్లో॥ నిత్యానుభూత నిజలాభ నివృత్త తృష్ణః
శ్రేయస్య తద్రచనయా చిరసుప్త బుద్ధేః ।
లోకస్య యః కరుణయా భయమాత్మ లోక
మాఖ్యాన్నమో భగవతే ఋషభాయ తస్మై ॥

(శ్రీ) భాగ. ౫. స్కం. ౬ అ. ౧౯ శ్లో॥

సీ॥ నిత్యానుభూత నిజరూపలాభ నివృత్తమై తగు మహాతృష్ణ గలిగి
యస్ఖలిత విపులమాయారచితంబైన లాభంబునకు దగులంబు లేని నతి
గన్గి లోకుల నతివేడ్కఁ గరుణించి యభయదానం బిచ్చి యంచితకల
నవ్యయంబై దివ్యమై మహానందమై యత్యంత సేవ్యమై యతులమైన
తే॥ తనదు లోకంబు నూపంగఁ దిగినయట్టి
మోక్షమార్గంబు సెలఁగించి ముక్తదేహుఁ
డనుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రిత్యక్ష విష్ణు
డైన ఋషభుండు జనులకు సద్భుతముగ॥

(శ్రీ) మదాంధ్ర భాగవతము.

శరీర మభిమానముచే నుత్పన్నమగును. అహంభావమున నిలుచును. కర్మలన్నియును సంకల్పముచేతనే జరుగుచుండును. శరీరమున నహంభావము లేకున్న సంకల్పమునుండదు సంకల్పమే లేకున్నఁ గ్రియయునుండదు. క్రియ లేకున్న నీ శరీరస్థితియును లేదు.

శరీరధారణము కొఱకు అహంకార మావశ్యకము. జ్ఞానులకు సాంసారికులవలె నహంకృత భావముండదు. అయినను దానిలోను శరీరధారణము కొఱకు సూక్ష్మాహంకారముండియే తీరును. దానివలన వారి శారీరకక్రియలు స్వభావానుసారముగ సంకల్పము లేకయే జరుగుచుండును. ఆ సూక్ష్మాహంకారముకూడ విలీనమైనప్పుడీ పాంచభౌతిక దేహము అధిక కాలము నిలువదు. ఏలననఁగా నీ శరీరము నిలుచుట కహంకార మావశ్యకము అహంకారశూన్యుఁడగు వ్యక్తి సర్వగత సూక్ష్మగుణ రహితుఁడై, సర్వవ్యాపకుఁడై యుండును. ఆతని వ్యష్టి అభిమానము సమష్టి రూపమునఁ బరిణితమగును. స్థూల, సూక్ష్మ భూతములు తమతమ కారణములలో విలీనమము కాఁగా ముక్తుఁడగును.

శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! అందఱాతనిని మూఢమతియనియు, నజ్ఞానియనియు ననుకొనునట్లు ఋషభదేవుఁడు చరించుచుండెను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ ! ఇంతటి జ్ఞానియు నవతారమయ్యు ఋషభదేవుఁడు – దిగంబరిగనుండుటయు, మలమూత్రముల లదుకొనుట మొదలగు లోకవిరుద్ధ కార్యములేల చేయుచుండెను?"

అంత శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! ఋషభదేవుఁడు పరమైశ్వర్య సంపన్నుఁడును. సమస్త సిద్ధుల కధిపతియు, ఇంద్రాది లోకపాలురకు భూషణమైయుండెను. అట్లయ్యును తనయైశ్వర్యమును దాఁచుటకై అవధూత వేషమును వేసికొని,

జడపురుషులవలెఁ జరించుచుండెను. రాజా! ఇటు చూడుము. మూల్యమగు వస్తువు కలవాఁడు దానిని దాఁచియే యుంచుకొనును. దానినేదో విశేషావసరమున నాత్మీయులకడ దానిఁ బ్రకాశింపఁజేయును. మీరే ధనవంతులైన నడుగుఁడు–ఏదో కాలమును వెళ్ళబుచ్చుచున్నామనును. ధనవంతుఁడు తన ధనము నెట్లు దాఁచియుండుకొనునో అట్లే జ్ఞానియుఁదన యైశ్వర్య, బల, సామర్థ్య, ప్రభావ, జ్ఞాన, విజ్ఞానములను దాఁచుకొనును. సభ్యనరనారీజనమెట్లు తన గుహ్యాంగములను దాఁచుకొందురో జ్ఞానులునట్లు దాఁచుకొందురు. తనయైశ్వర్య ధన ప్రభావమును, బ్రతిష్ఠను నెవఁడు తనకుఁదానే ప్రదర్శించునో ఆతఁడు వ్యాపారియే. వాటిప్రదర్శనమువాటివృద్ధికొఱకు చేయుచుండును. ప్రదర్శింపక కేవలమనుమానముచే వానినిధినిఁ గనుఁగొనినునది వేఱువిషయము, అందువలన ఋషభదేవుఁడు సిద్ధులను స్వీకరింపక, యే విధముగను నుపభోగింపక, తన యీశ్వరీయ ప్రభావమును నుపభోగింపకుండెను జ్ఞానులు మాత్రమాతఁడీశ్వరుఁడని జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనఁగలరు. ఆతనికి మిథ్యాభిమానమెన్నఁడును లేనేలేదు. శారీరకాభిమానమును గూడ ఆతఁడు త్యజించివేసెను. ఇప్పుడాతఁడు యోగమాయా వాసనను గేవల మభిమానాభాసాశ్రయముననే ఈశరీరమును ధరించెను. వాస్తవమున నాతఁడు లింగదేహాభిమానము వీడి, తనయంతరాత్మయందభేద రూపముననుండిన పరమాత్మతోఁ దాదాత్మ్యమును జెందెను."

రాజిట్లడిగెను:- "స్వామీ ! శరీరమందభిమానమే లేన
ప్పుడు అది యెన్నాళ్లు నిలిచి యుండఁగలదు?"

శుకుఁడిట్లనెను:- "రాజా ! అదే చెప్పుచున్నాను. ఆతని
శరీర మింకెన్నాళ్ళో నిలువదు. సంకల్పములేకయే ప్రారబ్ధ
వశమున శరీరమటునిటుఁ దిరుగుచున్నది. ఆతఁడు దక్షిణదేశము
లోని కొంకణ, వేంకట, కుటక, కర్ణాటకాది దేశములందు,
ఆతఁడు తల విరియఁబోసికొని, వస్త్రవిహీనుఁడై దిగంబర
వేషమున విచరించుచుండెను.

ఒకసారి ఆతఁడున్మత్తునివలె శరీరమునుమఱచి బ్రహ్మా
నందమందు నిమగ్నుఁడై కుటకాచల ఉపవనములందు చరించు
చుండెను. శరీరమందు వస్త్రములేదు సమస్తావయవములం
దును ధూళినిండియుండెను కన్నుల ఆమోదమ్ముగ నుండెను.
వెండ్రుకలు విఱియఁబడియుండెను. ఈ విధముగ మదోన్మత్తుని
వలె నోటనొక రాతిముక్కను ధరించి తిరుగుచుండెను"

అంతఁబరీక్షిన్మహారాజిట్లనెను:- "స్వామీ ! ఋషభ
దేవుఁడు నోటిలో రాతిక్కనేల ధరించినాఁడు. దాని యుద్దేశ్య
మేమి?"

ఇదివిని శుకమహర్షి కొంచెము సేపాలోచించి యిట్ల
నెను:- రాజా ! అవధూతల చర్యలు మనకుఁ దెలియవు. వారే
యభిప్రాయముతో నేకార్యమును జేయుచుందురో మనకేమి
తెలియును? అయితే నోటిలో రాయి పెట్టుకొనుటకుఁ గారణము
శరీరమునకును రాతికిని భేదములేదని చెప్పుటకే. దంతము
లెట్లో రాయియునట్టిదే. కావున సమత్వమును జూపుటకై

యూతఁడు నోటిలో రాతిని ధరించెను. లేక ఈ మానవ శరీర
మును ధరించియును గేవల మాహారపానీయములందే కాల
మును గడపినచో నాతఁడు రాళ్లు దినువాఁడే కాఁగలఁడు.
వానినోట దుమ్ముపడును. లేక మూర్ఖులు నన్నుఁబిచ్చివాఁడని
బాదినను నేనేమియు ననఁబోను. అన్నము పెట్టినన న్నమును
దినెదను, రాళ్ళనొసంగిన వాటినే యనుభవించెదనను నర్థమును
గావచ్చును. లేక హృదయహీనులు ఱాతివంటి యంతఃకర
ణము కలవారినిఁ గాలముఖమునఁ బడఁద్రోయ బడుదురు.
వారు కాలముఖమునఁబోయిగూఢాపరికారముగనే బయటకు
వచ్చెదరు. మార్పుండదు. జననమరణములను గాంచు
చుండియు హృదయము ద్రవింపకున్నచో మనో వికారము
కలుగదు; లేక జ్ఞానులై పరమహంసలు బాలునివలె వర్తింప
వలయునని బోధించుచున్నాఁడా యనునట్లుండెను. చిన్నపిల్లలు
డబ్బులు, మట్టి, ఫలములు, మిఠాయి మొదలగునవి ఏవిదొఱి
కిన వానిని నోటఁబెట్టుకొనినట్లు జ్ఞానులును ప్రారబ్ధవశముచే
నేమి దొఱికిన దానితోఁ దృప్తిచెంది యుండవలయు నను
చున్నాఁడా యనునట్లుండెను. మధుర కషాయములకు భేద
మానరాదు. ఇదేవిధముగా, మహారాజా! నోటిలోరాతిని
ధరించుట కనేకార్థములుండవచ్చును.

ఇప్పుడు ఋషభదేవుఁడు తన యీ పాంచ భౌతిక
దేహమునుఁ బరిత్యజింపఁదలఁచెను. ఆతఁడు కుటకాచలోప
వనములందు జరించుచున్నప్పుడు ఒకానొక దినమున వాయు
వేగముచేనూగి పరస్పర సంఘర్షణముచే వెదురుపొదలలో

దావాగ్ని పుట్టెను. ఆయగ్ని పుట్టఁగానే వనమునంతనుదగులఁ
బెట్ట నారంభించెను. ఋషభదేవుఁడును నచ్చటనేయుండెను.
ఆతనికి శరీరమునందు మోహముండి, దానిని రక్షించుకొన
వలయునని యుండినచో నాతఁడచ్చటినుండి తప్పించుకొన
యత్నించెడు వాఁడే. కాని ఆతఁడగ్నియును బంచభూతము
లనియే భావించి యభేదబుద్ధితోనుండి, అగ్నికి నాహుతియై
యుండెను. అగ్ని ఆతని యీ పాంచభౌతిక దేహమునుగాల్చి
వేసెను. అంత నాతనిశరీరము భస్మమయ్యెను.

అంత రాజిట్లడిగెను:– స్వామీ! ఇంతటి మహాయో
గియు, సాక్షాత్తుగ భగవంతుని యవతారమగు వృషభదేవుని
శరీరమును గాల్చుటకు అగ్నికెట్లు సాహసము కలిగినది? అగ్ని
భగవద్భక్తుఁడగు వసిష్ఠమునిఁ గాల్పఁజాలకపోయెను. అందులో
నీతఁడీశ్వరుఁడే. ఎట్లు కాల్పఁగలిగినదో" ఈ విషయము నాకు
సందేహముగనున్నది."

అంత శుకదేవుఁడిట్లనెను:– "రాజా! ఋషభదేవునకు
ఇష్టము లేకున్న నగ్ని ఆతనినిఁగాల్పఁ జాలదనుట సత్యమే.
కాని యాతఁడీశరీరమును వదలవలయు ననుకొనుచుండెను.
ఆతని సంకల్పముచేతనే అగ్నిదేవుఁడాతని యాజ్ఞనుబాలించెను.
ఆతఁడు యోగులకు దేహత్యాగముచేయవలసిన విధినిబోధించు
టకై యిట్లు శరీరమును త్యజించుట యుచితమని భావించెను.
అందువలన నాతని శరీరము ఆతనిసంకల్పముచేతనే నశించినది.

ఈ విధముగ మహారాజా! నీకు సమస్త వేద, లోక,
దేవతా,గో, బ్రాహ్మణులకు పరమగురువగు ఋషభదేవుని

పరమపావన పుణ్యప్రద విశుద్ధ చరిత్రమును జెప్పితిని. ఇప్పుడింక నేమి యడుగఁదలచితివి?"

రాజిట్లడిగెను:- "స్వామీ! కొందఱు ఋషభదేవుని "అర్హాత్" అందురే. ఏమి కారణము? వీరు వేదములను నమ్మరు. యజ్ఞపురుషుని నిందించుచుందురేల?"

అంత శుకదేవుడిట్లనెను:- "రాజా! కొందఱేదో ఒక మహాపురుషుని పేరుతో నేదో ఒకమార్గము నేర్పఱచుకొనుచుందురు. అట్టివారు ఆ మహాపురుషుని యొక్క ఆంతరిక భావములను జ్ఞానవిజ్ఞానములను దెలియఁజాలరు. వారిబాహ్య వేషమును, బాహ్యాచరణమును ననుసరించుచుందురు. కాశిలో నొక మహాత్ముఁడుండెడువాఁడు. ఒక్కొక్కప్పుడాతఁడొక పొడుగాటి టోపీను ధరించుచుండెను. ఆతనితర్వాత నాతనిమార్గమొకటేర్పడెను. అట్టి టోపీని నెవరు ధరించెదరో వారే ఆమతస్థులు. ఒక మహాత్ముఁడు ముక్కుకొననుండి తిలకమును ధరించెనా, ఇఁక నాతని భక్తులందఱును నట్లే ముక్కుకొననుండి తిలకమును ధరింపవలసినదే. ఇఁక మిగిలినవియున్నను లేకున్నను ఫరవాలేదు. ఒకానొక మహాత్ముఁడు చీరెపేలికను కాలికిఁజుట్టుకొనెడువాఁడు. ఆతనిసంప్రదాయస్థులందఱు నట్లేకాలికి గుడ్డను జుట్టుకొనవలసివచ్చినది. మహారాజా! మానవుల ఇంద్రియములు బయటకుఁజూచుచుండుటచే బాహ్యవిషయములనే శీఘ్రముగ ధరించుచుందురు. ధీర వీర పురుషుఁడగువాఁడే అంతరాత్మను గాంచును. నేను వినినది నీకు చెప్పుచున్నాను వినుము. ఋషభదేవుఁడు కొంకణ, వేంకట, కుటకాది దేశములను

భ్రమించుచున్నప్పుడు అచ్చట ఆతని మహిమము వెల్లడి
యయ్యెను. కలియుగములో నీ వృత్తాంతమంతయును "అర్హాత్"
అనెడు రాజువిని, అట్లే యాచరణముకావించి నూతనమత
మును సృష్టింపఁగలఁడని వింటిని. ఆతని తర్వాతవారు ఈ విష
యములలోని యాథార్థ్యమును గ్రహింపఁజాలక విచిత్ర
విచిత్రార్థములను సృష్టించి. అర్థము ననర్థము కావించెదరు.
వారు దేవమాయామోహితులై శాస్త్రవిహిత శౌచాచరణ
ములను వీడి అధర్మ ప్రభావముచే బుద్ధి విహీనులై అస్త
వ్యస్తముగ మాటలాడెదరు. స్నానముచేయరు. పండ్లుతోము
కొనిన హింసయని పండ్లుతోముకొనరు. పండ్లను పాచిపట్టి
యుండును. నోటివెంట దుర్గంధము వెలువడుచుండును. తల
దువ్వుకొనరు. క్షౌరము చేయించుకొనరు. ఈశ్వరునిఁ దిరస్క
రించుచుందురు. అహింసకు స్వకపోల కల్పితార్థములను జెప్పి
వేదములను, బ్రాహ్మణులను సతతము నిందించుచుందురు. అంధ
పరంపరకు వశీభూతులై అవైదికాచరణమే సర్వశ్రేష్ఠమని
భావించుచుందురు. ఇందులో ఋషభదేవుని దోషముగాని,
ఆతనివలె నాచరించు సాధువుల దోషముగానిలేదు. దోష
మంతయును తమస్వార్థమును సిద్ధింపఁజేసికొనుటకై అమా
యకులగు వారిని మోసమొనర్చు స్వార్థపరులలోఁగలదు.
మహారాజా! ఇందులో నెవ్వరి దోషమును లేదు. ఇది యుగ
ధర్మము. భగవదేచ్ఛ చేతనే యిదియంతయును జరుగుచుం
డును. ఆతని యిచ్ఛలేక ఒక్క ఆఁకైనను గదలదు. లోకుల
స్వాభావిక ప్రవృత్తి ఆయుగానుసారముగ నుండునట్లొతఁడే

వారివారి చిత్తవృత్తుల నట్లొనర్చుచుండును. ధర్మాధర్మములు భగవదేచ్ఛచేతనే పెరుగుచుఁ దరుగుచుండును.

శుకదేవుఁడిట్లనెను:— "రాజా ! ఈ ఋషభుని చరిత్ర మత్యంతమంగళమయమైనదియు, శిక్షాప్రదమైనదియును, పావనము, మనోరమమైనదిగనున్నది. దీనిని శ్రద్ధతో వినువారికిని, చెప్పువారికిని వాసుదేవుని పాదారవిందములందు భక్తి కలుగును. భక్తియే జీవునకు సాధ్యమైనది ఇదియే పరమ పురుషార్థము. ఇది లభించిన శాంతిసుఖములుకలవు. అందువలననే భక్తి ప్రవాహమునందు పండితులు తమ వివిధ పావజనిత సంతాపసంతప్తాంతః కరణమును నిరంతరము స్నానము చేయించుచుందురు. ఆ స్నానమువలన వారికి పరమశీతలతా ప్రాప్తికలిగి, ఆ మూలమున ధర్మార్థ కామముల మాటయేల? చివరకు భగవత్సేవా పరిచర్యాభావమగు మోక్షమునుగూడ తిరస్కరించెదరు. భగవతీ భక్తి భాగీరథిలో స్నానమొనర్చుటచే వారి సకల పురుషార్థములు సిద్ధింపఁగలవు.

## భరత చరిత్రారంభము

౩_౧

శ్లో॥ యోదుస్త్యజాన్దారసుతాన్సుహృద్రాజ్యం హృదిస్పృశః।
జహౌ యువైవ మలవదుత్తమ శ్లోకలాలసః ॥

(శ్రీభాగ. ౫. స్కం ౧౪. అ. ౪౩ శ్లో॥

వ॥ "మణిమయ నాభరణుండు శ్రీవత్స కౌస్తుభవనమాలాలంకృతుండును సుదర్శనాద్యాయుధోప లక్షితుండును నిజభక్తజన హృదయారవింద

నివాసుండును బరమపురుషుండును నైన వాసుదేవుని యందు నధికభక్తి
ననుదినంబును జేయుచు నేబది లక్షల వేలేండ్లు రాజ్యంబు సేసి పితృపితా
మహోపార్జితంబగు నా ధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచి
యిచ్చి బహుధనసంపదలుగల గృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె"

శ్రీమదాంధ్ర భాగవతము

మోక్ష మహత్వము మోక్షమును బొందినవానికే తెలియును. మోక్షమును బొందినవారు మోక్షసుఖ మిట్టిదని తిరిగివచ్చి చెప్పరు కాని కీర్తిసుఖము ననుభవించువారు చాలమంది కలరు. తనకుఁ గీర్తి కావలయుననియు, తన నామము శాశ్వతముగ నిలిచి యుండవలయునను కోరిక అందఱకునుండును. సాధారణముగ సార్వజనిక స్థానములందును, ధర్మశాలలందును, దారిలోని పాషాణముల మీఁదను బొగ్గుతోడనో తారుతోడనో తమనామమును జెక్కించుకొను చుందురు. కొందఱు స్మృతిచిహ్నము నేర్పాటుచేసికొని పాషాణ పటలములపైఁ దమనామములను జెక్కించుకొనుచుందురు. కొందఱు తమ పేరులతో పాఠశాలలు, గోశాలలు గ్రంథాలయములు, సత్రములు, భవనములు మొదలగువాటిని నిర్మించి తమకీర్తిని శాశ్వత మొనర్చుకొనఁ జూచుచుందురు. కాని వారు పొరబడుచున్నారు. ఎంతో ప్రయాసచే సంపాదించుకొనిన యీ శరీరము వలననే పేరునిలువకున్న నిక రాళ్లపై వేయించుకొనుటచే నిలుచునా? అయినను కీర్తికొఱకందఱును బ్రయత్నించుచుందురు. కొందఱు తనకీర్తికొఱకెంతగాఁ బ్రయత్నించినను గీర్తిరాదు, కొందఱేమాత్రము ప్రయత్నింపకున్నను అజరామరులుగ నుందురు. ఇది యదృష్టము. భగీరథుఁడు తన పిత

రులను దరింపఁజేయుటకై గంగను గొనివచ్చెను. దానిని
దీసికొనివచ్చుటకు అంశుమంతుఁడును, దిలీపుఁడును బ్రయ
త్నించి, తపస్సునుజేసి మరణించిరి; కాని యశస్సు భాగీరథు
నకు లభించెను. ఇప్పటికిని గంగను భాగీరథియనుట ప్రసిద్ధమే.
సాగరమును సగరుని యఱువదివేలమంది పుత్రులును గష్టపడి
త్రవ్విరి. కాని దాని పేరుమాత్రము సగరునకుఁ దక్కినది.
ఇప్పటికిని నెప్పటికిని సాగరమనియే పిలువఁబడును. ఇదే విధ
ముగ భరతుఁడును నట్లే పుణ్యశ్లోకుఁడును, యశస్వియు కీర్తి
మంతుఁడు నయ్యెను. ఆతని పేరటనే నీభరతఖండ మిప్పటికిని
బ్రసిద్ధినిఁ జెందెనది.

(శ్రీ) శుకమహర్షి యిట్లనెను:- "రాజా! ఋషభదేవుని
నూర్గురు పుత్రులలో భరతుఁడందఱికంటె జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁ
డునని నేనిదివఱకే చెప్పియుంటిని ఆతఁడు యువకుఁడు కాఁ
గానే ఋషభదేవుఁడాతనికి యువరాజ్యాభిషేక మొనర్చెను.
ఆతఁడు తండ్రికి రాజ్యకార్యములలో సహాయమొనర్చుచుం
డెను. ఋషభదేవుఁడు ఆతనికి విశ్వరూపుని కుమార్తెయగు
పంచజని నిచ్చి వివాహముకావించెను. పంచజనిని భార్యగాఁ
బొంది భరతుఁడు మిక్కిలి సంతోషించెను తనపుత్రుఁడు
సర్వగుణ సంపన్నుఁడనియుఁ బ్రజాపాలనము మిక్కిలి నైపు
ణ్యముగఁ జేయఁగలఁడనియు. దెలిసికొని, ఋషభదేవుఁడు తన
రాజ్యభారమునంతను నాతని కొప్పగించి, చిన్నపిల్లలను,
భార్యను నాతని కధీనముగావించి, అవధూత వృత్తినిధరించి
యింటినుండి వెడలిపోయెను.

తండ్రి గృహత్యాగము చేయఁగానే భరతుఁడే సమస్త అజనాభ ఖండమునకును రాజయ్యెను. ఆతఁడు ధర్మపూర్వకముగఁ బ్రజాపాలనమొనర్చుచు ననేకములగు వైదికానుష్ఠానములను, యజ్ఞయాగాదులను నొనర్చెను. పంచజని గర్భము నుండి భరతునకు సుమతి, రాష్ట్రభృత, సుదర్శన, అవరణ, ధూమ్రకేతువులను పేర నైదుగురు పుత్రులుద్భవించిరి. చేతికిఁ గల్గు అయిదు వేళ్లు కలిసి పనిచేయునట్లును, పంచభూతములు కలిసి యీ దృశ్య ప్రపంచమును రచించినట్లును, పంచజ్ఞానేంద్రియములు సమస్త తన్మాత్రలను వ్యక్తమొనర్చినట్లును, పంచప్రాణములన్నియును గలిసి యీ దేహమును నడుపునట్లు ఈ యైదుగురన్నదమ్ములును గలిసి భరతుని రాజ్యభారమునంతను జక్కఁగఁ బాలించుచుండెను.

భరతునకు శాస్త్రమర్మములన్నియును దెలియును. ఆతనికి రాజకర్తవ్యములన్నియు చాలబాగుగఁ దెలియును. ఆతఁడు తన ప్రజలను నౌరస పుత్రులవలెఁ బాలించుచుండెను ఆతఁడు చేయుచున్న కర్మల నన్నిటిని పరిభుష్త్రిత్వ నిష్కామముతోఁ జేయుచుండెడువాఁడు. ఆతఁడు ధర్మకార్యములలో విత్తశాఠ్య మొనర్చెడువాఁడుకాఁడు. ఆతఁడెల్లప్పుడును యజ్ఞయాగాదులలో లగ్నమైయుండి భగవదారాధన మొనర్చుచుండెడువాఁడు.

అంతబరీక్షిత్తు ఇట్లడిగెను:— "స్వామీ ! భరతునకుఁ గర్మఫలమందిచ్ఛ లేనపుడింత ఆడంబరముగ యజ్ఞములొనర్చ

వ్యర్థ ప్రయాసముపడనేల? ఆతనికి యజ్ఞములద్వారా స్వర్గము నకుఁబోవ నిచ్ఛలేదుకదా!"

ఇదివిని శుకుఁడిట్లనెను:- "మహారాజా! భరతునకు స్వర్గాపేక్ష లేదనుట సత్యమేకాని ఆయుగమందు యజ్ఞపతియగు వాసుదేవ భగవానుని వర్ణాశ్రమ ధర్మముద్వారా యజ్ఞ యాగాదులచేఁ బూజించు నాచారముండెను."

రాజిట్లనెను:- "స్వామీ! యజ్ఞములెన్ని విధములు?"

అంతశుకుఁడిట్లు ప్రత్యుత్తర మొసంగెను:- "రాజా! యజ్ఞములలో ననేక భేదములుకలవు. అయినను నన్నియు నాలుయజ్ఞములలో నిముడును నిత్యమును జేయఁబడు నిత్యాగ్ని హోత్రమది ప్రథమమును, బ్రధానమునగు యజ్ఞము-రెండవ యజ్ఞము పితరులనుద్దేశించి ప్రతి యమావాస్యకును జేయఁబ డును. పితృదేవతల కమావాస్య మిక్కిలిప్రియమైనది. కావునఁ బితరులనుద్దేశించి అమావాస్యకుఁ జేయఁబడు యజ్ఞమును దర్శయజ్ఞమందురు. దీనివలన నక్షయఫలములభించును. ఆదిన మునఁ గొంచెముగనో గొప్పగనో అన్నదానమును జేయవల యును. ప్రతిమాసములోఁ బూర్ణిమకు జేయు యజ్ఞమును బూర్ణ మాస యజ్ఞమందురు. నాల్గవయజ్ఞము చాతుర్మాస్య యజ్ఞము. వర్షాకాలములో నాల్గు నె ల ల వ ఱ కు ఒకేస్థానముననుండి విశేష ని య మ ము ల తో సంయమ స హి త ము గా జరుపు వ్రతోపవాసములు, చాతుర్మాస్య యజ్ఞమున కంగ ములు. వర్ణాశ్రమములు పాటించువారలకుఁ జాతుర్మాస్య యజ్ఞమావశ్యకము. ఈనాల్గింటిని నప్పుడప్పుడు సర్వదా చేయు

చుండవలయును. ఇవిగాక నింకఁబెద్ద యజ్ఞములుకలవు. వానిలో నొకటి పశుయజ్ఞము, రెండవది సోమయజ్ఞము. అవి యజ్ఞమనియుఁ, గ్రతువనియు రెండు విధములుగనున్నవి. పశువును బంధించుటకు స్తంభముగల యజ్ఞములను సాధారణముగ "యజ్ఞము"లందురు. ఈ స్తంభము లేనిదానిని 'క్రతు' వందురు. వానిలోఁ బ్రకృతి, వికృతి రూపమున రెండు భేదములుకలవు. సమస్తాంగములునుగల సాంగోపాంగ యజ్ఞములను ప్రకృతి యజ్ఞములందురు. న్యూనాధిక్యములుగనుండు యజ్ఞములను వికృతి యజ్ఞములందురు. యజమానుఁడు యజ్ఞములను హోత (ఋగ్వేదీయుఁడు) అధ్వర్యువు (యజుర్వేదీయుఁడు) ఉద్గాతా (సామవేదీయుఁడు) బ్రహ్మ (అథర్వవేదీయుఁడు) ఈ నల్గురు ఋత్విక్కుల సహాయముతో శ్రద్ధాపూర్వకముగ నిర్వహించును. సదస్సులు యజ్ఞమునందుండి చూచుచుందురు. ఈ విధముగ భిన్నభిన్నయజ్ఞాంగ క్రియలచే నెఱవేర్పఁబడును. ఏయజ్ఞమే దేవతనుద్దేశించి చేయఁబడునో నందులో నా దేవతకు బ్రాధాన్యముండును. మిగిలిన దేవతలకు సామాన్యముగఁ బూజింపఁబడుదురు. ఏ యజ్ఞమే యుద్దేశ్యముతోఁ జేయఁబడునో అందులో నాఫలములభించును. మరణించిన తర్వాత యజ్ఞకర్త తన భావనానుసారముగ నాయాలోకములకుఁబోయి ఆ ఫలములనుపభోగించును.

రాజిట్లడిగెను:— "ఎట్లైనఁ జేయనిండు యజ్ఞఫలమున స్వర్గము కలిగితీరునుగదా! మనమగ్నిని తెలియక తాఁకినను తెలిసి తాఁకినను కాలితీరునుగదా! ఇంక నిష్కామకర్మ

కర్థమేమి ? కర్మలన్నియును సకామముగనే యుండును. కోరిక లేక కర్మములందుఁ బ్రవృత్తి యసంభవము."

శుకమహర్షి యిట్లనెను:— మహారాజా ! నీవు చెప్పునది యథార్థమే. కర్మ ప్రవృత్తి కోరిక చేతనే యుండుననుట సామాన్య నియమము. అగ్నినిఁ దెలియక తాఁకినను దెలిసి తాఁకినను గాల్చుననుట నిక్కమే. కాని ఆకరకరాది కొన్ని ఓషధులుగలవు వాటిని యుక్తిగాఁ బ్రయోగించినచో నగ్నినిఁ దాఁకినచోఁ జేయికాలదు. అట్లే కర్మ నొనర్చుచున్నను ప్రభు ప్రాప్తికొఱకు చేయఁబడిన నిష్కామకర్మ బంధనహేతువు కాదు."

రాజిట్లనెను:— "స్వామీ ! ఇది నాఁ బుద్ధికందుటలేదు. యజమాని యజ్ఞచేయుచుండును. అధ్వర్యుఁడు చేతిలోనికి హవిస్సునుగొని "ఇంద్రాయస్వాహా" యని ఇంద్రుని కొఱకు వేల్చినచో దాని నింద్రుఁడు గ్రహించి భావనానుసారముగ ఫలమునొసంగును. యజ్ఞభాగమునుగొని యింద్రుఁడు యజమానికి స్వర్గము నొసంగును. స్వర్గమందు స్వర్గీయసుఖము లును, అప్సరసలతో విమానములందు విహారములును లభించును. హవిస్సును గ్రహించి యింద్రుఁడు స్వర్గమునొసంగుట కర్తవ్యమే కాఁగలదు. అట్లుకాకున్న యజ్ఞమొనర్చుట వ్యర్థమే కదా! ఇంక నిష్కామకర్మ యెచ్చటకలదు "

ఇదివిని శుకుఁడిట్లనెను:— "రాజా ! సమస్త కార్యము లందును భావనానుసారముగ ఫలము ప్రాప్తించును. ఎవని కెట్టి భావనయుండునో వానికట్టి ఫలముప్రాప్తించును. నీవెన్ని

గొప్పగొప్ప యజ్ఞములొనర్చినను జ్ఞానము లొసంగినను, ధర్మములొనర్చినను, నీభావము శుద్ధముగ లేకున్న సర్వమును వ్యర్థము కాఁగలదు. తల్లి, చెల్లెలు, పుత్రిక, భార్య వీరిశరీరము లన్నియు నొక్కరీతిగనే యుండును. అందఱి యవయవము లొక్కటిగనే యుండును కాని భావనానుసారముగ నొక్కతెతో నాలింగనము కావించినను ఫలములో మార్పుకనఁబడు చుండును. తల్లి నాలింగనము వేఱొక భావముతోఁ జేయుదుము. చెల్లెలు, పుత్రిక వీరి యాలింగనము ఇంకొక భావముచేతను, భార్యాలింగనము మఱియొక భావముచేఁ జేయు చుందుము. క్రియయొక్కటేకాని భావనా విభిన్నతచే ఫలమునందంతరము కలదు అదేవిధముగ భరతుఁడుయజ్ఞము చేయుచుండఁగాఁ గ్రియలు వేదమంత్రములన్ని యజ్ఞములలో వలెనే జరుగుచుండెడివికాని తన భావమును వేఱుగానుంచు కొనెడువాఁడు. ఎట్లనఁగా – ఆచార్యుఁడు మంత్రము ను "ఇంద్రాయస్వాహా" "సూర్యాయస్వాహా" యనినప్పుడు భరతుఁడిట్లు భావనచేయుచుండెడువాఁడు:- ఇంద్రుఁడెవఁడు? ఆతనికి సమస్త స్వర్గీయసంపత్తి నుపభోగించుటకును, రక్షించు టకును శక్తికలదు. ఐశ్వర్య సంపన్నుఁడు." ఇంద్రుని కిట్టిశక్తి యెచ్చటినుండి వచ్చినది? ఆతనిలో నైశ్వర్యమునకుఁగొంతెం యంశయేకలదు. ఐశ్వర్యమునకు స్రోత పరమదేవుఁడును పరబ్రహ్మము. యజ్ఞపురుషుఁడునగు వాసుదేవుఁడే కావున నింద్రస్వరూపుఁడగునేభగవానుఁడు కలఁడో ఆతనికీహావిస్సు

కడకు హావిస్సుపోయినప్పటికిని ఆతఁడు శ్రీహరియేయయ్యెను. మనమొక ఉత్తరమును వేఱొకరి జవాబుదారితోఁ బంపుదుము. ఉత్తరము మొదట అసలువానికిఁ జేరక, జవాబుదారునికే చేరును కాని దాని నాతఁడుంచుకొనఁడు. అది తనకడకు వచ్చినను అది తనది కాదని బాగుగాఁ దెలియును. తర్వాత దానినసలు చిరునామాదారునకే యొసంగును. అట్లే భగవద్భావనతో నేదేవతకు హావిస్సు నొసంగినను నది భగవంతుని కడకే చేరును. ఇట్లే అన్యదేవతల విషయములోను దెలిసికొనవలయును. "సూర్యాయస్వాహా" సూర్యునికార్యము ప్రకాశమొసంగుట. సూర్యునకుఁ బ్రకాశమెచ్చటనుండి వచ్చినది? భగవంతునినుండి. అందుకనియే సూర్యుని విరాట్పురుషుని నేత్రముగఁ జెప్పినారు. సూర్యునుద్దేశించి హావిస్సునొసంగినచో నాతఁడు సూర్యుని నేత్రముగాఁగలిగిన వానికే యాహుతి చెందవలయునని భావించుచుండెడువాఁడు. ఇట్టి భావనచేఁ జేయఁబడినకర్మను నకైతవకర్మయందురు. కొంచెమునొసంగి గొప్ప ఫలము నాశించుటను కైతవకర్మయందురు. "ఓ దేవా! నేనీఫలమును నీ కర్పించితిని. దీనివలన నా కోరికలన్నియు అనఁగా జన్మజన్మాంతరములలోని వన్నియును బూర్తికావలయును" అనునట్లుండును కైతవకర్మ. ఇట్లు చేయఁబడిన కర్మను సకామకర్మ యందురు. ఈకర్మలవలనసంసారబంధనములింకను దృఢపడును. నిష్కామకర్మముచే నంతఃకరణశుద్ధి కలుగును. శుద్ధాంతఃకరణమందు పీతాంబరధారియు, వనమాలియు, శంకచక్రగదా పద్మధారియు మురారియు, శ్రీవత్స చిహ్న మధ్యమందు కౌస్తుభమణి వెలుగుచుండ హృదయాంధకార

మును బోఁగొట్టుచుఁ బ్రకాశించును. సర్వవ్యాపకుఁడును, బురాణపురుషుఁడునునగు ప్రభువు హృదయము నందావిర్భవించినచో నీకఁజెప్పవలసిన దేమున్నది? దినదినమాతని చరణారవిందములందు భక్తి ప్రవృద్ధినిఁ జెందును. అట్లు ప్రవృద్ధిని జెందిన భక్తి సమస్తాశుభకర్మ బంధనములను ఛేదించి జీవుని భగవంతుని సమీపమునకుఁ గొనిపోవును. తదీయునిఁగా నొనర్చును. కాఁబట్టి రాజా! ఈ భావనచేతనే భరతుఁడు యజ్ఞయాగములను జేయుచుండెడువాఁడు."

ఈ విధముగ భరతుఁడు నిష్కామ కర్మలొనర్చుచుఁ బదివేల సంవత్సరములవఱకు భూమిని పరిపాలించెను. రాజ్యమును భోగించు ప్రారబ్ధ మాతనికి సమాప్తియైనదని ఆతఁడు గ్రహించెను. ఆతనికి రాజ్యభోగము లందాసక్తి లేనే లేదు. కాని ప్రారబ్ధ కర్మమైన నశించునను భావముతో నాతఁడు రాజ్యభోగము లనుభవించుచుండెను ఈ ప్రారబ్ధభోగము క్షయమై పోఁగానే ఆతఁడు గృహమును ద్యజించి వనమునకుఁ బోయి తపస్సు చేయఁదలఁచెను.

## భరతుఁడు పులహాశ్రమమునఁ దపంబొనర్చుట,

3_౨_౨

శ్లో॥ పరోరజః సవితుర్జాత వేదో
దేవస్య భర్గో మనసేదం జజాన ।
సురేతసాదః పునరావిశ్య చష్టే
హంసం గృధ్రాణం నృషద్రింగి రామిమః॥
(శ్రీ)భాగ. ౫. స్కం ౭. అ. ౧౪ శ్లో॥

సీ॥ కర్మ ఫలంబులఁ గడఁక నిచ్చుచు మనో
వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములఁ జేసి యాలోకములకు నంతర్యామి
యగుచుఁ బ్రవేశించి యంత మీఁద
నానందరూప మైనట్టి బ్రహ్మముఁ గోరు
చున్న జీవునిఁ దన లోని యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలన సేయు
చుండి యంతటను మార్తాండ మధ్య
గీ॥ వర్తియగుచు నిట్లు వఱలుచు జగముల
యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నఘుల దివ్యమూర్తియైన యానంద రూ
పమును శరణ మొందె భరత విభుఁడు॥

శ్రీమదాంధ్ర భాగవతము.

జీవునకుఁ బ్రధాన కర్తవ్యము శ్రీకృష్ణకైంకర్యము. కృష్ణ కైంకర్యముగాక మానవుఁడింకేమి యొనర్చినను వాఁడు తన చేతులతోఁ దన్నుఁగట్టి వేసికొను చున్నాఁడనవలసినదే. శ్వాసశ్వాసకుఁ గృష్ణ కృష్ణ యనవలెను. నోటఁ గృష్ణనామమును దప్ప యింకొకటి పలుకరాదు. కృష్ణనైవేద్యముకాని అమృతమునైనఁ ద్రాగరాదు. కృష్ణకథనుగాక అన్యశబ్దమును వినరాదు భగవత్ప్రతిమలను, భాగవతులను గాక అన్యమును జూడరాదు. కృష్ణ నిర్మాల్యమునుదప్ప దేనిని నాఘ్రాణింపనురాదు, చేత స్పర్శింపనురాదు. ఇది సిద్ధాంతము ఇంతకు సారాంశమేమనఁగా దేనినిఁజేసినను, ఏది తిన్నను, ఏది త్రాగినను, ఏ యజ్ఞాది శుభకర్మలొనర్చినను, సువర్ణ,

గో, భూ, అన్న, వస్త్ర ధనధాన్యాది దానములొనర్చినను కృష్ణ
ప్రీత్యర్థముగఁ జేయవలయును, ప్రారబ్ధవశమున సంసారమున
నుండి వివశతతో సాంసారిక భోగముల ననుభవింపవలసి
వచ్చినచో నాయన నిట్లు ప్రార్థించుము:- "ప్రభూ ! నన్ని
కర్మలనుండి విముక్తునిఁ గావింపుము. నన్ను దాసునిఁగ భావించి
స్వీకరింపుము. దీనహీనుఁడనగు నన్ను నీపాదపద్మముల కింకరు
నిఁగా నొనర్చుకొనుము." ఈ సాంసారిక భోగముల నెంత
శీఘ్రముగ నెంతమాత్రిగా వదలునో అంతగా సాధ్యమైనంత
త్వరగా వదలుటకుఁ బ్రయత్నింపవలయును. దీనివలన జీవునకుఁ
గల్యాణముకలదు. ముక్తికి సరళ సుగమ మార్గమిదియే.
ఇదియే ప్రభుప్రాప్తికిఁ బునీతమగు మార్గము.

శ్రీ శుకమహర్షి యిట్లనెను:- ''రాజా! భరతుఁడు తన
రాజ్య సుఖములనుభవించు ప్రారబ్ధమైపోయినది, ఇఁక దివ్య
రాజ్యముఁకొఱకు ప్రయత్నింపవలెనని భరతుఁడు జ్ఞానదృష్టిచేఁ
దెలిసికొనఁగానే తనపుత్రుల నైదుగురను బిలిచి, ధర్మమర్మము
లనుజెప్పి, తాను వనమునకుఁ బోవనిశ్చయించెను ఇట్లు
పుత్రులకుఁజెప్పి, సమస్త విషయములనుజెప్పి సమస్తరాజ్య
మును తృణమువలెఁ త్యజించి, ఆజ్ఞాకారులును, సుశీలురును,
సుందర సుకుమారులును, మృదు భాషులును, వినయశీలురు
నగు బుత్రులపై మోహమును త్యజించి భార్యను పుత్రుల
కప్పగించి యాతఁడింటినుండి బయలుదేరెను.

భరతుఁడు త్తరమునకుఁబోక తూర్పుగఁబోయెను. గండకీ
భాగీరథీ సంగమస్థానమునకుఁ బోఁగానే ఆతని మనస్సచ్చట
లీనమయ్యెను. చక్రినది యందాతఁడనేక చిహ్నములుగల

శాలగ్రామ శిలలనుగాంచెను శాలగ్రామశిలలలో ననేక భేద ములుకలవు. రెండువైపులను నాభివలె చక్రాకార చిహ్న ములుకలవి చాలగనుండును. కొన్ని పెద్దవిగను గొన్ని చిన్నవి గను నుండును. కొన్నిటికి రంధ్రములుండును, కొన్ని యుబ్బె త్తుగనుండును. కొన్నిటికి అవతారచిహ్నములుండును. కొన్ని గుండ్రముగనుండును. వీనిని హిరణ్యగర్భములందురు. ఇవన్నియును గండకీ యందువైపైనఁ గొట్టుకొని వచ్చుచుండును. అచ్చట నొక ఋష్యాశ్రమము శిథిలమైనదానిని భరతుఁడు కాంచెను. అడిగి తెలిసికోఁగా నచ్చట బ్రహ్మపుత్రుఁడగు బులహుఁడు తపస్సుచేసి యుండెననియు, నది పులహాశ్రమ మనుపేరఁ బ్రసిద్ధిచెందినదనియుఁ దెలిసెను. భరతుని మనస్సా పునీత హరిహర క్షేత్రమున లగ్నమయ్యెను. ఆతఁడు పులహా శ్రమోపవనమున నొక యేకాంత స్థానముచుజూచుకొని నివ సించుచుండెను. ఆతఁడొక పర్ణకుటీరము ను నిర్మించుకొనెను. ఆతఁడు చక్కని శాలగ్రామమూర్తిని పీఠముపైనుంచి శ్రద్ధా భక్తులతోఁ బూజాదులొనర్చు కొనుచుండెను. ఆతఁడిప్పటి వఱకును జక్రవర్తియగుటచే నంతఃపురములో నాతనికి వేల కొలఁది దాసదాసీజనములు సమస్త కార్యములను సమకూర్చు చుండిరి అందువలన నాతని కేసేవా కార్యమొనర్చుటకును నభ్యాసము లేకున్నను భగవత్సేవకై ఆతఁడు స్వయముగ సమస్త సంభారములను గూర్చుకొనుచుండెను. వనమునకుఁ బోయి యాతఁడచ్చటనుండి మంచి మంచి పుష్పములను, పచ్చని తులసిని, కోమలమగు దూర్వను భగవత్పూజకై చేయుచుండెనువాఁడు. నైవేద్యముకొఱకు వృక్షములందు

పక్వమైనట్టియు, నపక్వమైనట్టియు ఫలములను, త్రవ్వుకొని కందమూలములను దెచ్చుకొనెడువాఁడు. స్వయముగ గండకీ జలములను దెచ్చుకొని సర్వకార్యము లొనర్చెడువాఁడు.

ప్రాతఃకాలమున లేవఁగానే విష్ణుస్మరణ మొనర్చి, శౌచస్నానాది కర్మలు పూర్తిగావించుకొని సంధ్యావందనమును గావించును. అనంతరమాతఁడు భగవత్పరిచర్యలో లగ్నమగును. షోడశోపచార పూజనుగావించి కందమూల ఫలపుష్పాదులను, జలమును, తులసీపత్రాదులను సమర్పించి నిరంతర మాతని ధ్యానములో నిమగ్నుఁడగును. ఈ విధముగఁ బ్రేమతోఁ బూజలొనర్చుటచేత నాతని యంతఃకరణము సర్వథా కామనా రహితమై శాంతమయ్యెను. ప్రేమతో నాతఁడు పూజాదులొనర్చునపుడు హృదయమానంద పరిప్లావితమై ప్రేమసమాధి వచ్చుచుండెడిది. ఆతఁడునిత్యము నవ్యగ్ర భావముతో శ్రద్ధతో భగవత్పూజను జేయుచుండెడువాఁడు. నిత్యనూతనముగ వృద్ధిపొందుచున్న అనురాగ కారణమున నాతని హృదయములోని కాఠిన్యము తగ్గిపోయెను. అంతఃకరణము మైనమువలెఁగరిగి, నవనీతముకంటె నధికముగఁ గోమలమయ్యెను. ప్రభుప్రేమలో ద్రవీభూతులైన భావుక భక్తులు లౌకిక వ్యవహారమున కయోగ్యులగుచుందురు. భగవచ్చర్చ జరిగినచోట వారి హృదయములోని యానంద స్రోత ఉప్పొంగిపోవును. సమస్తశరీరము రోమాంచమగును. నేత్రములనుండి జలజల ప్రేమాశ్రువులురాలును. ఇట్టి దృశ్యము అదృష్టముచేతను, అనేక జన్మలలోని పుణ్య విశేషముచేతను బ్రాప్తించును. భరతునకిట్టిస్థితికలిగెను. ఒక్కొక్కప్పుడాతఁడు

ప్రేమమగ్నుఁడై శరీరము తెలియక ప్రపంచపుగోడే తెలియకుండును కంఠము గద్గదికమగును. నేత్రములలో నీరుక్రమ్ముటచే దృష్టి ఆగిపోవుచుండెడిది. ఎదుటనున్న వానినిఁగూడ ఆతఁడుచూడలేక పోయెడువాఁడు.

కొంతకాలమున కాతనిస్థితి యింక నున్నతముగఁ బోయెను. ఆతఁడు పూజనొనర్చుచుఁ దన్నుదాను మఱచెడువాఁడు ఆర్ఘ్య మిచ్చుచుండిన గంటలకొలఁది అట్లె చేతిలో నర్ఘ్యముంచుకొని కూర్చుండెడువాఁడు. పుష్పమర్పించిన తర్వాత మఱల పాద్యార్ఘ్యాచమనముల నొసంగెడువాఁడు. ధ్యానని మగ్నుఁడై నప్పుడు పూజాక్రమమును మఱచుచుండెడువాఁడు.

అంతఁబరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! చాల విషయములను స్మృతిహీనుఁడగు జడుఁడుకూడ మఱచుచుండును ఆతఁడును మహాత్ముఁడగునా?"

ఇదివిని శుకుఁడిట్లనెను:- "కాదు, రాజా ! వాడు తమోగుణాధిక్యముచే స్మరణయుండదు. ఘోర తమోగుణమును, సత్త్వగుణస్థితిని దూరమునుండిచూచిన నొక్కటిగనే కనఁబడును. తమోగుణుఁడాలస్యముచే నిశ్చేష్టుఁడుగనుండును, సత్త్వగుణుఁడును నిష్క్రియుఁడుగనుండును, కాని ఒక స్థితి అజ్ఞానజన్యమైనది, రెండవది జ్ఞానజన్యమైనది. జడమతి యగువాఁడు బుద్ధిన్యూనతచేఁ దమఃప్రభావముచే విషయములను మఱచును, కాని భరతునివంటి భగవద్భక్తుఁడు తనకుఁబరమ ప్రేమాస్పదుఁడగు శ్యామసుందరుని అరుణచరణ కమలములను నిరంతరము ధ్యానముచేయుటచేఁగలిగిన భక్తియోగము

ద్వారా పరమానందామృత గంభీర సరోవరములో బుద్ధిని నిమగ్నుఁడగుటచే బాహ్యక్రియలే యేమిటని, తననే మఱచి పోయెను. ఆతఁడానందానుభవ మొనర్చుచుఁ దదూర్ధ్వపుఁడగు చుండును అట్లుభరతుఁడు బాహ్యపూజనుమఱచి పూజ్యపాదుప పాదపద్మధ్యాన రూపార్చన మందుననే తల్లీనుఁడగుచుండెను.

ఆతఁడు వనమునందుండి మునివ్రతపాలన మొనర్చు చుండెను. ఆతఁడు రాజస వస్త్రములను త్యజించి, వల్క వస్త్రములనుధరించి, ఇఱ్ఱి చర్మమునుబైన వేసికొనుచుండెను. అడవిలో రాలిన ఫలములనేఱి తెచ్చి భగవంతునకు నైవేద్య మిడి ప్రసాదమును దీసికొనెడువాఁడు ఆతనినల్లనల్లని వెండ్రు కలకు చమురు రాయకపోవుటచే నొకటొకటి అంట కట్టుకొని జడలుగనయ్యెను. అవి ఆతని తేజోముఖముసఁ బడినపుడు చంద్రునిలోని అమృతమును ద్రాగుటకు మూఁగిన కాలసర్ప ములవలెనుండెను. సూర్యుఁడుదయించఁగానే ఆతఁడు సూర్య సంబంధమగు ఋక్కులను బఠించి హిరణ్య పురుషోత్తముఁడగు సూర్యనారాయణుని సమ్ముఖమున నిలుచుండి ప్రార్థించు చుండును. అతనిని శరణువేఁడి ఆతనిగుణములను గాన మొన ర్చును. ఆతని మహాత్మ్యమునుగూర్చి పలుకుచుండును. ఈ విధ ముగ తేజస్స్వరూపుఁడగు నారాయణుని ధ్యానించుచు నాతని శాపనములోఁ జాలదినములు గడిచెను.

# భరతుఁడు — మృగశాబకము

౩-౨౩

శ్లో॥ నిత్యం దదాతి కామస్య - చ్ఛిద్రం తమను యేఽరయః।
యోగినః కృతమైత్రస్య - పత్యుర్జాయేవ పుంశ్చలీ ॥
(శ్రీ)భాగ. ౫ స్కం. ౬ అ. ౪ శ్లో॥

క॥ చిరకాల తపము నైనను
హరియింపఁగ నోపుఁ జిత్తమని పెద్దలు న
మ్మరు జారునకున్ జారిణి
కరణిని నడరించు మనసు కామాదులకున్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఈ మనస్సులో ననేకములగు సంస్కారములుండును. వాటికిని గాలమునకును సంబంధముండును ఏకాలమున దేనితోటి సంబంధము జాగ్రుతిని జెందునో అది తెలియదు. మేడలను వదలిన వారు ఒక చిన్న గుడిసె కొఱకు పోరాడుకొనుచుందురు. ఇంట రంభలవంటి యింతులుండఁగ సానుల యిండ్లకు చవటలేగుచుందురు ఇది దైవవిధికాక యేమనవలెను? జీవుఁడీ ప్రారబ్ధమున కవశుఁడగును. నిన్నటివరకే వస్త్రమును హేయముగఁ దలంచుచుంటిమో అట్టిదానిపై నేఁడు సంస్కారాధీనమై ప్రీతి కలుగుచుండును. తనదేనను భావము కల్గుచుండును. ఇప్పటికి మనస్సు వశమైనది. సాధన యవసరము లేదను నిశ్చయము లేదు. బ్రతికి యున్నంతవఱకు ఈమనస్సును నమ్మరాదనియు, సర్వదా దీనిపై నంకుశము నెక్కుపెట్టి యుండవలయుననియే సిద్ధాంతము. దీని పగ్గము ను గొంచెము సళ్ళువిడిచితిమా అది యెగిరి గంతులిడును. అనిత్యత్వమును, అప్రియమందు ప్రియత్వమును, పరత్వమునందు నిజత్వమును భావించుచుండును.

శ్రీశుకుఁడిట్లనెను:- "రాజా! భరతుఁడు వానప్రస్థాశ్రమములోనుండి యమనియమములను పాలించుచు భగవత్పరిచర్యయందు నిమగ్నుఁడై యుండెను. ఆతనికి ప్రపంచమును మఱచునంతటి యుచ్చావస్థకలిగెను."

ఒక దినమున భరతుఁడు చేతిలో జలపాత్రనుగ్రహించి కక్షమునందు కుశాసన మృగచర్మ వల్కలములను ధరించి గండకికి స్నానముచేయఁబోయెను. అరుణోదయ సమయమగుటచే వృక్షముల మీఁదనున్న పక్షులు కలకలారవము లొనర్చుచుండెను. భువన భాస్కరుఁడు తనరాకను దెల్పుట కో యనునట్లు ముందుగాఁ దన సారథియగు నరుణునిఁ బంపెను. గండకీ జలము మంథరగతి గంగ లో నికిఁ బ్రవహించుచుండెను. ఆశాంత సమయమున రాజర్షియగు భరతుఁడు సరితాకూలమునకుఁ జేరుకొనెను. గండకీ పశ్చిమతటమున నాసనవల్కలముల నుంచి స్నానసంబంధమగు మంత్రములనుజపుచు, సంకల్పము నొనర్చి, మృత్తికతో విధ్యుక్తముగ స్నానమొనర్చెను. స్నానమొనర్చి యాతఁడు ప్రాతఃకాల సంధ్యార్ఘ్యము నొసంగెను. ఇంతలోనే ఆకాశముయొక్క తెలిమఱుఁగుననుండి మరీచిమాలియగు సూర్యుఁడు జగత్ప్రాణులను గదలించుచుండెను భరతుఁడుపస్థానముద్వారా సూర్యుని సత్కరించి, మరల జలములోనే నిలువఁబడి మూఁడు ముహూర్తముల వఱకు ఏకాక్షర ప్రణవమంత్రమును శాంతచిత్తముతో జపించుచుండెను ఆతఁడు కన్నులను మూసికొని నదిలోనిలుచుండి భగవద్ధ్యానములో మునిఁగియుండెను. బ్రహ్మవాచక

మగుఁ బ్రణవమును జపించుచు నాతఁడు దాని యర్థమును నవ్యగ్రభావముచే భావనచేయుచుండెను. ఆ సమయముననే అతఁడు కన్నులను దెఱచెను. కన్నులను దెఱవఁగానే ఆతనికొక గావుపాటి హరిణము భయభీతయై అటునిటు బిత్తరిచూపులు చూచుచుఁ గనఁబడెను. శంకితచిత్తముతో స్వభావమున భీరువగు నా హరిణము చెవులు నిక్కఁబొడుచుకొని యేదియో వినుచున్నట్లుండి, మరల మెల్లమెల్లగా సరితాసమీపమునకు వచ్చి సుస్వాదు సలిలమును పానముచేయసాగెను. అది చిరకాలము బాగుగా దప్పిక చెందినదనియు, నేదియో అఘటిత ఘటనచే నది తనగుంపునువదలి వచ్చినట్లుండెను. గండకీ మధురజలమునది పొట్టనిండుగఁ ద్రావెను. అధికజలమును ద్రావుటచే దానిడొక్కలు రెండును నుబ్బి, మామూలుకంటె నెక్కుడుగనుబ్బెను. దానిలావువలన నది గర్భిణీయనియు, నది యల్పకాలముననే ప్రసవించుననియుఁ దోఁచుచున్నది. చంచలనేత్రముకల ఆహరిణమును భరతుఁడట్లేనిలిచి చూచుచుండెను. నోట నేకాక్షర మంత్రమును బలుకుచుండెను, దృష్టి యామృగముపైననేయుండెను. ఒకసారి నీరుద్రావి, అదియిటు నటుఁజూచి మరల నీరు త్రావసాగెను. దశదిశలను బ్రతిధ్వనింపఁజేయు భయంకర సింహగర్జారవము దానికి వినఁబడెను. మృగములు స్వాభావికముగ భీరువులు, అందులో నేకాకి. అకస్మాత్తుగ సింహగర్జనము వినఁబడఁగానే అదరిపడి కింకర్తవ్యతా విమూఢయయ్యెను. సింహము తనపైకే దుముకుచున్నట్లు దానికిఁదోఁచెను. ఆత్మరక్షణమునకేమియు నుపాయముతోఁచక తనశక్తికొలఁది ఒక్కదుముకు దుమికెను.

మునుఁకున గండకి శావలియొద్దునకుఁ జేరినచో సింహాభయము
కనుండదనుకొనెను. సింహాయావలి యొద్దునకు రాఁజాలదని
దానినమ్మకము. ప్రాణము మీఁదకు వచ్చినప్పుడు ప్రతిజీవియు
తన బలమునంతను జూపించి ఆత్మరక్షణమునకుఁ దలపడును.
పాపమది బలముకోలఁది యెగిరినదికాని ఆ కదలికకు గర్భ
ములోనున్న శిశువు తనస్థానమునుండి తప్పి యోనిద్వారము
నుండి బయలువెడలి నదిలోఁబడెను. హరిణము తనశక్తినంతను
జూపుటచేతను, గర్భపాతమగుటచేతను మూర్ఛచే నొక పర్వత
గుహాయొక్క పాషాణమునకుఁదగిలి చనిపోయెను.

భరతుఁడీ చరిత్రమునంతను దనకన్నులతోఁ జూచుచుం
డెను. ఆతఁడు చచ్చిన హరిణమును జూడలేదుకాని తీక్ష్ణనదీ
ప్రవాహములోఁ గొట్టుకొని పోవుచున్న మృగశాబకమును
గాంచెను. చూడఁగానే ఆతనికి దయకలిగి, ఆలోచింపకయే
గబగబ పరువిడి, కొట్టుకొని పోవుచుండిన నా లేడిపిల్లను బట్టు
కొని, అమాయకమగు నా మృగశిశువు నీవలకుఁదీసికొని
వచ్చెను. అది రాజర్షిని దీన దృక్కులతోఁజూచు చుండెను.
అనాథయగు నా హరిణశాబక భయభీత కాతరదృష్టినిఁగాంచి
భరతుని హృదయము దయతో నిండిపోయెను. ఆతఁడు తన
వల్కలవస్త్రములతో నాపిల్లను తుడిచి, దానితల్లిని వెదుక
బోయెను. దగ్గఱనే చచ్చిపడిన హరిణమునుగాంచి రాజర్షి
యిట్లు చింతించెను. "భగవంతుఁడు నాకీహరిణశాబకమును
దీనహీనావస్థలో నప్పగించినాఁడు. దీని నేనెవరికి నప్పగింప
వలెను? దీని నొంటరిగ నిచ్చట విడిచిపోయినచో సింహ

వ్యాఘ్రములు తినివేయఁగలవు. పోనిండు. వానినిఁదప్పించు కొనినచో నేవ్యాధుఁడైనను బట్టుకొని, కోసి అమ్ముకొనఁ గలఁడు. ఏమిచేయుదును. దీనిని రక్షించుట కొక్కటే యుపాయముకలదు. దీని నాశ్రమమునకుఁ గొనిపోయెదను. పెద్దది కాఁగానే వదలిపెట్టెదను. ఈ యరణ్యములో దీని కాధారము నేనే. ఆత్మీయ స్వజనులవలె దీనిని నేను బోషింపవలయును. పిల్లలు స్వభావముగ ముద్దుగనుండును. అందులో దుఃఖములో నున్నది విపత్తులపాలైనది. అప్పుడే పుట్టినమృగశాబకమాయెను. భరతుఁడు దానిని మిక్కిలి స్నేహముతోఁ బోషించుటకై తన యాశ్రమమునకుఁ గొనిపోయెను వెళ్ళియాతఁడు జలపాత్రమును గ్రిందనుంచి, వల్కల వస్త్రముల నావలఁ బారవైచి, చంకనుండి జింకపిల్లనుదించెను. ఎండలోఁ గూర్చుండఁబెట్టి దానిశరీరమును వెచ్చనొనర్చెను, చేతులతో గీరి, దగ్గఱలోనున్న లేలేత పచ్చికను దానినోటికందించుచుండెను. ఆ మృగశాబకము నాలుకతో లేఁబచ్చికను నాఁకి నమిలిమ్రింగెను. భరతుఁడు తన కుటీరములో నొకమూల నెండుగడ్డిపైఁ బరుండఁబెట్టెను. సాయంకాలమున నీళ్లు పెట్టఁగా నదిత్రాగెను.

రెండవదినమున మరల భరతుఁడు గడ్డినిఁబెట్టగా దానినిఁదినెను ఇప్పుడది గడ్డిని దినసాగెను. రెండుమూఁడు రోజులలోనది యిటునటుఁదిరుగుచు దానంతట నదియే కొఱకి తినసాగెను. ఇప్పుడు భరతునకానందమయ్యెను. ఇచ్చట శాంత ఏకాంతారణ్యమందొక యమాయకపు తోడు దొఱకెను.

ఆడుకొనుటకు సజీవ సుందర వస్తువు ఆడుకొనుటకు లభించెను. ఆతఁడు దానిని వడిలోనికిఁ దీసికొని ఆడుకొనసాగెను.

భగవచ్చింతనములో మనస్సును లగ్నమొనర్చినను, మనోరంజనము కొఱకు ఆత్మీయులను బోషించుటలో వినియోగించినను మనస్సే కారణము. ఇదివఱకు భరతుఁడు లేవఁగానే భగవత్పూజా జపధ్యాన సమాధులందే యుండెడువాఁడు. ఇప్పుడో లేవగానే మృగశాబకపోషణచింతయే. ఇదియేల చిక్కిపోయినది? దీనికిజబ్బేమిచేసినది. ఇది దానితల్లిని మఱచునట్లుగాఁ బ్రేమను బ్రదర్శింపవలయును. ఇది ప్రేమాధారముననే బ్రదుకవలెను. ఈ యనాథకుఁ బుట్టినప్పటినుండియుఁ బ్రేమ లభింపలేదు. కావున దీనిని నేను బ్రేమలోముంచి వేసెదను. ఈ యరణ్యమందు భగవంతుఁడు నాకొకతోడును బంపినాఁడు కావున నేను నా హృదయ ద్వారమును దెఱవవలెను." అని యిట్లు భావించి దానిని ముద్దుపెట్టుకొని, ముఖమున నిమిరి నోఁకి, దానినోటిలోఁబచ్చని గడ్డినిఁదీసికొనివచ్చి పెట్టిమేఁపుచుండును. ఇప్పుడుదానికి చిన్నచిన్న కొమ్ములువచ్చినవి అది ఆ కొమ్ములతో నెమ్మదిగాఁ బొడిచి తలను తీసికొనిపోయి ఆతని వడిలోఁబెట్టును. వినయవంతుఁడగుఁ బుత్రునివలె నది యాతని వెంటఁదిరుగును. ప్రాణి యెవరిప్రేమను సంపాదించుకొననో ఆతఁడు వారికి అమ్ముడుపోవును. ఈ విధముగ భరతుఁడా హరిణశాబకమందు మోహపరవశుఁడై, భగవద్భజనమును గౌణముగనెంచి, దానినిఁ బోషించుటయే ముఖ్య కర్తవ్యముగ భావించెను. ఇదివఱకు నూఱునూఱులు జపించెడువాఁడు. తర్వాతఁ గొన్నాళ్ళకు ఏఁబది మాలలు, తర్వాతఁ

బదిమాలలు, ఆ మీఁద నైదుమాలలు  వివరకు జపసంచివియే పోయెను. యమనియమాదుల నన్నిటిని మఱచి పోయెను. మా బుజ్జిబాబు, మాకన్నతండ్రి, అని దానిని లాలించుట లోనే ఆతనికిఁగాలము గడుచుచుండెడిది.

ఇది విని శౌనకుఁడిట్లనెను:_ "సూతా! మృగశాబకము మూలమున భరతుఁడు యమనియమముల నేల విడిచెను ఆశ్రమములో ననేక పశుపక్ష్యాదులుండునుగదా! అట్లే యీ హరిణశాబకమును నుండవచ్చును. దీనికొఱకై భజన పూజనముల మానవలసిన పనియేమున్నది?"

అంత నవ్వుచు సూతుఁడిట్లనెను:_ "స్వామీ! జీవుని స్థితి ఒక్కరీతిగా నుండదు. అది అభ్యున్నతి స్థితికినిఁబోవును, బతనమును జెందును. సాధారణముగఁ బతనమునకే పోవును. కఠినముగ నియమములను బాటించుచో నున్నతికలుగును. కొంచెముగ నియమములు సడలెనా అవి నిలువవు. మనస్సెల్లప్పుడును బ్రవహించుచుండును. సంసార ప్రవాహమునఁబడి ప్రవహించుట జన్మజన్మాంతరముల స్వభావము. దానిని నేర్ప వలసినపనిలేదు. దానిని భగవన్ముఖముగాఁ జాలప్రయత్నముతోఁ గష్టముగ, జేయవలసియుండును. నీరు పల్లమునకుఁ బారునుగాని, మెఱకకుఁ బ్రవహింపదు, అట్లే నియమములను గొంచెముగ సడలించితిమా బతనమార్గమునే పట్టును. తన గుడ్డల శుభ్రతమీఁదనే లక్ష్యముంచుకొనెడువాఁడు నిరంతర మాసిపోకుండుటకుఁ బ్రయత్నించును అట్లే ఆతఁడు వస్త్రములను శుభ్రముగ నుంచుకొనును; కాని కొంచెము మఱికిదైన

దానినుపేక్షను జేసితిమా ఆ స్వచ్ఛత పోయితీరును. ఎటులనో ముక్తి కైనది, అవసరమైనపుడుదుకుకొన వచ్చునులే యను కొనెనా, దుమ్ము ధూళిలోనైనను నట్టే కూర్చుండును. ఒక్క సారి నియమమును వదలితిమా మానవుడు పతనమైతీరును. ఈ విషయమందు మీకొక దృష్టాంతమును జెప్పెదను."

ఒకానొకడు ఒకానొక సన్న్యాసి మాంసమును దినుటను గాంచెను. అతడత్యంతాశ్చర్యముతో "సాధు సన్న్యాసి వయ్యు మాంసమును దినుచుంటివేల" యని యడిగెను.

అతడు మిక్కిలి యుపేక్షా స్వరమున నిట్లనెను– "అయ్యా! తినుచున్నాను; కాని మాంసము రుచి సారాయితోఁ గూడిననే తెలియును. సారాయి లేక మాంసము రుచి తెలియనే తెలియదు."

ఆవ్యక్తి నిర్ఘాంతపడి యిట్లనెను:- "అయ్యా ! మీరు సురాపానమునుగూడ చేయుచుందురా ?"

ఆసాధువు వివశతాస్వరమున నిట్లనెను:–" నేను సురా పానమును జేయుటలేదు. ఒంటరిగా నుండిన నానందము రాదు. వేశ్యలకడకుఁబోయి, అందఱతోఁగలిసి త్రాగినచో మిక్కిలి సుఖముకలుగును."

ఆ వ్యక్తి నెత్తి బాదుకొనుచు నిట్లనెను:- "నిర్లజ్జకును నొక పరిమితి కలదు. స్వామీ ! మీకేపుకర్మలును బాధిం చుటలేదుగదా ! నాకాశ్చర్యమేమనఁగా వేశ్యలు డబ్బులేక మాటలాడనైనను మాటలాడరే. మీబోటివారికి డబ్బెచ్చటి నుండి రాఁగలదు?"

సాధువు దీర్ఘ నిశ్వాసమును విడుచుచు నిట్లనెను:- "నేను నౌకరి చేయను వ్యాపారమును జేయను నాకు పొలము లేదు. డబ్బవసరమే. కావున దొంగతనమును జేయుదును. జూదము నాడెదను; దానిమూలమున వచ్చిన డబ్బుతో నా వ్యసనములను బూర్తిగావించుకొనెదను."

ఆ వ్యక్తి యేవగింపుతో నిట్లనెను:. "ఛీ! ఛీ! రామ! రామ! సాధువేషమును వైచికొని దొంగతనమును జేయుదువా? ఇంతటి పాపమా?"

వివశతాస్వరమున సాధువిట్లనెను:- "అయ్యా! ఒక్క-సారి తన సదాచారమును బోగొట్టుకొనెనా వాఁడు పతనమగుచునేయుండును. అట్లు నశించిన వానికి గతు లేమియుండును."

సూతుఁడిట్లనెను:- "మునులారా! నియమములను దృఢముగఁ బాలించుచున్నంతవఱకు రక్షణముండును. సడలెనా పూర్తియైతీరును. ఒక వైష్ణవుఁడుండెడువాఁడు. తల్లిదండ్రుల సంస్కారముచే నాతనికి మాంసమనిన నసహ్యము. ఆతనికి మాంసాహారియొకఁడు స్నేహితుఁడుగనుండెను. ఆతఁడు మాంసమును భక్షించెడువాఁడు. ఈతఁడాతనినిఁ గోపపడెడువాఁడు. చాల దినములాతఁడు తెలియకుండఁగఁ గూరలలో మాంసరసమును గలిపి తినిపించుచుండెడువాఁడు. ఇప్పుడాతని నోటికది రుచిగనుండెను. ఒక దినమున మాంసరసము లేకుండ కూరను వేసెను. అది రుచిగ లేకపోవుటచే వైష్ణవుఁడిట్లు ప్రశ్నించెను:- "ఏమయ్యా! నేడు దానిలో రుచికనఁబడుటలేదా? ఆతఁడు నవ్వుచునిట్లనెను:- "నేనింతవఱకు

మాంసమును గలిపి వండుచుంటిని," ఇదివిని మోహావశమున
నాతఁడిట్లనెను:- "ఇప్పుడు భ్రష్టుఁడనే అయితిని. ఒక్కసారి
తినిన నొకటి, అనేకసార్లు తినిన నొకటా? నేటినుండి నేనును
దినెదను. ఈవిధముగ నాతఁడును మాంసాహారి యయ్యెను.
కావున మునులారా! నియమములందును వ్రతములందును
పడలుట యనునది యుండెనా రక్షణ యుండనేయుండదు.
భరతుఁడా హరిణశాబక మోహమునఁబడి, తన నియమవ్రత
ములనన్నిటినిఁ ద్యజించెను. నాఁటినుండి దానితిండితిప్పలనుగుఱిం
చియే ఆతనికి చింత. దూరమునుండి లేఁబచ్చికను దెచ్చి, తనదగ్గఱ
కూర్చుండఁబెట్టుకొని మేఁపుచుండును. ఒకవేళ నదితినకుండిన
దాని నోటినిఁబట్టుకొని లేఁబచ్చికను దానినోటఁబెట్టుచుండును.
గండకీకి గొనిపోయి దానిని తోమి కడుగును. వల్కలవస్త్రము
లచే దానిశరీరమునుదుడుచును. అంత దానిని వెంటఁబెట్టుకొని
కుటీరమునకు వచ్చుచుండును. ఆతఁడు కత్తితో గట్టిచెట్టు
కొమ్మలను గొట్టుకొనివచ్చి ఒకపాకను వేసెను. దానిమీఁద
నాయాకు నీయాకును వైచి కప్పుచుగప్పి, సింహవ్యాఘ్రాదులు
తినకుండుటకై కొన్ని రాళ్ళనుదెచ్చియుంచెను. ఇన్ని యేర్పాట్లొ
నర్చియు రాత్రులందు చాలసార్లులేచి చూచుచుండును. అది
క్షేమముగనుండి, పరుండి నెమరువేయుటనుగాంచి ఆనంద
నిమగ్నుఁడై దానిని ముద్దాడి యిట్లనును:- 'ఓసీ! నీవింత
వఱకు నిద్రయేపోలేదు? నిద్రపోముండా! నిద్రపో!!" అని
నిద్రనుబుచ్చును. పగలంతయు దానిని మక్కువతోఁజూచుచు,
ముఖమును మాటిమాటికి ముద్దుపెట్టుకొనుచు లాలించును.

ఈ కార్యములవలన నాతనికి భగవత్సేవచేయుటకే అవకాశము దొఱకుటలేదు. ఇప్పుడతనికి సేవనీయ, పూజనీయ, స్మరణీయ, చింతనీయ వస్తువా మృగశాబకమే యయ్యెను."

శ్రీ శుకుఁడిట్లనెను: "రాజా! ఇంతగాఁజెప్పనేల ? రాజర్షియగు భరతునకా మృగశాబకమందు తన యౌరస పుత్రునకు మించిన మమకారము కలిగెను. ఇప్పుడాతఁడు తన సర్వస్వమునా హరిణశాబకముగనే భావించుచుండెను.

## మృగశాబకమునందు భరతుని మోహము

3-౨౮

శ్లో॥ కామో మన్యుర్మదో లోభః శోకమోహ భయాదయః ।
కర్మబంధశ్చ యన్మూలాః స్వీకుర్యాత్కో ను తద్బుధః ॥

శ్రీభాగ. ౫. స్కం. ౬. అ. ౫. శ్లో॥

క॥ కామ క్రోధాదికముల్
భూమీశ్వర కర్మబంధములు మఱియును జే
తోమూలము లగుటను నా
నీ మహిమంగో మనసు నమ్మ రెప్పుడు పెద్దల్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రారబ్ధము మానవు నెచ్చటెచ్చటఁ ద్రిప్పునో దీనికి నిశ్చయములేదు. త్రైలోక్య విజయుఁడగు నర్జునునిఁ గేవలము కఱ్ఱలతో నడవి గొల్లలు జయించిరను విషయమును శ్రీ కృష్ణోపభోగ్యలగు రాణులను దస్యులు బలాత్కరించి గొని పోయిరనియు నెవఁడైన విశ్వసింపఁగలఁడా ? కాని అట్లే

అంతనత్యంత గంభీరుండై శ్రీ శుకుండిట్లనెను:- "మహా రాజా! నీవు నాయభిప్రాయమును తెలిసికొనలేవు దయకును, కృపకును గొంచెముగ భేదముకలదు. ప్రేమకును మోహము నకును భేదముకలదు. దయ ప్రాణులపై సమానరూపముగఁ జూపఁబడును. ఎవరికైన దుఃఖము కలుగుచో వారిదుఃఖమును దూరమొనర్చుటకు దయయందుగు. తనకు సంబంధముకలవారి యెడల, మమకారమునన్న వారియెడలఁ జేయునది కృపయన బడును. దయ సమష్టి రూపమైనది. కృపవ్యష్టి రూపమైనది. అర్జునుఁడు యుద్ధసమయమునఁ బలికినది సిద్ధాంతతః సత్యమే, కాని కృపావశమునఁ బరివారములోని వారిపైఁ గల మమత్వ కారణమునఁ బలుకుటచే మోహజనితమైనది. భగవానుఁడాతని మోహమును నాశముగావించెను ప్రతిబాల కునిఁగాంచి ప్రేమించుట స్వాభావికమే, కానిదానిలో మమకా రమును జెంది ఒక్కనియందే యాప్రేమను సీమిత మొనర్చుట మోహము. బంధనమునకుఁ గారణమాసక్తి. వాటికయందు నానావిధ పుష్పములు వికసించిన వాటినిఁగాంచి చిత్తప్రసన్న తను జెందుట స్వాభావికము. కాని వానియందాసక్తినిఁ జెంది, అందులో నొక్కదానినిఁబొందుటకుఁ బ్రయత్నించినను, దానిలో మమకారమును, బెట్టుకొన్నను మోహమే.

భరతుఁడు మృగశాబకమును జలములనుండి తీసినాఁ డిదియుచితమే. కొన్నాళ్ళు పోషించుటయు మంచిపనియే. కాని దానియందు మమకారమును వహించి, నిరంతరము దానికి సంబంధించిన యాలోచనలనే చేయుట ప్రత్యక్ష

మోహము. తపోవిఘ్నము పతనహేతువు. దానిని వదలవలసి యుండెను."

రాజిట్లడిగెను:- "స్వామీ! బయట వదలిన మరల వచ్చినయెడలనో?"

శుకుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "మహారాజా! అట్లుకాదు. ఆసక్తియున్నచోటకే జీవివచ్చును. ఆదరము లభించిననే పిల్లులు పడిలోనికిఁబరువిడి వచ్చుచుండును. వచ్చును, పడియుండును. అందులో హరిణశాబకములు వచ్చుచుండును. దానినిగాంచి రాజర్షి భజన పూజనము లొనర్చుచుండవలసినది. కాని ఆతఁడీ హరిణశాబకమును దన పుత్రులకంటె మిన్నగఁ బ్రేమించుచుండెను

భజన పూజనము కొలఁకువచ్చె, మృగాసక్తుఁడనైతి వేమని యాతని వివేకమప్పుడప్పుడు చెప్పుచుండును అంతఁ బ్రారబ్ధవశమున నుత్పన్నమైన మోహము నానాయుక్తులను దానిని ఖండించుచుండును. రాజర్షి యిట్లనుకొనును:- "ఈజింక పిల్ల ప్రారబ్ధమెంతగట్టిది? ఇది గర్భమున నున్నప్పుడు, దీనితల్లి తన యూథమును, సుహృద్బంధువులను విడిచినప్పుడు ఏకాకిగా దీని నుదరమందుంచుకొని తిరుగుచుండెడిది. దైవికముగ దీని జన్మము సింహభయముచే నదీ గర్భమునఁనైనది నేను జూడకుండినచో నిది యిప్పటి కంతమై యుండెడిదే. పుట్టఁగానే దీని తల్లి చచ్చినది. అనాథయు, నసహాయయునైనది. భగవంతుఁడు నాకు దీనిని దత్తత చేసినాఁడు. ఇది అమాయక పశువైనను నా పాలఁబడినది. శరణాగత రక్షణము ప్రాణముల నొడ్డినను

జేయవలెను, నేను మానవుఁడనుగదా! ఒక పావురపు పెంటి నొక వ్యాధుఁడు బంధించెను. ఆతఁడా రాత్రి పత్నీవియోగ దుఃఖముతోనుండిన యీ పెంటి భర్తయుండు చెట్టు క్రిందకే వచ్చి నిలిచెను. చలికాలము. వర్షములుకూడ కురియుచుం డెను. వ్యాధునకుఁ జలివేయుచుండెను. కపోత మిట్లను కొనెను:– "వీఁడు నాభార్యను బంధించినను, వీఁడు నిత్యము జీవహింస చేయుచుండినను నాయాశ్రయమునకు వచ్చినాఁడు. ఈ యతిథిని భగవంతుఁడు నా కడకుఁబంపినాఁడు. నేను వీనిని రక్షింపవలె"నని యోచించి, ఎండుపుల్లలను దెచ్చి ముక్కుతో నొక కొఱవినిదెచ్చి వెలిఁగించి, ఆతని యాఁకలిఁ దీర్చుటకై తనను వేపుకొని తినుటకై ఆయగ్నిలోఁబడెను. ఒక పక్షియే తనకు హాని యొనర్చి తన యాశ్రయమునకు రాఁగా వ్యాధుని రక్షింపఁగా, నేను మానవుఁడనయ్యు హరిణశాబకము నెట్లు పేక్షింపఁగలను. శరణాగత రక్షణ మొనర్చుటకు మానవుఁడు తన స్వార్థముల నన్నిటినివదలుకొన వలయునని శాస్త్రములు ఘోషించుచున్నవి భజన పూజనమును తర్వాతనైనఁ జేసికొనవచ్చును. కాని యీ పిల్ల మరణించిన నిఁకనెట్లు బ్రిదుకఁగలదు?" అని ఇట్లనేక విధములగు యుక్తులతో మనస్సును సమాధాన వఱచుకొని భరతుఁడతిప్రీతితో నాహరిణ శాబకమును లాలన, పాలన, పోషణ, తోషణ లొనర్చుచుండెను. ఒక్కనిమిషమైనను దానిని వదలఁ జాలనం తటి అత్యధికాసక్తిని భరతుఁడుచెందెను. ఆతఁడు స్నేహపాశ ముచే బంధింపఁబడి దానికధీనుఁడయ్యెను. ఆతఁడెచ్చట

కూర్చుండిన నచ్చటఁగూర్చుండఁ బెట్టుకొనును; పరుండినఁ దన ప్రక్కననే పరుండఁబెట్టుకొనును; తిరుగఁబోయిన వెంటఁగొని పోవును; భోజన మొనర్చుచుండినఁ దనయెదుటనే కూర్చుండఁ బెట్టుకొని ఒకముద్దనాతఁడుతిని, మఱియొకముద్దను దానికిఁబెట్టు చుండును. స్నానము చేయఁబోయినముందు దానిని బాగుగా తోమి కడిగి, తర్వాతతాను స్నానమొనర్చును. ఎప్పుడైనఁ గుశ, సమిధ, ఫలపుష్ప కందమూలాదులను గొనుటకు వెళ్ళిన దానినిఁగూడ వెంటఁగొనిపోవును. ఆతఁడిట్లను కొనెడువాఁడు:- "ఇట్లు వెంటఁగొని పోకున్నచో సింహవ్యాఘ్రములు మాబుజ్జి బాబును దినివేయును. దీనికే యనిష్టము జరిగినను నాజీవితము వ్యర్థమే దానిఁబోవుచు ననేకసార్లునుప్పి ముద్దు పెట్టుకొను చుండును. దాని శరీరమున గిలిగింతలుపెట్టును. ఒక్కొక్కప్పు డిట్లనును:- "రాజకుమారా ! నీవు సుకుమారుఁడవు. ఇంత దూరము నడుచుటచే నీవలసియుందువు. రా నాయనా! నిన్ను భుజములమీఁద నెక్కించుకొందును" ఇట్లు దానినిఁ దన భుజముపై నెక్కించుకొని చాఁదూరము నడుచును ఒక్కొక్క ప్పుడు దానిని బిగ్గ కౌఁగిలించుకొనును. దాని తలను దనవడి లోఁబెట్టుకొని, నోరు తెఱచి మఱల మూయుచుండును. ఈ విధముగ నాతఁడు దానితో నాడుకొని ఆశ్రమమునకుఁదిరిగి వచ్చుచుండును

ఇప్పుడాతని భజన ధ్యానములన్నియుఁ బోయినను స్వభావాను సారముగఁ గొంచెము సేపు మాలను గైకొని కూర్చుండును; కాని యా మృగశాబకమందే మనస్సుండెడిది.

మాటిమాటికి కన్నులను దెఱచి చూచుచుండఁగనే అది యెచ్చటికో పోయెడిది. అది కనఁబడకపోయెనా మూల సంచి నచ్చటనుంచి, అది యెచ్చటికిని బాఱిపోలేదు కదాయని చూచుచుండును అది దూరముగ వెళ్ళి కూర్చుండినచో దగ్గఱకు వెళ్ళి యిట్లనును:- "వత్సా! నీవు బాగున్నావా? భగవంతుఁడు నీకు శుభస్కరుఁడగుఁగాక! నీవు నాకంటి యెదుట నుండక దూరముగఁగూర్చుండెదవేల? పద, నాకెదురుగఁ గూర్చుండెదవుగాని." అని యీ విధముగ దానినిఁదీసికొనివచ్చి, ముద్దుపెట్టుకొనుచు, దువ్వుచు, గోకుచు వివిధ విధముల దానిపైఁ బ్రేమను బ్రదర్శించుచుండెడు వాఁడు

శుకుఁడిట్లనెను:- 'మహారాజా! మోహము బలవత్తరమైనది. అది యెవరి యెడలనుండునో దానినే సర్వస్వమును కొనునంతటిపని యొనర్చును కావున సాధువు స్త్రీ, పురుష, బాలక, పశు, పక్ష్యాదులందాసక్తినిఁజెంది మమకారమును వహింపరాదు. రాజా! నేను చాలమంది సాధువులను గాంచితిని. మొదట అబల యని ఆశ్రయ మొసంగి తర్వాత దాని వలలోఁ బడినవారు చాలమందిగలరు. సమీపముందుండుట చేతను, తనకనుకూలాచరణ మొనర్చుటచేతను అనురాగము కలుగును చిత్తము దేనినైనఁబ్రేమింప యువ్విళ్లూరుచుండును. భగవంతుఁడు కనఁబడఁడు. కనఁబడినను ఎంతో కష్టముమీఁదఁ గానికనఁబడఁడు. కావున సమీపముననున్న వారిపై ననురాగాసక్తులు, మోహముకలుగుచుండును. కావునసాధువగువాఁడుదగ్గఱకెవరు వచ్చినను వారియెడల మోహమును జెందరాదు. వారి

కనుకూలమగు నాచరణమందాసక్తినిఁ జెందరాదు. మనశరీర సంబంధులతోడనే సంబంధమును వదలు కొన్నప్పుడితరఁపై నాసక్తినిఁ జెందనేలయని మాటి మాటికి స్మరించు చుండ వలెను. ఈ విషయమును మఱచినచో వాఁడు రెంటికినిఁ జెడిన వాఁడగును. అట్టివాఁడు సాధుపురుషుఁడు గాఁడు గృహస్థును గాఁడు అట్టివాఁడు బాబాజీకాఁడు బాబునుగాఁడు. భ్రష్టుఁడై నశించిపోవును. భరతుఁడా హరిణశాబక మోహమునఁబడి యోగమార్గచ్యుతుఁడై జనన మరణ చక్రమునుండి బయటపడియు మఱల దానిలోఁబడి పోయెను.

## భరతునకు మృగశాబక వియోగ దుఃఖము

౩౨౫

శ్లో॥ రాజన్ మనీషితం సమ్యక్ తవస్వావద్య మార్జనమ్ ।
సిద్ధ్యాసిద్ధ్యోః సమం కుర్యాద్దైవం హి ఫలసాధనమ్ ॥

శ్రీ భాగ. ౧౦. స్కం. ౩౬ అ. ౩౮ శ్లో॥

ఉ॥ పంపిఁనఁబోనివాఁడనె నృపాలక మానవు లెన్నఁదమ్మునా
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతురది గాదన వచ్చునె యీశ్వరేచ్ఛఁదా
ప్పింపఁగరాదు నీపగతు బిడ్డలఁదెచ్చెదఁ బోయి వచ్చెదన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

మానవుఁడు దేని యందాసక్తినిఁ జెందునో ఆతఁడు దానికొఱకు సమస్తమును జేయ సిద్ధపడును. ఇట్టియుదాహరణ

ము:లు చాలకలవు. గొప్ప గొప్ప చక్రవర్తులొక సాధారణస్త్రీ కొఱకు స్వేచ్ఛగా రాజ్యసింహాసనమును త్యజించిరి. గొప్ప గొప్ప మహాత్ములు తమప్రతిష్ఠను గోల్పోయి యిట్టి యాసక్తినే చెంది భ్రష్టులైరి. ఎవరియందు మనస్సులగ్నమైనదో వారు తప్ప ప్రపంచములో నింకెవరును గనఁబడరు. వారినిఁ జూడనిది పొద్దుపోదు. వారి సాంగత్యము లేక సంసారము శూన్యమై తోఁచును. ప్రేమవలనఁ దమప్రాణములను మోహావశమునఁ దృణముగఁ ద్యజించిన యుదాహరణము లొక్కటి రెండుకాదు. అనేకములుకలవు. మనస్సులో వారి రూపమునిలిచిపోవును. వారి చేష్టలందు సుఖము లభించును. వారి ప్రతికార్యమందునను హృదయమునకుఁ బ్రీతిలభించును. వారిని స్మరించుటయందు మధురాతి మధుర మాదకత యుండును. వారిమాటలన్నియుఁ గలకండకంటె మధురముగ నుండును.

శుకదేవుఁడిట్లనెను:— "రాజా! భరతుని చిత్తము హరిణశాబక మందాసక్తినిఁ జెందఁగా నొకదివమున నాహరిణ మెచ్చటికో పోయెను. భరతుఁడాసనమునుండి లేచికుటీరము నకు బయట నటునిటుఁజూచెనుగాని దానిజాడ తెలియలేదు. ఆతఁడు బిక్కముఖము వేసెను. అటునిటుఁ బరువిడెను, వెదకి వేసారెను. కాని హరిణముజాడ తెలియలేదు. శంకిత చిత్త ముతో నాతఁడు గండకీనదీతటమునకుఁ బోయెను. అది అచ్చ టను గనఁబడలేదు క్షణక్షణము ఆతని యధీరత వృద్ధిపొందు చుండెను. హరిణము కనఁబడక పోవునప్పటికాతఁడు వ్యాగ్రః

డయ్యెను. చిత్తము చంచలమయ్యెను శరీరస్పృహ లేదు. ప్రేమ యందనిష్ట శంక అడుగడుగుననుండును. ఇప్పుడాతఁడు మన స్సులోననేక తర్కవితర్కములొనర్పసాగెను కరుణావశమున హరిణబాలక విరహమున వ్యాకులుఁడై యాతఁడు చింతించి త్రిములను జింతింపసాగెను. కృపణుఁడు ధననష్టమైనపుడు దుఃఖించునట్లును, ధనికుఁడు తనసర్వగుణ సంపన్నుఁడగు నేకైక పుత్రునిఁ గోల్పోయినపుడునుపాలుతాగు బాలుఁడు తనమాతృ వియోగమున వ్యాకులము చెందినట్లును, నీటిని విడిచిన మత్స్యము తటతటఁ గొట్టుకొనునట్లును, మణినిఁగో ల్పోయిన ఫణి వ్యాకులము చెందినట్లును, ప్రియుఁడు లేక ప్రియదుఃఖించునట్లును రాజర్షి మృగశాబక వియోగముచే దుఃఖించుచుండెను.

ఆతఁడిట్లనుకొనెను:- "నావలన నేదియోయపరాధము జరిగియుండవలెను అందువలననే అది నన్ను వదలి వెళ్ళిపోయి నది. అదేమైయుండునబ్బా! (ఉదయము రెండు గడియల వఱకిట్లే యాలోచించి) ఓహో; నేఁడు నేను దీనికి గడ్డినిదీసి కొనిరాలేదు. నీళ్ళుచెట్టుటయు నాలస్యమైనది. దోషమంత యును నాదియే అది అమాయకపుశిశువు పాపము. దీన, దుఃఖిత. దానితల్లి చనిపోయినది. అది అందఱను త్యజించి నన్నాశ్రయించినది నా మీఁద విశ్వాసముంచినది. నేను విశ్వసించిన మీఁదట దానికి కష్టమునొసంగిన విశ్వాస ఘాత కుఁడను. ఈ కార్యము నీచుఁడనగు నాకనురూపముగనే యున్నది; కాని అది సత్పురుషులవలె సాధు స్వభావముకలది.

అమాయకపు జంతువు. అది యవశ్యము నన్ను క్షమింపఁ గలదు. అది నా యపరాధములమీఁద దృష్టినుంచక తిరిగి రాఁగలదు. (మరల తనకుఁదానే యులిక్కిపడి యిట్లనెను) తిరిగిరాఁగలదు. తిరిగి రాఁగలదు నిజముగ వచ్చునా! నాయీ కన్నులార నాహరిణ రాజకుమారుఁడిచ్చట నీ యాశ్రమ ప్రాంతమునఁ గోమలమగు పచ్చికను దినుటను గాంచఁగలనా? అది తన చిన్నకొమ్ములతో నా శరీరమునకేఁకి నా జిలను బోఁగొట్టఁగలదా? ఆహా ! దాని శృంగముల స్పర్శ యెంతటి సుఖద, మృదు, శీతలమైనది! అది యెంతటి ప్రేమతో నాశరీరము నానుకొనెడిది!"

ప్రేమ హృదయము శంకలతో నిండియుండును, అందువలన భరతుఁడు మరల నిట్లాలోచింపసాగెను:- "నేనపరాధమొనర్చిననునది స్వేచ్ఛచే నన్నువిడుచునట్టి శీలముకలదికాదు అది పశువై పుట్టినను, దానికన్నియును దెలియును. దానికింకను మనోహర బాల్య చాపల్యము వదలలేదు. హరిణము స్వాభావికముగఁ జాపల్యము కలదు. అందులోనది యింకను బిల్ల. ఒక్కొక్కప్పుడది బాలసులభ చంచలత్వమునఁ బెద్దగ నెగురును; అప్పుడు నేను గోపపడు వాఁడను. నా గదుముటను విని అడకువగల సుశీల ఋషికుమారునివలెఁ జింతఁజెంది నా సమ్ముఖమున భయభీతవలెఁ జెవులు వ్రేలాడవైచికొని మెదలక నిలుచుండి యుండెడిది. అప్పుడు నేను దానిముఖమును ముద్దుబెట్టుకొని ప్రేమతో నిట్లనెడు వాఁడను:—'వత్సా! చూడుము. అధికముగ నల్లరిని జేయుచుందువు. నేఁడు ఫలము

లను దినుము." అప్పుడది నావడిలోఁగూర్చుండి ప్రేమతో ఫలములను దినసాగును. అది నన్ను వదలి వెళ్ళడిదే కాదు. దానిని సింహవ్యాఘ్రములు తినియుండచ్చును. నాబిడ్డను దినునప్పుడు సింహమునకు దయయైనఁగలుగలేదా! అది దాని పంజాతోఁ గొట్టినప్పుడిది యెంతగా గిల గిల కొట్టుకొనినదో (ఇట్లు తలఁచుచు భరతుఁడేడ్చెడువాఁడు)

(శ్రీ) శుకుఁడిట్లనెను:- "రాజా! ఆశబలవత్తరమైనది. మానవుఁడాశవలననే జీవించును భరతునకు మరల యాశ జనించెను. ఆతఁడిట్లనుకొనెను:- "దాని నెవరును జంపియుండఁ గూడదు హరిణయూథముతో దూరము వెళ్ళి యుండవచ్చును. సాయంకాలమునకుఁ దిరిగి రావచ్చును. (రాఁగలదను నాలో చన మనస్సులోనికి రాఁగానే హృదయముప్పొంగి యిట్లు తలఁచెను) ఆహా! పోయిన హరిణశాబకము మరల వచ్చినచో నది యెట్టి శుభముహూర్తము కాఁగలదు? అది యిచ్చటికి వచ్చి, తన బాలక్రీడలను జూపించి నామనస్సు నానంద డోలికలలో నూగింపఁగలదు, దాని విషయములన్నియును నెంత ప్రేమభరితములై యుండును! నే నప్పుడప్పుడు దానిని మోసగించుటకై కుటీరములోఁ గన్నులనుమూసికొని ధ్యాన మును నటించెడువాఁడను. మనస్సులోనదియే వసించుచున్నను పైకిధ్యానమును నటించెడువాఁడను. అది వెనుకనుండివచ్చి మెదలక తలతోఁగుమ్మి, విశాల నేత్రములతోఁ బ్రేమప్లావిత మొనర్చుచు సరిగా నన్నే చూచుచుండును. నేను నవ్వఁగానే అది నావల్కలల మందఁదన ముఖమును దాఁచుకొనును.

నా వడిలోఁబడును. అది పసువగుటచేఁ బొరపాటున హావన సామగ్రిని మూఁజూచును. కుశలనుసములును. అప్పుడు నేనిట్లె నెడువాఁడను:— "ఎందుకే ! నీకు జ్ఞానము లేదూ. ఇది హావనీయ పదార్థమని దీనినేల ఎంగిలిచేసితివి? కుశల నపవిత్రనేల చేసితివి? అప్పుడది అపరాధినివలె భయపడి నా యెదుటనుండి తొలఁగి, తలవంచుకొని లజ్జాభావమును బ్రదర్శించుచు దీనముగ నుండెడిది. ఆహారిణ యువరాజెంతటి సుశీల ! నామీఁద నెంతటిప్రేమ !! అది నన్నెంతగాఁ బ్రేమించెడిది. అది నామాటను వినఁగానే గబగబవచ్చి దుఃఖితుఁడనగు నాకు సుఖమును గలిగించెడిది.

అయ్యో ! రెండు జాములు దాఁటినది. భగవానుఁడగు భువనభాస్కరుఁడస్తా చలమునకు దుత్రగతిని బరువిడుచున్నాఁడు. ప్రాచీదిశ ఆతనికి స్వాగత మొసంగుట కుత్సహించి తన అరుణవరణ వస్త్రమునుధరించి నిలుచుండినది. ఇంకను మాబుజ్జి రాదా ? సాయంకాలమైనదని యైనను నది మరల ఆశ్రమమునకు రాదా ! నేను దానినెచ్చట వెదుకఁగలను ? అంతటను వెదకివచ్చితిని. దూరము వఱకుపోయి వెదుకుటకు చూఁచివచ్చెదను" అని యిట్లాలోచించి ఆ మృగశాబకమును వెదుకుటకు బయలుదేరెను కొంతదూరము పోయిచూడఁగా నచ్చటదానిగిట్టలచిహ్నములు కనఁబడెను. వాటినిఁగాంచి రాజర్షి వికలుఁడై కూర్చుండి యిట్లనుకొనెను:— "ఈ ధరిత్రి ధన్యమైనది. ఏలననఁగా నాముద్దు బుజ్జిబాబు పద చిహ్నములను ధరించి తాను భాగ్యవతియనునది సార్థకముచేసికొనెను. ఎచ్చట

కృష్ణమృగము చరించునో అది యజ్ఞముల కనువైన భూమి యనియు, పరమపవిత్రమగు దపోభూమి యదియేయనియుఁ, గీకటాది దేశములలో నవి యుండవనియు శాస్త్రకారులు వచించినారు.

నేఁడీ మృగచరణ చిహ్నము లనుధరించి యీ వసుంధర భాగ్యవతి యైనది ఈ పృథివి ఎంతటి పరోపకారిణి ఎవరి యింటనైన దొంగలుపడిన నా చోరుల పదచిహ్నముల ననుసరించి వారి నన్వేషించెదరు నేఁడు నేనంతను గోల్పోయితిని. నేనును దరిద్రుఁడనైతిని. నా నిధిని గాలరూపుఁడగుచోరుఁడు హరించినాఁడు ఈ భూమి దయతో నీమార్గమునఁ బోయిన దని నాకు జాడచెప్పుచున్నది.

అంశుమాలియగు దినకరుఁడు పగలంతయును శ్రమించి ప్రియాహరణాంచలమందు ముఖమును గప్పుకొని నిద్రించినాఁడు. అంబరము నేకాంతమని భావించి నిశారాణి తన ప్రాణేశుని కొఱకు బ్రతీక్షించుచుండెను; ఇంతలోనే నవ్వుచుఁ జతుర్దశీ చంద్రుఁడుదయించెను. చంద్రునిఁ జూడఁగనే భరతుఁ డానందము చెందెను. అతని యంకమున మృగచిహ్నమును గాంచి యానందోద్రేకముచే మిక్కిలియుల్లాసముతో నిట్లనెను:— "చంద్రదేవా! నీవు ధన్యుఁడవు. నీవు పరోపకారివి నిన్నందఱును సుఖదశీతల శాంతికరుఁడవను చుందురు. నీవు మాబుజ్జాయిని దాఁచిపెట్టినావు. అయితే మంచిపనియే చేసితివిలే పాపమది తల్లిలేనిపిల్ల. వనములో నొంటరిగాఁ దిరుగుచుండ నీవు దయావశమున దానిని స్వీకరించితివి. సాధువుల స్వభావమిట్లే

యుండును. మాహరిణశాబకము దారితప్పి తిరుగుచున్నదని పరోపకారము కొఱకు వడిలోనికిఁదీసికొని పుత్రిస్నేహమున వికలుఁడై న నన్ను, భాగ్యహీనుఁడ నై దుఃఖ దావానలముచేఁ గాల్పఁబడుచు నశాంత చిత్తుఁడ నై, మందమతి నైయున్న నన్ను నీ శీతల, శాంత, స్నేహమయ అమృతమయ కమనీయ కిరణ పరిసారముచే సుధా శీకరములను వర్షింపఁజేయుచు సుఖశాంతుల నొసంగుచున్నావు.

అంతఁబరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ! మానవుడిట్లు మోహమున స్పృహావిహీనుఁడగునా? సాధారణుల విషయమును విడిచివేయుఁడు వారవివేకముచే మోహమమత్వములందుబడిపోవుచుందురు; కాని ఎంతో వివేకియు, జ్ఞానియు, ధ్యానియు తేజస్వియు, తపస్వియునగు భరతుఁడొక హరిణ శాబకము కొఱకింతటి యధీరతను జెందునా?"

అంత దుఃఖిత చిత్తముతో శ్రీ శుకుఁడిట్లనెను:- "మహారాజా! ఈ విషయములో నేమి చెప్పవలెను. ఏదో ఘోరాంతరాయ ప్రారబ్ధకర్మము మూర్తిమంతమై మృగరూపమును ధరించి, వనమునందు తపో విఘ్నమును గావించుటకై వచ్చి యుండునని తోఁచుచున్నది. కాకున్న పరమధార్మికులును, సుశీలురును, సదాచారులునగు దనపుత్రులను మోక్ష మార్గమునకు విఘ్నకారులనిభావించి తృణమువలెఁద్యజించి రాఁగా, వాని కన్యజాతియగు పశువునందింతటి మోహమేల కలుగును? ఇదంతయును దేవుని విడంబనము. ప్రారబ్ధచక్రము. అదృష్టఖేలనము. లలాటమున వ్రాసిన దుర్నివార రేఖాఫలము.

పూర్వజన్మకర్మలయొక్క పరిపక్వ పరిణామము. మహారాజా ! ఆ మృగమోహమున భరతుఁడు సమస్తజ్ఞాన, ధ్యాన సేవా, సంయమ, యమ, నియమాదులను, మఱచిపోయెను. ఇప్పు డాతని కొక్కటే జపము-"అయ్యో ! నా మృగశాబకమా ! అయ్యో ! నాహరిణరాజ కుమారా ! " అని యిట్లు పిలో పించుచుఁ బ్రలాపించుచు వికలుఁడై మూర్ఛచెంది క్రిందపడి పోయెను."

## భరతుఁడు మృగమోహమునఁజచ్చి మృగమై పుట్టుట

3_౨౬

శ్లో॥ అహం పురా భరతో నామరాజా !
విముక్త దృష్టశ్రుతసంగ బంధః ।
ఆరాధనం భగవత ఈహమానో
మృగోఽభవం మృగసంగాద్ధతార్థః ॥

(శ్రీభాగ. ౫. స్కం. ౧౨. అ. ౧౪. శ్లో॥)

ప॥ రాజులు ప్రస్తుతింప సురరాజ సమానుఁడనై తనూజులన్
రాజులఁజేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁబల్కఁగాఁ
దేశము నొంది యాహరిణ దేహము నందలి ప్రీతిఁజేసి నా
యోజ సెడంగ నేఁజెడితి యోగి జనంబులలోన బేలనై ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

జగమంఁదీ మోహజాలమే లేకుండిన జీవుల పునరాగ మన జన్మము లుండవు. మోహావశమననే మానవులు మరల

మరల జన్మించుచుందురు, మోహావశముననే జీవులు ఎనుబది నాల్గులక్షల జీవరాసులలోఁ దిరుగుచుందురు, మోహమనునది సుఖదుఃఖ మిశ్రబంధనము. దానిని ఛేదింపను వీలులేదు. కావలయునని బంధింపను బడము. ఈ బంధములోఁబడవలయు నని వివశుల నౌనర్చును. మనము మంత్రముగ్ధులవలెఁ బడి కామ విచారముచేయకయే దానిలో బంధింపఁబడుదుము. తర్వాతఁ బశ్చాత్తాపపడుచుందుము. దీనినే మాయయందురు; మోహము క్షయించుటకే మోక్షమందురు. ఇదియే బంధ మోక్షములయొక్క సారసిద్ధాంతము.

(శ్రీ) శుకుఁడిట్లనెను:— "రాజా! భరతుని యా హరిణము యువావస్థనుబొందినది అదియొక హరిణము వలలోఁ బడి మదోన్మత్తమై తనను పెంచినవానిని మఱచిదాని వెంటఁ బడిపోయెను. ప్రపంచములోఁ బ్రేమయెచ్చటనున్నది? సర్వత్ర స్వార్థమునిండియున్నది. పతికడ ధనము, యౌవనమున్నంత వఱకు ప్రియుఁడగును. ధనమునశించి, యౌవనము పూర్తి కాఁగానే ఎక్కడపతి? ఎక్కడ పత్ని? తండ్రిపోషించినంత వఱకు మంచివాఁడే. ఏమైన గద్దించి పనిచేయుమనిన నాతఁడు శత్రువుగఁ గనఁబడును. యువకుఁడగు పుత్రుఁడు వృద్ధుఁడగు తండ్రిని వదపెట్టిపోవును. మృత్యువువచ్చేనే యేడ్చినవారము ప్రేమచేతే యేడ్వము. తమస్వార్థమునకు వ్యాఘాతముకలిగినచో నేడ్చెదము. "ఇప్పుడు నాకు సంపాదించి పెట్టువారెవరో? ఇప్పుడునన్ను రక్షించువారెవరు?" తనరక్తమునోడ్చి నానాబా ధలుపడి పుత్రులను బోషించఁగా నట్టితండ్రికి అసాధ్యరోగము

ఆతఁడు స్పృహతప్పి తనజీవితముయొక్క చివరగడియలను లెక్క పెట్టుకొనుచుండెను. పూర్వస్వభావాను సారముగ హరిణము బంధువులవలెను, ఔరసపుత్రులవలెను ఆతని తలపైపున దుఃఖముతోఁ గూర్చుండెను. పశువైనను దనను బోషించిన తండ్రికి అవసానకాలము ప్రాప్తించినదని తెలిసికొనెను.

తన సుతునివలె మృగశాబకము దీనవదనముతోఁ దన తలపైవున గూర్చుండుటనుగాంచి భరతుఁడు కరుణావశమున విలపింపసాగెను. ఆతని కంఠము మోహము కారణమున రుద్ధమయ్యెను. గండకీ తీరమున వెనుక జరిగిన సంఘటనము జ్ఞాపకమునకువచ్చెను. దీనితల్లి నదిలోనెట్లు ప్రసవించి చచ్చినదియు, దీనితల్లిముఖమున మరణకాలమున బిడ్డపై నెంతటి కరుణా మమకారములుండినదియు, తనబిడ్డ కొఱకెట్లు దుఃఖించి మరణించినదియు తాను బిడ్డవలె దానినెట్లు పోషించినదియు, చివరకు దనయవసానకాలమున నదిదగ్గఱనుండుట మంచిదేననియు, నది ఆహరిణి యొసంగిన పెంపుడనియు, నది న్యాసరూపమునఁ దనకొసంగినదియనియు, ఈ యరణ్యములోనైనను దనకు సుఖమొసంగిన యీ హరిణ మెంతటి భాగ్యశాలియో కదా! అని యీ విధముగ నాహరిణ ధ్యానమొనర్చుచు రాజర్షియగు భరతుఁడదేచింతతో మృగభావముగల చిత్తముతో నీయసార సంసారమునుండిపోయెను. ఆతఁడత్యంత ప్రబలమును వేగశాలియునగు కరాళకాలగళమునఁ బ్రవేశించెను. ఆతని పాంచభౌతిక శరీరము మరణించెను చివరకు మృగశాబకధ్యానమున మృగీ గర్భమునఁ బ్రవేశించి మృగశాబకముగఁ బ్రవే

శించెను. కొంతకాలమునకా మృగమును మరణించెను. అది యును నా మృగీగర్భముననే ప్రవేశించెను. మొదట భరతుఁడు మృగగర్భమునుండి పుట్టెను. తర్వాత నాతఁడు పెంచిన హరిణమును నాతల్లి గర్భముననే పుట్టెను.

ఇదివిని శౌనకుఁడు సూతుని నిట్లడిగెను:—"మహాభాగా! సూతా! మా కొక శంకమిగిలినది. భరతుఁడు వేలకొలఁది సంవత్సరములు భగవదారాధనము చేసినదంతయు వ్యర్థమై రెండుమూఁడు సంవత్సరములు హరిణశాబక స్నేహమున మృగ జన్మమును బొందుట ఆశ్చర్యకరముగనున్నదిది ఏమి?"

ఇదివిని గంభీరుఁడై సూతుఁడిట్లనెను:- 'స్వామీ! జీవులకు విషయములమీఁద స్వాభావిక ప్రవృత్తియుండును. విషయాసక్తి యుండుట జీవులకు సహజస్వభావము. దానిని భగవానుని వైపునకు మిక్కిలి కష్టముతో, గొప్పసాధనతో ననేక యుక్తులతో హఠపూర్వకముగ మరలింపవలెను. మీకనుభవ విషయమును జెప్పెదను వినుఁడు. భగవంతుని రూపమును ప్రతిదినమును జూచుచుందుము. నిత్యమాతని మూర్తిని ధ్యానించుచుందుము. ఇన్ని చేయుచుండినను నాతని భావమయమూర్తి హృదయమున నంకితముకాదు. ఎన్నడును స్వప్నమందైనను గనఁబడదు. దానికి విపరీతముగ స్త్రీ ఒక సుందరుఁడగువానిని, పురుషుఁడొక లావణ్యమయి, సుందరమగు స్త్రీని పొరబాటున నొక్కసారి చూచినను, ప్రత్యక్షముగఁ జూడనక్కఱలేదు, చిత్రములోఁ జూచినను జాలును నది మనస్సులో నిలిచిపోవును. ప్రయత్నమొనర్చినను మనస్సు

నుండి తొలఁగిపోదు. జాగ్రత్తలో సంగతియేల నది స్వప్నము నను నదియే జ్ఞాపకమునకువచ్చును. ఒక్కొక్కప్పుడు చిత్త చంచలమువలన స్వప్నదోషమును గలుగును. ఈ విషయము లందూ చిత్తమును లగ్నమొనర్చుటకుఁ బ్రియత్నమక్కఱలేదు. స్వతః మనస్సుదానియందు లగ్నమగును. గురుకులమందు నిత్యనియమముగ బలాత్కారముగ సంధ్యావందనము చేయిం పఁబడుచున్నది. అది అభ్యాసమునకురాదు పొగనుబీల్చుట మొదలగునవి సంవత్సరము ఆఱునెలలలో నలవాటైనది, ఎంత ప్రియత్నించినను వదలనే వదలవు.

జబ్బుపడిన శరీరమును నారోగ్యముగ నుంచుటకు గుణ కారియు, చేదుగనుండు నౌషధమును నెంత కష్టముతో సేవిం చెదరో చూడుఁడు. కాని చెడ్డబుద్ధినింకను భ్రిష్టము కావించు చున్న సారాయినిఁ దాగ్రుబోతు ఎంతటి ప్రేమోల్లాసము లతోఁ ద్రావునో చూడుఁడు. కృష్ణ కథాశ్రవణము చేయ వలయుననిన నెంతో ఆలస్యము రాసాగును. ఒడలువిఱుపు, ఆవలింతలు, నిద్ర వెంటనేవచ్చును. కాని నిందాప్రకరణ మును విప్పితిమా ఎంతోప్రేమతో వినుచుందుము. ఇప్పుడు నిద్ర యెచ్చటికి పాఱిపోవునో తెలియదు. చిత్తము తన్మయ మగును. ఇట్టిదాని నెల్లప్పుడును వినవలయునని కోరుకొనుచుం దుము. అర్ధరాత్రియైనను, చివరకు తెల్లవారినను నిద్రరానే రాదు. దానివలన వచ్చునదేమియునులేదు. ఒరుగున దేమి యునులేదు. కాని మనస్సుయొక్క స్వభావము లోకవార్త లందు బడుటయే. ఈ జీవి యనేక యోనులలోఁ దిరిగినది.

అన్ని యోనులందును తల్లులుఁ దండ్రిలు, సోదరులు, మిత్రి బాంధవులుందురు. అప్పుడు కొందఱియెడల మిత్రిత్వము, కొందఱయెడల శతృత్వమును గలిగియేయుందురు. ఆసంస్కారములు సహజముగ నశింపవు. వాటికి వశీభూతుఁలై జీవుఁడు ప్రారబ్ధవశమున నెవనితో సాంగత్యమొనర్చునో వానితోఁ గూడ రాగద్వేషములను జెందును. తనకనుకూలముఁగ నుండు వారియెడల రాగమును, తనకు వ్యతిరేకముగ నున్న వారియెడల ద్వేషమును గలుగును. ఈ రాగద్వేషముల వలననే జీవుఁడు మాటి మాటికిఁ జచ్చుచుఁ బుట్టుచుండును. మహారాజా! రాజర్షియగు భరతుఁడును సంస్కారవశమున హరిణము కావలసివచ్చినది.

ఇఁక భగవద్భజనము వ్యర్థమగునా కాదా యను విషయముఁ కలదు. భగవద్భజన మెన్నడును వ్యర్థముకాదు. కల్యాణము నిమిత్తము చేసినకార్యములవలన దుర్గతి యెన్న డును గలుగనేకలుగదు. భరతుఁడు మృగశరీరమును బ్రారబ్ధవశమున ధరించినప్పటికిని పూర్వజన్మ స్మృతికలదు. మృగమయ్యును జాతిస్మరణముఁకలిగి యుండెను. ఇప్పుడాతనికిట్లు జ్ఞాపకమునకువచ్చెను:- "అయ్యో! నేనిదివరలోఁ జక్రవర్తిని. రాజ్య, ధన, ధాన్య, స్త్రీ, పరివారము నంతటిని బరిత్యజించి యిచ్చటకు వచ్చితిని! దైవికముగ నొక హరిశాబకముతో నాకు సాంగత్యము కలిగినది. అందు వలన నాకీమృగజన్మము లభించినది. నేను దైవికముగ మోసపోతిని. నేను మృగకారణముగ మోసపోతిని. నాభవిష్యత్తు నాశనమైనది.

శ్రీ శుకుఁడిట్లనెను:— "రాజా! ఈ విధముగ నాతఁడు మిక్కిలిగ విలపించుచు నేదోవిధముగ జీవనయాపనము చేయుచుండెను. మహారాజా! భగవత్కృపవలన నాతనికి మృగశరీరమందు పూర్ణముగ జ్ఞానముండెను.

## భరతుని మృగశరీర నాశనము

3—౨౭

శ్లో॥ యజ్ఞాయ ధర్మపతయే విధినైపుణాయ
యోగాయ సాంఖ్యశిరసే ప్రకృతీశ్వరాయ।
నారాయణాయ హరయే నమ ఇత్యుదారమ్
హాస్యన్మృగత్వ మపియః సముదాజహార॥

శ్రీ భాగ. ౫. స్కం. ౧౪ అ. ౪౫ శ్లో॥

"వ॥ యజ్ఞస్వరూపుఁడును, ధర్మపతియును, విధులను నేర్చినవాఁడును, యోగమెఱిఁగిన వాఁడును, జ్ఞానమునకు శిరస్సైన వాఁడును, ప్రకృతి కధీశ్వరుఁడును, నారాయణుఁడును, హరియగు వానికి నమస్కరించుచు నా నామములను బలుకుచు నాతఁడా మృగరూపమునుగూడ వదలి వైచెను."

విస్మృతి, దుఃఖము బశ్చాత్తాపమును దగ్గించును. ప్రపంచములోని దుఃఖములన్నియును, అవమానములన్నియును మనకు జ్ఞాపకముండినచో మన మీసాంసారిక పదార్థములలో సుఖానుభవమును జేయఁజాలము; కాని భగవంతుఁడు విస్మృతి గలుగఁజేసి మనదుఃఖముల నెన్నిటినో పోఁగొట్టినాఁడు.

జీవుఁడే జన్మము నెత్తినను నాజన్మకు పూర్వజన్మ విషయము
లను మఱచి సుఖము ననుభవించుచుండును. ఒకానొక రాజు
నకుఁదాను మరణించుటకుఁ బూర్వమే తాను రాఁబోవు జన్మ
ములోఁ బందిగాబుట్టునని తెలిసెను. అందువలన నాతఁడు తన
పుత్రునిబిలిచి యిట్లనెను:- "నాయనా ! నేను ఫలానిచోట
ప్రారబ్ధవశమున శూకరమునై పుట్టుచున్నాను. నా శిరస్సున
నొకపెద్ద తెల్లని మచ్చయుండును. ఇదియేగుర్తు. నేను
మలమును భక్షింపకుండుటకై వెంటనే నీవు నన్నుఁగనుగొని
ఖడ్గముతో ఖండింపుము." ఆజ్ఞా కారియగు నాతని పుత్రుఁ
డట్లే చేసెదననెను. కాలాంతరమున రాజు మరణించి పంది
యయ్యెను. ఆతని కుమారునకు జ్ఞాపకము లేకపోయెను. లెక్క
కూడ పొరపాటుపడెను. ఇంతలోనే పంది పెద్దదై ఒక ఆడు
పందితో సంబంధమేర్పడెను. దానికి పిల్లలునుబుట్టెను ఒక
నాఁడా రాజుయొక్క పుత్రుఁడే దైవికముగ నొక క్షేత్రమునఁ
దనపిల్లలుజల్లలతో మ భక్షణము చేయుటనుగాంచెను. ఆతనికిఁ
దనతండ్రి విషయము జ్ఞాపకమునకువచ్చెను. ఆతఁడు వెంటనే
అంబులపొదినుండి బాణమునులాగి దానిని లక్ష్యించి కొట్ట
బోవఁగా నది మిక్కిలి కాతరస్వరమున నిట్లనెను:- ''రాజా !
ఇప్పుడు నన్నుఁజంపవలదు. నేనీ పిల్లలతో పరమసుఖము
ననుభవించుచున్నాను ఇప్పుడు నాకీ యాహారము పరమప్రియ
ముగనున్నది. నాకీజన్మమందాసక్తియున్నది. నేనిప్పుడు మలము
నందే సుఖము ననుభవించుచున్నాను. ఇట్లే అన్నిజీవుల
విషయమును, ఏజన్మము నెత్తుచుందురో ఆ జన్మనే సుఖమును

కొనుచుందురు. ఆ శరీరమును వదలఁగోరరు. కొందఱుజ్ఞానులు, ధ్యానులు, ఏదో అంతరాయ కారణముగ హీనజన్మము నెత్తియు భగవదారాధనా పరిభావముచే వారికి పూర్వజన్మ స్మరణము కలుగును. అట్టివారా నీచజన్మమునుండి బయటపడుటకు మిక్కిలి యుత్కంఠతతో బ్రతీక్షించుచుందురు. ఇట్టి వారిని బశువులలోఁ జూచియుంటిమి. ప్రత్యక్షముగఁజూచిన విషయమొకటికలదు. ఒకకుక్క భగవన్నైవేద్యమునుదప్ప ఇంకొకటి తినెడిదికాదు. ఏకాదశిరోజున నెట్టియన్నమును బెట్టి నను దినుట యటులుంచుఁడు, వాసననైనఁజూడదు. నాఁడేకాదశియని దానికెవరుచెప్పిరి. దీనినిఁబట్టి మనకుఁ దెలియునదే మనఁగా నది పూర్వజన్మమున నెవఁడో సంస్కారముచెందిన వైష్ణవుఁడై యుండవచ్చును. అతఁడు ప్రారబ్ధ కర్మవశమునఁ గుక్కగాఁ బుట్టవలసివచ్చినది. కాని యుపాసనా పరిభావముచే దానికిఁబూర్వజన్మస్మృతి కలిగినది అందువలననది యెన్నడును బ్రతికినంతవఱకు బందిని తాఁకలేదు. వైష్ణవులకడకుతప్ప యింకనెక్కడికిని వెళ్ళలేదు. భగవన్నైవేద్యముకాని పదార్థమును దినలేదు. చివరకు దానిమృత్యువును మిక్కిలి యుత్తమమైనది.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! భరతుఁడిప్పుడు మృగమయ్యెను. దాని మృగీమాత కాలంజర పర్వతముమీఁద నివసించుచుండెను. పుట్టగానే ఇది తనయోగమునకుఁ గలిగిన అంతరాయఫలమని తెలిసికొనెను. మృగశాబక సంగముచే నేను మరల జన్మింపవలసివచ్చినది. ఇఁక నే నెవరితోడను

సాంగత్యమును బెట్టుకొనను. ఎవ్వరి యెడలను నాసక్తినిఁ బెంచుకొనను. ఎవ్వరియందును మమకారముము జెందను. తన మృగీమాంతవలనను నేవిధమగు బ్రియోజనము లేదని తెలిసి కొని, పుట్టిన మఱునాఁడే రాత్రియందు తనతల్లినివదలి హరిణ శాబకము బయలుదేరివచ్చెను. హరిణములు పుట్టఁగానే పారి పోవుచుండును. భగవన్మహిమ యెంతటి విచిత్రమైనది! భగవం తుఁడు తల్లి గర్భములోనే పారిపోవుటకు శక్తి నొసంగినాఁడు. భరతుఁడు పారిపోయివచ్చి గండకీతీరమున హరిహరక్షేత్రము నఁగల శాలగ్రామ తీర్థమునకువచ్చెను. అచ్చటనే పులస్త్య పులహ ఋషులయొక్క పావనాశ్రమముకలదు

భరతునకీ మృగశరీరమందు తన తపస్సునకును, భగవ దారాధనమునకును గలిగిన విఘ్నము జ్ఞాపకమునకువచ్చెను. దానివలన నాతనికి బాధకలిగెను. ఆతఁడు మిక్కిలి పశ్చాత్తా పముఁనుజెంది యిట్లనుకొనుచుండెను:— "ప్రారబ్ధము నన్నెచ్చ టికి తీసికొనివచ్చి పడవైచినది! నా దుర్దైవము మృగరూప మును ధరించి నా సమ్ముఖమునకు వచ్చినది. అది నన్ను మోసగించినది, పరమార్థచ్యుతుని గావించినది. నా సాధనను భ్రష్టముకావించినది. ఏ చిత్తమును నేనొక క్షణమైనను వృథాచేయక, క్షణక్షణము భగవద్గుణ కీర్తనశ్రవణ మనన నిదిధ్యాసనములలోను, భగవద్ధ్యానములోను గడుపుచుంటినో ఆ చిత్తమే ప్రారబ్ధవశమున నొక మృగశాబక మోహమునఁ బడి, నా సర్వస్వమును నాశముజేసికొంటిని. నేను నాలక్ష్య మును మఱచి ఉత్థాన స్థానమునఁ బతనము జెందితిని. అస్తు

ఇప్పుడు చింతించిన ఫలమేమున్నది? ఇఁక నిట్టిపొరపాటు జరుగ కుండునట్లు నిరంతరమును బ్రియత్నింపవలయును ఇట్టి మోహ మునఁబడి పునరావృత్తి కాకుండవలయును. ఈ కన్నులే మోసముచేయునవి. ఈ రెండు కన్నులు నాల్గు కన్నులై నవా నూతన సృష్టి జరుగును. ఇఁక నే నెవ్వరినిఁజూడను, ఎవ్వరి కడకుఁబోను, ఎవ్వరిని నా కడకుఁబిలువను, ఎవ్వరికడకును బోయితినను. ఎవ్వరికిని కాడువఁబెట్టను. నా సుఖదుఃఖములకు సంబంధించిన విషయములను నెవ్వరికినిజెప్పను. ఏకాంతమున నుందును. నారాముని ఁబ్రేమింపెదను. హరిస్మరణ మొనర్చుచు నానందమును బొందుదును." అని యిట్లాలోచించుకొని మృగ జన్మమును బొందిన నా భరతుఁడు మదలక నొకగుహాయందు నివసించుచుండెను. ఆతఁడు హింసయను భావముతో పచ్చ గడ్డినైనను దినక కాలమును గడుపుచుండెను. ఎన్నడును మృగ యూథములోఁగలిసి పోవుటలేదు. మెదలక గండకీనదికి వెళ్ళి జలమును బానమొనర్చి, ఎండుటాకులనుదిని శాంత చిత్తముతో ధ్యాన మొనర్చుకొనుచుండెను. ఆతనికి మృగశరీ రముపిూఁద మోహము లేదు. అది ఆతనికి భారభూతముగ నుండెను. కాని చేయునదేమికలదు? ప్రారబ్ధము భోగించినఁనే నశించును. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధము నశించు టకు భోగించుటతప్ప వేఱొక యుపాయము లేనేలేదు. అందు వలన నాతఁడు మృగశరీరములోని ప్రారబ్ధము క్షయించుటకుఁ బ్రతీక్షించుచుఁ గాలమును గడుపుచుండెను.

కొంత కాలమునకు మృగశరీరమునకు ప్రారబ్ధ నాశన మయ్యెను. ఎన్నిదినములా విఘ్నరూపమగు మృగముతో సాం

గత్యములభించెనో, ఎన్ని దినములు దానినిలాలించుట, పాలించుట పోషించుట మొదలగునవి చేసినాఁడో, ఎన్ని దినములు ముద్దులు పెట్టుకొని మోహామును పెంచుకొనెనో అన్ని దినములు మృగత్వమును బొందెను. అంత నా సంస్కారములు సమాప్త మయ్యెను. అది ఆతని జన్మాంతరీయ ప్రగాఢ మోహాము మాత్రము కాదు నైమిత్తిక ప్రారబ్ధము. అది అల్పకాలమే యుండి సమాప్తమయ్యెను

భరతునకు భగవదారాధనా ప్రభావముచేఁ దనకా మృగశరీరమంతము కావలసియున్నదని తెలిసెను, రాజా! భగవదుపాసన యెట్లు చేసినను నది యెన్నటికిని వ్యర్థముకాఁజాలదు. "నహికల్యాణ కృత్కశ్చిత్, దుర్గతింతాత గచ్ఛతి" కల్యాణకృత్తు దుర్గతి నెన్నటికినిఁబొందఁడు. కాకున్న మృగశరీరములో భగవత్స్మరణ చింతనములు గలుగుటయును, పూర్వ జన్మస్మృతి యుండుటయు నసంభవములు.

భరతుఁడు తన కవసానకాలము వచ్చినదని గండకీ సమీపమునకుఁ బోయెను. సగము శరీరము గండకీనదీ జలములందును మిగిలిన సగము శరీరము బయటనుండెను. మరణకాలమున నేదైన తీర్థస్థానముగు జలాశయము లభించి, అందులో సగము శరీరమును జలములో ముంచి, అచ్చట ప్రాణత్యాగ మొనర్చినచో నంతకుమించిన యుత్తమమృత్యు వేమికలదు. ఎంతో అదృష్టము వలనను, జన్మజన్మాంతరముల సాధనవలనను నిట్టిమృత్యువు ప్రాప్తించును. కాకున్న నింటిలోఁ గుక్కిమంచములో మరణము లభించును మంచముమీఁదఁ జచ్చినచో దానికెన్ని రంధ్రములుకలవో అన్ని దినములు

సంసార బంధములం గొనుందురని శాస్త్రములు వచించు చున్నవి. ఇంతకు సారాంశమేమనఁగా మృత్యుకాలమున నింటి లోని సమస్తవస్తువులు, జ్ఞాపకమునకు రాఁగలవనియే పరివా రము మీఁద మమత్వముండును. కావున మృత్యు వేకాంత స్థలములో, నేదైన తీర్థమందు శాంతిగను, భగవత్ స్మరణము జరుగుచోట జరుగవలెను. మృగశరీరములో నున్నను భరతు వకి జ్ఞానముకలదు. అందువలన నాతఁడు తనగుహలో శరీర త్యాగము చేయలేదు. ఆతఁడు శరీరమును త్యజించుటకు గండకీ పావన తీర్థమునకుఁ జేరెను.

ప్రారబ్ధ క్షయము కాఁగానే ఆతని జీవాత్మ శరీరము నుండి వేఱయ్యెను. జీవన ధారణచేయు ప్రాణవాయువు సంస్కారములతోఁగూడి యీ పాంచభౌతిక దేహమును వీడి సూక్ష్మశరీరముతో లేచిపోయినది. చావఁబోవునపుడు మృగ శరీరమందుండియు భరతుఁడు స్పష్ట శబ్దములతో భగవన్నా మోచ్చారణ మొనర్చు చుండెను ఆతఁడిట్లనెను:– యజ్ఞపురు షుఁడగు భగవానునకు నమస్కారము. ధర్మప్రభువగు ధరణీ ధరునకు నమస్కారము. సమస్తజీవుల పాపములను హరించు హరికి నమస్కారము సాంఖ్యశాస్త్ర సిద్ధాంతమును బ్రవర్తిం పఁజేయు ప్రభువునకుఁ బ్రణామము, యోగగమ్యుఁడగు నఖిలే శునకు నేననన్యభావముతో నభివాదన మొనర్చుచున్నాను. ఈ విధముగ నా యఖిలాంతర్యామి అచ్యుతుని స్మరించుచు నాతఁడా మృగశరీరమును బరిత్యజించెను.

# భరతుఁడు బ్రాహ్మణుఁడై జన్మించుట.

3_౨౮

శ్లో॥ సా మాం స్మృతి మృగదేహేఽపి వీర
కృష్ణార్చన ప్రభవా నో జహాతి।
అథో అహం జన సంగాద సంగో
విశంకమానోఽవివృతశ్చరామి॥

(శ్రీభాగ. ౫. స్కం. ౧౨. అ. ౧౫. శ్లో

క॥ నరేంద్రా! యేను బూర్వంబున భరతుండను రాజను సర్వసంగ పరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబనై పుట్టియు నంతను హరిభక్తి దప్ప కుండిన కతంబున నిప్పుడు మనుష్యుండనై మనుష్య సంసర్గంబును బాసి యేకాకినై చరియించుచున్న వాఁడ నరుండు వృద్ధసేవం జేసి సంసార మోహంబును బాసి హరిధ్యాన కథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందును."

శ్రీమదాంధ్ర భాగవతము.

మన మొక గ్రంథమును సగము వఱకు చదివి పది పదు నైదు సంవత్సరముల వఱకు చదువకుండిన దానినంతను మఱచి పోయెదము. సాధారణముగ నా గ్రంథమంతయును మఱపు లోనికేవచ్చును. కాని దానిని మఱల బఠించుట కారంభించుచో నిదివఱకు చదివినది శీఘ్రముగ జ్ఞాపకమునకు వచ్చును. చదువని భాగము ఆలస్యముగ స్మరణమునకువచ్చును. దీనికి కారణమేమనఁగా నిదివఱకు చదివినది మనము మఱచిపోయి

నప్పటికి ఆస్మృతి చిహ్నములు మన హృదయ పటలమునఁ బడియుండును. ఇదివఱకు చదివినది ఇప్పుడు చదువుట కంత శ్రమయుండదు చదివినకొలఁది జ్ఞాపకమునకువచ్చును. అట్లే పూర్వజన్మమునఁ జేయఁబడిన సాధన మఱుజన్మమున మఱలఁ జేయవలసినపనిలేదు. విద్యార్థి రాత్రిసగము పాఠము చదివి పరుండిన మరల దానిని ప్రాతఃకాలమునఁ జదువ నవసరము లేదు. తర్వాతనే ప్రారంభించును. ఇట్లే యోగమునొనర్చుచు మధ్యమధ్యకల్గు విఘ్నములవలన యోగము ఖండితమైనచో యోగభ్రష్టుడగును. అట్టియోగభ్రష్టుఁడు పవిత్రమగు ధర్మాత్ములు, ధనికులు నగువారి యిండ్లలోఁ బుటుదుగు. అట్లు పుట్టుటచే వారి శరీరనిర్వాహము కొఱకేమియుఁ బ్రయత్నింప వలసిన పనిలేదు సాధన సామగ్రులన్నియు శ్రమయేమియును లేకయే ఇదివఱకాగిన సాధన పూర్తిచేయుటకు లభించును. లేదా అతని జన్మ శమ, దమ, తప, స్వాధ్యాయ, వేదాధ్యయన, త్యాగ, సంతోష, తితిక్షా, వినయ, విద్యా, హ్రీ, శ్రీ, దయా, మైత్రీ, కరుణా, ముదితాది గుణములచేఁగూడిన యోగుల యిండ్లలో కలుగును, ఆ మూలమున నాతని సాధన సంస్కారము వంశపరంచేఁ బ్రాప్తించును. ఇంతకు సారాంశమేమియనఁగా యోగమందంతరాయము కలిగినచో వెనుకటి యోగము, శ్రమము వ్యర్థము కాదు. వెనుకటి జన్మములో నెచ్చటవదలఁబడినదో అచ్చటినుండియే ప్రారంభము కాగలదు.

శుకుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను:— 'రాజా ! ... గండకీనదియందుఁదన యర్థశరీరమునుముంచి సుమ

ధుర భగవన్నాముల నుచ్చారణము కావించుచు మృగశరీర మును ద్యజించెను. చివరకాతఁడు భగవన్నామోచ్చారణ మొనర్చి చచ్చుటచే నాతనికి ముక్తికలుగవలసినది, కాని మానవశరీర ముత్కృష్టమైనదని చూపుట్కై తానుజేసివదలిన సాధనతితిక్షతోఁ బూర్తిచేయుట కాతఁడొక శరీరమును ధరింప వలసివచ్చెను. ఆతఁడొక అంగిరసగోత్రి పరమశీలీన ధార్మిక సద్గుణ సంపన్నుఁడగు బ్రాహ్మణు నింటఁ బుత్రరూపమునఁ బుట్టెను.

భరతుఁడు పుట్టిన వంశము గొప్పధార్మికమైనది. ప్రసిద్ధమైనది. పూజనీయమైనది. సమ్మాననీయమైనది. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునకిద్దరు భార్యలుండిరి. పెద్దభార్యయందు సమస్త శీలగుణ సదాచార. విశ్వవినయాది సద్గుణ సంపన్నులగుఁ దొమ్మండు గురు పుత్రులుదయించిరి. చిన్నభార్య సుశీల, పతిపరాయణ, వినయవతి, ఆమెకొక పుత్రుఁడును బుత్రికయు నుదయించిరి. అందులోఁ బుత్రుఁడు మృగశరీరమును విడిచిన భరతుఁడే

బ్రాహ్మణుఁడు తనపెద్దభార్య యందుఁబుట్టిన తొమ్మిది మందికి విధ్యుక్తముగ జాతకర్మాది సమస్త సంస్కారము లొనర్చెను. ఉపనయనమును గావింపఁజేసి వేదములను బఠింపఁజేసెను. వారందఱును బ్రాహ్మీ, శ్రీయుక్తమగు గర్మకాండను దెలిసిన త్రయీ విద్యయందు నిష్ణాతులైరి. వారు యజ్ఞములు చేయుచుండిరి, చేయించుచుండిరి, వేదమును బఠించుచుండిరి పఠింపించుచుండిరి, దానమొనర్చుచుండిరి. దానమును గ్రహించుచుండిరి జీవన నిర్వాహముకొఱకు కృషినిఁగూడ చేసికొనుచుండిరి. భరతుఁడువయస్సులోఁ జిన్నవాఁడు. చిన్నభార్య

కేకైక పుత్రుఁడు. సాధారణముగఁ దల్లిదండ్రులకు చిన్నవాని యందితరులకంటె నధికస్నేహముండును. అందులో నాచిన్న వాఁడుబుద్ధిలోఁగూడతక్కువవాఁడు.గానుండిన వానియందు మమత్వమింకను బెరుగును. తమపిల్లలందఱును సుఖముగనుండవలయు ననియు ఎవరును దుఃఖమునుబొందరాదనియుఁ దల్లిదండ్రులకుండును. తెలివికలిగి, బుద్ధిమంతులై, కార్యకుశలులై యున్నవారి విషయము వారితల్లిదండ్రుల కంతగాఁబట్టదు. వారు తమ బుద్ధిబలముచే నేదో విధముగ సంపాదించుకొని తినఁగలరనుకొనుచుందురు. బుద్ధిహీనులు, అసమర్థులునగు సంతానముయొక్క తల్లిదండ్రుల కెల్లప్పుడును చింతయే. ఆ బ్రాహ్మణుని యింటిలో దేనికిని గొదువ లేదు. మిక్కిలిగ ధనధాన్యములు కలవు. చాలగ ఆవులు, గేదెలుకలవు. నిర్వాహమునకు కావలసినంత భూమికలదు. పుత్రులందఱును విద్వాంసులును సుశీలురును గుణవంతులును మాతృ పితృ భక్తులునై యుండిరి. అందఱకును వివాహములైనవి. కేవలము భరతుఁడే తెలియని వాఁడు. బ్రాహ్మణునకిదియే చింత:— "ఏదో విధముగ నాయీపుత్రుఁడుకూడ విద్యావంతుడైనచో నేను నిశ్చింతగ మరణింపఁగలను. కాకున్న నాకు వీనిచింతయేతప్ప యింకొకటి యుండదు." ఆతనికి భరతుఁడనిన మమకారము.

భరతునకన్నియును దెలియును. ఆతఁడిట్లనుకొనెను:— ఒకసారి హరిణముమీఁద మమత్వమును వహింపఁగా హరిణముగా జన్మింపవలసివచ్చినది. తండ్రిమీఁద మమత్వమును వహించితినా ముందు జన్మకు తండ్రి కావలసివచ్చును. అని

యాతఁడు పుట్టినప్పటినుండియే తల్లిదండ్రుల యెడల నుదాసీనుఁడుగనుండెను. ఆతని తల్లి ఆతనిని ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించి, బుజ్జగించి. ముద్దిడుకొనుచుండును. తండ్రియు నాతఁడందఱికంటెఁ జిన్నవాఁడగుటచే నాతని ప్రేమయు నాతనిపైననే క్రుమ్మరించెడు వాఁడు. కాని తల్లిదండ్రుల యీ మమకారమంతయును నాతనికి విషసమానముగ నుండెడిది. ఆతఁడెన్నడును నవ్వుచుఁబలికెడు వాఁడు కాఁడు ఎల్లప్పుడు ముగ్ధుఁడుగఁ గూర్చుండును. దీనివలనఁ దల్లిదండ్రులీతఁడు వెఱ్ఱివాఁడు కాదుకదా యని సందేహించుచుండెడువారు.

ఈతని కైదారేండ్లు వచ్చునప్పటికి తండ్రి యీతనికి విధ్యుక్తముగ మిక్కిలి వైభవముగ నుపనయనముగావించెను. ఉపనయన సంస్కారము తర్వాత వేదాధ్యయన సంస్కారము జరుగును బ్రాహ్మణులకు ముఖ్యకర్మ శ్రావణీ ఉత్సవము (ఉపాకర్మ] సాధారణముగ వేదాధ్యయనము నా దినమునుండియే ప్రారంభించెదరు. దీనికి పూర్వము (వసంత, గ్రీష్మ) చైత్ర వైశాఖ, జ్యేష్ఠ ఆషాఢములలో వేదాధ్యయనమునకుఁ బ్రయత్న మొనరించెదరు. ఈ నాలుగు నెలలోఁ బ్రణవ సవ్యాహృతి శిరోమంత్ర సహితముగాఁ ద్రిపదాగాయత్రీ మంత్రమును సస్వరముగఁ జెప్పెదరు. పద, ఘన, క్రమ, జటా స్వరాది సహితముగ వేదమాతయగు గాయత్రి నీవిధముగ జ్ఞాపకము చేసికొనుచుందురు. శ్రావణీదినమున శుద్ధముగ నుచ్చరించుచు సమస్తము సమ్మిళితము కావలయునని ఆదినముననే వేదాధ్యయనమును బ్రారంభించెదరు.

భరతుని తండ్రి ఆతనికి మొదట నాచారశిక్షణ నొసంగెను కారణమేమనఁగా నాచారము వలననే ధర్మము వృద్ధి పొందును. ఆచారహీనుని వేదములును బవిత్రము కావింపఁజాలవు. ఆచారమును జెప్పి యాతఁడు గాయత్రీమంత్రమును కంఠస్థము గావింపఁజేసెను. భరతుని నాతఁడు తన దగ్గఱనే కూర్చుండఁబెట్టుకొని మిక్కిలి ప్రేమతో నిట్లనెను:- "వత్సా! నేనెట్లుచ్చరించుచున్నానో నీవు నట్లే యుచ్చరించుము." రెండు మూఁడు సార్లు భరతుఁడు వినియు విననట్లుండెను. ఎన్నో సార్లు తండ్రి చెప్పఁగాఁ దలను ద్రిప్పెను.

తండ్రి యిట్లు చెప్పెను:- "నాయనా! "ఓమ్" అనుము

అప్పుడాతఁడు "గోమ్" అనును.

అంతఁదండ్రి తలను బ్రద్దలు కొట్టుకొనుచు నిట్లనును:- "ఓరీ! ఈ బ్రాహ్మణ వంశమున నిట్టి మూర్ఖుఁడవు పుట్టితి వేమిరా? వీనికొక యక్షరమైననురాదు" అని వానిని తన కాత్మయఃగుటచే వదలజాలక యిట్లనెను:- 'అబ్బాయి! బాగుగా వినుము "ఓమ్" అనుము.

ఆతఁడిప్పుడు "బీమ్" అనెను.

తండ్రి మరలఁ గోపపడి చెంపలు బాది యిట్లనెను:- "వీఁడెక్కడి మూర్ఖుఁడురా, వీనిచేత ప్రణవము-నుచ్చరింపఁ జేయఁజాలకపోతిని. వీఁడింకేమి చదువఁగలడు? వీనికడుపులో విద్యలన్నియు నున్నవని తండ్రికి తెలియదు. ఈతనికిఁ గర్మ కాండలు, ఉపాసన యవసరము లేదు. ఈతఁడు జీవన్ముక్తుఁడు. జ్ఞానియొక్క నాల్గవ భూమికను దాఁటి జగద్భానమే లేనట్టి

మైదవభూమికకు వచ్చినాఁడు. కాని కర్మకాండలోనున్న తండ్రి దీని నెఱ్ఱుఁగఁగలఁడు. పుత్రమోహమునఁ దండ్రి నాతఁడు వివిధ విధముల భరతునిఁ జావమోదినను నల్లకంబళికి వేఱు రంగంటనట్లాతని కేదియునంటుటలేదు ఆ తఁ డ న్ని యు ను దెలిసియే అస్తా వి స్తముగా మ ాటలాడుచుండెను. బుద్ధిసాగరుఁ డయ్యు బుద్ధిహీనునివలె వర్తించుచుండెను. శాస్త్రములందు బహుశ్రుతుఁడయ్యు జెవిటి, మూఁగవలెఁ బ్రవర్తించుచుండెను. ఆతఁడు సమస్త విధముల ననాసక్తుఁడుగ నుండఁదలఁచు చుండెను. లోకములో నెచ్చట బుద్ధి చమత్కారము కలదో, యెచ్చట సిద్ధులు కనఁబడుచున్నవో అచ్చట బంధనముకలదు. ప్రపంచము చమత్కారమునకు నమస్కార మొనర్చెను. వాచాలుని వెంటఁబరువిడుచుండును మనము ప్రపంచమున కై ఆసక్తినిఁజెందరాదు. ఆసక్తి చెందవలసిన వస్తువు ఘట ఘట మున వ్యాపించియున్నది. అందఱ మనోగత భావముల నెఱుఁ గును. దానిముందు ప్రదర్శనమున కవకాశము లేదు. అందు వలన నాతఁడు తనను వెఱ్ఱివానినిఁగాఁ దలఁచు కొనుచుండెను. తండ్రి తన శక్తికొలఁది శౌచ, వేదాధ్యయన, వ్రత, నియమ, బ్రహ్మచర్య, గురు శుశ్రూష, అగ్ని పరిచర్య, మొదలగువానిని గూర్చి శిక్షణ నొసంగదలఁచెను కాని యాతఁడు తామరాకు వలెనుండెను. ఆతని కడతండ్రి చేయునుపదేశ బిందువొక్క టైనను నిలుచుటలేదు. తండ్రి కోర్కెనెఱవేరలేదు. ఆతఁడు తన కనిష్ఠ పుత్రునకు శిక్షణ నొసంగఁజాలక పోయెను. కనిష్ఠ పుత్రుని గుఱించి చింతించి చింతించి తండ్రి పరలోక గతుఁ

డయ్యెను. భగవత్సేవా రూపమగు నేముఖ్యకర్మ కలదో దాని నా వైదిక బ్రాహ్మణుఁడు మఱచియేపోయెను. ఇంటిలోనది లేదు ఇదిలేదు. దీనినిఁదీసికొని రావలెను, దానిని సమకూర్చ వలెను. పుత్రుఁడెట్లు చదువును, వానికెట్లు జరుగును? ఇట్టి మూర్ఖునకుఁబిల్ల నెవరొసంగెదరు?" ఇట్లు వివిధచింతలనుజెంది చెంది, దుర్లభ మనోరథ సంకల్పములనుజేసి చేసి ఆతఁడీ లోకమును విడిచిపోయెను ఆతఁడు తన పుత్రునిఁ జదివింపఁ జాలకపోయెను. కాలమాతనినిఁ గనికరింపలేదు. పుత్రుని యోగ్యుఁడుగా నొనర్చుటకు ఆనిర్దయ కాలమవకాశ మొసంగ లేదు.

భరతుని బ్రాహ్మణ తండ్రి గతించెను. ఆతని తల్లి తన సవతితో నిట్లనెను:— "అక్కా! నీకు తొమ్మండుగురు పుత్రులు కలరు. నీవు పెద్దదానవు. నాకా ఒక్కఁడే మూర్ఖపుత్రుఁడు. ఒక్కతెయే కుమార్తెకలదు. ఈ పిల్లనేదో యోగ్యుఁడైన వరున కొసంగవలయును. ఈ పిచ్చివానికేదో నాల్గు మెతుకులు పెట్టవలెను. నీ తొమ్మిదిమందితోపాటు వీనినిఁ బదవవానిఁగా భావింపవలయును. నేను నా ప్రాణనాథునితో సహగమన మొనర్చెదను. నీవు సంతోషముతో నాకనుమతినొసంగుము. ఈ పిల్లలను నా యెదుటనే దగ్గఱకుఁ దీసికొనుము."

తన చిన్నసవతి యిటు పలుకుటను గాంచి విప్రుని జ్యేష్ఠపత్ని చాలగ విలపించెను ఆమె యిట్లనెను:— "పరలోక మునకును బతి ననుగమించు నీవే ధన్యురాలవు. సరియే. నీవు వెళ్లుము. నేను నల్పకాలమునఁ బతిలోకమున మీ యిద్దరను దర్శించెదను. నీవీ పిల్లల విషయములో నిశ్చింతగనుండుము.

నా పిల్లలెంతో నీ పిల్లలంతే. వీరందఱొక్క తండ్రి బిడ్డలేకదా! నాకు చేతనైనంత వఱకు వీరికేహానియు రానీయను."

ఇట్లు విని బ్రాహ్మణుని కనిష్ఠభార్య తనపతితో సహగమనము కావించెను. తల్లి దండ్రులిద్దరును పరలోక గతులగుటచే నిప్పుడు భరతుఁడు స్వతంత్రుఁడయ్యెను. ఇప్పుడు తననదుపు చేసెడువారును లేరు. వెనుకనెవరును లేరు. నిర్ద్వంద్వుఁడై యిటునటుఁ బిచ్చివానివలెఁ దిరుగసాగెను. ఆతని హృదయములో జ్ఞానజ్యోతి భగవత్స్మరణ, శ్రవణ, నామగుణ కీర్తనములలోఁ గలుగు సమస్త విఘ్నములను నాశమును గావించు వెలుఁగుచుండెను. ఆతఁడు శ్రీహరి యుగళారుణ చరణ కమలములను నిరంతరము ధ్యానించుచు ధ్యాననిమగ్నుఁడై యుండెను. అజ్ఞానులును, మూర్ఖులునగు, విషయాసక్తులునగు సాంసారికులిట్లనుచుందురు:- "ఈతఁడు మూర్ఖుఁడు. మనముగూడ పిచ్చివారమగుచో నాతనికడ నాతనివలెనే మూకాంధ బధిరులవలె నుండవచ్చును. ఆచరింపవచ్చును ఈతఁడు పిచ్చివాఁడే నను నట్లుగ నాతఁడు వర్తించుచుండెను కాని యాతఁడు జ్ఞానులకును గురువు, యోగులకును యోగేశ్వరుఁడుగ నుండెను.

## భరతుఁడు జడభరతుఁడుగా

3వ

శ్లో॥ నమో నమః కారణవిగ్రహాయ
స్వరూప తుచ్ఛీకృత విగ్రహాయ ।
నమోఽవధూత ద్విజ బంధు లింగ
నిగూఢ నిత్యానుభవాయ తుభ్యమ్॥

శ్రీభాగ. ౫. స్కం. ౧౨. అ. ౧. శ్లో॥

ఉ॥ కారణ విగ్రహంబు నరకాయము నీ యవధూత వేషముల్ భూరి
ధరామరత్వమును బూర్వసమాగమ మాత్మభావముం జారు విహార
మత్యతుల శాంతి గుణంబును గాఢ వర్తనం బారయఁగల్గ నీకు
ననయంబును మ్రొక్కెదఁ బెక్కు భంగులన్ ॥

సాంసారికులు రాత్రింబవళ్ళు జడతాకార్యము లొనర్చు చుందురు. అయినను దమ్ము తాము బుద్ధిమంతులమనుకొని జ్ఞానులను జడులు, మూర్ఖులు, పిచ్చివారలని వారి నెగతాళిచేయు చుందురు. ఈపృథివి అనాది కాలమునుండీ వచ్చుచున్నదనియు, సదా యీ విధముగనే జరుగుననియుఁ దెలిసికొన వలయును. గొప్ప గొప్ప ప్రతాపవంతులగు రాజులు దీనిని దమదనుకొని దీనిలోనే విలీనమైపోయిరి. పృథు, ప్రియవ్రత, ఉత్తానపాద, మను, నహుష, గయ, మాంధాత, సగర, రావణ, రామాదు లెందఱో శూరవీరులు దీనినిఁ దమదనుకొని చెప్పుకొనిరి. కాని యిది యెవరిది? ఈపృథివియందు నాది నాది యనుకొనుట జడత్వము కాదా? మట్టినిబుట్టిన మట్టినిఁ దిని యానందమును జెందుట మూర్ఖత కాదా? చర్మ చర్మ సంఘర్షణమున నానందము ననుభవించుట వెఱ్ఱితనము కాదా? ఎఱుపు, నలుపు, తెలుపు, పసుపు మట్టికి రాగి, ఇనుము, వెండి, బంగారమని పేర్లుపెట్టి, భేదభావమును స్థాపించి రాత్రిందివములు దానిని సంపాదించుటకే ప్రయత్నమొనర్చుచుండుట వెఱ్ఱితనముకాక యింకేమి? కాని మాయామోహమునఁబడి ప్రాణులీ సత్యమువైపు లక్ష్యముంచుటయే లేదు. సత్యాసత్యములు పలికి నాలుగు వెండి బంగారు ముక్కలను గూర్చిన వానిని బుద్ధిమంతు డను

చున్నాము. ఈవ్యర్థ వ్యాపారములం దుదాసీనముగ నున్న వాఁడీ మూర్ఖుల దృష్టిలో జడుఁడుఁ, అజ్ఞుఁడు, వ్యర్థుఁడు, వెఱ్ఱివాఁడు, మూర్ఖుఁడు. మూర్ఖతకును హద్దుకలదు. వెఱ్ఱికిని అంతమున్నది. తనజడత్వమును బుద్ధిమత్వమను కొనుటయు, బ్రహ్మస్వరూపుఁడై క్షణభంగురమగు సంసారమును శాశ్వతముగఁ ద్యజించిన వానిని అజ్ఞులు జడమతి యనుచుందురు.

శుకదేవుఁడిట్లనెను:— "రాజా ! బ్రాహ్మణ భరతుని తండ్రి పరలోక గతుఁడయ్యెను. ఆతఁడు తన చిన్నకుమారునిఁ జదివింపఁజాలకపోయెను. తనమనోరథము పూర్తికాకముందే ఆతఁడీ లోకమును విడిచిపోయెను భరతుఁడిట్లను కొనెను:— "పీడవదలినది. బంధమూడినది. నిత్యము చీవాట్లు చెప్పుదెబ్బలు తప్పినవి." కర్మకాండరూపమగు నపర విద్యనే సమస్తముగ భావించుచుఁ బరావిద్యయగు బ్రహ్మజ్ఞానమునందు బొత్తుగాఁ బ్రవేశములేని ఆతని అన్నలు తొమ్మండుగురు నీతనిని మూర్ఖునిఁగను, విద్యాగంధములేని వానిఁగను భావించుచుండిరి. అందువలన వారితనికి చదువు చెప్పింపలేదు. తండ్రి తండ్రియే. పుత్త్రుఁడెంతటి మూర్ఖుఁడైనను నాతఁడు కొద్దిగనో గొప్పగనో చదువవలయు ననియుండును; కాని సోదరులకంతటి శ్రద్ధయేల యుండును ? చదువకున్నఁబోనిండను కొనిరి. నూరు కొని త్రాగుటకిది చెట్టు క్రియకాదు కదా ! పరిశ్రమ నొనర్చిన సుఖమును బొందును. లేకున్న నటునిటుఁ దిరుగును ? అని యనుకొని వారుదాసీనులైరి. వారితని నాదరింపకుండిరి.

సాధారణపుటజ్ఞానులకు నితర నరపశువులీతనినిఁ బిచ్చి వాఁడనియు, మూర్ఖుఁడు, మూఁగ, చెవిటి, వ్యర్థుఁడు, జడుఁడని యెన్నియో పలుకుచుండిరి. ఈతఁడు వారి మాటలనువిని నవ్వి తాను బిచ్చివాఁడనునది స్థిరమొనర్చు కొనుచుండెను.

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఈ సాంసారికు లందఱును స్వార్థులే, మానవులు స్వార్థములేక యేపనినిఁ జేయరు. తనకు స్వార్థమున్నచోట వారితో సంబంధము లేకున్నను సంబంధమును బెట్టుకొందురు. నీవు నా మిత్రుని బావమఱది పినతండ్రికి అల్లుని మామకొడుకునకు పిల్లనిచ్చిన మామలు. ఇదేమైన చుట్టరికమేనా? కాని స్వార్థమే అన్నిటి కంటె ముఖ్య బంధుత్వము. స్వామీ? ఈ మానవులు సాంసారిక స్వార్థపరులనే సమస్తముగఁ దలఁచుచున్నారు. తమ స్వార్థము నెఱవేరుటకు గొప్పయుక్తులను బన్నుచుందురు. ఒక కథయున్నది. ఒకానొకఁడొక బండిలో నెచ్చటికో పోవుచుం డెఁడు, బండి యిరుసు విఱిగిపోయెను. ఒక గ్రామమున నొక రేఁగుచెట్టుక్రింద బండిని నిలుపుకొనెను. ఈ చెట్టెవరిదని అందఱునడిగిరి. ఈ చెట్టున కెదురుగా బాగుగాఁ గట్టఁబడిన ఇంటివారిదీ చెట్టని ఇంకొకఁడనెను. ఆ మహాశయుఁడు తానొక బుద్ధిమంతుఁడననుకొని గర్వముతో నట్టహాసముగ నాయింటికిఁ బోయెను. దైవికముగ నాయింటిలోని పెద్ద లతఁడెచ్చటికో బయటకుఁబోయెను. వెళ్ళఁగానే ఆతఁడు పిల్లలతో నిట్లనెను:— "పండితుల వారెచ్చటికిఁ బోయిరి." పిల్లలిట్లనిరి:— "అయ్యా! వారు బయటకు వెళ్ళిరి, తమరెవరు?"

ఆతఁడిట్లనెను:— "మనకు దగ్గఱ బంధుత్వముకలదు. గ్రామములో నడుగరుగాని నగరములో నట్లుకాదు. అడుగు చుందురు. ఆరా తీయుచుందురు." పిల్లలు లోపలికివెళ్ళి తల్లితో 'ఎవరో మనబంధువులువచ్చి' రనిరి. ఇంకేమున్నది. నవకాయ పిండివంటలతోడను పంచభక్ష్య పరమాన్నముల తోడను వంట తయారయ్యెను. చిక్కని గేదెపాలతోఁ బర మాన్నమును సిద్ధమయ్యెను. ఆతఁడిష్టము వచ్చినట్లు తినుచు మూఁడు నాల్గు దినములుండెను, ఇంతలోఁ బండితులవారును వచ్చిరి. అన్నియును బాలతోడనే పిండివంటలుజరుగుచుండెను. ఈ పిండివంటలన్నియు నెవరికని యాతఁడడిగెను. ఎవరో మన బంధువులు వచ్చినారని పిల్లలుచెప్పిరి. ఈ బంధు వెవరబ్బా యని యాతఁడు విచారించెను. గబగబలేచి ఆ చెట్టు దగ్గఱకుఁ బోయెను. బంధువులేచి సత్కారము కావించెను, మాటలలోఁ జాల సంకోచముతోఁ బండితుఁడిట్లడిగెను:— "క్షమించుఁడు. నాకు జ్ఞాపకము వచ్చుటలేదు మన బంధుత్వమేమి?"

ఆ మహాశయుఁడు గంభీరముతో నిట్లనెను:— "మనకు బాదరాయణ సంబంధము."

పండితుఁడు చాల చిక్కులోఁబడెను. ఈ సంబంధ మెచ్చటను వినవేలేదే. కొంచె మాలోచించి యిట్లనెను:— "బాదరాయణ సంబంధమనిన నాకర్థమగుటలేదు."

ఆబంధువిట్లనెను:— "మా బండి యిరుసు బదరీ వృక్షముతోఁ జేయఁబడినది మీ యింటిలో బదరీ వృక్షమున్నది. మీకును మాకును బాదరాయణ సంబంధము లేదా? "

పండితుఁడు నెత్తి బాదుకొనుచు "బాదరాయణ సంబంధ
మున్నదో లేదో కాని పస్తు పరమాన్నముల సంబంధముల
మాత్రము తప్పక ఉన్నది." స్వార్థమున్నచో జనులు మాన
వులు బాగుగా నాదరసత్కారము లొనర్చుచుందురు. వారికే
మియును సంబంధము లేకపోయినప్పటికి స్వార్థము లేనప్పుడు
సహోదరునిఁగూడ నుపేక్షించుచుండెదరు. వారి సంగతి విచా
రింపనే విచారింపరు. ఈ విషయము స్త్రీ పురుషులయందు
సమానమే కాని పురుషులకంటె స్త్రీలయందు కొంచెమధిక
ముగ నుండును. ఇల్లాలైతె యింటియజమాని యగుటచేతనే
మమకార మెక్కుడగును. తన పతికి మంచి మంచి వేడియన్న
మును బెట్టుకొని యింటిలోని మామకును, బావలకు, మఱఁదు
లకును జలిది యన్నమును బెట్టుచుందురు. అడిగిన నిట్లనును:—
"నేను జూడలేదు ఇదిగో తినుఁడు. దానిని వదలి వేయుఁడు.
ముఖ్యముగ మఱఁదులందు వీరికి రోషమెక్కువ. పైని
మఱఁదియగు వదినె దొ ఆకిన వాఁడే అదృష్టవంతుఁడు.
కాకున్న వదినెల కోపమంతయు మఱఁదులమీఁదనుగనే పోవును.
పాసిన చల్దియన్నమును దేబె మఱఁదుల ముఖమునఁ బడవేయు
దురు. సంపాదించు మఱఁదినిఁగాంచిన వానిని నిజ భర్తకంటె
మిన్నగ గౌరవించుచుండెదరు."

శుకుఁడిట్లనెను:— "రాజా! జడభరతునకు తొమ్మండు
గురు వదినెలుండిరి. ఆతని నెవరును సరిగాచూచెడువారు కారు.
అందఱకంటెఁ జివర ఆతనికి భోజనమును బెట్టుచుండెడువారు.
తవుడు రొట్టెలు, వేపుళనగ, ఆలచంద పప్పుతోఁ జేయబడిన

రొట్టెలను బెట్టుచుండిరి. ఒకొక్కప్పుడు పాసినకూడు పెట్టెడు
వారు. మాడు చెక్కలీతనిపాలనే పడుచుండెడివి. ఇంటిలో నెవరి
కినిఁ బనికిరాని వన్నియు నీతని పాలఁబడుచుండెడివి. ఈతని రుచి
యవసరమే లేదు. దేని నొసంగిన దానినే కడుపునిండఁదినును.
ఈతని యింటిగోల, పిల్లలగోడు పట్టనేపట్టదు. గృహస్థులకు
రాత్రింబవళ్ళు చింతయే. పాలుఃపెరుగులతో మెక్కుచున్నను
వీరికి రుచింపదు విరక్తుఁడు నిశ్చింతగానుండుటచేఁ జప్పదనము
లోనే ఛప్పన్నారు భోగముల నాస్వాదించును నిశ్చింతవలన
భరతుని శరీరమూరెను. ఆతఁడు బలిసిన ఆఁబోతువలె నిటు
నటుఁ దిరుగసాగెను. ఎవ్వరినిఁ గఠినముగ మాటలాడఁడు.
ఎవ్వరినిఁ గోపఁబడఁడు. అందువలన నందరును సహజముగఁ
బ్రేమించుచుండిరి. ఈతఁడొక మాసి చినిఁగిన పాతవస్త్రమును
నడుమునకుఁ జుట్టుకొనును వానకురిసిన వానలోనే యుండును.
చలియైనచోఁ జలిలోనే దిగంబరియై పడియుండును. ఎండ
యగుచో నెండలోనే మాడుచు నానంద మనుభవించు
చుండును పిల్లలీతనినిఁబట్టుకొని యిట్లందురు:— ఓరీ! జడుఁడా!
కూర్చుండుము. ఈతఁడు కూర్చుండిన వారీతనిని గుఱ్ఱమని
యెక్కుచుందురు. ఇంతలోనే ఎవఁడో వచ్చి పిల్లలను వారించి
పంపుచుండును. అప్పుడు పిల్లలందఱును బరువిడి పోవుచుందురు.
అప్పుడాతఁడు ఈతనితో "ఈ పిల్లలను బగుల వేయుము"
అనఁగానే ఆతఁడట్టే నలుగురు పగులవేయునంతఁ దానొక్కఁడే
పగులఁవేయును. అంతపనినిఁ జేయించుకొని ఆతఁడు కడుపునిండ
భోజనమును బెట్టుచుండును. ఈతనికా భోజనమునకే సంతో

షము. ఈతనికింకొక బంధన మవసరమే లేదు. ప్రజలు స్వార్థులుగ నుందురు. ఈతఁడు బాగుగాఁ బనిచేయఁగలఁ డనియు, కూలి లేకయే పనిచేయుననియుఁ దెలిసికొని ప్రతిపనికిని నీతనినే పట్టుకొని తెచ్చుచుందురు. ఈతఁడవును కాదనక వారి వెంటఁబడివచ్చుచుండును. ఎవ్వరైనను గడుపునిండఁ బెట్టినఁ గడుపునిండఁ దినును. తక్కువగఁ బెట్టినఁ దక్కువగఁ దినును. ఎవ్వరేమియును బెట్టకుండినచో నాఁకలితో డనే పడి యుండును అడుగుట అలవాటు లేదు. ఎవ్వరైనఁ దలపై బరువు నుంచి "మా వెంటరావలసిన' దనఁగా వారి వెంటఁబడిపోవును. ఎంతదూరము తీసికొనిపోయిననంత దూరము పోవును ఆతనికిఁ జివరకేమైన డబ్బులిచ్చినఁ గైకొనును. ఈయకున్న నట్లే తిరిగి వచ్చును బాగుగా నాఁకలైనను దిండి యెవ్వరి నడుగకుండును. ఎవ్వరైనను బిలిచి పెట్టినఁ గూర్చుండి తినును, స్నానమును లేదు, పానమును లేదు, నవ్వుటయునుఁ లేదు యేడ్చుటయును లేదు, నిర్ద్వంద్వుఁడై మత్తుగాఁ బడియుండును. ఆఁబోతువలె నిటు నటు హర్షశోక విరహితుఁడై స్వచ్ఛందముగఁ దిరుగును. ఏల ననఁగా నాతనికి సిద్ధ విశుద్ధజ్ఞానానంద రూపమగు నాత్మక్షా నము లభించినది. అందువలన నాతనికి దేహాభిమానస్ఫూర్తి లేదు. ఆతఁడు కటియందు మలినవస్త్రమును ధరించినను, శరీర మంతటను మురికి పేరుకొనియున్నను, దుమ్ములోనే పరుండు చుండుటచే శరీరము ధూళిధూసరితమైనను నాతని బ్రహ్మ తేజము స్పష్టముగ నుట్టిపడుచుండెడిది. ఆతని మెడలో నొక పాతమురికి తెగినజందెముండెడిది. దాని నాతఁడెప్పుడు నును

కుటయును లేదు, కడుగుటయును లేదు. ఆతనినిఁగాంచి యందఱు అను నీతఁడెవఁడో నీచ బ్రాహ్మణుఁడనియు, లేక అన్యద్విజ వర్ణములోని పిచ్చివాఁడనియుఁ దలంచుచుండిరి, గ్రామము లోని వారందఱెఱుంగుదురు. అందఱాతనిని జడుఁడని పలుకు చుండెడువారు. ఇప్పుడతఁడు భరతుఁడు జడభరతుఁ డయ్యెను

శుకుఁడిట్లనెను:- *రాజా! నిత్యము బ్రహ్మానంద నిమగ్నులగు యోగులనేకు లనేకరూపములను ధరించి చరించు చుందురు. కావునఁ బొరబాటుననైనను నెన్నఁడును జడుఁడు మూర్ఖుడని యవమానముచేయఁరాదు. అందఱిను భగవద్రూప మని యాదరదృష్టితోఁ జూడవలయును. ఇదియే శాస్త్రముల సార సిద్ధాంతము.

## జడభరతుఁడు పంట కాపరిగా

330

శ్లో॥ లోకః స్వయం శ్రేయసి నష్టదృష్టి
ర్యోఽర్థాన్సమీహేత నికామ కామః ।
అన్యోన్యవైరః సుఖలేశ హేతో
రనంత దుఃఖం నచ వేద మూఢః ॥

(శ్రీ) భాగ. ౫ స్కం. ౫ అ. ౧౬. శ్లో॥

సీ॥ జనులెల్ల సర్వవాంఛలఁ జేసి యత్యంత
మూఢులై నైహికంబును మనంబు

లందుమ గోరుదు రల్ప సౌఖ్యములకు
నన్యోన్య వైరంబు లంది దుఃఖ
ములఁబొందుదురు గాన మునుకొని గురుఁడైన
వాఁడు మాయామోహ వశుఁడు నెంత
జడుఁడు నైనట్టి యా జంతువు నందును
దయగల్గి మిక్కిలి ధర్మ బుద్ధిఁ

గీ॥ కన్నులున్న వాఁడు గానని వానికిఁ
దెరువుఁజూపినట్లు దెలియఁబలికి
యతుల మగుచు దివ్య మైనయా మోక్షమా
ర్గంబుఁ జూపవలయు రమణతోడ.

(శ్రీమదాంధ్ర భాగవతము)

ఎట్లైననుండనిండు. సోదరుఁడు సోదరుఁడే మనము మనతోఁ బుట్టువు నెంతగా నవమానించినను, నెంతగాఁదిరస్కరించిననుఁ నెంతగాఁదిట్టినను, అదిమనకు బాగుగనే యుండునుగాని, మఱి యొకఁడు మన సోదరుననిచో మనకు బాధకలుగును అది సోదరుని హితదృష్టితోఁగాదు, తనకున్న సంబంధదృష్టిచేతనే. ఇందులో మనకవమానమున్నది. మనతో నాతనికిసంబంధము కలదు. మనగౌరవ రక్షణకొఱకు మనము దానిని సహింపఁజాలము. కౌరవ పాండవులు పరస్పరము విరోధులుగ నుండిరి. కాని దుర్యోధనుని యక్షులవమానింపఁగా ధర్మరాజు సహింపఁజాలకపోయెను ఆతఁడు స్పష్టముగ నిట్లనెను:- "మేము పరస్పరము పోట్లాడుకొనునప్పుడు కౌరవులు నూఱుగురు. మేమైదుగురము. ఇతరులు పోరాటమునకువచ్చిన మేము నూటైదు

గురము, సేమందఱమును వారితోఁ బోరాడెదము. ఇదియే సంబంధ మహాత్మ్యము.

శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! ప్రపంచములో మానవులు మంచివారును జెడ్డవారును నుందురు. కొందఱు దయాళువులు భరతుని సోదరుల కడకుఁబోయి యిట్లనిరి:-"సత్పురుషులారా ! మీరు తొమ్మిదిమంది సోదరులు. భగవంతునికృప చే మీకు అన్నమునకును, బట్టకును గొదువలేదు. ఇంటిలోనున్న కుక్కలకును గొంచెము పడవేయుచుందుము. మీతోఁబుట్టిన వారిలో నొక్కఁడు పిచ్చివాఁడున్నాఁడు. వానికన్నము పెట్టఁజాలరా?"

అంత నందఱిలోఁ బెద్దవాఁడు వినయమున మనవిచేయుచున్న బ్రాహ్మణునితో నిట్లనెను:- "అయ్యా ! మీరేమి మాటలాడుచున్నారు? మీ కృపవలన మావద్ద నేకొదువయునులేదు. పదుగురువచ్చి భోజనమొనర్చినను దఱుగునది లేదు. మేము వానినన్నము తినవలదనుటలేదు. వానికే పనియును జెప్పుటలేదు. వాఁడు తన యిష్టము వచ్చినట్లు ఇటునటుఁదిరుగుచుండును."

అంత నా వృద్ధ బ్రాహ్మణుఁడు పెద్దరిక స్వరమునని ట్లనెను:- "అబ్బాయీ ! మీ ప్రతిష్ఠ మీ చేతిలోఁగలదు. మీరు నామాట కేమైన ననుకొండుగాని మీ వాఁడు పొట్టకొఱకు ఇంటింట కూలిచేసి తిరుగవలెనా ? ఆతఁడు పనియే చేయవలసియుండిన మీ యింట పనికి తక్కువా ? ఇంటిలోని పనియే చేయవచ్చునే ? వానికేదైనఁ బనినిఁ జెప్పుఁడు. మీ

తండ్రికిని నాకును సంబంధముకలదు కనుక నీకు చెప్పుట సంభవించినది. నీవు వేఱుగాఁ దలఁపవలదు.

అంత నతివినయము జడభరతుని సోదరుఁడిట్లనెను:- "అయ్యా! మీరు మమ్ముల నేల బిగియ పెట్టెదరు? మిమ్ము లను మేము మా తండ్రితో సమానముగ భావించుచున్నాము. ఇఁక నాతఁడితరుల పనిసిఁ జేయుచుండుటను మీరు గాంచినచో మాకే శిక్షనైన విధింపుఁడు. ఇప్పుడిఁక మేము వానికింటిపనులే చెప్పెదము." ఇదివిని యా బ్రాహ్మణుఁడు వెళ్ళిపోయెను. మఱునాఁడు సోదరులందఱిట్లనుకొనిరి:- "వీఁడితరులపనిఁ జేయు చున్నప్పుడు మనపనిలో నేల వినియోగించు కొనఁగూడదు? వీఁడు పండితుఁడుగాని పురోహితుఁడుకాని కాఁజాలఁడు. వీనికి పొలము పనిసిఁ జెప్పవలయును."

ఇట్లాలోచించి మఱునాఁడు భరతునితో నిట్లనిరి:- "ఓరీ జడుఁడా! నీవు వారిపని వీరిపని నేలచేసెదవు? ఇంటిపనులు చేయవేమి? పొలముపని చేయుము."

దీనిలో బాధయేమికలదు? పాఱ భుజము మీఁదఁబెట్టు కొని సోదరులతోఁగూడి పొలమునకుఁబోయెను. సోదరులు పొలమును మూఁడునాలుగు మడులుగా నొనర్చి సాయంకాల మగునప్పటికి పొలమును బాగుచేయవలయుననిరి. ఈతఁడు తల నూఁపుచు సరే' యనెను. ఇది విని సోదరులు ఇంటికిఁబోయిరి.

ఇప్పుడాతఁడిట్లను కొనెను:- 'ఇప్పుడు తెలివిగాఁబని చేయుచో వీరెల్లప్పుడును నన్నే బాధించెదరు. అందువలన నాతఁడు గుంట త్రివ్వుటకుఁ బ్రారంభించెను. పొలములో

నొకవైపునఁ ద్రవ్వుటచే గుంట యేర్పడి, రెండవవైపున పెద్ద
కొండంత మట్టి పోగుపడెను. పగలంతయును బనిచేయుటచే
శరీరమంతయును జెమటపోసెను. సాయంకాలమున సోదరు
లందఱును వచ్చిరి. వారీపనినిఁజూచి చకితులైరి. పెద్దన్నగారు
చాలకోపబడి తిట్టెను. అంతట చిన్నన్నలిట్లు చెప్పిరి:- "అన్నా!
నీవెందుల కట్లు వ్యర్థముగఁ గ్రోధమును జెందెదవు. వానికి
బుద్ధియే యుండినచోఁ దండ్రి అంతచదువును జెప్పిన నొక్క-
యక్షరమైన రాకుండునా? నీవు వానికి ఒప్పగించినపనియేమిటి?
పొలము పనిచేయుటకును తెలివికావలయును. నీవు వీనికింకొక
పనిసిఁ జెప్పుము."

ఇది విని పెద్దన్న యిట్లనెను:- "సరే, పొలములో
నొక మంచెను బాతుఁడు వీఁడు రాత్రింబవళ్ళచ్చటనే యుండి
పిట్టలను దోలవలెను దీనికి తెలివితోఁబనిలేదు"

అంతమిగిలిన సోదరులిట్లనిరి:- ''అవును. ఇది బాగుగనే
యున్నది ఇచ్చట నీవు మంచముమీఁదనుండి 'హూ' 'హూ' యను
బశుపక్షులను దోలుచుండఁగలఁడు. అన్నలందఱును సమ్మతిం
చుటచే నట్లేజరిగెను. పొలము మధ్య నెత్తైన మంచెను బాతిరి.
భరతుని దానిపైఁగూర్చుండబెట్టి యిట్లనెను:- యెల్లప్పుడు
జాగ్రత్తగ నుండవలెను పొలమును బిట్టలు పాడుచేయకుండఁ
జూడవలయును"

ఈ పనివలన నాతఁడత్యంతానందమును జెందెను.
ఆతఁడు లోలోన నిట్లనుకొనెను:- "పీడ వదలినది. అడుసులో
దిగుటయును లేదు కాలు కడుగుటయును లేదు." అని యేకాంత

ముగఁ గూర్చుండి భగవద్భజనము చేసికొనుచు హాయిగఁ గాలమును గడుపుచుండెను.

ఇప్పుడీతఁ డెల్లప్పుడును రాత్రింబవళ్లు వీరాసనమునఁ గూర్చుండి యుండెను. పశుపక్షులను దోలుట లేదుగాని భగవత్పాద పద్మములందు మనస్సును నిలిపి, ప్రేమపూర్వకముగ ధ్యానము చేయుచుండెను. మనస్సు భగవంతుని రూపమాధుర్యమునందుఁ దన్మయ మొనర్చెడువాఁడు ఏదో వేళకు తన సోదరులు పంపిన చలిదిదో, పాసినదో, ఏదో కూటినిఁ బంపిన దానినిఁదిని చెఱువులో నీరు త్రాగెడువాఁడు. ఒక్కొక్కప్పు డన్నము యింటినుండి రాకుండినచో చెఱువులోని నాచు మొదలగు మొక్కలనుబీకి దానినే నమలితినెడువాఁడు. ఆతనికి చింతగాని, దుఃఖముగాని లేదు. కడుపునిండఁదిని ముసుఁగు బెట్టుకొని నిద్రించెడువాఁడు, చలిలో, నెండలో బఱ్ఱె గొడ్డువలెఁ బడియుండును. వెండ్రుకలు పెరిగి జడలు వేనుకొనెను. గడ్డము పెరిగెను. శరీరముయొక్క చర్మము అడవి ఒఱ్ఱెలకువలె నల్లగను గఠోరముగను నుండెను. నడచునపుడా తఁడేనుఁగు గున్నవలె నూగుచు నడుచును. దూరమునఁదన యన్నలరాక గాంచినచో హాహాహాయని యఱచుచుండును వారు వెళ్ళిపోఁగానే మరల ధ్యాన నిమగ్నుఁడగును. ఆతనికి. సింహశార్దూలముల భయములేదు. ఆతఁడు భయమునుగూడ భయపెట్టెడువాఁడు. ఆతఁడీ ప్రపంచములో బ్రహ్మానంద సుఖము ననుభవించుచుండెను. శీతోష్ణ, మానావమాన, కీర్త్యప కీర్తులను, సుఖదుఃఖములను సమానముగఁ జూచు

కొనెడువాఁడు. ఆతఁడనుకూల ప్రతికూలములందును నానంద ముగ నుండెడువాఁడు. అందఱాతనిని బిచ్చివానిఁగ నెంచు చుండిరి, కాని యథార్థమునకు స్వార్థ సంపాదనమందు సదా సావధానముగ నుండెడువాఁడు. ఆతనినిఁ దన మార్గమునుండి తప్పింపఁగలదేదియును లేదు.

ఆతని సోదరులాతని యీ యుచ్చావస్థ నెఱుఁగఁ జాల కుండిరి. ఏమైన ననుకొననిండువారు కర్మకాండనే ముఖ్యముగ నెంచుకొనియుండిరి. వారు తామే కులీన విద్వాంసులనియు, సర్వ శ్రేష్ఠులనియు భావించుచుండిరి. వారికి సమస్తమును స్వర్గసుఖమే. వారు మోక్ష మార్గము నెఱుఁగఁ జాల కుండిరి. ఊసర క్షేత్రములో మొలకలెత్తనట్లు అనధికారు లగు వీరికుపదేశించుట వ్యర్థమని భరతుఁడు తలఁచెను. పదునగు నేలయందు భూమిని సమయమునకుదున్ని, విధ్యుక్త ముగ విత్తినచో నది యంకురితమై పుష్పించి ఫలించును. భరతుని జీవితములో నొక్కఁడే అట్టి యధికారి లభించెను. ఆతని సమక్షముననే ఆతఁడు తనజ్ఞాన భాండారమును దెఱచెను. ఆ యుపదేశ మొసంగుటచే భరతుఁడ జరామరుఁడయ్యెను. ఆ జ్ఞానము వలననే అసంఖ్యాకులగు సంసారమగ్నులగువారు, అసారమగు నీ సంసారమును దాటిరి. అట్లే ముందును దరింపఁ గలరు."

శుకుఁడిట్లనెను:— "రాజా ! ఈ విధముగ నిష్ఠుఁడు జడ భరతుఁడు పాలము కాపరియయ్యెను."

శుకుఁడిట్లనెను:- "రాజా! భరతుఁడిప్పుడు పొలము కాపరియై భజనధ్యానమందు మగ్నుఁడయ్యెను. ఆ నగర సమీపముననే ఒక శూద్రరాజుండెను. ఆ రోజులలో నాటవికులు చాలమంది రాజులైరి; వారిలోఁ జాలమంది రజోగుణులు, తమోగుణులు నగుటచేఁ గాళికాదేవి నుపాసించెడువారు. వారు మదిరామాంసములను, గొఱ్ఱెలను, మేఁకలను, దున్నలను గాళికాసమ్ముఖమున బలియిచ్చు చుండెడువారు. ఒకొక్కప్పుడు మానవులనుగూడ బలియిచ్చుచుండెడువారు. తూర్పు దేశములందిప్పటికిని కాళికోపాసన జరుగుచుండుచోట నీబలి జరుగుచునేయుండును.

ఆ శూద్రరాజునకు సంతానములేదు. ఆతఁడు తనకుఁ బుత్రుఁడుదయించినచో నరబలి యిచ్చెదనని భద్రకాళికి మ్రొక్కుకొనెను.

దైవికముగఁ గాళీకాదేవి కృపవలన నాతనికి పుత్రుఁడుదయించెను. అందువలన నాతఁడు సంతోషమును జెంది భద్రకాళికి గొప్పవైభవముగఁ బూజాదు లొనర్పవలయునని ప్రయత్నించుచుండెను. పూజాసామాగ్రి యంతయు సమకూరెను. సర్వలక్షణ సంపన్నుఁడగు వానిని బలి నొసంగుటకుఁ గొని రావలయునని ఆజ్ఞయొసంగెను. సేవకులు వెదకిరి. కాని స్వయముగఁ దలనొసంగుట కెవరువచ్చెదరు? వారికి బలిదానమునకై పురుష పశువెవఁడును దొరకలేదు చివరకువారరణ్యమందున్న నొక పథికునిఁ బట్టుకొని తెచ్చిరి. వాఁడు తనను బలి నొసంగుటకు తెచ్చినారను సంగతిని దెలిసికొని చాల

భయపడెనుగాని యేమియును జేయలేదు. వారాతనినొక త్రాటిచే బంధించి, మందిర సమీపమునఁ గట్టివైచి వారందఱును నిద్రించిరి. కావలి వారందఱును నిద్రపోయిన పిమ్మట నాతఁడు మెల్లఁగా లేచి, త్రాటి ముడులనన్నిటిని విప్పి, వెనుక ద్వారముగుండా పాఱిపోయెను.

అర్ధరాత్రియందు సేవకులు మేల్కాంచి చూచుకొనఁగా బలిగా నీయఁదలచినవాఁడు పాఱిపోయినాఁడని తెలిసికొని చాల భయపడిరి. వారు పరస్పరమిట్లనుకొనిరి:- రేపు బలియీయవలసిన దినము. ఈసంగతి రాజునకుఁ దెలిసినచో నిశ్చయముగ మనలో నొకనిని బలియీయఁగలఁడు. కావున నీసంగతి రాజునకుఁ దెలియక ముందే ఇంకొకనినిఁ దీసికొనిరావలెను. అట్లు చేసినచో రాజుపని నెఱవేఱఁగలదు. మనము సంకటమునుండియు బయట పడఁగలము." అని యిట్లాలోచించుకొని అట్టి వానిని వెదకుటకై బయలు దేరిరి.

సంయోగవశమున వారికి పొలమున మంచెమందు వీరాసనమునఁ గూర్చుండిన సర్వశ్రేష్ఠుఁడగు మునియు బరమ జ్ఞానియునగు భరతుఁడు కనఁబడెను. సేవకులలో నీతని నెఱుఁగని వారులేరు. ఆతఁడిట్లనెను:- "ఓరే! ఈజడుఁడు బాగుగా బలిసి యున్నాడు. వీఁడేమి చెప్పిన దానినిఁ జేయఁగలఁడు మనవెంట రమ్మనిన రాఁగలడు ఈస్థూలకాయుఁడు హృష్టపుష్టముగను నున్నాడు రాజు వీనిని గాంచి చాలసంతోషింపగలఁడు. భద్రకాళియు నిట్టి బలిసిన మానవుని బలియొసంగిన బరమ సంతు

ష్టినిఁ జెందఁగలము. వీఁడెట్టుకూడ చెప్పడు పిచ్చివాఁడు గాను న్నాఁడు. వీనినే పట్టుకొని పోవుదము."

అవసరమున దోషము బాటింపదు,

రాజసేవకులు, భరతుని కడకుఁ బోయి యిట్లనిరి:— "ఓరీ పిచ్చివాఁడా! నీవు మా వెంట రావలెను. మేము నీకు తినుటకు లడ్డు పెట్టెదము ఈతనికి చిరుతిండ్లమీఁద లేదు. వారు రమ్మనగానే బయలుదేరెను. ఈతఁడు పారిపోకుండుటకై నాల్గు వైపులను గట్టిగఁ దాళ్ళతోఁ గట్టివేసిరి. తాళ్ళతోఁ గట్టినను నాతఁడు కాదనలేదు. ఆరాత్రియే యీతనినిఁ దీసికొనివచ్చి మందిరములోఁ గూర్చుండఁబెట్టిరి.

ప్రాతఃకాలమయ్యెను. రాజు తనపురోహితుని వెంటఁ గొనివచ్చెను. ఆతఁడు రాఁగానే బలిపురుషునిఁ గాంచి యిట్లనెను:— "వీఁడు నిన్న చిక్కియున్నాఁడు తెల్లవారునప్పటి కీతఁడింత బలిసినాఁడేమి?"

సేవకులిట్లనిరి:— "మహారాజా! ఈతఁడు తెల్లవారు వఱకును మెక్కినాఁడు అందులో దేవికృపకలదు. ఆమె మహిమ నెవఁడెఱుఁగఁగలఁడు? చూడుఁడు, ఈతఁడెంతగా నానందించుచున్నాఁడో" రాజు మఱిప్రశ్నింపనేలేదు ఆతనికి కావలసినది బలియిచ్చుటయే కదా! బలిపశువిదియే కదా!

ఆతఁడాటవిక దస్యులకును, దోపిడిగాండ్రకును రాజు. తన పరివారముతో లూటీలొనర్చుచు నడవిలోఁ గోటకట్టుకొని నివసించుచుండెను. దస్యులందును నాకాలమున ధర్మకర్మలుండెను. వారికి పురోహితుఁ డుండెడివాఁడు. వారి యిష్టదైవము

నకు వైభవముగ విధివిధానముతోఁ దామసపూజను చేయు చుండెడువారు. దస్యురాజుకడ బలిప్రయత్నము జరుగుచుండెను. భరతుని బలిపశువుగా నొనర్చిరి. బలిదానమునకు పూర్వము బలిపశువునందు దేవతాహ్వాన మొనర్చుచుందురు. విధ్యుక్తముగ నాతనికిఁ బూజ జరిగిన పిమ్మట బలినొసంగెదరు

దస్యురాజ సేవకులు భరతుని ముందుగా విధ్యుక్తముగ స్నానము కావింపఁజేసిరి. ఈతఁడు చిన్నప్పుడేమైనఁ దనతండ్రి బలవంతమున స్నానముచేసినాఁడేమో, కానున్న నీతనికి స్నానముతో నేమిపని? నేఁడు నలుగుతో సుగంధ ద్రవ్యములతో నీతనికి స్నానము జరిగెను. స్నానము చేయించి యీతనికి క్రొత్తవస్త్రమును గట్టిరి. శరీరమంతటను సుగంధమును నలఁదిరి. నానావిధములగు సొమ్ములను ధరింపఁజేసిరి. సుగంధ పుష్పములతోఁ గూర్చిన మాలను ధరింపఁజేసిరి. అనేకవిధములగు వ్యంజనములుగల భోజనమును ఆతనిముందుఁ బెట్టిరి. ఈతనికి రెండుదినములనుండి తిండిలేదు. కన్నులు మూసికొని తినుటకారంభించెను. ఉప్పుకారముల రుచితో నీతనికిఁ బని లేదు. ఉన్నదాని నొక్కమాటుగా నోటఁబెట్టుకొని మెక్కవలసినదే. లడ్డులడ్డు మ్రింగుటయే. మంచి పెరుగు లభించెనా మొగురవేయును. ఇదేవిధముగఁ బొట్టనిండుగ భోజనమొనర్చెను.

శ్రీ శుకుఁడిట్లనెను:- "మహారాజా! మహర్షియు, జ్ఞానియు నగు నీతని నిర్ద్వంద్వతను గమనింపుము. మృత్యువెదుటనిలిచియున్నది. ఈతఁడు కాళికా సమ్ముఖమున బలియీయఁబడు

నని అందఱకును దెలియును. ఆతని శిరస్సు తీక్ష్ణ ఖడ్గధారచే ఛేదింపఁబడఁబోవుచున్నదని తెలిసియు, నిసుమంతైన నాతనికా చింతలేక మిక్కిలి యానందముతో భోజనము చేయుచుండెను. ఈతనికి మరణభయమును లేదు. ప్రాణములమీఁద మోహా మునులేదు. ఏది జరుగుచుండిన దానిలోనే మగ్నుఁడగుచుం డెను. ఆతనికి అనుకూల ప్రతికూలముల భేదములేదు.

భరతుఁడు కడుపునిండఁ దినిన తర్వాతఁ బెద్దగ రెండు సార్లు త్రేపి; పొట్ట నిమురుకొనెను. అంత సేవకులు ధూప, దీప, మాల, పుష్ప, ఫల, పత్ర, కంఠసూత్ర, ఇక్షుఖండాదు లను, యవాంకురములను, వివిధ విధములగు నైవేద్యాదులను బూజాసామగ్రిలను గొనికొని, వివిధ వాద్యములతో బలిపీఠ స్థానమునఁ జండీ సమీపమున నుంచిరి. ఈతఁడు ముందు నవ్వుచు మదించిన యేనుఁగు గున్నవలె వెళ్లుచుండెను. ఇదివ ఱలో నరబలికి వచ్చిన నరపశువు ఊరక యేడ్చుచు దుఃఖిత మనస్కుఁడై యుండెడువాఁడు. ఈతఁడో ఒక విచిత్ర బలి పశువువలె నున్నాఁడు. అమితానందముతోఁ దనలోఁ దాను నవ్వుకొనుచున్నాఁడని దొంగలందఱును నాశ్చర్యచకితులగు చుండిరి, కాని ఈతఁడు పశువుకాఁడు. పశుపతియని వారికి తెలియదు. ఈతఁడు నరుఁడుకాఁడు నరర్షభుఁడు, కాళికా శక్తియు నీతని పాదధూళిని శిరస్సున ధరించి ధన్యనసుకొనును.

జడభరతుని బలిపశువుగా నొనర్చి ప్రదర్శనముతో మందిరములోనికిఁ గొనిపోయిరి. అచ్చట మునుముందుగా దస్యుల పురోహితుఁడు అనేక మంత్రములతో భద్రకాళినిఁ

బూజించెను. తర్వాత దేవిని ఉష్ణరక్తముతో సంతుష్టురా లుగా నొనర్చుటకై తళతళలాడు పెద్ద ఖడ్గముచే బలిపశు శిరస్సును దెగవేయుటకై ఖడ్గమును దూసిరి. ఆఖడ్గమును ముందుగా దేవీసమ్ముఖమునుండి విధ్యుక్తముగఁ బూజించి, దేవీ మంత్రములచే దాని నభిమంత్రించిరి.

జడభరతుఁడీ లీలను దనకండ్లతో మెదలక కూర్చుండి చూచుచుండెను. ఆతని మనస్సు హర్ష విషాదములు లేవు. ఆతనికి మరణ భయముగాని, జీవితాశగాని లేదు. ఆతఁడన్నిటి యందును సమభావముతో నుండెను. ఆతఁడు బ్రాహ్మీస్థితిని బొంది సర్వత్ర శ్రీహరినే చూచుచుండెను. శరీరాభిమాన ముండినచో దానిని రక్షించుకొను ప్రయత్నముండును గాని అహంకార మమకారములు లేనివానికి శరీరరక్షణ ప్రయత్న మేమియుండును. ఆతఁడహంకార మమకారములను మ్రింగి వేసినాడు. ఆతనికి ఖడ్గభయమును లేదు. పురోహితుఁడు చేయు కార్యముల వలన నుద్వేగమును లేదు. ఆతఁడీకార్యముల నన్ని టిని నొకయాటగఁ జూచుచుండెను.

శుకమహర్షి యిట్లనెను:- "రాజా! ఇట్టి సమభావ మందుండిన యోగిని బలినొసంగుటకు తామసీదేవి యెట్లు సహింపగలదు? దేవియు స్థానము తప్పెను. ఆమెయు భయపడి నది. ఆమెకా దస్యులపై క్రోధము కలిగెను. తామసక్రియ లలో నున్న బాధయే యిది. సరిగా జరిగిన సరియే కావున్న దానినిఁ జేయువానినే అణఁచి కొట్టును."

# భద్రకాళి బలినుండి తప్పించుకొనిన జడభరతుఁడు

33_౨

శ్లో॥ హింస్రైః స్వపాపేన విహింసితః ఖలః
సాధుః సమత్వేన భయాద్వి ముచ్యతే ॥
(శ్రీ భాగ. ౧౦. ౭ అ. ౩ స్క. ౧ శ్లో॥)

క॥ రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁడగు సమతఁజేసి రాయిడులందుఁ౯
రక్షణములు వేయిగలిగిన
శిక్షితుఁడగు ఖలుఁడు పాపచిత్తుండగుట౯ ॥

(శ్రీ మదాంధ్ర భాగవతము.)

తమోగుణశక్తులు ప్రబలములైనను నవి సత్వగుణము ముందు వానియాటలు సాగవు. అల్పపాపిని ఘోరపాపియణఁచును. నిర్బలుఁడగు సత్త్వగుణుని సబలుఁడగు తమోగుణుఁడు జయించును. కాని తమస్సు లేశమైనను లేక నిత్యము సత్త్వమందేయుండు వానిముందు ప్రబలాతి ప్రబలమైన శక్తియు పరాజితమగును తానుగా నాతఁడు దండింపఁడు. తనమీఁద ధూళిని విసరిన వానిని సూర్యుఁడు కోపగించఁడు కాని స్వభావ వశమున నా ధూళి విసరినవాని శిరస్సుననే పడును. అట్లే సాధువును బాధించువారే కష్టపడుచుందురు. సమభావములోనుండు వారికి క్లేశములెట్లు కల్గును? ”

శుకమహర్షియిట్లనను:- “రాజా! దొంగల పురోహితుఁడు దేవీ మంత్రములచే నభిమంత్రింపఁబడిన ఖడ్గము నెత్తి

మును పానముచేయుచుండెను. ఆయుష్ణరక్తమును మత్తిలఁ
ద్రావి అందఱును నున్మత్తులవలెఁ దలవెండ్రుకలను విరియఁ
బోసికొని ఆడిపాడి నవ్వుచుఁ దందనాలాడసాగెను. ఇప్పుడు దేవి
కొక నూతన ఖేలనము తోఁచెను. తెగిన తలలను బంతులవలె
నాకాశమునకెగుర వేయుచుండెను. మధ్యలో నింకొక దేవి
మధ్యలోనే కొట్టుచుండెను. మూడవశక్తి పరువిడివచ్చి లాగు
కొని నవ్వుచు బంతులాడుచుండెను.

భరతుఁడచ్చటనే కూర్చుండి నవ్వుచుండెను. ఆతనికిఁ
దనమృత్యువు నెడల నసంతోషమును లేదు దస్యుల తలలు తెగి
నందులకు సంతోసమును లేదు. ఇదియును భగవద్విలాసమని
లోలోన నవ్వుకొనుచుండెను.

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:— "స్వామీ ! ఇట్లెందు
లకైనది? ఎట్టివారైనఁ గానిండు దస్యులు భద్రకాళికి భక్తులు
కదా ! ఆమెకా బ్రహ్మర్షికుమారుని జంపుట యిష్టము లేకున్న
వదలి వేయవచ్చును ఒకని యపరాధమునకై యిందరును జం
పుటెందులకు?"

ఇదివిని శుకదేవుఁడిట్లనెను:— "రాజా! మంత్రప్రయోగ
మున నితరులను జంపుటకు అభిచారమందురు. అభిచారము
సదా అపవిత్రుల మీఁదను, అసావధానుల మీఁదను బనిచే
యును. పవిత్రులును, భగవద్భక్తులైనవారి మీఁదకు ఇంద్ర
జాలము, అభిచార, మోహన, మారణోచ్చాటనములు పని
చేయవు. ధనుస్సునుండి బయలుదేరిన బాణము వృథాకాఁజా
లదు. అట్లే అభిచారమంత్రప్రయోగము వ్యర్థముకాదు. ఎవ్వ

మీఁద నభిచారమును గావింపఁబడినదో అది అచ్చట వ్యర్థమై నచోఁ చేసినవారి మీఁదకే పోవును. కాశీరాజు పుత్త్రుఁడు ద్వారకా ధీశుమీఁదకుఁ గృత్యను బ్రయోగించెను. దానికివిప రీతముగ నాకృత్యవానిని వాని సేనావాహినీ సహితముగనాశన మొనర్చెను. దుర్వాసుఁడు పరమ భక్తుఁడగు నంబరీషునిపైఁ గృత్యను బ్రయోగింపఁగా నాతఁడొక సంవత్సరము వఱకు సుదర్శన చక్రభయమున సమస్తలోకములుతిరుగవలసివచ్చెను. బ్రాహ్మణుఁడు సర్వత్రి అవధ్యుఁడని చెప్పఁబడినది. ఘోరా పత్తు సంభవించినను సాధారణబ్రాహ్మణునే చంపరాదు; అట్టి యెడ నిర్వైరుఁడై, సాక్షాత్తుగ బ్రహ్మభావమును బొంది సమస్త జీవులకు సుహృదుఁడై యున్న బ్రహ్మర్షిని వధించుట మహాపాపము కాదా? ఈ దోపిడిగాండ్రి స్వభావము రజస్త మోగుణములచే నాచ్ఛాదితమైనది. దోపిళ్ళలోఁజిక్కిన ధనము ప్రోగు బడుటచే వారు మదోన్మత్తులైరి. అందువలనబ్రాహ్మ ణుని మెడలో భగవదంశ భూతముగనున్న యజ్ఞోపవీతమును గాంచియైన నాదుష్టులు వెనుకాడక యాతనినిబలినీయ నుద్యు క్తులైరి. అట్టివారిని దేవియెట్లు క్షమింపగలదు? వారిపాపము పండినది. పాపధనముకొంతకాలమే పుష్పించిఫలించి, చివరకు వానివంశమునంతను బొట్టఁబెట్టుకొని వానినిఁగూడ మూలమట్టు ముగ నాశము గావించును. ఇంతవరకు దేవిక్షమించి యూర కుండెను కాని వీరు జ్ఞానస్వరూపుఁడగు బ్రాహ్మణుని నన్యా యము గావింపఁదలఁచునప్పటికి అందఱను స్వాహా కావిం చెను. భరతుఁడు శాపము నీయలేదు, బలినిచ్చుచుండ నిషే

ధింపను లేదు. ఆతఁడెంతో సంతోషముతో బలియగుటకు నుద్యుక్తుఁడయ్యెను.

అంతఃబరీక్షిన్మహారాజిట్లనెను:- 'ప్రభూ! ఇది చాల ఆశ్చర్యకరమగు విషయము ఈశరీరముగోఁ బ్రాణమున్నంత వఱకు శరీరము మీఁదఁ గొంచెముగనో గొప్పగనో మోహ ముండును. ఎంతటి జ్ఞానియైనను గానిండు ప్రాణ రక్షణము కొఱకు ఆతఁడు ప్రయత్నము కావించును. భరతుఁడు బాహ్యక్రియా శూన్యుఁడు కాఁడు. అన్నము తినుటయు, త్రాగు టయు కలదు. అన్నిటిని గ్రహింపఁగలఁడు ఏదోవిధముగా వ్యవహార కార్యములను జేయుచుండును. అయినను వధ సమయమున నేయభ్యంతరమును బెట్టలేదు. కొంచెముగ మాటలాడి తన విషయమును జెప్పియుండవచ్చును గదా!"

ఇదివిని శుకమహర్షి దృఢతాస్వరమున నిట్లనెను:- "రాజా! నీవీవిషయమున సందేహింపవలదు అజ్ఞానుల హృద యమందే యీ యనిత్య క్షణభంగురమగు దేహమందు నాత్మా భిమాన గ్రంథి సుదృఢముగఁ బడియుండును. జ్ఞాని యాహృ దయ గ్రంథిని తన జ్ఞాన ఖడ్గముచే ఛేదించును. ఆతఁడు బ్రహ్మ స్వరూపుఁడగుటచే వాసుదేవుఁడు స్వయముగఁ దన చక్రముచే నాతనిని రక్షించుచుండును. ఇట్టి జ్ఞానులు ఇతరుల కీడును గాంక్షింపరు. వైరమును గోరరు వారికి శిరస్సు పోవు సమయమాసన్నమైనను నేవిధమైన వ్యాకులతనుగాని, చింతను గాని ప్రకటింపరు. ఇది యాశ్చర్యకరమగు విషయము కాదు. ఆతని మనమునందు భేదభావ ముండనేయుండదు. ప్రాణముండ

నిండు పోనిండు వారికి లెక్కలేదు.

ఇది విని రాజిట్లడిగెను:- అయితే స్వామీ! "తర్వాత నేమైనది?"

శుకమహర్షి యిట్లనెను:- ఇంకేమైనది. ఏమికావలయునో అదియే యైనది. అందఱి శిరస్సులను ఖండించి ధరిత్రి కాళి తన సహచర శక్తులతో నంతర్ధానమయ్యెను. భరతుఁ డచ్చటనుండి వెడలిపోయెను. ఇప్పుడాతఁడు తనగ్రామమునకుఁ బోలేదు. ఆతఁడిట్లు తలచెను:- "ఇఁకఁ బాణమును కాపాడుటలేదు. ఆతఁడలక్షిత భావముతోఁ బరమహంసవృత్తిలోఁ దన జ్ఞానమును దాఁచుకొనుచు నిటునటు స్వేచ్ఛాపూర్వకముగఁ దిరుగసాగెను. ఆతఁడే వేషమును వేసికొనలేదు. ఏ వర్ణాశ్రమ చిహ్నములను ధరింపలేదు. వెండ్రుకలు పెరిగినఁ బెరుగనిచ్చెను. నడుమునకు మాసి చిఁగిన వస్త్రమును గట్టుకొనియుండును చాల మాసిన పాతజందెమాతని మెడలోఁ గలదు. ఇంత బరువుగల శరీరమును మోయుచుండఁగా జందెము మీఁద నేమి ద్వేషము? పడియుండినఁ బడియే యుండును ఈ విధముగఁ బరమహంస వృత్తియందాతఁడు నిర్ద్వంద్వుఁడై విచరించుచుండెను.

## రహూగణ మహారాజు జడభరతుని గలిసికొనుట

333

శ్లో॥ భవాపవర్గో భ్రమతో యదా భవేత్
జనస్య తర్హ్యచ్యుత సత్సమాగమః
సత్సంగమో యర్హి తదైవ సద్గతౌ
పరావరేశే త్వయి జాయతే మతిః ॥
(శ్రీ భాగ. ౧౦ స్క. ౫౧ అ. ౫౪ శ్లో॥)

సీ॥ సంసారినైయున్న జనునకు నీశ్వర
నీకృప యెప్పుడు నెఱయఁగల్గు
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు
బంధమోక్షంబైనఁ బ్రాప్తమగును
సత్సంగమంబు సత్సంగమలబున నీపు
భక్తి సిద్ధించు...
శ్రీ మహాంధ్రభాగవతము.

పాత్రత లేనిదే ప్రపంచములో నేమియును లేదు. భగవత్కృపానుభవముచేఁ బాత్రత లభించును. భగవత్కృపాదృష్టి నిరంతరము ప్రతిజీవిమీఁదను నుండును. కాని దాని నందఱును ననుభవింపలేకున్నారు. వర్షమంతటను సమానముగనే పడును. కాని ఉర్వరభూమిపై వర్షజలము పడఁగానే పచ్చగఁ గళకళలాడుచుండును. ఊసరక్షేత్రమునఁబడిన యథాప్రకారముగనే యుండును. సాధువులు సిద్ధపురుషులు ఎఱుకగను నెఱుక లేకను నందఱకును దర్శనమొసంగుచుందురు. కానీ అట్టి యోగ్య

తనుగలవారే వారిదర్శన లాభమును బొందఁగలరు. వారికృప కుఁ బాత్రులగుదురు. అట్టియోగత్యలేని వారట్లేయుందురు. యోగ్యునకు సాధుసంగము ఇచ్ఛతోఁజేసినను ననిచ్ఛతోఁ జేసినను మేలేకలుగును. సిద్ధులు సాధారణముగ సాంసారికు లకుఁగనఁబడరు. వారెల్లప్పుడును రహస్యముగ బాలోన్మత్త పిశాచాదులవలెఁ దిరుగుచుందురు. వారెప్పుడైన నెవరిమీఁద నైనఁగృపఁజూపిన విచిత్రముగఁ జూపుచుందురు. వారితోఁ బోట్లాడుచుండును, ఒక్కొక్కప్పుడు కొట్టుచుండును, ఒక్కొ క్కప్పుడు వ్యంగ్యవచనములను బలికి వారినిఁ దనవైపున కాక ర్షించుకొని పరమార్థ రహస్యములను దెలిపి జనన మరణ చక్రమునుండి బయటఁబడవేయును. ఇట్టి సిద్ధులీధరాధామము నందిదివఱలోనుండిరి. ముందుండఁగలరు. వీరులేకున్నఁబృథివి నిలువదు. పది పది ఇరువదిరువది కోసులకొక సిద్ధపురుషుఁ డు గుప్తముగనుండును లేకున్నఁ బ్రళయము సంభవింపఁగ లదు వీరి ధర్మమే యీ జగత్తును ధరించినది. వారే యీ ప్రపంచ స్థితిని నడుపుచున్నారు. ఈ సిద్ధులు భగవదంశభూ తులై ఏదో కారణమున విగ్రహమును ధరించి జీవన్ముక్తులై చరమశరీరమును ధరించిరి. వీరు వారంతటవారు తెలియఁబ డరు. అనఁగా వారు బుద్ధి పూర్వకముగఁ దెలియఁబడరని భా వింపరాదు. వారంతటవారు రహస్యముగ నుండఁదలఁచినచో విషయాసక్తులగు నీసాంసారిక మానవులకు వారిఁ దెలిసికొను సామర్థ్య మెక్కడిది? ఎవరో అదృష్టవంతులకడ వారిజ్ఞాన విజ్ఞానములను నిర్భయులై ప్రకటించెదరు. జడభరతుని నింత

వఱకు బిచ్చివానిగ భావించుచుండిరి. భరతుఁడందఱికిట్లు కనఁ బడెను గాని దైవవశమున సింధు సౌవీర దేశాధిపతియగు రహూగణునకాతఁడు తన యథార్థ రూపమును జూపించెను. అధికారియని భావించి భరతుఁడాతని ననుగ్రహించెను. ఆతఁ డొసంగిన జ్ఞానము పరమార్థ సారమే. దానికి మించిన నుత్కృ ష్ట అద్వైత జ్ఞానమింకొకటి యుండఁబోదు. భరతుఁడు చెప్పఁ దగిన దంతయును సారరూపమునఁ జెప్పెను.

శుకమహర్షియిట్లనెను-: "రాజా! భరతుఁడు బలిపశు వయ్యెను. కాని భద్రకాళి భయపడి బలికానీయలేదు. దస్యు వధ కాఁగానే యాతఁడు చేతులూపుకొనుచు మత్తవన గజేం ద్రమువలె నిటు నటుఁ దిరుగుచుండెను. తిరుగుచుఁ దిరుగుచు నాతఁడు దైవవశాత్తుగ నిక్షుమతీ నదీతీరప్రదేశమునకుఁ జేరెను. దైవికముగ నాసమయముననే సింధు సౌవీర దేశపురాజు రహూగణుఁడు పాలకీనెక్కి అచ్చటకి వచ్చెను. రాజు గొప్ప ధర్మాత్ముఁడు పరమార్థ తత్త్వ జిజ్ఞాసకలవాఁడు. ఈయ సార మగు సంసారమున నేది సారమో తెలిసికొనవలయునని జ్ఞానా వతారుఁడగు కపిలుని యాశ్రమమునకుఁ బోవుచుండెను. ఆ కా లమున సాధారణముగ రాజులు రథముపైఁగాని పల్లకీలపైఁగాని యెక్కి పోవుచుండెడువారు. పల్లకీప్రయాణము సుఖకరమును శ్రేష్ఠమునై యుండెను. రాజ్యములో నచ్చటచ్చట కొందఱు కర్మచారులనుజీతములిచ్చిపోషించెడువారు. వారు రాజుగాని రాజ పుత్రులుగాని యెచ్చటికైన వెళ్లవలసియుండినచో వారచ్చ టకి వారినిఁ జేర్చవలసియుండును. నౌకరులు రెండు రకములు

వేతన భోగులు, విష్టిభోగులు. వేతన భోగులకు నెల నెలకును, లేక రోజు రోజునకును జీతమేర్పాటుండును. విష్టిభోగులకు మాన్యములుండును. వారు వంశ పరంపర దానిననుభవించి సేవచేయుచుండ వలయును, వీరికప్పుడేమియు నీయఁబడు. ఇట్టి విష్టిభోగులే రాజుయొక్క పల్లకిని మోయుచుండిరి.

ఇక్షుమతీనదీ తటమందు ఇంతవఱకు వచ్చిన మోఁత గాండ్రు రావలసిన సరిహద్దు పూర్తియైనది. మోఁతగాండ్రి నాయకుఁడు వెనుకటి వాండ్రను వదలివేసెను. అటునుండియు నిటునుండియు మోఁతగాండ్రను దీసికొనివచ్చి పల్లకీని మో యుమనిరి. అందులో నొకఁడు తక్కువయ్యెను. రాజుగారి నౌ కరులు ఉద్దండులుగ నుందురు "రాజా! నీకు స్వయముగ నను భవమునకు వచ్చియుండవచ్చును. వారు తమ ప్రభువు బల మును జూచుకొని ప్రజలను తృణములవలెఁ జూచుచుందురు. వారికహంకారముమెండు. ఆమూలమున వారేదైనను జేయఁ గలరు. ఆమోఁతగాండ్ర నాయకుఁడిట్లాలోచించెను:- "ఇప్పుడు గ్రామములోనికి మోఁతగాండ్ర కొఱకెవరు వెళ్ళుదురు. ఎవఁడు దొఱకిన వానిని పల్లకీకి తగిలింపవలెను " అని యిట్లాలోచించి అటు నిటు వెదుకు నంతలో వానికంట భరతుఁడు పడెను. ఆ తఁడు నల్లగనుండెను. సర్వదా నగ్నుఁడగుటచే శరీర చర్మము ఎనుము చర్మమువలె బండబారియుండెను. గుడ్డలు మాసియుం డెను. శరీరము హృష్టపుష్టముగ నుండెను. ఆతఁడు మత్తుఁడై అటు నిటుఁ దిరుగుచుండుటనుగాంచి యీతఁడెవఁడో శూద్రుఁ డని భావించి, వానిని పాలకీకి మోఁతగానిఁగా జేయ వలయునని

అధికార స్వరమున నిట్లనెను:- "ఓరీ! నీవెచ్చటికి పోవుచున్నావు? పద. మహారాజు పల్లకీని మోయుము. నీవు మహారాజును ఆవల మజిలీ వఱకు మోయవలసి యుండును."

ఈతని కేమి బాధ. అవును కాదు అనకుండ నాతని వెంట బయలు దేరెను. ఇంకను నైదారుగురు మోఁతగాండ్రు పాలకీకి ఉండిరి ముందీతని నుంచి చేతికొక చిలుక కఱ్ఱ నొసంగి "ఇకపద" అనెను. ఇప్పుడాతఁడు మోఁతగాండ్రతోఁ బల్లకీని మోయసాగెను.

రాజు పాలకీని మోయువారందఱును మోఁతగాండ్రే. ఆ సమీపముననే మోఁతగాండ్ర పట్టణముండెను. వారినాయకుఁడును సీతసిని మోఁతగాఁడనియే భావించెను. ఆతని మెడలో మాసిన జందెమును సరిగాఁజూడలేదు. మోఁతగాండ్రు రాజు భయమున జాగ్రత్తగ పద్ధతి ననుసరించి పోవుచుండిరి; కాని యీ మహాత్మునకెవరి భయమును లేదు. ఎప్పుడైనఁ బల్లకిని మోసినవాఁడునుగాఁడు. మోఁత నిప్పుడు క్రొత్తగ నేర్చుకొనుచున్నాఁడు. ధర్మ మర్మమును దెలియును. అందువలన నీతఁడు నాల్గంగల భూమి వఱకే గాంచుచు నెచ్చటనైన నేదైన జీవ జంతువు కనఁబడినచో నది చచ్చునని యెగిరి దుముకి దానిని రక్షించుచు. దీనివలన పాలకీనూగుచుండెడిది. రాజు శరీరము స్థూలము. ఈతఁడెగురఁగానే రాజుగారి బొజ్జయూగి, దాని లోని నీరు బొళక్కు బొలక్కు మని శబ్దము చేయుచుండెను. రాజు సాధారణముగ సుఖముగ కుదింపులేక యుండును. ఈవిధముగఁ గుదుపునొనర్చు సాహసుఁ డింతవఱకాతని కెవరును

లభింపలేదు. ఆతనికిది యభూత పూర్వవ్యవహారము. అయినను రాజు ధర్మాత్ముఁడు బుద్ధిమంతుఁడు, అందువలన నాతఁడు శాంతముగ నిట్లనెను:— "ఓరీ! మీరిట్లు నడుచుచున్నా రేమిరా? మెల్లగా నడువుఁడు. ఊఁగింపకుఁడు. కుదుపు రానీయకుఁడు."

రాజిట్లనఁగానే మోఁతగాండ్రు చాలభయపడిరి. వారేమైనఁ బొరపాటొనర్చిన దెబ్బపడునని వారికి తెలియును. అందువలన వారు జాగ్రత్తగ నడుగువేయుచు నడుచుచుండిరి. కాని వారియపరాధమేమున్నది? పాలకీ క్రొత్తగా మోయుచున్న బలవంతపు మోఁతగానివలనఁ గదలుచున్నది మోఁతగాండ్రనాయకుఁడిట్లు తలఁచెను:— "వీఁడు యువకుఁడు. గట్టి శరీరము కలవాడు. హృష్ట పుష్టముగనున్నాఁడు గాడిదకంటె బరువెక్కువగ మోయఁగలఁడు, ఎద్దుకంటె వేగముగ నడువఁగలఁడు కాని యీతఁడవధూత. ఒక్కొక్కప్పుడు గంతిడును, ఒక్కొక్కప్పుడు పైకి ఎగురును ఒక్కొక్కప్పుడు నిలువఁబడిపోవును. ఒక్కొక్కప్పుడీ భుజమునుండి యాభుజమునకు మార్చుకొనును. ఒకరివెనుక నొకరు నిలుచుండవలయును. రాజునకు చాలబాధగనుండెను. ఆతనికిఁ గోపముకూడ వచ్చెను. ఆతఁడు కోపము నణఁచుకొని యిట్లనెను:— "ఓరీ! మీరిదేమిటిరా? మీరిది వఱకు పాలకిని మోయలేదటరా? ఏల నట్లెగిరి పడుచుందురు? మీరేమైనఁ ద్రాగిరాలేదుకదా!"

రెండుసార్లు రాజిట్లనుటను విని ముందున్న బుద్ధిమంతుఁడగు బోయీ చేతులుజోడించుకొని యిట్లనెను:— "ప్రభూ! మేము మీ ప్రజలము. పాలకీనిమోయుట మాకు వంశపారం

పర్యకార్యము. మాకు హృదయములో మీమీఁద మిక్కిలి శ్రద్ధకలదు, మేము చాల జాగ్రత్తగనే యీ పాలకిని మోయు చున్నాము; కాని ఎక్కడనుండియో యిందులోనికిఁ గ్రొత్తగా నొక మోఁతగాఁడు వచ్చిచేరినాఁడు. ఆతఁడు తన యిష్టము వచ్చినట్లాగును. ఆతఁడాగఁగనే మేమందఱము నాగవలసి వచ్చుచున్నది. మేము త్వరగాఁబోవుదమనిన నీతఁడు వెళ్ళఁడు. ఇప్పుడే పాలకీ నెత్తుకొన్నది. అయినను త్రొప్పుచున్నాడు. మహారాజా ! వీనితో నడచుట మాకు చాలకష్టము."

రాజు వివేకియు, బుద్ధిమంతుఁడునైయుండెను. అందఱును సరిగానే వెళ్ళుచున్నారు, ఈతఁడొక్కడే విలక్షణముగ నున్నాఁడని ఆతఁడు గ్రహించెను. ఇట్టిఅస్తవ్యస్తవ్యాపారముచేఁ దనను దీసివేయించుకొనవలయునని ఆతఁడిట్లు చేయుచుండ వచ్చును. ఇట్టి వేషములు నా ముందుసాగవు నన్ను మోస గింపఁదలచినచో నది పోఁకిరితనమే కాఁగలదు. గొప్పవారికి విచారణముండును. అందువలన రాజు ధ్యానపూర్వకముగా నా క్రొత్త మోఁతగాని వైపునకుఁజూచెను. ఆతఁడాతని నడకను బరీక్షించుచుండెను. యథార్థముగ నీతని ధూర్తత్వము వలననే పాలకీ సరిగాఁబోవుట లేదనియు, మిగిలినవారందఱును సరిగానే నడుచుచున్నారనియు, నీ ధూర్తుని వలననే నింత జరుగుచున్నదనియు నిశ్చయమయ్యెను సంసర్గదోషముచే నొక వ్యక్తివలన నందఱకును నవమానము సంభవించును. సమూహములో నొకఁడు దోషమొనర్చును. వాని కలంకమందఱు నె తినఁబడును.

ఇప్పుడు రాజునకానూతన వాహకునిపై స్వాభావికము గఁ గోపమువచ్చి పాలకీముందునున్న కిటికీనిఁ దెఱచి లావుగా బలిసిన వాహకునిఁజూడ సాగెను. ఆతనికాతని పనికి కోపము కలిగెను.

అంతఁబరీక్షిన్మహారాజిట్లనెను:- "స్వామీ! మోక్ష మార్గమందుండి ఇంతవివేకియును, జ్ఞానపిపాసువునగు రాజునకు గోధమేల వచ్చినది?

అంత నవ్వుచు శుకుఁడిట్లనెను:- "రాజా! ఎంతటి జ్ఞాని యు, ధ్యానియు, వివేకియు, ముముక్షువునగుఁగాక రహూగ ణుఁడు రాజుగదా! ఆతని యాజ్ఞ నింతవఱకెవఁడును మీఱిన వాఁడు లేడు. రాజాజ్ఞనుల్లంఘించుట యనఁగా శస్త్రము వినా మృత్యువు నాహ్వానించుటయే కాఁగలదు. మహారాజా! నీకను భవ పూర్వకముగనే తెలిసి యుండవచ్చును; ఈరాజులు తమ యపార సంపత్తినిఁ జూచుకొని సుఖసమ్మానముల కలవాటు పడి యుందురు. వారి చిత్తమునకేమాత్రమైన విరుద్ధముగ జరి గెనా ముఖమును జిట్లించెదరు, నీవే ఆలోచించుకొనుము- శమీకమహాముని నిన్నేమిచేసినాఁడు; ఆతఁడు తన యేకాంత ఆశ్రమమందు మెదలక సమాధిమగ్నుఁడై యుండెను. నిన్నేమి యు యాచించినవాఁడుకాఁడే. పోనిండాతఁడు నిన్నుఁజూచి మి థ్యాసమాధినే నటించినాఁడనుకొనుఁడు, దానివలన నీకేమి హాని? ఆతఁడే మంచియో చెడ్డయో సమాధిని నటించినాఁ డను కొనుఁడు నిన్నుసన్మానింపకుండిన నీవు తిరిగి రావచ్చును. ఆతని మెడలోఁబామును వేయుటకును- ఆతనినిఁబరీక్షించుట

కును నీకేమి యవసరము? కాని రాజా! దీనిలో నీదోషము లేదు. మానవుఁడు జీవితమంతయును నెట్టి యభ్యాసము నొనర్చుకొనునో, తన సమీపముననున్నవారు తనయెడల నెట్టులఁ బ్రవర్తించెదరో అందఱు నట్లే చేయవలయునని యాశించుచుండెదరు. సన్మానము చేయనందులకే నీవింతటి శిక్ష ఆతని కొసంగినచో రహూగణ మహారాజునకు భరతుని మూలమునఁ గలిగిన శారీరక కష్టమునకేమి శిక్షనొసఁగవలెను, అనేకసార్లు చెప్పినను భరతుఁడు తన వ్యవహారమును త్యజింపలేదు. అతఁడట్లే హరిణమువలె నెగురుచుండెను. అందువలన రాజునకుఁ గోపము వచ్చుట స్వాభావికమే. ఇందాతని దోషమేమియును లేదు. వివేకి, పరమార్థ పథికుఁడు కాబట్టియే యీయవమానమును భరించెను, కాక యింకొక రాజైనచో నాతని వీఁపును విమానపు మోఁత మోగించెడువాఁడే. సున్నములోనికి యెముకలు లేకుండ నలగఁబొడిచెడువాఁడే. అట్లే కూర్చుండి ఏదో అడుగవలెననుకొని భరతునిపై వ్యంగ్య బాణములను విడుచుచుఁ క్రోధావేగమున శుష్కహాసము నొనర్చుచు నాతనిని మూర్ఖునిగా నొనర్చుటకిట్లనెను:- 'ఓరీ! బోయీ! నీవు సుకుమారుఁడవు రా, పాపము నీనెత్తిన నెంతటిబరువు వేసినారురా– అబ్బ ఒక్కఁడవే మోయుచుంటివిగాదూ? పాపము చాల అలసిపోయినావు, నిన్నుఁ జలువ చప్రమునఁ గూర్చుండఁబెట్టి ధూపదీప నైవేద్యాదులతోఁ బూజింపవలెను. అహా! నీసుందర శరీరమెంత కృశించినది. బక్కచిక్కినావు. ఎముకలన్నియుఁ గనఁబడుచున్నవి. నరములు బయటఁబడి మెఱయుచున్నవి. పాపము చాల

ముసలి వగ్గువైతివికూడాను. శరీరములో బలముకూడ లేదాయెను. నీ యీ సహచరులు నీకు చాల నన్యాయము కావించినారు. వీరు పాలకీపైఁజేయి వేయనేలేదు. నీవొక్కఁడవే పాపము! పాలకిని మోయుచున్నావైతివి. అందుకనియే నీవింతగా నెగురుచున్నావు," అని యీవిధముగ భరతుని లజ్జితునిగావించి తలక్రిందులు చేయుటకిట్లు మాటలాడెను. కాని యాతఁడు లజ్జను నూరి త్రాగి వేసెను. మానావమానములు, భయక్రోధములు మొదలగునవి ఆతని దగ్గఱగానైనఁబోవు. ఆతఁడు రాజు మాటలను వినిపించుకొనలేదు. రాజు ఆకాశమునుండి వ్యర్థ వాక్యములు పలుకుచున్నట్లుండెను. ఈ వ్యంగ్య వచనములవలన నాతని పైసనుమాత్రమైనఁ బ్రభావము పడలేదు. ఆతఁడదే విధముగ నిలుచుచు నిలుచుచు నెగురుచు నెగురుచు మత్తేభమువలె నూఁగుచు నిర్భయముగ వెళ్ళుచుండెను. ఏలననఁగా నాతనికీ పంచభూత సంఘాత రూపమగు నీశరీరమునందు నేను నాది యను మిథ్యాధ్యాసము లేదు.

ఇంతవఱకు రాజు తన వివేకముచేఁ దనకు వచ్చిన కోపము నెట్లో నణఁచుకొనెను. ఇఁక నాపుకొనఁజాలక పోయెను. గర్జించి మేఘగంభీర స్వనముతోఁ బండ్లు పటపటఁ గొఱుకుచు నిట్లనెను:- "ఏమిరా సిగ్గులేని వాఁడా! నీవు చెవిటివాఁడవురా? నీవు కోరి కోరి మృత్యువు నాహ్వానించుకొనుచున్నావా? జబ్బలు విఱుగఁగొట్టినచో మత్తు గిత్తు దిగిపోఁగలదు. నీచుఁడా? నీవెవనియాజ్ఞ నవహేళనము గావించుచున్నావో

నీకు తెలియదా? భయములేదా? నేను రాజును. అందఱకును బ్రభువును. నీ నడ్తని సరిచేసెదను. నీయవినయమునకు ఫలము నిప్పుడే చూపించెదను. నీవు మదోన్మత్తుఁడవగుచున్నావు. నేన రణ్యరోదనము చేయుచున్నట్లెంచుచున్నావు. ఇప్పుడే నీవు చేసిన పనికి శిక్షించెదను. దెబ్బకు దయ్యము పాఱిపోఁగలదు. వీఁపు మీఁద దడ దడ దెబ్బలుపడిన నీబుద్ధి సరైన త్రోవకు రాఁగలదు, అప్పుడు నీరోగమంతయుఁ బోఁగలదు."

రాజు తానే సర్వస్వామి యనుకొనుచుండెను. ఆతని విశ్వాసము రాజు నోటినుండా సంబద్ధమైనవో అసంబద్ధమైనవో పలుకులు వెలువడినచో నవున కాదనకుండఁ బాలింపవలయు ననియే. రాజవాక్యమే వేదవాక్యమని యాతని యూహ. ఆతఁడా పరమహంస వృత్తి నెఱుఁగక మోహావశమున నాతనినిఁ దిరస్కరించుచున్నాఁడు. ఆతఁడు భగవద్భక్తులను సరిగా నెఱుఁగడు. ఆతఁడు స్థితప్రజ్ఞులను వారి లక్షణములను బట్టి తెలిసికొనఁజాలకుండెను. ఆతఁడు తానే గొప్పజ్ఞానిని, ధ్యానిని వివేకి ననుకొనుచుండెను. ఎవఁడైనను నాలుగుడబ్బులు ప్రోగుచేసెనా తానే పండితుఁడననుకొనుచుండును. అందు కనియే రాజు యోగేశ్వరుని నిన్నిమాటలనెను; కాని ఆతని మనమునందీ మాటలవలన విక్షేపము కలుగలేదు. ఏలయనఁగా నాతఁడు సర్వత్ర శ్రీహరి వ్యాపించియున్నాఁడని భావించు చుండెను. అయినను నొకతరంగము రేగెను ఆతఁడిట్లనుకొని యుండియుండును:- "వివాహసమయమున స్త్రీయొక్క ఒకర చేతినిఁ బట్టుకొందురు, దానిమూలమున జీవితమంతయును

# రహూగణుని వ్యంగ్యవాక్కులకు భరతుని ప్రత్యుత్తరము



శ్లో॥ విశేష బుద్ధేర్వివరం మనాక్చ
పశ్యామ యన్న వ్యవహార తోఽన్యత్ ।
క ఈశ్వర స్తత్ర కిమీశితవ్యమ్
తథాపి రాజన్ కరవామ కింతే ॥

(శ్రీ భాగ, ౫ స్కం, ౧౦, అ, ౧౨ శ్లో॥)

రహూగణుఁడు మాటిమాటికి తాను రాజునని చెప్పుకొనుచుండఁగా జడభరతుఁడిట్లనెను:- "స్వామి భృత్యసంబంధంబులు విధికృతంబులగుచు వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుం గాని జీవునికి లేకయుండు నదియుమంగాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెదవేని బ్రిమత్తుండ నైన నీకుం బూర్వస్వభావం బెట్లుండెనట్లుగాక యేనేమిసేయుదు నెఱింగింపుము"

శ్రీమదాంధ్రి భాగవతము.

శరీరమున్నంత వఱకు కొంచెమో గొప్పయో క్రోధ ముండితీరును, భేదమేమనఁగా పశుబుద్ధిగల మూర్ఖుడు క్రోధ మునకు వశుఁడై తన్నుఁదాను మఱచును, వివేకియొక్క క్షణ ములో సంబాళించుకొనును, క్షణములోఁ దనతప్పును దెలిసి కొని దానిని మదరనీయఁడు, పరిసంగమును మార్చుకొనును. మార్పుచేసికొన్న భావనయేరాదు. అతఁడు తనతప్పు నొప్పు కొనుటకైనను సంకోచింపఁడు. ఇదియే మహాపురుషుల మహాత్ము నకు చిహ్నము.

ప్రభావశాలియగు సింధు సౌవీర దేశాధిపతి సమ్ముఖ
మున మోఁతగాఁడొకఁడు ప్రత్యుత్తరమిచ్చుటను గాంచి మిగి
లిన మోఁతగాండ్రిందఱును భయపడిరి. వారిట్లనుకొనిరి:- "ఈ
మూర్ఖుఁడెంతయును బేడయు బెల్లమును గావించినాఁడు. ఈసో
మరితోఁబాటుగా మనకును దడితగులఁగలదు వీని యవినయ
కారణమున మోఁతగాండ్రిందఱును దండనార్హులు కాఁగలరు."
ముందుననున్న బుద్ధిశాలియగు ముసలివాఁడు భరతుని మాటి
మాటికినిఁబొడుచుచు మెల్లమెల్లగ నిట్లనెను:- "ఓరీమూర్ఖా!
ఊరకుండుము. రాజు మాటలకుఁ బ్రత్యుత్తరమీయుటా? గొ
ప్పవారేమన్నను సహించి యూరకుండవలయును. కాని భరతుని
దృష్టిలోఁ బెద్దలును లేరు, చిన్నలును లేరు. అతఁడందఱను సమ
భావముతోఁజూచుచుండును. పాలకీ నిలుచుటను గాంచి వెనుక
నున్న నౌకర్లు పరువిడి వచ్చిరి. ముందునడుచుచున్న రౌతులు
తిరిగి వచ్చిరి. మోఁతగాండ్ర నాయకుఁడు రాఁగానే మోఁత
గాఁడు రాజ సమ్ముఖమునఁ బ్రత్యుత్తరమిచ్చుటను గాంచి
అడుగకయే దండము నెత్తెను. రాజు వారినందఱను వారించి
కుతూహల వశమున నిట్లనెను:- "అబ్బాయీ! నీవు చెప్పఁదలఁ
చినదేమో చెప్పుము" భరతుఁడు నిర్భీకుఁడై యిట్లనెను:- "రా
జా! వినుఁడు. మీరుపలికిన వన్నియు వ్యంగ్యముగఁబలికితిరి;
కాని నేను వానిని వ్యంగ్యముగఁదలఁపను. నిజముగనే భావించె
దను "నీవు చాల దూరమునుండి బరువును మోసి తెచ్చితివి
కావున నలసియుందువు." అని నన్నంటిరి. రాజా! నేను బరు
వును మోయలేదు. అలసియును బోలేదు. అలసట మొదలగు

ముండితీరును; కాని భూపాలా! నేను జనన మరణ రహితుఁ డను.

"నీవు సేవకుఁడవై స్వామినగు నాయాజ్ఞను బాలింపకు న్నా' వని నాపైదోషము నారోపించితిరి మీరు కోపపడకుఁడు నేనొక్కమాట నడిగెదను. మిమ్ములను స్వామిగా నొసర్చిన దెవరు? మీరు స్వాములనియు, రాజనియు, చక్రవర్తియనియు మీ ముఖమున వ్రాసియున్నదా? సేవ్య సేవక భావము ద్వైతమందు కలదు. అద్వైతాత్మ యందీభావమే లేదు. ఇప్పుడీక శరీర భావమున్నది. అది క్షణ క్షణము మారుచుండును. దీనికి సంబంధించినవియు మాటికి మాటికిని మారుచుండును. మీరు రాజగుచో నందఱకును రాజగుటయు, నిత్యముగ రాజగుటయు జరుగుటలేదు. మీభార్య మిమ్ములను 'బతి'యనును కొడుకు 'తండ్రి'యనును. బావమఱఁది 'బావా' యనును. 'వదినె' 'మఱఁది' యనును. 'తల్లి' "పుత్రా", "యనును" 'చెల్లెలు" "అన్నా", యనును. నిన్ను ద్వేషించు రాజు శత్రువనును. ప్రేమించువాఁడు మిత్రుఁడనును గురువు శిష్యుఁడనును. అట్టియెడనీవు రాజైనదెక్క డ? రేపే శత్రువైనను దండెత్తి వచ్చినచో నీవు భయమునఁ బారిపోయి యడవులలోఁ దిరుగుచుందువు. ప్రజలందఱును గలిసి నన్ను సింహాసనముపైనఁ గూర్చుండఁబెట్టుచో, నప్పుడు నీవుఊరకఉంటివిపసి నాపల్లకీ నీకెత్తినచో నప్పుడు స్వామియెవఁడో సేవకుఁడెవఁడో చెప్పుము. సేవ్య సేవక భావము క్షణ క్షణము మారుచుండును. అట్టి పరివర్తన శీలము కలదియు, క్షణికమైన దియు, నసత్యమైనదియునగు సంబంధము ను శుద్ధ బుద్ధ ముక్తు

డనగు నాయందారోపించుకొని యెట్లాజ్ఞాపింపఁగలను ? ఎట్లు పాలించుటకు బాధ్యుఁడనగుదును మహారాజా! ఈసేవ్య సేవకభావము కేవలము వ్యవహారమునకొఱకే, అది పరమార్థములోఁ బనికిరాదు. సేవ్య సేవకభావము నిశ్చితమును శాశ్వతము నగుచో నప్పుడాజ్ఞ నొసంగుటయు, ఆజ్ఞను బాలించుటయును సంభవమే కాఁగలదు. మరణశీలమును, నాశవంతములగు నీజీవులందు సేవ్యసేవకభావము, రాజ ప్రజ స్తుత్య స్తుతులు, కర్తృత్వభావము ఇవన్నియును గల్పితములు, అనిత్యములు, అసత్యములు. పరమార్థదృష్టితో విచారించుచో నెవరెవరికి స్వామి? ఎవరికి సేవకుఁడు. ఇట్లయ్యు నీ కభిమానముకలదు ఈయనిత్య క్షణభంగుర నశ్వరశరీరమందే నీవాత్మబుద్ధినుంచి పట్టు బట్టినచో లేదా నేను రాజును నాయాజ్ఞను నీవుపాలింపవలసినదేయని పలికితివా నాకు హాశము లేదు. ఏమి చేయవలయునో చెప్పుము? నీకేమి సేవచేయవలయునో ఆజ్ఞాపింపుము.

చివరకు "నీవున్మత్తుఁడవు పిచ్చివాఁడవు, జడుఁడవు" అని ఒకమాటనంటివి. కఱ్ఱతో బాది పిచ్చిగిచ్చి వదలించెద నంటివి."

శుకుఁడిట్లనెను:- 'అభిమన్యునందనా ! రాజా! ఇట్లు పలుకుచుఁ బలుకుచు భరతుఁడు నవ్వెను. ఇప్పుడాతఁడు తన్నధికముగ దాఁచుకొనలేకపోయెను. ఉపదేశావసరమున నాతఁడు ఆత్మగోపనము చేసికొనఁ జాలకపోయెను. నిర్భయుఁడై గర్జించుచు నిట్లనెను:- "రాజా ! నేను బ్రహ్మజ్ఞానిని. నేను నాస్వ

స్వరూపమును జెందిన స్థితప్రజ్ఞుఁడను. నన్ను నీవట్లను కొనుట లేదు. వెఱ్ఱివాఁడు, జడుఁడనుకొనుచున్నావు. అట్లే యనుకొనవచ్చును. నేను బుద్ధిగలవాఁడనని తలఁచుమని బలవంతము పెట్టఁబోను కాని నీదృష్టిలో నేను వెఱ్ఱివాఁడనే యగుచోఁ బూర్తి "వెఱ్ఱివాని నెవఁడైన దండించి సరిచేయఁగలడా? కొట్టి పిచ్చినివదలఁ గొట్టునెడల లోకములో నిప్పటికి పిచ్చివాఁడనెడు వాఁడుండెడు వాఁడే కాఁడు. ఏలననఁగాఁ గొట్టుట అందఱకును దెలియును. కఱ్ఱతో నెవరు కొట్టజాలరు? రాజా! నన్నాత్మారాముఁడగు మహాత్ముఁడను కొంటివా చిన్న, గొప్ప, రాజు ప్రజసంబంధమును నీవు మఱచిపోవలెను. అట్లుగాక నన్నువట్టి వెఱ్ఱివానిఁగాఁ దలఁచుచో వెఱ్ఱివాఁడు తనయిష్టమువచ్చినట్లు చేయునుగదా? వానిపై మీ వ్యంగ్యవచనములుగాని, దండనభయముగాని, కఠోరవాక్యములుగాని కొంచెమైనను బనిచేయంజాలవు.

శుకుఁడు పరీక్షిత్తునితో నిట్లనెను:- "పాండునందన నరేంద్రమండలి మండన రాజా! ఇట్లుపలికి మహాత్ముఁడగు జడభరతుఁడు మెదలక ఊరకుండెను. పాలకీని మోయుటయు సేవయే ప్రారబ్ధోదయమనియు నట్లుమోయుటచే నాభోగము నశించినదనియుఁ దెలిసికొనెను. ఆ కారణమున రాజు ప్రశ్నలకు యుక్తియుక్తముగఁ బ్రత్యుత్తరమొసంగి, ఆతని జవాబు కొఱకు నిరీక్షింపకయే, మరల పాలకిని భుజముమీఁదఁ బెట్టుకొని మోఁతగాండ్రతో 'పదండయ్యా పదండి" అని పాలకీని దీసికొనిపోవుచుండెను.

రహూగణ మహారాజుగూడ జ్ఞానయుక్తమగు నీప్రత్యు

త్రరములను వినఁగానే ఆతనికి కను తెఱపిడి కలిగెను. ఆతనికి రాజాభిమానము వీడెను. మోహరూపమగు హృదయాంధకారము నశించెను. జడభరతుని జ్ఞానరూపమగు నాలోకనమున వానికిఁ దనస్వరూపము గోచరించెను. రాజదరిపోయెను ఇంకొక దేహాభిమానియగు రాజైయుండినచో మోఁతగాని యిట్టి దృష్టతకు దండించెడువాఁడే. కాని ఆతఁడు తనయుత్తమశ్రేష్ఠ కారణమునఁ దత్త్వజిజ్ఞాసకు బూర్ణాధికారియయ్యెను. సాక్షాదీశ్వరుఁడే మోఁతగాని రూపమును ధరించి తనమోహమును నాశనమొనర్చుటకై యీ యరణ్యమునకు వచ్చినాఁడని తలఁచెను. ఆతని ఒక్కొక్క శబ్దమువలన మహారాజ పరిభావాస్యతుఁడయ్యెను. అనేకసార్లు ఆతఁడు జ్ఞానులతో సత్సంగమొనర్చెను. అనేక యోగశాస్త్ర గ్రంథముల నధ్యయనము గావించెను, కాని నేఁడాతనికి లభించిన సారయుక్తమగు గంభీర విషయము లిదివఱకెన్నడును లభింపలేదు. రాజు హృదయము నీరునీరై పోయెను. ఆతఁడు వెంటనే తన కర్తవ్యమును నిశ్చయించుకొనఁజాలకపోయెను. ఆ తికమకలో మోఁతగాండ్రకు తనపాలకి నాపుమని యాజ్ఞనీయఁజాలకపోయెను. ఆతఁడు వెంటనే పోవుచున్న పాలకీనుండి ఒక్కసారిగా దుమికి, యామునిశ్రేష్ఠుని పాదపద్మముల పైఁబడెను. ఆతఁడు తన యశ్రువులచే నాతని ధూళిభరిత పాదపద్మములనుగడిగెను. కన్నులకాతని పాదధూళిని రాచుకొని, స్నేహాభరిత హృదయముతో నచేతనుఁడై చిరకాలమట్లే ఆ పాదములపైఁ బడియుండెను.

# రహూగణుని పరిచయ ప్రశ్నము

## 33౫

శ్లో॥ కస్త్వం నిగూఢశ్చరసి ద్విజానామ్
బిభర్షి సూత్రం కతమోఽవధూత।
కస్యాసి కుత్రత్య ఇహాపి కస్మాత్
క్షేమాయ నశ్చేదసి నోత శుక్లః॥

శ్రీభాగ. ౫. స్కం. ౧౦ అ. ౧౬ శ్లో.

"వ. మఱియు నిస్సంగుడవయి జడుండునుంబోలె నిగూఢ జ్ఞానంబు గలిగి చరియించుచున్నవాఁడవు నీవచనంబులు యోగశాస్త్ర సమానంబులై వాఙ్మానసంబులకు నభేద్యంబులయియున్నవే నవిష్ణు కళావతీర్ణుండు సాక్షాద్ధరియునగు కపిలమహాముని వలన బ్రహ్మవిద్య దెలియంగోరి చనుచున్నవాఁడ. నీవు లోక నిరీక్షణార్థం బవ్యక్త లింగుండవై చరియించుచున్న కపిలమహామునీంద్రుండవు కాఁబోలుదువు"

శ్రీమదాంధ్ర భాగవతము.

సాధువు ముందుగా నెవనిని స్వీకరింపఁడు. తన యథార్థ స్వరూపమును జెప్పఁడు. భాగ్యవశమున నెవనినైన ఆత్మీయునిఁగా స్వీకరించెనా ఆతనికి తన సత్యస్వరూపమును బ్రకటించి వానినిఁ దరింపఁజేయును. ఆత్మగోపన మొనర్చుట అజ్ఞజనుల యెడలనే. విజ్ఞులైనవారును, అధికారులును ఆత్మస్వరూపులే. వారికడ సంకోచమేల? మనమితరులకడ నగ్నులగుటకు లజ్జించెదము; కాని తనకభిన్నహృదయులకడ నెవఁడైన సంకోచించినాఁడా? అట్లు సంకోచించిన నాతఁడాత్మీయుఁడు కాఁడు.

శ్రీ శుకుఁడిట్లనెను:– "రాజా! రహూగణ మహారాజు భరతుని వాక్యముల కత్యంత ప్రభావాన్వితుఁడై ఆతని చర

ణారవిందముపైఁ బడఁగానే భరతునకు ఆతనిపై దయకలిగెను ఆతఁడేమియుననక అట్లే నిలుచుండెను. ఆతఁడు రాజును తన పాదములనుండి లేవదీయనులేదు, పాలకీని వీడిపోవనులేదు. నేఁడాతఁడు తన వెఱ్ఱినివీడెను నేఁడాతఁడు తనయథార్థరూపమునఁ బ్రత్యక్షమయ్యెను

రహూగణుని ప్రేమావేగము కొంచెము తగ్గిన తర్వాత నాతఁడు లేచి మరల భరతునకు నమస్కరించెను. పనువిడి జని పాలకీనుండి ఆసనమును దిండును గొనివచ్చెను ఎఱ్ఱ మఖమలుతోఁ జేయఁబడి మెత్తగానున్న ఆసనము నొక వృక్షమున కానచి, ఆకుపచ్చని మఖమల్లుగుడ్డపై బంగారు జరీపనిచేయఁ బడిన మెత్తని దిండ్లను మూఁటినిదెచ్చి ఒకదానివెనుక నొక దానిని వైచెను. చేతులు జోడించుకొని భరతుని దానిపైఁ గూర్చుండఁ బ్రార్థించెను. రాజు ప్రార్థన ననుసరించి నేఁడవ ధూత శిరోమణి యగు భరతుఁడు తన కృత్రిమ జడత్వమును వదలి నవ్వుచు నాసనముపైఁ గూర్చుండెను. ఒకమెత్తని బాలీసును ఆతఁడు తన వడిలో నుంచుకొనెను దానిపై చేతినానించుకొని యిట్లనెను:– "రాజా ! ఇప్పుడు చెప్పుము. స్వామియెవరు? సేవకుఁడెవరు?"

అత్యంత లజ్జాభావమును బ్రదర్శించుచు రాజు దీనతాస్వరమున నిట్లనెను:– "స్వామీ ! ఈ మందమతి దాసుఁడు బ్రహ్మభూతాచార్యులగు తమరే స్వాములు."

ఇది వినఁగానే భరతుఁడు నవ్వి యిట్లనెను:– "రాజా ! మరలఁ బొరబడుచున్నావే ?"

రహూగణమహారాజు విషయము దాటవేయుచు నిట్లు నెను:- "స్వామీ! ఆ విషయమును దర్వాత తెలిసికొందము, ఇప్పుడు మీరెవరో తెలిసికొనఁగోరుచున్నాను. ఈ యజ్ఞోపవీతముచే మీరు ద్విజులని తోఁచుచున్నది. కాని మీరుపూర్తిగా నిగూఢముగనున్నారు. నేను మీ పరిచయమును దెలియఁ గోరుచున్నాను.

అంత భరతుఁడిట్లనెను:- "రాజా! 'మీరు' అనుటచే మీ అభిప్రాయము దేనినిగూర్చి? దేహి, దేహమను రెండు వస్తువులున్నవి దేహము పంచభూతములతో నేర్పడినది. నీ దేహమెట్టిదో నా దేహమునట్టిదే. ఇఁక దేహియగు నాత్మ యందమా ఆది నిత్యము, విభువు, సర్వగతము, సర్వవ్యాపకమునైయున్నది. దానినిగూర్చి యేమని చెప్పుదును, కావున నీయీ ప్రశ్న సంగతముకాదు."

రహూగణ మహారాజిట్లనెను:- "అయ్యా! కులగోత్రములతో నాకేమిపని? పోనిండు మీరు నిత్యసిద్ధులలో నెవరేని కారుగదా! దత్తాత్రేయ, ఆసురీ పతంజలి వీరిలో నొకఁడవు కాదుగదా! అట్లు కాకున్నచో మీరేఋషి యింట జన్మించితిరి."

జడభరతుఁడిట్లనెను:- "మహారాజా! మరల నదియే ప్రశ్న. శరీరము పంచభూతములతో నుత్పన్నమైనది. చివరకు వానిలోనే విలీనముకాఁగలదు. ఆత్మ దేనివలనను బుట్టలేదు, పుట్టబోదు. అది పుట్టనే పుట్టకుండిన దాని జనకుని నామము నెట్లుచెప్పఁగలను?"

రాజిట్లనెను:- "స్వామీ! నేనుమీతో తర్కమొనర్పఁ జాలను. మంచిది. మీరెచ్చటనుండి విచ్చేసితిరో చెప్పుఁడు. ఎక్కడుండెదరు? మీ పుట్టుకయెచ్చట?"

భరతుఁడిట్లనెను:- "రాజా! ఈభౌతిక బుద్ధిని వదలుము కొంచెముగఁ బరమార్థ చర్చనొనర్పుము. ఆత్మ యెచ్చటనుం డియునురాదు, ఎచ్చటకినిబోదు. త్యాగగ్రహణములున్న దానికే రాకపోకలు. మనము ప్రియాగనుండి కాశీకివచ్చితి మనఁగా కాశీలో లేమనియుఁ బ్రియాగనుండి కాశీకివచ్చితి మనియునర్థము. ఆత్మ సర్వవ్యాపకము. దానికి రాకపోకలును, ఒకానొకస్థానమునఁబుట్టుటయు సంభవింపదు."

రహూగణ మహారాజు మాటలాడఁజాలక యిట్లనెను:- "ప్రభూ! మీయీగూఢవచనముల వలన మీరుపురుషులు కారు పురుషోత్తములను నిర్ణయమునకు వచ్చితిని. మీరు వచ్చుటకు సాంసారిక ప్రయోజనమేమియునులేదు. కేవలము నన్నుఁ గృపఁజూచుటకే మీరీ గుప్తరూపమునఁ బ్రత్యక్ష మైతిరి. మీరు భగవంతుని జ్ఞానావతారమగు సాక్షాత్తుగ కపిల భగవానులే. "ప్రభూ! దీనహీనుఁడనగు నాయపరాధములను పాటింపక మన్నింపవలెను. దుష్టుఁడనగు నేను మిమ్మనేక విధ ముల నవమానించితిని. దీనిమూలమున నాకు మిక్కిలిగ్లాని కలుగుచున్నది. నాగుండెలదురుచున్నవి."

నవ్వుచు భరతుఁడిట్లనెను:- "ఇఁకఁజాలును. ఏదోమాట లాడుచున్నావు? నీవప్పుడు నేను రాజను ఇదిచేసెదను, అది చేసెదను అని బడబడ వాగితివి. ఇప్పుడీ భాగ్యమునకే గడగడ వణఁకుచుంటివి."

- - - - - - - -

రాజు దృఢ స్వరూపముతో నిట్లనెను:- "లేదుస్వామీ! భయపడ వలసిన పనిలేదు. మానవుల కేమి? నేను ఇంద్రవజ్రమునకే భయపడను. శివుని త్రిశూలమునకు భయపడను. యమపాశమునకు జంకను ఇంతేందులకు పావకాస్త్రము, సూర్యాస్త్రము, చంద్రాస్త్రము, వాయవ్యాస్త్రము, కుబేరాస్త్రము వీనిలో వేనికిని జంకను స్వామీ! కాని బ్రాహ్మణావమానమునకధికముగ జంకెదను. నామూలమున మీకొక్కసారికాదు మాటి మాటికిని అవమానము జరిగినది. అందువలననే మిమ్ములను మాటిమాటికిని బ్రాహ్మణులగుదురా కాదాయని యడుగుచున్నాను."

అంత భరతుఁడిట్లనెను:- 'రాజా! నేనెవఁడనో వాఁడనే నీసంగతినిఁ జెప్పుము."

ఇదివిని రహూగణుఁడిట్లనెను:- "స్వామీ! మీ, యోగయుక్తములగు వాక్యములను విని గ్రహించుటకు నాకు శక్తి లేదు. మీరత్యంత గూఢవాక్యములతోఁ బలుకుచున్నారు. స్వామీ! నేను మీకేమి చెప్పఁగలను? మీకు తెలియనిదేదియును లేదు మీరు బాహ్యాభ్యంతరముల నున్న విషయముల నన్నిటిని గ్రహింపఁగలవారు"

అయినప్పటికిని నేను నాపరిచయములను మీకొసంగుచున్నాను. నేను సింధు సౌవీర దేశములకు రాజును. యోగేశ్వరులకును బరమ గురువును, సాక్షాచ్ఛ్రీహరియొక్క అంశావతారమున నవతరించిన కపిలుని కడకు 'ఈ సంసారమందేక మాత్రమగు శరణ్యమేది? ఎవని శరణు జొచ్చుటచే సమస్త

శోక సంతాపములు తీరిపోవును?" అని అడుగఁబోవుచున్నాను
ఇట్లు పోవుచుండఁగా దారిలో మీదర్శనమైనది. సాక్షాత్తుగ
భగవత్స్వరూపులును యోగేశ్వరులునగు గపిల మహర్షులు మీ
రేనని నాకు దోఁచుచున్నది."

భరతుఁడు నవ్వి యిట్లనెను:- "రాజా! నీకు మాటి
మాటికిట్టి భ్రమ యేలగలుగుచున్నది?"

రహూగణమహారాజిట్లనెను:- "స్వామీ! మీ యోగ
గతి నెవరును దెలియఁజాలరు. యోగేశ్వరులకును నీశ్వరుఁ
డగు శ్యామసుందరుఁడెట్లు లీలాధారియో అట్లే మీరందఱును.
మీరు చూపరులకు మీ వేషమును దాఁచుకొని మీ యిష్ట
ము ననుసరించి తిరుగుచుందురు. మాయామోహమున బద్ధుల
మగు మాబోటివారిని మఱపించుచుందురు. ఒకానొక భాగ్య
శాలి ననుగ్రహించుచుందురు. కాని చాలమంది తమ స్వరూప
మును దెలిసికొనఁజాలక అపరాధములనే యొనర్చుచుందురు.
ఏలననఁగా గృహస్థాశ్రమమునందాసక్తినిఁ జెందిన వివేక విహీ
నులమగు మేము మీబోటి యోగీశ్వరుల గతి విధుల నెట్లెఱుఁ
గఁగల్గుదురు? నావలన నెట్టి యపరాధము సంభవించినదో
చూడుఁడు పూజార్హులగు మిమ్ములను నేను పాలకీమోయు
టకు మోఁతగానిగాఁ జేసి మీచే మోయించితిని గదా! మీ
పైఁగోపగించి నానా యవాచ్యములను బలికితిని గదా! స్వా
మీ! నాయీ యపరాధముల నన్నిటిని మీరు మీదయా స్వ
భావముచే క్షమింపవలయును. నేను చాల సిగ్గుపడుచున్నాను."

జడభరతుఁడు స్నేహ స్వరమున నిట్లనెను:- రాజా! క్షమాపరాధములు ద్వైధీభావమున్నచోటనుండును. ఆత్మీయు లకడ అపరాధమేమి? క్షమయేమి? పొరపాటునఁ బండ్లతోఁ నాలుకను గొఱుకుకొనినఁబండ్ల నూడఁగొట్టుకొందుమా? పొరపాటున వ్రేలితోఁ గన్నులను బొడుచుకొనినచో నెవఁడైన చేతిని దెగఁగొట్టుకొనునా? ఇవన్నియును శిష్టాచార వాక్య ములు. వీనినన్నిటినిఁ గట్టిపెట్టి యథార్థ విషయములను మాట లాడుము. పారమార్థిక ప్రశ్నలనడుగుము. నీశంకలనుగూర్చి నన్నడుగుము."

భరతుఁడనుగ్రహించి రాజునకాజ్ఞనీయఁగా, ఆతఁడు అవకాశమును దీసికొని సంతోషముతోఁదన శంకలనడుగుట కుద్యుక్తుఁడయ్యెను.

శుకుఁడిట్లనెను:- "రాజా! రహూగణ మహారాజు భర తుని వాక్యముల నుండియే చక్కని శంకల నేఱియడిగెను. వా టిని నీవు శ్రద్ధగా వినుచో నాతఁడెంతటి గొప్ప జిజ్ఞాసువో, సూక్ష్మబుద్ధిగల నృపతియో తెలిసికొనఁగలవు. ముందుగా రా జెట్టి సందేహముల నడిగెనో చెప్పి తర్వాత వాటికి సమాధా నములను విస్తారముగ నీకు వర్ణించెదను."

సూతుఁడిట్లనెను:- 'మునులారా! దుగ్ధమునకు సారము ఘృతమెట్లో అట్లే రహూగణ భరతులకు జరిగిన సంభాషణము జ్ఞానమునకు సారమైయున్నది. మీయాజ్ఞయైనచో దానిని వర్ణించెదను; లేదా యీ వర్ణనము నెప్పుడైనను బ్రసం గను సారమగ జ్ఞాన ప్రకరణమున దీనిని వర్ణించి యిప్పుడు

పైకథను నడుపుట మంచిదని నా యుద్దేశ్యము."

అంత నత్యంతోత్సాహమును బ్రకటించుచు శౌనకుం డిట్లనెను:- 'సూతా! ఈమాట మాకు బాగుండలేదు. మహాభాగా! నీవు పరిసంగము నట్లే వదలి వేయుచో మా సందేహము లట్లే నిలిచిపోవును. రాజేపరిశ్నములను వేసినదియు భరతుండు వాని కేమి పరిత్యుత్తరము లిచ్చినదియు నతిగూఢము లైనను నవి కథకు సంబంధించిన భాగములే. నీవు గూఢజ్ఞానమును నెన్నియో దృష్టాంతము లొసంగుచుం జెప్పుచున్నప్పుడు మాకు విసుగు జనించుటలేదు. నీవు శుష్కజ్ఞానరూపమగు పిండిలో నుపాఖ్యానము, సరసత, భక్తిపరిసంగములను చక్కెర, నేయి, పాలను గలిపి దానిని హృద్యముగను, పరమపేయముగను సుస్వాదువుగను జేయుచున్నావు సూతా! మేము నీవిప్పుడనిన యాలోచనము నొప్పుకొనము. నీవీ పరిసంగమును పూర్ణదృష్టాంతములతో బాగుగా నర్థమగునటులం జెప్పవలయును. కృపణత్వమును వహింపరాదు."

సూతుండుల్లాసముతో నిట్లనెను:- "స్వామీ! నాకేమి? మీరు వినుట కుద్యుక్తులై యున్నారు; కావున నేను వినిపించెదను. సావధానులరై మీరందఱును శ్రవణ మొనర్పుడు.

# రహూగణ మహారాజు శంకలు-భరతుని సమాధానములు

(33ఇ)

శ్లో॥ దృష్టః శ్రమః కర్మత ఆత్మనో వై
భర్తుర్గంతుర్భవతశ్చానుమన్యే
యథా సతోదాన యనాద్య భావాత్
సమూల ఇష్టో వ్యవహార మార్గః ॥

(శ్రీ) భాగ. ౫ స్కం. ౧౦. అ. ౨౧ శ్లో॥

వ. "——. కర్మవశంబున దృష్టంబై శ్రాంతి సహించుచు నడచుచున్న యీ యాశ్రమంబు నాకునుం బోలె నీకు నగునని తోఁచుచున్నదది యెట్లనిన ఘటంబు లేక జలంబు దేనేరని తెఱంగున లేనిది గానంగనేరదు గావునం బ్రమాణ మూలం బయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి నీవాడు వాక్యంబులు నాకు సమ్మతంబుగా నేరవు."

(శ్రీ) మహాంధ్ర భాగవతము.

ఆచార్యుఁడు మనకనుకూలమైనపుడు మనము దృష్టులమై వారి వాక్యములను ఖండింపఁబూనెదము. ఇచ్చటి ఖండనముయొక్క తాత్పర్యము వారియెడల ననాదరమును బ్రదర్శించుటకాదు, కాని విషయమును శంకావిహీనము గావించుటకే, అల్పబుద్ధిగల మనము ఆచార్యుని వ్యాఖ్యయందు దోషములనెన్ని శంకలను బయటఁబెట్టుచో దానిని గాంచి తన కథనమునకు విస్తృత వ్యాఖ్యానుగావించి శిష్యుని శంకలను నిర్మూలము గావించును. ఇట్లు శ్రద్ధాపూర్వకముగను, సమ్మానముతోడను జరుగు పరస్పర వివాదమునందు తత్త్వబోధ నిర్ణయమగును. ఇట్లాలోచించి రహూగణమహారాజు భరతుని కథనమందుగల దోషములను జూపించుట కారంభించెను.

శుకుఁడిట్లనెను:- 'రాజా! ఇప్పుడు రహూగణమహా రాజా భరతుని వచనములందే శంకజేయఁబ్రారంభించెను. రాజిట్లనెను:- "ప్రభూ! నేను పల్లకిని మోయుటయును లేదు, నాకు మార్గశ్రమమును లేదు' అని అంటిరి. ఈమాట నాకు సత్యముగ గోచరించుటలేదు. ఏలననఁగా పాలకిని మోయుచుండఁగా మనుష్యులనందఱును జూచుచునేయున్నారు. ప్రత్యక్ష ప్రమాణముండఁగా నన్యప్రమాణ మవసరములేదు. మీకుశ్రమ కలిగినదియు లేనిదియు నది ప్రత్యక్షముగఁగనఁబడుట లేదు. ఏలననఁగా- నలయుటయు, శ్రమచెందుటయు స్వవిస్వానుభవ విషయములు; కాని బాహ్య చిహ్నములచే నీయనుభూతిని ననుమానముచేఁ దెలిసికొనవచ్చును. నేను శస్త్రమును దీసికొని యుద్ధములో శ్రమచెందుచుందును, దారినిఁబోవుచు బరువు మోయువారందఱును నలసిపోవుచున్నారు. దానివలన మీకుఁగూడ శ్రమకలిగియుండవచ్చునని యనుమానము కలుగుచున్నది చెమటవలనను, ముఖమునఁగల దీనత్వమును బట్టియు నొకానొక వ్యక్తి యలసినాఁడని అనుమానము గలుగుచున్నది బరువును మోయుటయు, శ్రమ ఇవి ప్రత్యక్షానుమాన సిద్ధములు అట్టియెడ మీరంగీకరింపరేల? నా మొదటి శంక యిదియే."

ఇది విని భరతుఁడు నవ్వి యిట్లనెను:- "రాజా! మొట్టమొదట ప్రత్యక్షమని నీవు దేని నందువో చెప్పుము. నీవు ప్రత్యక్షముగ దేనినిఁజూచితివి?"

రాజిట్లనెను:- "స్వామీ! ప్రత్యక్షమన వ్యాఖ్యానించు

లెట్లు? కన్నుల ముందఱ కనఁబడునది ప్రత్యక్షము. మేము మాకన్నులతోఁ జూచితిమి, పాలకి మీ భుజముపైఁగలదు. దానిని మీరు మోయుచున్నారు. నేనేకాదు వీరందఱును జూచిరి."

భరతుఁడిట్లనెను:- "నీవు ఎవనిమీఁద దేనినిఁజూచితివో దానినిగూర్చి విచారింపుము. వీనిని నీవు మోయువాఁడని అనుచున్నావు ఆతనికి నేలపై రెండు పాదములు కలవు. పాదములపై మీఁగాళ్లు, మడమలు కలవు మడమలపై పిక్కలుగలవు పిక్కలపై మోఁకాళ్ళు గలవు. మోఁకాళ్లపై తొడలు కలవు. తొడలపైఁగటిప్రదేశము. దానిపైని పొట్ట, పొట్టపై వక్షః స్థలము, వక్షః స్థలముపై భుజములు. భుజములపై పాలకీబొంగు ఆబొంగునకు మడత బందుతో వ్రేలాడుచున్న కొయ్య వ్రేలాడుచున్నది. ఆకాష్ఠము మీఁద నొక మాంసముతోఁ జేయబడిన పిండము కూర్చుండెను. అది తనను గూర్చి మాటి మాటికి 'నేను సింధు సౌవీర దేశపు రాజునని పలుకుచున్నది. ఇప్పుడాలోచించుము మోయువాఁడెవఁడో? ఎప్పుడెవనిపై మనస్సు పోవునో అదియే మోయుచున్నదనుకొందుము బరువన్నిటిపై నున్నది. నీశరీరముపై మాత్రము బరువు లేదా యేమి? పాదముల మీఁద కటికలదు. కటిపై నుదరము కలదు. శిరస్సు భుజముపైనున్నది. పోవుచుండిననే అలపుకలిగినచో నీవును వెళ్ళుచున్నావు, పాలకియు వెళ్లుచున్నది. అన్నిటికిని సమానముగ శ్రమయుండవలెను"

రాజిట్లనెను:- "స్వామీ! పాలకీ బడమైనది. మీరును

నేనును చైతన్యము కలవారము. నేను కూర్చుంటిని; మీరు నడుచుచున్నారు. ఇందులో జాల భేదమున్నది."

ధైర్యముతో జడభరతుఁడిట్లనెను:- "ఆభేదమునే తెలిసికొనవలసియున్నది. ఏమి భేదము? కేవల నామరూపములచేఁ గల్పింపబడిన భేదము. ముందుగా నీవు పల్లకీ యని దేనిననుచున్నావో దాని సంగతినిఁ దెలిసికొనుము. పర్వతముపై నొక వృక్షమున్నది. అది కొట్టి చీల్చఁబడినది ఇప్పుడు దానిని వృక్షమని పిలువక అందఱును చెక్కలని పిలుచుచున్నారు రెండు మూఁడు చెక్కలనుగోసి, కొయ్యమేఁకులను బిగించి దానినొక గుండ్రని వస్తువుగాఁ దయారుచేసినారు ఇప్పుడు దానిని చెట్టనరు చెక్కయనరు ఇప్పుడుదానికి పల్లకీయనుపేరు వచ్చినది తత్వతః దానిలోని పదార్థములన్నియు నవియే, కేవలము నామరూపములలోనే భేదము ఆకాష్ఠములఁగూడఒకదానిపై నొకటిపెట్టబడినవి వానికిఁగూడ శ్రమకలుగవలసియున్నది. ఇఁక జడచైతన్యము విషయము మిగిలియున్నది. అయితే నీశరీరమునకును ప్రపంచములోని సమస్త శరీరములకును, ఆశిబికయొక్క పదార్థములలోను నేభేదమున్నదని నేనడుగుచున్నాను. కొయ్యతోఁ జేయఁబడిన శిబికయు పంచభూతముల వికారమే. అన్నిశరీరములును బంచభూతాత్మకములే. అన్నిటిలోను నొకటే పదార్థమే యుండగా 'నీదిలావు' ఇది సన్నము; ఇది బలముకలది, ఇది నిర్బలమైనది; ఇదిజడము, ఇది చైతన్యము; ఇది వాహ్యము, ఇతఁడు వాహకుఁడు; ఇతఁడురాజు, వీఁడు సేవకుఁడు" ఇవన్నియుఁ గేవలము వ్యవహారమాత్రములే, ఆత్మ [illegible]

నిర్లేపమైనది అది రెండుగా లేదు. అది ఒకే అఖండాద్వైతము.
అట్టియెడ 'నేను ప్రత్యక్షముగ మోయుటను జూచుచున్నాను;
అలసియుండవచ్చును, బలవంతుఁడవు' మొదలగునవి యనుట
యజ్ఞాన జన్యవాక్యములు కాఁగలవు. వ్యవహారములో వీని
సత్తా కలదు. కాని పరమార్థమందు ఇవి నిరర్థక వ్యర్థవాక్య
ములే కాఁగలవు."

రహూగణ మహారాజిట్లనెను:— "స్వామీ ! మీరు
మిక్కిలి చక్కఁగ మాటలాడుచున్నారుగాని అది నామనస్సు
నకు సరిగా నెక్కుటలేదు దీనిని స్పష్టముగఁ జెప్పుఁడు."

అంత జడభరతుఁడు నవ్వుచు నిట్లనెను:— "మంచిది
రాజా! ఇప్పుడు నీకొక దృష్టాంతమును జెప్పెదను వినుఁడు.
ఒక ధర్మాత్ముఁడగు ఋషియుండెను. అతనికొక పుత్రుఁడు.
అతఁడు తనపుత్రుని మిక్కిలి యోగ్యుఁడగు జ్ఞానిగాఁ జేయఁదలఁ
చెను; కాని గారాబముచే సాధారణముగఁ దండ్రికడ పుత్రు
నకుఁ జదువురాదు. అట్లని యాఋషి వానినిఁ దన యన్నకడకుఁ
గొనిపోయి యిట్లనెను:— "వీనిని మీరు సర్వథా యోగ్యునిఁగ
నొనర్పుఁడు. వీనికి బ్రహ్మజ్ఞానమందును, వేదాంత శాస్త్ర
మందును బూర్ణనిష్ఠను గలిగింపుఁడు." తనతమ్ముని కుమారుఁడు
శిష్యుఁడగుటకు ఋషిమిక్కిలి ప్రసన్నుఁడై తనతమ్మునితో
నిట్లనెను:— "సోదరా ! నిశ్చింతగానుండుము. వీనిని నేను బూర్ణ
జ్ఞానిగా నొనర్చెదను." అంత సోదరుని చింతపోయెను ఇప్పుడా
ఋషి వానికి జగత్తుయొక్క యనిత్యతనుగూర్చి వేదాంత వాక్య
ములచే బోధింపసాగెను. చిరకాలము వేద వేదాంతములను

చెప్పెను. కొంతకాలమునకు సమావర్తన సంస్కారసమయ
మాసన్నమయ్యెను. స్నాతక మొనర్చుకొని, వివాహమైన
తర్వాతఁదన శిష్యుఁడు అనఁగాఁదమ్ముఁనికొడుకు ఇంటికిఁబోయి
యింటి పనులలో మునిఁగిపోయెను, ఇచ్చట నాచార్యుఁడు వానికి
పూర్ణజ్ఞానము కలిగినదో లేదో యనుకొనెను. ప్రాచీన మహాత్ము
లకు ఆయువు వేలకొలఁది లక్షలకొలఁది సంవత్సరములుండెడిది.
వేల సంవత్సరములు గడిచిపోయెను, ఆచార్యుఁడు వృద్ధుఁ
డయ్యెను, తలవెండ్రుకలు నెఱసెను శిష్యుఁడును దపస్సుచేసి
చేసి యువకుఁడయ్యెను.

ఆచార్యుఁడు తన శిష్యుని యింటికిఁబోయెను. రాజా !
రాజధానులలోఁ బెద్దపెద్ద నగరములకు నాల్గువైపులను పరకోట
లుండును. వానికి నలువైపులను ప్రధాన ద్వారములుండును.
జనులు వానిద్వారముననే లోనికివచ్చిపోవుచుందురు, ఆచా
ర్యుఁడు ప్రధానద్వారముకుండా పోఁదలఁచునప్పటికి ద్వార
పాలకు లాతని నడ్డగించిరి. ఆతఁడిట్లనెను:- "అయ్యా ! ఎందు
లకు లోనికి వెళ్ళనీయరు?"

ద్వారపాలకు లిట్లనిరి:- "మహారాజు సవారి బయటికి
వచ్చునంతవఱకు లోనికెవ్వఁడును వెళ్ళరాదు." ఇదివిని
ఆచార్యుఁడు ద్వారమునకొక ప్రక్కనొదిగి కూర్చుండెను.
ఇంకను జాలమందివచ్చి అచ్చటకూర్చుండుచుండిరి దైవ
యోగమున నాతని తమ్ముఁడు కొడుకగు శిష్యుఁడరణ్యమునుండి
కుశసమిధలను గట్టకట్టుకొనివచ్చెను. ద్వారపాలకులు వానినిఁ

గూడ అడ్డగించిరి, ఆతఁడును దనమోఁపు నొకప్రక్కనునుంచి రాజసవారి బయటకు వచ్చుటకుఁ బ్రతీక్షించుచుండెను. ఆతఁడు తనశిష్యుఁడని యాచార్యుఁడు గుర్తుపట్టినాఁడుగాని శిష్యుఁడు గుర్తింపలేదు. చాల పరిశ్రమకావించి యెండలో నాతఁడు సమిధలను దెచ్చెనుగావున నలసిపోయి చెమట నార్చుకొనుచుండెను. ఇంతలోనే మెల్లమెల్లగ జరుగుచు జరుగుచు నాచార్యుఁడు వాని దగ్గఱకుఁజేరెను. ఇంతలోనే గొప్ప వైభవముతోడను మేళతాళములతోడను రాజ సవారియువచ్చెను.

వృద్ధస్వభావాను సారముగ మిక్కిలి సరళముగ నాతఁడిట్లడిగెను:- "ఇదియేమి ప్రపంచము?"

ఆశిష్యుఁడు సరళముగ నిట్లనెను:- "నేఁడొక విశేష పర్వము. ఇది రాజుయొక్క సవారి ఆచార్యుఁడు సంతోషముతో నిట్లనెను:- "నాయనా ! రాజెవరో నాకు చెప్పుము." ఆచార్యునితో శిష్యుడగు ముని యిట్లనెను:- "నీవీ దేశపు రాజునుగూడ యెఱుఁగవా?"

ఆచార్యుఁడిట్లనెను:- "ఎట్లు తెలిసికొందును నాయనా ! నీవు తెలిపినఁదెలియఁగలను. ఇంతమందిలో రాజెవఁడో నాకుఁ దెలియుటలేదు."

యువకముని వృద్ధుని యీ యజ్ఞానమునకు నవ్వి యిట్లనెను:- "బాబూ! ఈమాత్రము తెలియదా? క్రింద అందరును నస్త్ర శస్త్రములు పట్టుకొని నడుచువారును మిగిలిన వారును బ్రజలు, పైన నేనుఁగు మీఁద వస్త్రభూషణాదుల నలంకరించుకొని, ఛత్రచామరములను ధరించి కూర్చుండిన యీతఁడు రాజు."

సరళముగ నాచార్యుఁడిట్లడిగెను:- "ఏనుఁగెవరు? రా జెవఁరు? ఈ ప్రశ్నవలన యువక మునికి విసుగుపుట్టి, అసలే అలసియుండుటచే వ్యంగ్య వచనములతో నిట్లనెను:- 'ఇప్పుడే వనపర్వత గుహానుండి వచ్చినట్లున్న దే. ఏనుఁగనఁగా నేమియో యెఱుఁగవా? గొప్ప లావుపాటి శరీరముగల పశువది యేనుఁగు, దానిమీఁదఁగూర్చుండిన యాతఁడు రాజు."

ఆచార్యుఁడు సరళముగ నిట్లనెను:- "పశువనేమి? మనుష్యుఁడననేమి? ఇప్పుడు యువకమునికి ధైర్యము సడలి పోయెను. అతఁడు కోపదృష్టితో వృద్ధమునినిఁజూచుచు నిట్లను కొనెను:- "ఈతఁడు వెఱ్ఱికాఁడుగదా! ఈతనికి మానవునకును బశువునకును గల భేదమును దెలియదు." అయినను సంబాళించుకొని యిట్లనెను:- "బాబూ! సొదపెట్టెద రేల? ఎంతసేపటి నుండియో వాగుచున్నారు. భంగు త్రాగలేదు గదా! పశువేది యో మనుష్యుఁడెవరో తెలియదా! అంతమాత్రము బుద్ధి నీకు లేదా? ఎక్కించుకొన్నది పశువు, ఎక్కినవాడు మనుష్యుడు, క్రిందది పశువు పైనున్నవాఁడు మనుష్యుఁడు.?"

వృద్ధుఁడు మరల సరళముగ నిట్లడిగెను:- "పైనయేమి? క్రిందయేమి? పైనయెవఁడు క్రిందయేది"?

ఇప్పుడు యువకుని క్రోధము హద్దులు దాఁటిపోయెను. ఎగిరి వృద్ధుని భుజముపైఁగూర్చుండి పెద్దగ పెరిగినగడ్డపు వెండుకలను బట్టుకొని యిట్లనెను:- "ఎంతసేపటి నుండియో వ్యర్థప్రశ్నములడుగుచుఁ జెవులు చిల్లులు పడిపోవుచున్నవి. ఇప్పుడైనఁ దెలిసినదా? నీవు క్రిందనున్నావు నేను పైనున్నాను."

అదే సరళతా స్వభావముతో వృద్ధముని యిట్లనెను:-

"నీవెవఁడవు, నేనెవఁడను?"

ఇప్పుడు యువకముని తలకుఁదట్టెను ఈ తఁడెవఁడో ద్వైతగంధము లేని జ్ఞానియగుఋషి యని యనుకొని పైననుండి దిగి యాతని చరణములపైఁబడి యిట్లనెను:- "స్వామీ! మీరు నాయాచార్యులగు ఋభులుగాఁ దోఁచుచున్నారు. ఏలననఁగా-నిట్టి యద్వైత జ్ఞానమాతనికిఁదక్క యింకెవరికిని గలుగదు."

నవ్వి మహాముని యిట్లనెను:- "నాయనా! నేను నీ యాచార్యుఁడనే నీకు జ్ఞానమునఁ బూర్ణనిష్ఠకలిగినదో లేదో పరీక్షించుటకై వచ్చితిని. నాయనా! ఇంకను బక్వము కాలేదు బాహ్యా వాహకములగు నేను నీవు, నాది నీది యను నీ వ్యావహారిక విషయములు మిథ్యలు, జ్ఞాని వీనియందు స్వప్నమందైనఁ బ్రీతికలిగియుండరాదు. ఇంద్రియముల మూలమునను, మనస్సుమూలమునను మనకుఁగలుగ యనుభవములన్నియును మాయజనితములును, అసత్యములును, ఆత్మకును వానికిని సంబంధము లేదు. ఆత్మ అసంగము, నిత్యము, శాశ్వతము, అపరివర్తన శీలము."

ఇట్లుపదేశించి ఋభువు తన శిష్యుఁడగు నిదాఘుని ద్వారా పూజితుఁడై, సత్కృతుఁడై మరలఁదన యాశ్రమమునకు వెడలి పోయెను. కావున రాజా! ఉత్తమాధమత్వములు, నీచోచ్చలు ఆత్మయందు లేవు. ఇవన్నియును జిత్తకల్పిత వికారములు. ఈ చిత్తము సత్వ, రజ, స్తమోగుణ వ్యాప్తమైనపుడు నపుస్త జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు వశమై వాని ద్వారా కర్మలొనర్చుచుండును. మనస్సులోనైనను గర్మలొనర్చు ప్రేరణ పూర్వజన్మ వాసనానుసారముగ నుండును.

పృథివ్యప్తేజోవాయురాకాశములు దశజ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, మనస్సు యీ విధముగ పదునారు కళలతోఁగూడి, గుణాశ్రితమై విషయ వికారములుగల మనస్సే భిన్న భిన్న నామములతో భిన్న భిన్న రూపముల అసత్కల్పనలు గావించి వానిలో నుత్తమ నీచత్వములు నారోపించును. అశుద్ధ మనస్సే సంసారమునఁ బడును, అదియే విశుద్ధమైనపుడు బ్రహ్మ వఱకు బోవును. యథార్థ జ్ఞానమును గలిగించును. కావున రాజా! ఈ మనస్సును విశుద్ధము కావించుకొని నీవు విచారించుకొనుము. వాహ్యమును లేదు, వాహకమును లేదు, క్రియయును లేదు, ఆయాసమును లేదు, ఏది కలదో అది అదియే.

శుకుఁడిట్లనెను:- "రాజా! పరమహంస శిరోమణియు నవధూతయునగు జడభరతుని యీగూఢ తత్త్వజ్ఞాన విషయములను విని రహూగణ మహారాజు కొంచెము సేపు విచారించుచు, మరలఁదర్వాత పరిసంగమును నడుపుటకు ఆతఁడు భరతుని అన్యపరిసంగముపైఁ బ్రశ్నింపసాగెను స్వామిసేవక భావమెట్లు సత్యమో తెలిసికొనుటకై ప్రశ్నించుట కుద్యమించెను.

## జడభరతుని ద్వారా వ్యవహార పరమార్థ వివేచనము.

(332)

శ్లో॥ అకోవిదః కోవిదవాద వాదాన్
వదస్యథో నాతి విదాం వరిష్ఠః ।
న సూరయో హి వ్యవహారమేనమ్
తత్త్వావమర్శేన సహామనంతి ॥

(శ్రీ) భాగ. ౫స్కం. ౧౧అ. ౧ శ్లో.

క॥ కడు వేడ్క నీవు విద్వాం, సుఁడవై యుండియును మిగుల అజ్ఞోద్యమవిద్వాం
సుఁడుం బోలెను బలికెదవి, ప్పుడు మేలన వచ్చుఁ గొంత పురుషులలోనన్॥

ఆ॥ పరఁగఁ బెద్దలీ ప్రపంచమంతయుఁ దథ్య
మనరు నీవు తథ్య మనుచుఁ బలికి
తట్లు గాన నిన్ను నధికుండవని పల్క
రాదు నాకుఁ జూడ రాజ చంద్ర॥

(శ్రీమదాంధ్ర భాగవతము

దగ్గఱ పరిచయము లేనంతవరకే శిష్టాచారముండును. అతిపరిచయమున శిష్టాచారము శిథిలమగును. చిన్నవారియందు మమకారముండిన వారినదుపుచేసి కసరుటలో నానందము కలుగును. మమత్వము లేక యెవఁడెవరినిఁ బ్రేమ పూర్వకముగ గద్దించును. మమత్వము లేక యెవరెవరిని స్నేహభరితముగ నెగతాళి చేయును ఈ ప్రపంచము సంబంధము మీఁదనే ఆధారపడియున్నది. సాంసారిక సంబంధము కానిండు, పారమార్థిక సంబంధము కానిండు రెంటియందును బక్షపాతముండును. పక్షపాతము లేక సంబంధము లేదు. యోగ్యుఁడగు శిష్యునియందు గురువునకుఁ బక్షపాతముండును. పెద్దవారికి యెవరియందెట్టి పక్షపాతముండునో వారినంతయధికముగ నదుపు చేయుదురు. యోగ్యునిగా నొనర్చుటకుఁ బ్రయత్నించెదరు, వారి నెగతాళి చేయుదురు వ్యంగ్యముగ నిట్లందురు:- "వత్సా! నీవు చాల బుద్ధిమంతుఁడవే మాటలు కోటలు దాటుచున్నవిగాని వానిలో సారము లేదు." ఇట్టి స్నేహవచనములలో నెంతటి మమత్వమున్నదో దీనినభిమాని యగువాఁడు తెలిసికొనఁజాలఁడు."

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! జడభరతుని మాటలకు

ఇంకను శంకఁజేయుచు రఘూగణ మహారాజిట్లనెను:- "స్వామీ! ఆఁకలి దప్పులును, తృష్ణాభయములును, శోకశ్రమలును నాత్మకు లేవని మీరంటిరి ఇవి మనోధర్మములు. ఆత్మకు విషయములయొక్క సుఖదుఃఖములతోడ నేవిధమగు సంబంధమును లేదంటిరి ఇది నాకర్థముకాలేదు. ఆత్మకు దేహేంద్రియములతో సంపర్కము లేకున్నచో దానికి సుఖదుఃఖములుండవనుటను మేమంగీకరింతుము, కాని జీవాత్మకు శరీరముతో సంబంధముకలదు. ప్రత్యక్షముగ దానికి విషయములతో సంపర్కము లేకున్నను బరంపరగా సుఖదుఃఖములు కలుగుచుండును ఎట్లనఁగాఁ- బొయ్యిపై గిన్నె పెట్టి, దానిలో నీరుబోసి, ఆనీటిలో ధాన్యమును బోయుఁడు పొయ్యిక్రింద అగ్ని వెలుఁగుచున్నది. అగ్నితో ధాన్యమునకుఁ బ్రత్యక్ష సంబంధము లేకున్నను నగ్నివలన గిన్నె వేడెక్కినది. గిన్నె వేడిచే నీరు వేడెక్కెనవి. నీటి వేడివలన బియ్యముపైననున్న పొట్టు వేడెక్కినది. అది వేడెక్కుటచే లోననున్న బియ్యము గింజెయు వేడెక్కి ఉడికినది. దానివలన నన్నమైనది. ఇదే విధముగ శరీరము, ఇంద్రియములు, మనస్సు, అంతఃకరణము వీని సన్నిధిచే జీవాత్మయగు పురుషునకును సుఖదుఃఖాను భూతికలుగవచ్చును. అది మొదటి ప్రశ్న. ఇఁక రెండవదేమి యనఁగా రాజు, ప్రజల సంబంధము మిథ్య, కల్పితమంటిరి. ఇందుఁబారమార్థిక ప్రయోజనమేమియును లేదంటిరి. ఇదియు నాకు తెలియలేదు. రాజు లేకున్నఁ బ్రపంచకార్యములు నడుచుటెట్లు? రాజుశరీరము పంచభూతాత్మికమైనను, అందఱకు వలెనే ఆతనికిని కాళ్ళు చేతులు, కన్నులు, ముక్కులు, చెవులు మొదలగు నవయవ

ములున్నను రాజు వారికి విశిష్టుడే. అందఱు నొక్కటియే య
నుచో నెవరి యాజ్ఞను బాలించువారుండరు. మీరు మట్టికిని,
కుండకును భేదము లేదందురు. కుండయును మట్టితోఁ జేసినది
యే, మట్టియు మట్టియే యందురు. రెంటిలో నొకే పదార్థము
న్నది కుండలో నంతటను మట్టియే కలదనుట యదార్థమైనను
మట్టితోఁ జేయఁబడినది, మట్టిలోనున్నది, చివరకు మట్టిలోనే
కలియును. అట్లైనను సాధారణపు మట్టికిని, కుండకును జాలభే
దమున్నది. మీరు జలమును దేవలయుననిన మట్టిలో జలము
రాదు. జలము కుండతోడనే రాఁగలవు అదేవిధముగ శాసన
మును రాజే చేయఁగలఁడు. కావున రాజునకును సాధారణుల
కును మిక్కిలి భేదముకలదు. ఆతఁడు ప్రజలచేనియమింపఁబడిన
నియమింపబడుగాక ఆతఁడు శాసకుఁడే పాలకుఁడే. కావుననున్మ
త్తులను, పిచ్చివారినిదండించుట ఆతని ధర్మము, కర్తవ్యమును.
అది ప్రభుసేవ. అందుదోషమేమియు లేదు. ఈనియమము మీ
విషయమునఁగాదు మీరు విశ్వబంధువులు. మానావమాన
రహితులు, సాక్షాత్తుగఁ బరబ్రహ్మ స్వరూపులరు. నేనేమిటి
మిమ్మలను శూలపాణియగు శంకరుఁడవమానించినను వానికిఁ
గళ్యాణములేదు. దయయుంచి నా యీ ప్రశ్నలకు సమాధా
నమీయవలెను."

శుకుఁడిట్లనెను:— "రాజా! రహూగణ మహారాజుయొ
క్క యీమాటలను జడభరతుఁడు విని యాతఁడు నవ్వుచు
నా నిరభిమాని యగు మునిరాజును మధురముగ మందలించి
యిట్లనెను:— "రాజా! నీవు మూర్ఖుడఁగు వసంతుఁడవే గొప్ప

పెద్దవానివలె బాఱలు చాచుచున్నావు. అజ్ఞుఁడవు విజ్ఞునివలె మాటలాడుచున్నావు. మహారాజా! పేడను బెల్లమును నొక్క-టిగఁ జేయరాదు. పరమార్థము వ్యవహారము ఇవి వేఱు వేఱు, పరమార్థమందు వ్యవహారముండదు. గిన్నెలోని గింజలుడుక వచ్చును సంగమువలనఁగాని, ఆత్మ అసంగమైనది అది దేహాది సాంగత్యముననుండదు. ఆకాశము సర్వవ్యాపకమును నపరిచ్ఛిన్నమును సర్వగతమైయున్నది కాని ఘటాదుల ద్వారా అది పరిచ్ఛిన్నముగ గోచరించును. సాధారణముగ ఘటాకాశము; మఠాకాశము; శరీరాకాశము, కర్ణఛిద్రములలోని యాకాశము. ముఖాకాశము మొదలైనవి. బాగుగా నాలోచించుచో నీభేదములాకాశమందుఁ గలవా? ఈ భేదములకుఁ గారణమాకాశములో వికారము కలిగినా? దాని సర్వవ్యాపకత నశించినదా? ఘటము పగిలినదనుకొనుము, ఘటాకాశము సర్వగతాకాశములోఁ గలిసినది. కలిసినదనుటయును మిథ్యయే, అసలు వేఱుగా లేనే లేదు. ఘటోపాధిచే నది వేఱుగా గోచరించినది. ఉపాధి నశింపఁగానే దాని సంజ్ఞయు నశించినది. కావున నీవు చెప్పినటుల దేహసంసర్గము చేతను, మనస్సన్నిధిచేతను నాత్మకును సుఖదుఃఖములు, శ్రమ, గ్లాని, ఆఁకలిదప్పులు నిద్రాతంద్రలు కలిగినవనుట నిజముకాదు. ఆఁకలిదప్పులేమి? ఆత్మకు సుఖదుఃఖ భోక్తృత్వము లేదు. ఈ విషయమున నీకు మహర్షియగు ఋభు, నిదాఘుల అత్యంత మనోరంజకమగు నుపాఖ్యానమును జెప్పెదను ధ్యానపూర్వకముగ వినుము.

ఋభువు బ్రహ్మకుమారుఁడు నిదాఘుఁడాతని సోదరుఁడగు బులస్త్యుని కుమారుఁడు. పులస్త్యుఁడు నిదాఘుని ఋభుని కడకుఁ జదువఁబంపెను చదువు పూర్తికావించుకొని సమావర్తనము చేసికొని యాతఁడు తనయింటికిఁబోయెను. ఆతఁడు దేవికా నదీతీరమున వీరనగరమను బురమునకుఁబోయి గృహస్థ ధర్మమును బాలించుచుండెను. నిదాఘుఁడు తన కనురూపయగు నొక సుందరిని పాణిగ్రహణము కావించుకొని, ఆమెతో నగ్నిహోత్రాది పంచయజ్ఞములను నిత్యమొనర్చుచు సుఖముగఁ గాలయాపన మొనర్చుచుండెను. ఈవిధముగ వేల సంవత్సరములు గడిచెను.

శిష్యుఁడు సమర్థుఁడైన తర్వాత గురువును మఱచిన మఱవవచ్చును గాని గురువు శిష్యుని మఱవఁడు. ఒక దినమున దయాళుఁడగు నాచార్యుఁడు నిదాఘునకు జ్ఞానము కలిగినదో లేదోనని వీరనగరమునకుఁ బోయెను.

గృహస్థ ధర్మమేమనఁగా- వంటకాఁగానే బలివైశ్వదేవము నొనర్చి అన్నమును భగవానునకు నివేదించి, కొంచెము సేపు ద్వారమున నతిథికొఱకుఁ బ్రతీక్షించి, అప్పుడెవఁడైన నతిథి వచ్చినచో ముందుగా వానికి భోజనమిడి, భగవత్ప్రసాదమును, సాధుమహాత్ముల ప్రసాదమును దాను తినవలెను.

నిదాఘుఁడు బలివైశ్వదేవము నొనర్చి యతిథి కొఱకు వాకిటఁగూర్చుండఁగా నింతలో నాచార్యుఁడగు ఋభు అచ్చటికి వచ్చెను. చాల దినములగుటచే ఋభువును దనవేషమును మార్చుకొని వృద్ధబ్రాహ్మణ వేషమున వచ్చుటచే నాతని

నిదాఘుఁడు గుర్తింపఁజాలక పోయెను నేఁడంతటి తేజస్వియగు నతిథినిఁబొంద నిదాఘుఁడు పరమ సంతుష్టినిఁజెందెను. అతిథి సత్కారమునెట్లు చేయవలయునో అట్లు సత్కరించి శ్రద్ధతో నాతని పాదములను గడిగి. చేతులను జోడించుకొని నిదాఘుఁడిట్లనెను:- "ప్రభూ! మాయింటనున్న నీపచ్చడి మెతుకులను గ్రహించుఁడు"

ముఖము చిట్లించుకొని వృద్ధ బ్రాహ్మణుఁడిట్లనెను:- 'విప్రవరా! పచ్చడి మెతుకులు నాకు రుచింపవు. ఇంక మీ యింటిలో నేమియున్నవి?"

చేతులు జోడించుకొని నిదాఘుఁడిట్లనెను:- "స్వామీ! మాయింటిలోఁ బప్పుచేయఁబడినది. రొట్టె, మజ్జిగపులుసు వున్నది. పిండియున్నది. నీవారధాన్యమున్నది. మీకేది యిష్టమో దానినిఁ దినుఁడు."

ఇది విని వృద్ధ బ్రాహ్మణుఁడిట్లనెను:- "ద్విజవరా! నీవు చూచుచునేయున్నావుగదా, నేను వృద్ధుఁడను. నోటనొక దంతమైనను లేదు. ఈ వస్తువులతో నాకు తృప్తి లేదు. ఇంకేదైన మంచి వస్తువులను బెట్టినఁదిందును. లేదా యింకొక యింటికిఁ బోయెదను."

ధర్మ రహస్యము తెలిసిన నిదాఘుఁడు భోజన సమయమున నిట్టి యోగ్యాతిథి తనయింటికి వచ్చుటనుగాంచి యింకొక యింటికి ఆతని నెట్లు పోనీయఁగలడు? అందువలన మిక్కిలి వినయముతో నిట్లనెను:- "విప్రవంశావతంసా! ద్విజోత్తమా! అట్లు మాటలాడెద రేల? మీరాజ్ఞాపించిన నేదికావలయున

నిన నది సిద్ధము కాఁగలదు."

వృద్ధుఁడధికార స్వరమున నిట్లనెను:- "నేనిప్పుడేమి యాజ్ఞాపింతును. నీకేదినచ్చునో అట్టిస్నిగ్ధహృద్య మధుర సుందర స్వాదిష్ట పదార్థమేదైననున్న దానిని శీఘ్రముగఁ జేయించుము"

ఇది విని నిదాఘుఁడు తన ధర్మపత్ని వద్దకుఁబోయి యిట్లనెను:- "దేవీ! నేఁడు నీకు పరీక్షవచ్చినది. ఎక్కడనో అరణ్యమునుండి చాల గొప్ప తేజస్వియగు తపస్వి వచ్చియున్నాఁడు. ఆతఁడరణ్యములోని వగరువి, పచ్చివి, నీరసమైన ఫలములను దిని నోరు చవిచెడివచ్చి నట్లున్నాడు. ఆతఁడుత్తమ స్వాదిష్ట మనోహర పదార్థమును దినఁగోరుచున్నాడు, కావున నీవేదైననుత్తమ పదార్థమును సిద్ధముచేయుము. ఇట్టి మధ్యాహ్నపువేళ యతిథి నిరాశతో వెడలిపోవుచో నేఁటివఱకు చేసిన తపస్సంతయును నశించిపోవును.

నిదాఘుని భార్య శ్రీధర్మచారిణియుఁ బతివ్రతయునై యుండెను. ఏదైన గయ్యాళియైయుండిన నిట్లనును:- "నడుమంత్రపు మునిని ఇంటిలోఁ జేసిన వస్తువులను నిష్టమైనఁ దినసిందు లేదా త్రోవ పట్టవచ్చును సాధువై పరాయి యిండ్లకు యిట్టి కోరికలు కోరుటకు సిగ్గుండదా? మాయింటిలో నేమియును లేదు. నీవారాన్నము, కాల్చిన రొట్టెయున్నది. తినఁదలఁచిన దినుమనుము. లేదా త్రొమ్మిది రెండు పదునొకండు." కాని సాధ్వియు, పతిపరాయిణియునగు మునిపత్ని యిట్టి మాటలేల యనును? ఆమె మిక్కిలి వినయముతో నిట్లనెను:- "ధన్యులారా లను. మీరొక్క పనినిఁ జేయుడు. మన ప్రక్కయింటిలో నా

సఖి ఉతథ్యముని పత్నికి కొంచెగఁ జెప్పిరండు ఆమె యిప్పుడే
అరఁటికాయలు తీసికొని మనకడకు రాఁగలదు."

ముని శీఘ్రముగఁదన పత్నిసందేశమును నుతథ్య ముని
పత్నికందించెను. ఆమె తన స్నేహితురాలి సందేశమును విఁ
గానే అరఁటికాయలు తీసికొని శీఘ్రముగ వచ్చెను. ఆమెను
జూడఁగానే నిదాఘుపత్ని సంతోషించి మిక్కిలి యుల్లాసము
తో నిట్లనెను:- "సోదరీ! నేఁడు మాయింటిలో నుత్కృష్ట
శ్రాద్ధము నాకు తోడ్పడుము. వెంటనే యీకాయలను బాణ
లిలో పాలుపోసి మంచి క్షీరాన్నమును గాయుము."

ఇది వినఁగానే సఖి వెంటనే చేతులు కాళ్ళు కడుగు
కొని వంటయింటిలోఁ బ్రవేశించి, వెంటనే పొయ్యి రాజవేసి
యుంచెను. ఇంతలో నిదాఘు పత్ని రెండు గిన్నెలు తోము
కొని వచ్చెను. క్షీరాన్నము నొక్కపొయ్యి మీఁదఁ బెట్టెను.
ఒక్క పొయ్యిమీఁద నరఁటికాయలనుడుకఁ బెట్టెను. కమ్మని
నేతితోఁ దిగుగమూఁత వాసన ఇల్లంతయు గుప్పించుచుండెను.
ఇంతలోనే అరఁటికాయలుడికెను వాటిని నలిపి కొంత హల్వా
ను, కొంత పకోడీలను బోసినోటితోనైనను దినఁదగినట్లుగఁ జే
సెను. అరఁటి హల్వాగాక కొంచెము రవ్వహల్వానుగూడ
చేసెను నిమిషములో పాయసము, పూరీ, పకోడీ. రెండు రక
ముల హల్వాలు తయారయ్యెను. అంత నామె తన పతితోఁ
ద్వరగాఁ నిట్లనెను:- "విన్నారా? అతిథినిఁగొని రండు భగవ
త్ప్రసాదము సిద్ధమైనది. సాలగ్రామమును సింహాసనముతోఁ
దీసికొని రండు, తులసిచే నర్చింపుఁడు; చాల ఆలస్యమైనది".

వృద్ధుఁడిట్లనెను:- "అవునమ్మా! నీవు సుతిమెత్తనదా నవు. అరఁటి హల్వాను దినుచు నిట్లనెను:- "హల్వా చాలరుచి గానున్నది. దేనితోఁ జేసితివి?"

నిదాఘుపత్ని యిట్లనెను:- స్వామీ! ఇది అరఁటి హల్వా. బొప్పాయితో నింకను బాగుండును, ఇవ్వేళ తొందర అలోఁ గాలేదు. రేపుకూడ మీరుండు నెడల సమస్త వస్తువు లను జక్కఁగఁ జేసి పెట్టెదను."

నవ్వుచు వృద్ధ బ్రాహ్మణుఁడిట్లనెను:- "అమ్మాయీ! మేము భజన చేయుచుందుము ఇవ్వేళ నిచ్చట రేపింకొక చోట- నీవు పదార్థములను బాగుగాఁ జేసినావు." అంత సమీ పమునఁ గూర్చుండిన నిదాఘమునితో నిట్లనెను:- 'నిదాఘా! నీకింతటి సుశీలయు, సుందరియు, కార్యదక్షయు, సతీసాధ్వియు సర్వగుణ సంపన్నయునగు భార్య దొరకినది. నీవు భాగ్యశా లివి. మనోనుకూలతగల భార్య పుణ్యమువలన లభించును."

నిదాఘముని లోలోన నానందించుచు మాటి మాటికి నిట్లనుకొనుచుండెను:- "నేను వివాహము చేసికొన్నందులకు నేఁటితో సఫలమైనది. ఈ గృహస్థాశ్రమములో నిత్యము పాపమే పాపము. పొయ్యిలో, ఇంటిలో, పొలములో, వ్యాపా రమందు, ద్రవ్యోపార్జనములోఁ బాపమే పాపము. ఈ గృహ స్థాశ్రమములోఁగల గొప్ప పుణ్యము దీనిలో నతిథి సేవయొన ర్చుట.

అతిథి పూజనములేని యిల్లు, కుక్కలు, పందులు, పొరలాడు గూడు. ఏగృహిణి తనశీల స్వభావముచేతను సదా

చార సద్గుణముల చేతను సమ్మాననీయుఁడగు నతిథిని సంతోష పఱచి, ఆఁకలిచెందిన యాత్మను మృష్టాన్నముచేతను, మధుర వచనముల చేతను దృప్తిపఱచినదియే వాస్తవమున గృహిణి యని పిలువఁ దగినది. ఎవతె అభ్యాగతునిఁగాంచి మండిపడి, మహాపురుషుల సేవను నవమానముగ నెంచునో అట్టి చండాల స్త్రీ. అట్టి పత్నితో స్వార్థపరుఁడును, గామియునగు పురుషుఁ డుగాక ధర్మాత్ముఁడగు సద్గృహస్థెవఁడొక రాత్రియైన నుండఁ గోరును? ఆహా! నేను ధన్యుఁడను నాభార్య మూలమున నేఁడత్యంత యోగ్యుఁడగు నతిథికి పరమ సంతుష్టి కలిగినది." ఇటులాలోచించి నిదాఘముని మిక్కిలి వినయముతో నిట్లనెను:— "స్వామీ! ఇదంతయును మీబోటి గురుజనుల ఆశీర్వాద ఫలము."

ఋభు మహాముని యథేష్టముగ పాయసాదుల నన్నిటినిఁ దినెను. చాలసార్లు హల్వా పాత్రమును ఖాళీయొనర్చెను. కడుపునిండఁదినిన మీఁదట, అనేకసార్లు బలవంతమొనర్చినను సింహగర్జనమువలె వలదనఁగా నప్పుడు నిదాఘుఁడు వడ్డించుటమానెను. లేచి కాళ్ళు చేతులు కడుగుకొనెను. ముఖశుద్ధి కొఱకు లవంగములు, ఏలకులు, కరక్కాయపలుకు లిచ్చెను. బ్రాహ్మణుఁడు కడుపునిండ భోజనము చేయఁగానే, పరుండుటకు సుందరమగు శయ్యనేర్పఱచిరి. మునివరుఁడు దానిపై సుఖముగఁ బరుండెను. నిదాఘుఁడాతని పాదములను మెల్లమెల్లఁగ నొత్తసాగెను."

భోజన సమయమునకు అతిథి యెట్టివాఁడు వచ్చినను

కలవాఁడు తినును త్రాగును. వానికిఁ దినుటచేఁ దృప్తికలు
గును మనస్సు స్వస్థమైనపుడు తుష్టి అనుభవము కలుగును.
కావున స్వామీ! చిత్తమెవని కున్నదో, ఎవనికిఁ దుష్టి కలిగి
నదో వానినడుగుము, నాకు హర్షమును లేదు శోకమును లేదు
నేనస్వస్థతగ నుండను లేదు. ఇప్పుడు నాకు స్వస్థతయును గలుగ
లేదు. నేనాత్మ స్వరూపుఁడను. నిత్యతుష్టుఁడను, నాకుఁ దుష్టి
కలుగుట కేవిధమగు బాహ్యపదార్థమును నవసరము లేదు."

"ఎక్కడనుందువు? ఎచ్చటనుండి వచ్చితివి? ఎచ్చటికి
వెళ్ళెద' వని నడిగితివి. దానికి ప్రత్యుత్తరమును వినుము.
నేనెచ్చటను లేకయుండినచో నొక స్థానమునుండి యింకొక
స్థానమునకు వెళ్లుచును. ఆత్మ ఆకాశమువలె సర్వత్ర సర్వ
వ్యాపకమైనది. దానిలో రాకపోకలు లేవు నేనిది చేసితిని నీవె
చ్చటినుండి వచ్చితివని నీవు మాటి మాటికి నడుచుచున్నావు.
నేనును, నీవును నింకెవ్వరైన వేఱుగ నున్నచోఁ జెప్పెడు
వాఁడను నేనును, నీవును అందఱును నొక్కటే. ఆత్మలో
ద్వైతభేదము లేదు. ఈ మధుర పదార్థముల వలన మీకానం
దము కలిగినదా? యని అడిగితివి తీఁపియేమి? చేదుయేమి?
పదార్థములన్నియును బంచభూతములతో నేర్పడినవియే. పార్థి
వములే. పార్థివ వికారములే. నేఁడు నీవు దేనిని తీఁపి యను
చున్నావో రేపటికది చేదయెక్కును. నేఁడు చేదైనది రేపేదో
కారణమునఁ దీఁపియగును. నాకీరెంటిలో నణుమాత్రమైనను
భేదము కనఁబడుట లేదు. గోధుమ, యవ, వరి, వేరుశనగ, అల
చందలు, నేయి, నూనె, పాలు, పెరుగు, చక్కెర, బెల్లము,

ఫలములు, పుష్పములు, కూరలు ఇవన్నియును పృథివినుండియే యుత్పన్నమగుచున్నవి. చివరకవి పృథివీ రూపమును జెందును దేహమును బృథివి వలన నేర్పడినది. దీనిని రక్షించుటకును బార్థివ పదార్థములను నోటి ద్వారమునఁ బడవేయుచుందుము. మట్టితోఁ గట్టిన యింటిని మట్టితో మెత్తినట్లుండును. మొత్త పదియు మట్టియే కేవలము నామరూపములతో భేదము ఇంటి మట్టి నల్లమట్టి పూయునది తెల్లనిమట్టి దానిని నల్లమన్నం దుము దీనిని సున్నమందుము. నామ రూపములను దీసివేసి నచోఁ గేవలము మట్టియేకలదు ఎవని మనస్సులో మంచిచెడ్డ అనుకూల ప్రతికూల భేదభావములు కలవో అట్టివాఁడు జనన మరణములను పొందును. ఎవని మనస్సు సర్వత్ర, సమముగ నున్నదో వాఁడాత్మ రూపుఁడే శుద్ధ, బుద్ధ ముక్తుఁడు. స్వామీ! నీవు నీచిత్తమును సమత్వముపై స్థిర మొనరించుము. ఈ దృశ్య ప్రపంచము మాయామాత్రమని తెలిసికొని సచ్చిదానంద స్వరూపుఁడగు బ్రహ్మమందుండుము.

ఇది వినఁగానే నిదాఘుఁడు వృద్ధముని పాదములమీఁద బడి యిట్లనెను:- "స్వామీ! తప్పక మీరు మా ఆచార్యుఁడగు ఋభువవే ఆతనికితక్క యింకెవరికి నాపై నింతటి యహైతుక కృపయుండును."

నవ్వి ఋభు విట్లనెను:- "వత్సా! నీయనుమానము సత్యమే నీమీఁదఁ గల ప్రేమచే వశీభూతుఁడనై నేను నీకుపదేశము జేయవచ్చితిని. నీవీమిథ్యా ప్రపంచమందు సద్బుద్ధి నెన్నడును కలిగియుండవలదు." అని యిట్లుపలికి ఋభువు నిదా

ఘుని నాశీర్వదించి వెడలిపోయెను.

జడభరతుఁడు రహూగణ మహారాజుతో నిట్లనెను:- "రాజా! ఇది యేపదార్థముయొక్క గూఢోపదేశము, ఇఁక రాజు ప్రజల విషయమున్నది. ఇది వ్యవహారమందు సంకేతము కొఱకేర్పడినది. ఆత్మయందు భేదభావము లేదు. అనిత్య సంబంధమైనవన్నియు నాశవంతములు, క్షణ భంగురములు. వానికి నిత్యాత్మతో లేశమాత్రమైనను సంబంధము లేదు. జ్ఞానులీభేద భావమును నంగీకరింపరు. ఈ సాంసారిక సంబంధ వస్తువులపై నాశక్తినిఁ జెంది యెవరికిని మానావమానములను గావింపకు. నాయనా! తనకన్యమేమైననున్నఁ గదా సత్కార తిరస్కారము లొనర్చుట ఆత్మ భేదభావ రహితమైనది రాజా! ఈ భేదభావమంతయు మనస్సు చేసిన పని ముందుగా నీవీ మనస్సును వశమొనర్చుకొనుము. సాంసారిక వ్యవహారములనుండి మనస్సు లాగివేయుము. అప్పుడీ దృశ్య ప్రపంచము దానికదియే విలీనమై పోవును."

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! ఇట్లు పలికి మహాముని యగు జడభరతుఁడు మెదలకుండెను. ఇప్పుడు రాజీ మనస్సు విషయమై యాలోచింప సాగెను.

# బంధమోక్షములకు మనస్సే కారణము.

(33_౨)

శ్లో॥ గుణానురక్తం వ్యసనాయ జంతోః
క్షేమాయ నైర్గుణ్యమథో మనః స్యాత్ ।
యథా ప్రదీపో ఘృతవర్తిమశ్నన్
శిఖాః సధూమా భజతి హ్యన్యదా స్వమ్ ।
పదం తథా గుణకర్మానుబద్ధమ్
వృత్తీర్మనః శ్రయతేఽన్యత్ర తత్త్వమ్ ॥

(శ్రీ) భాగ. ౧౧ స్కం. ౧౧ అ. ౮ శ్లో॥

వ. "మఱియు సత్కర్మ వాసనాయుక్తంబు విషయాసక్తంబునై చిత్తంబు గుణప్రవాహంబులచేత వికాసంబు నొంది దేవతిర్యఙ్మనుష్య రూపంబులయిన దేహంబులం బుట్టించుచుం గాలప్రాప్తంబులైన సుఖదుఃఖ తదుభయ ఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షంబగుచు స్థూల సూక్ష్మ రూపంబులనుండు ప్రాప్తంబు గుణరహితంబైన ముక్తి కారణంబగు ఘృతవర్తులం గల దీపంబు సధూమ శిఖలం బుట్టించు ఘృతక్షయంబున నాశంబు నొందిన స్వరూపంబు బొందు నీ తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మములం బుట్టించు గుణకర్మంబులం బాసి నేని తత్త్వంబు నొందు"
శ్రీమదాంధ్ర భాగవతము

ఆట యంతయు మనస్సుదే. మనస్సునకు ఓడినచో నోటమి, మనస్సును గెలిచినచో గెలుపు అనులోకోక్తి సత్యము. మనస్సు సాంసారిక విషయములయందు భ్రమచే సుఖమని భావించి తిరుగుచున్నంత వఱకు వానికి పరమ పద ప్రాప్తియుండదు. ఈ మనస్సు విషయవిరక్తతను జెందిన దాని జడత్వము పోవును. నీవు నేను, మంచి చెడ్డ, ఉచ్చనీచలు, సుఖ దుఃఖములు మొదలగు ద్వంద్వములను నీ మనస్సే సృష్టిం

చినది. మనస్సునుండి యీ మిథ్యాకల్పనము తొలఁగనంత వఱ కేమియును లేదు. అంధకారమందు తమః కారణమున మనమందు భయవశమున నెదుట నొక భూతమున్నదను నొక భ్రమ కలుగును. మనస్సులోనికి భూతభావము రాఁగానే దానికి సంబంధించిన కాల్పనిక హస్తములు, మెలితిరిగిన పాదములు, మిడిగుడ్లు, తీక్ష్ణదంతములు మొదలగున వన్నియును గోచరించును దయ్యము దయ్యమని చాలమంది అఱచుచుందురు. ఇది వినఁగానే బుద్ధిమంతుఁడు పరికాశమును దీసికొని వచ్చి భూతమెక్కడ? యని అడిగినచో ఆతఁడిట్లనును:— “ఇప్పుడే వచ్చినది. మిమ్ములను జూచి పాఱిపోయినది యదార్థముగ జ్ఞానదృష్టిచే నాలోచించినచో భూతమెచ్చటినుండియు రానులేదు పోనులేదు. మనస్సులోనే పుట్టినది మనస్సులోనే విలీనమైనది మనస్సే కల్పనామయ సృష్టినొనర్చినది. దానిలో సుఖదుఃఖములు స్వయముగనే కలుగును. ఆకారణముననే శుద్ధ బుద్ధమగు జీవాత్మయు జన్మించుచున్నట్లును మరణించుచున్నట్లును గనఁబడును. మనస్సు విషయాభిముఖము కాకున్నచో జీవునకు బంధముగాని, సాధనగాని లేదు. ఆతఁడు నిత్యముక్తుఁడే.

శ్రీశుకుఁడిట్లనెను:— “రాజా! జడభరతుఁడు తత్త్వజ్ఞానోపదేశ మొనర్చుచు రహూగణ మహారాజునకు నంతయును మానసిక సృష్టియనియు, మనస్సే త్రిగుణాయుక్తమై యీ జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల ద్వారా శుభాశుభకర్మలొనర్చుచున్నాఁడని చెప్పఁగా రాజిట్లనెను:— స్వామీ! మన

స్సృష్టి ప్రపంచరచనమును గావించును? దీని వృత్తులేవి? దీని కాధారమేమి? ఈ విషయముల నన్నిటిని నాకు స్పష్టముగఁ జెప్పవలయును."

ఇది విని శుకమహర్షియిట్లనెను:- "రాజా! నీవు స్వర్గ సుఖములనే సమస్తమని తలంచినంత వఱకు, కర్మకాండలో మునిఁగి సకామ కర్మల ద్వారా స్వర్గప్రాప్తి ప్రయత్నము న్నంత వఱకు నీకు రాగాదిదోష రహితమైన విశుద్ధ తత్త్వ జ్ఞానమభివ్యక్తమగుట అత్యంత కఠినము. అమృతపానము, విమానములలో నప్సరసలతో విహారము, నందనవనములో గంధర్వగానము, దేవాంగనల నృత్యము, అమ్లాన పుష్పముల దివ్యగంధము మొదలగు స్వర్గీయ భోగములం దనిత్యత గోచ రింపనంత వఱకు, వీనిని స్వప్న సుఖములవలే మిథ్యలుగను త్యాజ్యములుగను భావింపనంత వఱకు మానవునకు బ్రహ్మ జ్ఞానమబ్బదు. మహారాజా! ఈ చిత్తము త్రిగుణాత్మకమై నంత వఱకు తన యధీనమునఁనున్న నీయింద్రియములచే మంచి చెడ్డ కార్యములు చేయించుచునే యుండును. ఏకాదశేంద్రి యములు పంచభూతములతోఁ గూడుకొని, శరీరోపాధినిధరించి మనస్సు జీవుని ఒక యోనినుండి యింకొక యోనికిఁ దిరుగు చుండును.

బీజమునందు జననశక్తి యెట్టిదో యీ మనస్సుకూడ అట్టిదే. ఆబీజమును వేయించినచో సృజనశక్తి మహాశక్తిలో లీనమై పోవును. అప్పుడు దానికి లక్ష విధముల నీరుపోసి పాతి పెట్టినను నది అంకురింపదు. అదే విధముగ దేహాభిమానియగు

జీవునితోఁ గూడుకొనిన ఈ మాయా మయమగు నంతరాత్మ విషయాసక్తమై యున్నంత వఱకు నిద్రించుట మేల్కొనుట మొదలగు స్థూలసూక్ష్మ వ్యవహారములను జరుపుచునే యుండును. సంసార చక్రమును వృద్ధి పొందించును, ఉత్తమ మధ్య మాధమ యోనులందు జీవుఁడు భ్రమించును. ఈ విషయవాసనలు విలీనమై పోయినచో నది శాంతిమయ మోక్షపద ప్రాప్తినిఁ గలిగించును. ఇందు సంసార సృజనశక్తి యుండదు.

రాజిట్లడిగెను:– 'స్వామీ! ఇది యెట్లు లభించును? ఒకే మనస్సు రెండు విపరీత కార్యముల నెట్లు చేయఁగలదు. మామిడి చెట్టునుండి మామిడిపండ్లే పుట్టును. మనస్సుయొక్క స్వభావము విషయాసక్తినిఁ జెందుటే కదా అట్టియెడ నిది ముక్తి మార్గమున నెట్లు పొందగలదు?"

అంత జడభరతుఁడిట్లనెను:– "రాజా! ఈ మనస్సు జడమైనది. చైతన్య సత్తాను గ్రహించి దేహాభిమానియగు జీవుని సుఖదుఃఖములను భోగింపఁజేయును. సత్వ రజస్తమోగుణములు, శుభాశుభ కర్మలందాసక్తమైన మనస్సు, సంసారములోఁబడవేయు ననేకవృత్తుల నుత్పన్నము కావించి వంశ వృద్ధి కావించుచుండును. ఈ గుణములు వీడిపోఁగానే తనకుఁ గారణమగు మహతత్త్వమందు విలీనమగును.

రాజిట్లనెను:– "స్వామీ! మీరు డొంకతిరుగుడుగ చెప్పుచున్నారు నాకివి అర్థము కాలేదు."

నవ్వి జడభరతుఁడిట్లనెను:– 'మహారాజా! ఇది గూఢ

జ్ఞానమే. గుటుక్కున మిగ్రింగుటకిది జెల్లపుల్లకాదు. దీనిని ధ్యానపూర్వకముగ సమాహిత చిత్తముతో నెఱుఁగుటకుఁ బ్రియత్నము చేయునంత వఱకు ఇది అర్థముకాదు. నేనడిగిన దానికి చెప్పుము. అగ్ని శుద్ధము, నిర్మలమైనది కదా ధూమ మెచ్చటినుండి వచ్చినది?"

రాజిట్లనెను:- "స్వామీ! అగ్నిలో ధూమములేదు. కాష్ఠ సంసర్గముచే ధూమము కలుగుచున్నది."

అంత జడభరతుఁడిట్లనెను:- "దీనినిట్లు తెలిసికొనుము. ఒక దీపము గలదు. దానిలో నొకవత్తియున్నది ఘృతమున్నది అగ్నియున్నది వత్తిలో ఘృతమో, తైలమో ఏదో స్నిగ్ధ పదార్థమున్నంత వఱకు దానినుండివచ్చు అగ్నిజ్వాల ధూమ యుక్తమై వెలువడును. దీపము వెలుఁగుచున్నప్పుడు గోడనల్లబడుటయు, దానినుండి మసిని సందఱును గ్రహించుటయు నెఱిఁగిన విషయమే. ఘృతవర్తి సమాప్తి కాఁగానే అగ్ని తన సత్స్వరూపమగు మహాగ్నియందు కలియును. అప్పుడు దానిలో ధూమప్రము వుండనే వుండదు. గుణకర్మలే ఘృతము, వత్తి. ఇవి యున్నంతవఱకు సంసారమను మసి యుత్పన్నమగుచునే యుండును. ఇవి సమాప్తికాఁగానే జీవుఁడు శుద్ధమగును. మనస్సు తన కారణమున విలీనమగును సమస్త ప్రపంచము సమాప్తము కాఁగలదు."

రాజిట్లడిగెను:- "ప్రభూ! మనస్సునకెన్ని వృత్తులు కలవు? వాని కాధార భూతములగు విషయములెన్ని గలవు?"

అంత జడభరతుఁడిట్లనెను:— "మహారాజా! నీవు మనో వృత్తులను గూర్చి అడుగవద్దు. మొట్ట మొదట గంగ గోముఖ మునుండి బయలు వెడలుటను గాంతుము. ఒకే ఛిద్రముః కాని యాఛిద్రమునుండి నిరంతరము జలరాశి ప్రవహించు చుండును. పోను పోను గంగ యనేక శాఖలగును. అదేవిధ ముగఁ గర్ణములు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములైదును, శబ్ద స్పర్శ రూపరస గంధము లను విషయ పంచకమును, అదే విధముగ వాక్పాణి పాద పాయూపస్థలను బంచకర్మేంద్రియములును భాషణ, ఆదాన, ప్రదాన, గమన, ముత్యాగ కామోపభోగములను విషయము లును, అహంమమలను నభిమానము మూలమున మనస్సునకుఁ బదునొకండు వృత్తులేకలవు. ఇదియే ముందు ముందు వందలు వేలు, కోట్లు, అర్బుదములు, ఖర్వములు అసంఖ్యాకములుగ నగును. ఇంద్రియముల కాధార భూతములు తన్మాత్రలు, అహంకారమున కాధారము దేహము. కొందరాచార్యులు మనస్సును వేఱుచేసి అహంకారమును బండెండవ విషయ ముగఁజెప్పిరి. వాస్తవమున మననము చేయుచున్నప్పుడు మన స్సని పిలువబడును. అహంభావము వచ్చినప్పుడహంకారమనఁ బడును. ఒకలోభియగు నుద్యోగి ఒక నౌకరును బెట్టుకొని వానిచేతనే జవాను పనియు, వంటయును జేయించుకొనును. వంటచేయునపుడు వానికి వంటవాఁడను పేరు వచ్చును. పట్టా ధరించిన జవానగును.

ఇది విని రహూగణుఁడిట్లనెను:— "స్వామీ! మీరు

జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ఒక అహంకారము మొత్తము మనోవృత్తులు పదునొకండు గదా! అవి వందలు, వేలు, అసంఖ్యాకములుగ నేలనైనవి?"

అంత జడభరతుఁడిట్లనెను:- "మహారాజా! నేయి, చక్కెర, పిండి మొదలగు పదార్థములు వీని మూలమున నెన్ని మిఠాయిలు తయారగుచున్నవో, యెన్నెన్ని పేర్లతో వ్యవహరింపఁబడుచున్నవో చూడుము. అదే విధముగా నీ పదునొకండు వృత్తులు ద్రవ్యములద్వారా స్వభావము ద్వారా, ఆశయ, కర్మ, కాలముల ద్వారా పరిణామమును జెంది వృద్ధి యగు చుండును."

రాజిట్లడిగెను:- "మహారాజా! ఈ వృత్తులన్నియు స్వతః ఎట్లు పుట్టఁగలవు?"

జడభరతుఁడు తనమాటకు బలము కలిగించుచు నిట్లనెను:- "రాజా! పరస్పరము కలిసిగాని, స్వతః గాని యీ యన్నిటికి సత్తాలేదు. మహారాజా! క్షేత్రజ్ఞుఁడగు నాత్మ సత్తావలననే వీని సత్తాకలదు."

అంత బాగుగా నాలోచించుకొని రాజిట్లడిగెను:- "ప్రభూ! నాకొక గొప్ప సందేహమున్నది. ఈ సంసారము- సాంసారిక పదార్థముల అస్తిత్వమే లేనపుడు జీవుల మనస్సునకివి యెట్లు రాఁగలవు?"

ఇది విని జడభరతుఁడు పక పక నవ్వి యిట్లనెను:- "మహారాజా! దీనికి నేనేమి ప్రత్యుత్తర మొసఁగెదను? నీవిట్లు తెలిసికొనుము. ఇంటిలో నన్నివస్తువులును గలవు. చీకటిలో

వానము వెళ్లెదము. అప్పుడేమియును గనఁబడదు. ప్రకాశ మును గొనిపోయినచో నన్నియును వేఱు వేఱుగ గోచరించును ఆవస్తువులు ప్రకాశములో లేవు. ప్రకాశమునకును ఆవస్తుల కును అణుమాత్రమైన సంబంధములేదు. ప్రకాశము ద్వారా కేవలమూ వస్తువులు అభివ్యక్తినిఁ జెందినవి, ప్రకాశము పోఁగానే మరల నవి కనఁబడవు. అదే విధముగ సంసార బంధ నమునకు హేతు భూతమగు కర్మలొనరించు జీవుఁడు మాయా రూపమగు మనస్సుయొక్క సదా ప్రవాహ రూపమగు నీవృ త్తులు జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును బ్రకటమై సుషుప్త్యవస్థయందుఁ దిరోహితమగును. శుద్ధ సాక్షియగు నాత్మకును వీనికిని సంబంధమేమియును లేదు. అది కేవలము ద్రష్టామాత్రమే. దాని సత్తావలననే నివియన్నియును గలవు"

రహూగణుఁడిట్లనెను:- "స్వామీ! లోకములో నింతటి యన్యాయము, పాపము జరుగుచున్నదే భగవంతుఁడు దాని నేల నడ్డగింపఁడు? ఆశుద్ధ సచ్చిదానంద ఘన పరబ్రహ్మచూ చుచుండియు నన్నిటిని నేల యుపేక్షించుచున్నాఁడు?"

నవ్వి జడభరతుఁడిట్లనెను:- 'రాజా! నీవు దీనియందు యదార్థ బుద్ధినేల కలిగియున్నావు? ఇదంతయును గ్రీడ, లీల, మాయ. ఇద్దరు పిల్లలు పచ్చిమట్టితో నేనుఁగు, గుఱ్ఱము, బంతె, గాడిద ఇట్లెన్నియో తయారు చేయుదురు. తండ్రి కూర్చుండి చూచుచున్నాడు. ఒకఁడింకొకని బొమ్మను పాడు చేసెను. వాఁడిట్లు పోట్లాడును" నా యేనుఁగు నేల పాడుచేసితివి? నీవు నాబంతె నేల తీసికొంటివి? తండ్రి కూర్చుండి నవ్వుచుం

నోటిద్వారా కడుపులోనికిఁ బంపితివి. రూపాంతరమున నదియే మలమైనది. పొలమునకుఁ బోయి దానిని వదలిపెట్టినాము. మరల నాపొలములోనే గోధుమ మొక్కలు పెరిగినవి. చెఱకు గడ్డి అయినవి. గడ్డిని ఆవుతినఁగానే ఘృతము వచ్చినది. చెఱకు నుండి చక్కెర వచ్చినది. గోధుమనుండి పిండివచ్చినది. అంత మిఠాయి అయినది. మనము భ్రమవశమునఁ బదార్థములందు వ్యర్థముగఁ బ్రియాప్రియములను జెంది ఆసక్తినిఁ జెందుచు న్నాము. జ్ఞానోదయమగు నంతవఱకు ఈ యజ్ఞానము పోదు. సర్వసంగమును వీడి, మిథ్యాప్రపంచ రూపమగు మాయను దిరస్కరించి, కామక్రోధాది షట్ఛత్రువులను జయించి మాన వుఁడు వివేకము నాశ్రయించనంత వఱకు, ఈ ఆత్మకు ఉపాధి రూపమగు మనస్సును సంసారిక దుఃఖక్షేత్రమని భావింపనంత వఱకు రాజా! ఈ జీవుఁడిట్లు సంసారరూప భవాటిలోఁ దిరుగు చుండ వలసినదే. జీవునిలో దోషమేమియును లేదు. విషయా సక్తమగు నీచిత్త సంసర్గముచేఁ దాను భ్రమవశమున సుఖిన నియు, దుఃఖిననియుఁ దలఁచుచుండును అందువలన శోక, మోహ, రాగ ద్వేష లోభ, రోగాదులందు బంధింపఁబడి ఈ సంసారమందు మమత్వమును బెంచుకొనుచున్నాఁడు. కావున రాజా! నూఱుమాటల కొక్కమాటలో నేమనఁగా సమస్త హత్యలకు మూలమీ కపట విషయాసక్తమగు మనస్సే. నీవు దీనిని వశమందుంచుకొనిన నన్నియు సరియగును. ఇది వశము కాకున్న నది యెప్పటి యట్లేయగును."

రాజిట్లడిగెను:- "స్వామీ! ఎట్లు వశపడును? ఈ

మనస్సు మాత్రము వశముకాదు ఉపాధుల కాలయమీ భూతమే. దీని తలను గొట్టినఁ బనియగును. నాకిది దొఱకెనా ఈ ఖడ్గముచే వెంటనే తుత్తునియలు గావింతును."

ఇది విని జడభరతుఁడు నవ్వి యిట్లనెను:- "రాజా! మనస్సు బయట నెక్కడిదోకాదు. నీలోనేయుండి సమస్త వ్యాపారము లొనర్చుచున్నది. ఈ బాహ్య ఖడ్గముచే దానితల తెగదు ఆ బలవత్తరమైన దానిని నీవు సహజముగఁ బట్టఁ జాలవు చంచలత్వమునకు దీనికుపమింపఁ దగినది యింకొకటి లేదు. రామరావణ యుద్ధము రామరావణ యుద్ధము వంటిదై నట్లును, సముద్రము సముద్రమువలె విస్తృతమును గంభీర మునైనట్లును నీమనస్సు మనస్సువలెఁ జంచలమైనది. దీనినిఁ బట్టుకొనుటకొనుకే ఉపాయమున్నది. నీవు దానినిఁ జేయునె డలఁ జెప్పెదను"

రహూగణ మహారాజిట్లనెను:- "స్వామీ! నేను తప్పక చేయుదును. మీరు నాకీసంసారమునకు బీజరూపమగు పాపపు మనస్సును వశమందుంచుట కుపాయము నవశ్యము చెప్ప వలెను."

జడభరతుఁడిట్లనెను:- "మహారాజా! దీనిని వశ మొనర్చుకొనుటకేక మాత్రమగు నుపాయము శ్రద్ధాసహిత ముగ సద్గురుని శరణువేఁడుటే శ్రీహరి చరణారవింద మకరంద రసాస్వాదనమునకు మత్తభ్రమరమై నిరంతరము పాన మొనర్చు చుండుము. శ్రీగురురూపహరియొక్క పాదపద్మరూప పరిచర్యకు అతిరిక్తముగ నీమనస్సును వశమున నుంచుకొనుటకు మఱియొక

సరళ సుగమ సర్వసమ్మతమగు నుపాయ మింకొకటిలేదు. భగవంతుని యుగళచరణస్మృతి సమస్త అశుభములను నాశమొనర్చుటయందు సమర్థమైనది. మనస్సను భ్రమరలరూపమగు హరిచరణ మకరందలోభమును జెందినచో నిది యిదివఱకున్న వాటి నన్నిటిని మఱచిపోవుచు దీనిచంచలత్వము నశించును. గబగబ యెగురు దీనిఱెక్కలు తెగిపోవును. కమల తంతువుచే నిదికదల కుండ కట్టివేయఁబడును. కావున రాజా ! నీవిట్లుచేయుము. నీవీశత్రువును ముందుగాఁజంపుము. తర్వాత నింకొక శత్రువు పైకిఁబోవు యోచన. తర్వాత యోచింపవలసిన పనియే లేదు. ఏలననఁగా నన్నిటికంటెఁ బ్రిబలశత్రువిదియే. ఇది చావఁగానే యింకొక శత్రువుండనేయుండఁడు."

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! ఇట్లుపలికి జడభరతుఁడు మెదలక ఊరకుండెను. తనమాటలకా రాజుపై నెట్టి ప్రిభావము పడినదో తెలిసికొనవలయునని ఆతని ము ఖ ము ను జూచుచుండెను.

## సంగ ప్రభావము

౩౩౯

శ్లో॥ రహూగణైత త్తపసా నయాతి
న చేజ్యయా నిర్వపణాద్గృహాద్వా
నచ్ఛందసా నైవ జలాగ్ని సూర్యై
ర్వినా మహత్పాదరజోఽభిషేకమ్॥

శ్రీ భాగ. ౫ స్కం. ౧౨. అ. ౧౨ శ్లో.

సీ॥ ధరలోన బ్రహ్మాంబుదపమున దానంబు
లను గృహాధర్మంబులను జలాగ్ని
సోమసూర్యులచేత శ్రుతులచేనైనను
బరమభాగవతుల పాదసేవఁ
బొందిన మాడ్కిని బొందంగరాదని
పలుకుదు రార్యులుఁబరమమునులు
ఘనతపో బాహ్య సౌఖ్యములకు విము
ఖులు నైపుణ్యులు హరిగుణానువాద

తే॥ మోదితాత్ములు నగు బుధ పాదసేవ
ననుదినంబును జేసిన నంతమీఁద
మోక్షమార్గంబునకును బద్ధాత్మునందుఁ
బట్టువసియుండు నెప్పుడుఁబరఁగ బుద్ధి ॥

(శ్రీ) మదాంధ్ర భాగవతము.

అకారణ కృపఁజూపుచు, లోకములో శత్రువులే లేకున్నవారును, సాంసారిక ప్రతికూలతకు వ్యథితులుకానివారును, సర్వభూత సుహృదులైన సాధువులయెడల మనము వారియుపకారమునకెట్టి శబ్దములతోఁ గృతజ్ఞతను బ్రకటింపఁగలము. ప్రపంచములో ధనైశ్వర్య దారాపుత్రాదులు ప్రాప్తించవచ్చునుగాని సాధుసంగము ప్రాప్తించుట అత్యంత దుర్లభము. సాధుసంగమందఱకును దొఱకదు అదృష్టముసఁ బూర్వజన్మలలోఁ జేసిన సత్యంత పుణ్యముచే మహాత్ములు లభింతురు; వారి చరణములందుండు సమయము ప్రాప్తించును. తత్సంగము ప్రాప్తించినవానికి సంసార బంధము తెగిపోవును. ఇట్టి సాధువు

అనాయాసముగ మహోపకార మొనర్చినను అహైతుకకృపను బ్రదర్శించినపుడును, ప్రత్యుపకారముగ నాతని చరణారవింద ములకు నమస్కరించుటతక్క యింకేమి చేయఁగలము? చేతు లను జోడించుట దేవతలను బ్రసన్నుల నొనర్చుకొనుటకు శ్రే ష్ఠమగు ముద్ర.

శుకమహర్షి యిట్లనెను:- 'రాజా! రహూగణ మహా రాజు భరతుని యిట్టి గూఢవిజ్ఞాన విషయములను వినఁగానే ఆతని యాశ్చర్యమునకు మేరలేకుండెను. ఆతని హృదయము కృతజ్ఞతతో నిండిపోయెను. ఆతఁడొనర్చిన మహోపకారము నకుఁ బ్రత్యుపకారముగ నేవస్తువును నాతని శ్రీ చరణములకు సమర్పించవలెను. ధన. ధాన్య వస్త్రభూషణ, గజాశ్వాది వాహనముల నొసంగినను, తన సంపూర్ణ రాజ్యమును సమ ర్పించినను దుఃఖములేకాఁగలవు పృథివీరాజ్యమేల త్రిలోక ములు బ్రహ్మలోకముతోఁగూడ సమస్తమును నీతనికిఁ దృణ సమానము. ఆతనికి యోగ్యవస్తు వేదియును దొరకక మహా రాజాతని చరణములకు భక్తితోఁబ్రణామము కావించెను.

రాజిట్లనెను:- "ఈశ్వరరూపుఁడై, జడవేషమునఁ దిరు గుచుండు పరమహంస శిరోమణియగు ద్విజవర్యుని పాదపద్మ ములకు భక్తితో నేను బ్రణామ మొనర్చుచున్నాను. ప్రభూ! నాబోటి దేహాభిమానముగల అసాధ్య రోగికి మీ వచనము లమృతము వంటివి. మిక్కిలి ఆఁకలి చెందినవానికి భోజనము లభించినట్లును, మిక్కిలి దప్పిక చెందిన వానికి సుస్వాదు శీతల జలము లభించినట్లును, ఎండదెబ్బతిన్న పథికునకు శీతలచ్ఛాయ

లభించినట్లును, అసాధ్య రోగముగల రోగికి మధుర సుస్వాద గుణకారియగు నౌషధము లభించినట్లును, సర్పదష్టునకు వారుణీ మంత్రములభించి యానందము లభించినట్లు నేనును మీ యుపదేశామృతమునఁ గృతార్థుఁడనైతిని. ఈ మనస్సు వశమగు మార్గమేమో చెప్పవలయును ఈ బుద్ధి వాసుదేవుని యందే సాధనమునఁ బ్రవృత్తియగును. ఏపనిచేసిన నీసంసార బంధనము తెగును. కృపతో నీయుపదేశమును నాకీయవలెను. శరీరముండఁగా శ్రీమాదుటేల తెలియవో ఈ విషయమున నాకు సందేహము గలదు.

ఇది వినఁగానే భరతునకుఁ గొంచెము రోషమువలె వచ్చెను. ఆతఁడు గర్జించి యిట్లనెను:- "రాజా! నీవు గొప్ప మూర్ఖుఁడవు. నీలోనేమి విశేషమున్నదో నీవాలోచించుము. ఇదికాక నేను సింధు సౌవీర దేశపు రాజునని నీకభిమానము న్నది. రాజరికమను పని యేమైననుండిన గ్రహింపవచ్చును."

శ్రీశుకుఁడిట్లనెను:- "రాజా! జడభరతుఁడు రాజు నీవిధముగ గద్దించుచుండఁగా భరతునితో బాటు పల్లకీమోయు బుద్ధిమంతుఁడగు వృద్ధవాహకుఁడు కనుగల్పి భరతునితో నిట్లనెను:- "కొంచెము మా విషయముకూడ వీరిలోఁ జెప్పుఁడు. భరతునకేమున్నది? ఆతఁడిట్లు కసురుచుండెను:- "ఛీ ఛీ చాల చింతింపవలసిన విషయము. ఐశ్వర్యశాలినందువు, నరపతివి, భూపతివి, బ్రజాపాలకుఁడవు, పనులుచూడఁగాఁ గూరపు పనులు ఈ మోఁతగాండ్రను తేరగాఁబట్టుకొన్నావు. నేను రాజునని చేరగిల పల్లకిలోఁ బండుకొన్నావు. ఏమిరాజవయ్యా?

రాజువా? రాయివా? వీరికి పది పది యిరువదిరువది గ్రామములనిచ్చుచో రాజవందువు. నీసుఖదుఃఖముల నెట్లు చూచుకొనుచున్నావో వీరి సుఖదుఃఖములట్లేగదా! పగలంతయును బాలకీని మోయించుకొనుచున్నావు వారు తిండి తినిరో లేదో విచారించవు. ఊరకే పనిచేయించుకొని వదలిపెట్టుచున్నావు నీవు రాజని చెప్పుకొనుటకు సిగ్గైనవేయుట లేదా? నిర్దయుఁడవు. పదార్థములన్నియుఁ పార్థివములే. నామరూపములను దీసివైచిన నన్నియు నొక్కటియే. కేవలము వ్యవహారములోనే పరమార్థములో భేదమునకవకాశమే లేదు. విచారించినచో నీపృథివియు మిథ్యయే. ఈ విశ్వమంతయును భగవన్మాయచే నిర్మితమైనది. మాయలోనే కృశ, స్థూల, లఘు, గురు, అసత్, అచేతనాది కల్పనలుకలవు. ద్రవ్య, స్వభావ, ఆశయ, కాల, కర్మాది నామములు కలవి యన్నియును భగవద్వ్యాపారమువలె.

మాయాధీశుఁడగు నా వాసుదేవుని విశుద్ధ విజ్ఞాన స్వరూపునిగను, అద్వితీయునిఁగను, బాహ్యాభ్యంతర భేదరహితునిగను, వ్యాపకునిగను, అంతర్ముఖునిగను దెలిసికొనుము. ఆతఁడే అత్యంత శాంతుఁడు ఆతఁడే కామ్య. ఆతఁడే పరాగతి ఆతఁడే పరమార్థ సత్యము. ఆతనిజ్ఞానము కలుగుఁగానే ద్రవ్య స్వభావ, ఆశయ, కాల, కర్మాదులన్నియును విలీనములగును. ఈజగత్తే యుండదు. భేదభావభూతము పటిపోవును.

రహూగణ మహారాజిట్లడిగను:—"ప్రభూ! ఈజ్ఞానమే సాధనచే లభించును."

జడభరతుఁడిట్లనెను:— "ఇది లౌకిక సాధనములచే- అనఁగాఁ గేవలము యజ్ఞజప, అనుష్ఠాన, పరిభావోత్పాదన, శాస్త్ర తర్పణ మాత్రముచే నీ జ్ఞానము రాదు. మహాపురుషుల చరణధూళి నాశ్రయించుటచేతనే లభింపఁగలదు."

రాజిట్లనెను:— "స్వామీ! మహాపురుషుల చరణధూళి యెట్లు గైకొన వలెను. వారి పాదధూళిని శిరస్సున ధరింపవల యునా?"

నవ్వుచు భరతుఁడిట్లనెను:— "కేవలము శిరస్సున ధరించుటచేఁ బ్రయోజనము లేదు రాజా! వారి పాదధూళిలో సర్వాంగములతోఁ బొర్లాడ వలెను. ఆ పాదధూళిలో స్నాన మొనర్పవలెను. మనోవాక్కాయముల దానిని స్వీకరింపవలెను. వారి దగ్గఱ నివసింప వలెను.

రాజిట్లడిగెను:— "స్వామీ! మహాత్ములకడ నుండుటచే నేమి జరుగును."

భరతుఁడు శీఘ్రముగ నిట్లనెను:— ఏమి జరుగును? సంసారికి నేర్పడును సాధువు లెచ్చట నివసించుచున్నను నచ్చట నిత్యనియమముగ భగవత్కథ జరుగుచునే యుండును. సాధువుల ఆశ్రమములలో నా యీ విషయ వార్తలు, తగాదాల కథలు, గ్రామ్యకథలు రావు అచ్చట భగవంతుని సుమధుర నామ కీర్తనమైనను జరుగును లేదా భగవత్కథలైనను జరుగును వారి ఆశ్రమములో- వారి చరణ సన్నిధిలో-నున్నచో నిత్యము నాసుమధుర కథలు వినుటకు వీలగును నిత్య నియమముచేఁ గథలు వినఁగా వినఁగా బుద్ధి శుద్ధమై మోక్షమార్గ

మునకుఁ బ్రవృత్తమగును. అట్లు సాధు సంగమున నుండక విషయములతో నుండినచో వాని పరమాణువులు నీ శరీర ములోఁ బ్రవేశించును. అప్పుడు విషయాసక్తి కలుగును. సం సార బంధమింకను దృఢపడును. సాంసారికులతోఁ గూడుటచే సంభవించిన మోహము సంసార బంధనమును దృఢముగ బిగించును. నేను పూర్వము భరతుఁడను చక్రవర్తిని. రాజా! నీ పేరుతో నేదేశమును బిలువఁబడుట లేదు. నా పేరుతో నీ యజనాభ వర్షము భారత వర్షమను పేరుతోఁ బ్రసిద్ధినిఁ జెందెను.”

ఇది వినఁగానే రహూగణ మహారాజునకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను. ఆతఁడాశ్చర్య చకితుఁడై జడభరతుని వైపు చూచుచు విస్మయ వినయములతో నిట్లనెను:- “మం చిది! స్వామీ! మీరేనా పూర్వజన్మమున రాజర్షియగు జడ భరతుఁడు. ధన్య భాగులు. మేము నిత్యమును భారత వర్షము భారత వర్షమని జపించుచుందుము. స్వామీ! మీకథను మేము నిత్యము ఇతిహాస పురాణములలో వినుచుందుము. మీకు భగవంతునిపై సుదృఢ భక్తి కలదని వింటిమి. మీకీ సంసార బంధమునుండి ముక్తి యేలఁగలుగలేదు? మీరు మరల నీద్విజ శరీరమేల ధరింపవలసి వచ్చినది.”

జడభరతుఁడిట్లనెను:- “రాజా! నేనొక వలలోఁబడితిని. పూర్వజన్మాంతరాయ మొకటి వచ్చిపడినది. నా దౌర్భాగ్య మొక హరిణ రూపమును ధరించి ఆశ్రమమునకు వచ్చినది. దాని యందత్యంతాసక్తి కలిగినది. మనస్సొక్కటే కదా! ఇది

వఱకు భగవంతునిపై లగ్నమైనది మృగశాబకముపై లగ్నమైనది. కృష్ణచరణారవిందములమీఁద నుండిన ప్రేమ కృష్ణ మృగశాబకముమీఁదఁబడినది. నేను బరమార్థచ్యుతుఁడనైతిని. మోక్షమార్గ భ్రష్టుఁడనై మరు జన్మమున నిరంతరము మృగధ్యాన మొనర్చుటచే మృగజన్మము నెత్తితిని"

రాజు నకింకను నాశ్చర్యమయ్యెను. ఆతఁడిట్లనెను:— "స్వామీ! ఒకదాని కంటె మఱియొకటి ఆశ్చర్యకరమగు విషయములను జెప్పుచున్నారు. మేము నిన్నరాత్రి చూచిన స్వప్నమును జెప్పఁజాలకున్నాము. మీరు మూఁడు జన్మల వృత్తాంతమును జెప్పుచున్నారు. మీకు పూర్వజన్మముల స్మృతి యెట్లున్నది?"

జడభరతుడిట్లనెను:— "మహారాజా! భగవద్భజనము వ్యర్థము కాదు. నాకు నామృగజన్మమునను పూర్వస్మృతి కలుగుట భగవద్భజన ఫలమే, అట్లే భగవత్స్మరణ మొనర్చుచు నేను మృగ శరీరమును త్యజించి మరల బ్రహ్మవంశమున జన్మించితిని. రాజా! ఇది నా చరమ దేహము. ఇఁకనాకు బునర్జన్మ లేదు. అయినను నేనింతవఱకు జన సంసర్గమునకు వెఱచుచున్నాను. అసంగ భావముతో గూఢముగఁ దిరుగుచున్నాను. నేనందఱిలో నున్నను వారియందాసక్తినిఁ జెందుట లేదు. నాతో నెవఁడెన్ని దినములున్నను వాఁడు వెళ్ళిన వెళ్లనిండు నాకిచ్ఛ కలిగినప్పుడన్నిటిని వదలి వెళ్లిపోయెదను. లౌకిక కార్యములొనర్చుటచే నన్నుఁజూచి మూఢులు నన్ను బిచ్చివాఁడందురు; జడుఁడందురు; నేను వారిని లక్ష్య పెట్టను. ఈ

కార్యముల నన్నిటిని నేను భగవత్క్రీడలను గొందును. నేనెవ రికి నుపదేశింపను, అధికారియును లేఁడు పరమార్థమున నెవ రికినిఁ బ్రవృత్తి లేదు. సాధువులకడకీ సంసారులు వెళ్ళుచో వారిని పుత్రులను, ధనమును నడుగుదురు. తాను బుద్ధిమంతుఁ డన ననుకొనువాఁడితరులతో నిట్లనును:- ఈసంసారులు గొఱ్ఱె గుంపువలె నెవరికి పేరువచ్చినదో వానికే యిత్తురు. ఈ సాధు వులకడకు వ్యర్థపువస్తువుల వచ్చును కంబళియో, వస్త్రమో, మిఠాయియో దొఱకునని మేము వెళ్లుచుందుము. ఈమూర్ఖుల దృష్టిలో ధన, వస్త్ర, ఫలాపూపములే మూల్య వస్తువులు. ఇట్టి విషయాసక్తులకు నేనెన్నఁడు నుపదేశింపను ఎవరే భావ నతో వచ్చినారో వారు నావద్దనున్నది కొనిపోవచ్చును. ఎక్కువమంది పరమార్థ తత్త్వమున కధికారులు కారు. నీవు పరమార్థమున కధికారివనియు, మోక్షకాంక్షివనియుఁదలఁచి నీకీవిషయములు చెప్పితిని.

రాజిట్లనెను:- "స్వామీ! నామీఁద నెంతో దయజూ పితిరి. నాకిప్పుడు సంపూర్ణోపదేశ సారమును జెప్పుడు. నేనే సాధనమును జేయవలయునో నాకుస్పష్టముగఁ జెప్పవలయును"

ఇది వినఁగానే కృపాలుఁడగు జడభరతావధూత యిట్లనెను:- "మహారాజా! ఈ సంసార రూపమగు సాగరమును నీమనుష్యుఁడను పక్షి యేల దాఁటజాలఁడు? కారణమేమనఁగా గర్మ మోహ బంధమున నీతనిఁ గట్టివేసినవి. పక్షి కాలికి త్రాడును గట్టిన నాపక్షి యాత్రాడు పరిధిని దాఁటి పోఁజా లదు, అచ్చటనే తెక్కలు కొట్టుకొనుచుఁ బడియుండును.

మహారాజా! ముందుగా తీక్ష్ణ ఖడ్గముచే నీమోహరూపమగు బంధనమును ఖండించుము''

రాజిట్లడిగెను:— "ప్రభూ! ఖడ్గమెచ్చట దొఱకును?"

ఇది విని జడభరతుఁడిట్లనెను:— సాధుసమాగమమునఁ బ్రాప్తించు జ్ఞానవైరాగ్య ఖడ్గముచే నీమోహ బంధమును మూలోచ్ఛేదము కావింపుము. అంత నీయదార్థ కర్తవ్యమును బాలించుము.

రాజిట్లనెను:— "స్వామీ! మానవునకు యదార్థమగు కర్తవ్యమేది? ఆతఁడెట్లు కాలక్షేప మొనర్పవలయును?''

అంత జడభరతుఁడు దృఢముగ నిట్లనెను:— "రాజా! మానవుఁడు సమస్త కార్యములనుండి విరమించుకొని హరి లీలా కథన చింతనములచే నిరంతరము భగవత్స్మరణ మొనర్చుటయే య్యేకైక సర్వశ్రేష్ఠమగు ప్రధాన కర్తవ్యము. హరి స్మరణ మొక్కటియే మానవుని సమస్త ఆపద్విపత్తులనుండి రక్షింపఁగలదు. వాసుదేవుని నెన్నడును మనస్సున మఱవ కుండుట వలననే జీవునకేకైక కల్యాణము, ఆతని ధ్యానము, ఆతని నామకీర్తనము, ఆతని యశోగానము, ఆతని కమనీయ కథాశ్రవణము చేయుచుండవలెను. దీనిలోనే మానవునకు జన్మ సాఫల్యముకలదు. దీనిచేతనే ఆతఁడు పరమ పదమున కధికారి కాఁగలడు. ఈ సాధనముల ద్వారా ఆతఁడు సంసార మార్గమును దాఁటి భగవంతునిఁ బొందును. దీనికి మించిన నన్య సరళ సుగమ మార్గము లేనేలేదు,''

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఇట్లు పలికి అవ ధూతయగు జడభరతుఁడు మెదలకుండెను. రాజేమియు ను మాటలాడక కౌతూహలాశ్చర్య చకితదృష్టిచే నాతనివైపుఁ జూచుచు నిలిచిపోయెను.

## భవాటవిలో తిరుగు బాటసారి

౩౮౦

శ్లో॥ దురత్యయేఽధ్వన్యజయా నివేశితో
రజస్తమః సత్త్వవిభక్తకర్మ దృక్
స ఏష సార్థోఽర్థపరః పరిభ్రమన్
భవాటవీం యాతి న శర్మ విందతి

శ్రీ భాగ. ౫ స్కం. ౧౩ అ. ౧ శ్లో.

సీ॥ ధరణీశ మాయచేతను దాటఁగా రాని పథమునఁ బెట్టంగఁ బద్ధజీవుఁ
డెలమిమై గుణకర్మలఁ జేయుచును లాభ మాశించి తిరుగు బేహారిమాడ్కి
ఫలమపేక్షించుచుఁ బాయక జీవుండు సంసారగహన సంచారి యగుచు
ననవరతమునందు నామహావనమందుఁ గామలోభాదితస్కరులుఁగూడి

తే॥ ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁబట్టి
ధర్మమనియెడి యా మహాధనము నెల్ల
నరసిగొనిపోవు చుందురనుదినంబుఁ
గాన సంసారమందు నాకాంక్షవలదు॥

శ్రీమదాంధ్ర భాగవతము

లౌకిక మానవుఁడు యాత్రచేయుటకు ముందచ్చటి విషయమును దెలిసికొనును. ఇతరులపరిచయమును సంపాదించు కొనును, దేశపటమును జూచుకొనును యాత్రావృత్తాంత

ముఁను పతించును, కాని యీమాయామోహితుఁడు జగత్పథ మందు గమ్యస్థానమును దెలిసికొనకయే, తానెచ్చటికి వెళ్ళ వలయునో తెలిసికొనకయే, తాను విశుద్ధమార్గమునఁ బయ నించుచున్నాడో, దారితప్పి వ్యర్థముగఁ దిరుగుచున్నాఁడో తెలిసికొనక గ్రుడ్డివానివలెఁ జీఁకటిలోఁ గన్నులు మూసుకొని పయనించుచున్నాఁడు. ఆలోచించక గమనము సాగించుట చేతను, అవివేకముచేతను నానాక్లేశములననుభవించు చున్నాఁడు.

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! రహూగణమహారాజు మొదలకుండుటనుగాంచి మహాముని జడభరతుఁడు నవ్వియిట్లనెను:- "రాజా! ఊరకుంటివేమి? ఏమైన నడుగుము. మంచిది, నీవడుగకపోయినను నీకొకకథను జెప్పెద."

రాజిట్లనెను:- "స్వామీ! నాయదృష్టము. వినిపింపుడు మీ కథయైనను రాజు రాణికథకాదు. మీ కథలో నేదో గూఢ రహస్యమిమిడియుండును. ఆకథను మీరు తప్పకవిని పింపవలెను."

ఇదివిని జడభరతుఁడిట్లనెను:- "రాజా! ఇది మంచికథ. నీవు శ్రద్ధతో విననలయును. చిత్తము కొంచెమిటు నటునిటుఁ బోయెనా ఆనందమంతయును బోవును. ఇఁకవినుము:- "ఒకానొక వణిజుఁడుండెను. అతఁడు కడులోభి రాజా! ఈ వ్యాపారముచేయు వణిజులు చాలలోభులుగనుందురు వణిజుఁడు చర్మమున్నైన నిచ్చునుగాని చిల్లికానియైన నీయఁడు తేనెనైన నాకించునుగాని బెల్లపుగడ్డ నీయఁడను సామెతగలదు.

ఆవణిజుఁడు డబ్బుసంపాదించుటకు తన తోడివారలతోఁ
బోయెను. పోయిపోయి, ఇండ్లు పొలములు, వాగులు వంకలు
కోటలు గోడలుదాఁటి చాలదూరముపోయెను ఆతఁడొక
దారినిబట్టుకొనెను. ఆదారిలో ననేకములగు చీలుదారులుకలవు.
అందులో నొకదారి యిసుకతోడను, కొంచెము మెఱయుచు
నుండెను. ఆతఁడును అతని తోడివారును లోభులగుటచే నంద
ఱును నాదారినిఁబట్టిరి. దారితప్పి తిరుగుచుఁదిరుగుచు నాతఁ
డొక గహనవనమునఁ బ్రవేశించిరి. దారిలో నాలుగురు
దొంగలు చేతులలో నాడ్డుకత్తులను బట్టుకొని దారినిఁబోవు
వారిని దోఁచుకొనుటకు నిలుచుండిరి వారికి నాయకురాలు
ఒక స్త్రీ. ఆదొంగలు నిర్దయులు. విషయలంపటులు. యెట్టి
పథికునియొక్క శీలసంకోచమును చేయరు. చూచినవారినెల్ల
వారి సర్వస్వమును దోఁచుకొని గోతిలోఁ బడఁద్రోయును.
ఆ దొంగలీ వణిజుని వెంటఁబడిరి వారు వెంటనే దోఁచుకొ
నుట మంచిది కాదనుకొనిరి మెల్లమెల్లఁగా వీని సర్వస్వమును
నపహరణమొనర్చుటకు వారుసంకల్పించిరి. ముందుకుఁజూడఁగా
బాగుగా బలిసిన తోడేళ్లును నెదురుగా వచ్చుచుండుటను గాం
చెను. అవి ఆతఁడెచ్చట నిటురించిన నచ్చట నాతనిమాంస
మును పచ్చిదే బీఁకుకొని తినఁజూచుచుండెను. కొన్ని నక్క
లును నీయాశతోఁడనే కనిపెట్టుకొని యుండెను. అన్నియుఁ
జుట్టుకొనియుండఁగా చింతితుఁడగు నాలోభివణిజుఁడు ఆశకు
వశీభూతుఁడై ముందుకుఁబోయెను. వనమతిఘోరమైనది.
ఆ వణిజుఁడు ముందునకుఁ బోవుటకును వీలులేకుండెను. వెను

కనుఁ బోవుటకు వీలులేకుండెను. చుట్టును పెద్దపెద్ద దుబ్బులుం డెను. దట్టముగ నల్లుకొనిన లతాగుల్మాదులచే నది దుర్గమమై యుండెను అటునిటు తోఁకదోమలు బాగుగాఁగుట్టి రక్తపానము చేయునని మూగియుండెను. ఒక్కొక్కప్పుడాతనికి ముందేదో నగరమున్నదని భ్రమయుండెడి. ఆ నగరమునకుఁ బోయిన క్లేశములు పోవునని ఆతనియాశ కాని అచ్చట నగరమేమియును లేదు గంధర్వనగరము - మిథ్యానగరము. ఒక్కొక్కప్పుడు కార్చిచ్చు కనఁబడి మరల క్షీణమగుచుండెడిది. అది నిజముగ నగ్ని కాదు. కొఱవిదయ్యములట్లు భ్రమ కలిగించుచున్నవి.

రాజా! ఆ వణిజుఁడు వెళ్లుచు వెళ్లుచు నలసిపోయి. యెచ్చటనైన విశ్రమస్థానము దొఱకిన బాగుండును, త్రాగుటకు జలమును, తినుటకుఁదిండియు దొఱకిన బాగుండును, దానికితోడుగాఁ దినుఘుచున్నది దానికొఱకే కావున డబ్బు కూడ దొఱకిన బాగుండునని తలఁచుచుండెను. ఇంతలోనే ఒక సుడిగాలి గోచరించెను. ఇసుకతోఁగూడిన సుడిగాలియగుటచే నది మెఱయుచుండెను. దానివైపుగానే పోవుటచేఁ గన్నుల నిండ దుమ్ముపడెను. కన్నులెట్టివైన కానఁబడక సుడిగాలిలో నిరుక్కొనెను. రాజా! నీవీసుడిగాలి నెన్నఁడైనఁ జూచితివా?

రహూగణమహారాజిట్లనెను:- అవునౌను స్వామీ! జ్యేష్ఠ వైశాఖమాసములలో సరిగా రెండు జాముల వేళ దుమ్ముతో సుడిగాలిలేచును. దానిలోఁ బడినవాఁడు దానితోఁ బాటు తిరుగును."

నవ్వి జడభరతుఁడిట్లనెను:- "అవును రాజా! సరిగా

నదియే. ఆలోభియగు వణిజుఁడును నానుడిగాలిలోఁబడితిరుగుట ప్రారంభించెను. ఆనుడిగాలిలోఁగూడ ఆతఁడు సాగిపోవు చుండెనుగాని చిత్తము ద్వేగముగనుండెను. ఒక్కయెడ కీచురాళ్ళ శబ్దములు వినవచ్చుచుండెను ఇంకొకయెడ గుడ్లగూబల కర్ణ కఠోరశబ్దమ్ము, యీ గుడ్లగూబల భయానకశబ్దముల భయ మున వ్యథితుఁడై యుండెను. ఆఁకలి బాధించినప్పుడు చేదు పండ్లచెట్లను, ముండ్లచెట్లను ఆశ్రయించి బాధపడును. దాహ మైనపుడెండమావులను జలమనుకొని పరువిడును.

ఎండమావులవలన దప్పితీరక యెండిన నదులకుఁ బోవును. ఆఁకలియగుటచే నటునిటు దృష్టిని సారించును. ఒక్కొక్కప్పుడు వనములలో వెదురు ఒకటొకటి రాచుకొని దావాగ్ని పుట్టును. ఆవైపునకేపోవును. ఒక్కొక్కప్పుడు వనజం తువులు మీఁదికి దుముకును. ఒక్కొక్కప్పుడు భూతప్రేతములు దుముకును. బురదలోఁగాళ్ళుజారును, కాని నీటిజాడయుండదు. ఒక్కొక్కప్పుడు చోరులు మూఁటముల్లెను దీసికొనిపారిపోవును. దీనివలన నాతనికి దుఃఖముకలుగును. ఒక్కొక్కప్పుడు గంధర్వ పురమున నొక్కక్షణకాలము నిలిచిన సుఖనైనాననుకొనును.

వెళ్ళఁగా వెళ్ళఁగా నడవిలోఁబర్వతములు వచ్చును. వానిపై నెక్కఁబ్రయత్నించును. కొంతదూరమెక్కి, ముండ్లు రాళ్ళుగ్రుచ్చుకొనుటచే కాలుజారిపడిపోవును. దీనివలన నాతఁ డత్యంతదుఃఖితుఁడగును. ఆతని వెంటనున్నవారును దుఃఖితు లగుచుండిరి. వీనికాఁకలైనపుడీతఁడు వారితోఁ గలహించును. తనక్రోధమును వారిపైజూపును,

ఒక్కొక్కప్పుడు దారిలో నజగరము (కొండచిలువ) కనఁబడును. దానికాటువలనఁ జూపరుకాని యచేతనులై పడిపోయెదరు. అట్టి యజగరము కాటువేయఁగా నాతఁడు వనములోనే మూర్ఛితుఁడై పడియుండును. కొంతసేపటికి మూర్ఛ తెలియును. ఇట్టి సర్పాదిజంతువులు కన్నులలోఁ గాటువేయుటచే నంధుఁడై కూపములలోఁబడిపోవును, ఒక్కొక్కప్పుడు పోవుచుండఁగా నతనికి తేనెతుట్టెలు కనబడును, రసలోభమున నాతఁడు దానిని ముట్టుకొనఁగానే నవిచుట్టును మూఁగికుట్టును అప్పుడాతఁడమ్మో ! అయ్యో ! యనుచు నటునిటుఁబరువిడును. ఒక్కొక్కప్పుడు యిచ్చిపుచ్చుకొనుటలో తగాదాలు వచ్చెడివి. ఒక్కొక్కప్పుడావశ్యక వస్తువులను బోఁగొట్టుకొనఁగా నితరులవస్తువులమీఁదకు మనస్సుపోవును. వారిని యాచించును. వారీయకపోయిన వారితో వైరమును బెట్టుకొనును. చివరకవమానముచే దుఃఖితుఁడై పశ్చాత్తాపమును జెందును. అనుచరులుండిరిగదా ? వారిని వదలివెళ్ళుటయెట్లు? అవసరము వచ్చినపుడు వారినిఁబ్రేమించి వివశుఁడై సంబంధమును బెట్టుకొనును. ఆతని యనుచరులలోఁ గొందఱు చచ్చిపోయిరి, కొందఱు దారితప్పిపోయిరి. ఆతఁడు వారికొఱకేడ్చుచుఁ గ్రొత్తవారినిఁగలుపుకొనుచు నాసమూహముతో గూడి మధ్యమధ్య కీచులాడుచుఁ బయనించుచుండెను. ఒక్కొక్కప్పుడొక్కొక చెట్టుకొమ్మను బట్టుకొని దానితోడనే వ్రేలాడును, శాఖలమీఁద గూర్చుండిన చిన్నచిన్నపక్షుల కలరవములను గాంచి మంత్రముగ్ధునివలెఁగూర్చుండి తనకుదాను యఱచును.

సింహగర్జనమునువిని భయభీతుఁడై కంకగృధ్రి వకులాది రూపములకు ముగ్ధుఁడై వాటినిఁబోషింప మొదలిడును. చెడ్డ స్వభావమునందు విసుగుగలిగినప్పుడు వాటిని వదలి హంసలను బెంచును, కాని హంసల పవిత్రతకును స్వచ్ఛతకును భయపడి కోఁతులను బ్రేమించును. వాని చంచలతలోఁ దన చంచలతను గలిపి కల్లోలమొనరించును. ఒక్కొక్కప్పుడు వృక్షముల నానుకొనును, ఒక్కొక్కప్పుడు పర్వతకందరములలోఁబడి పోవును. అచ్చటనుండు ఏనుగులు తఱుమగా లతాసహాయ మున బయటఁబడఁ బ్రయత్నించును. ఒక్కొక్కప్పుడు మధ్య మధ్య వ్రేలాడుచునేయుండును. సింహ, గజాదులకు తప్పించు కొని బయటపడెనా మరలఁ దనవాధినిఁ గలిసికొనును. పాపమా పథికుఁడు చిరకాలము పయనించెనుగాని వాని దారికి అంతు గనఁబడలేదు, మార్గమునకంతు లేదు. అధ్వమునకు సమాప్తి లేదు. రాజా! కథ పూర్తియైనది.

రహూగణ మహారాజాశ్చర్యముతో నిట్లనెను :— స్వామీ! ఇదియేమికథ? దీనికంతునులేదు. పొంతునులేదు. తలయుఁదోకయును లేదు. ఒక వణిజుఁడున్నాడు, తన సమూహ ముతో నొకదట్టపు టడవిలోఁ దిరుగుచున్నాఁడు. అను నీమా టలపైన వచ్చినభూమిక యెంతో యేర్పడినది. స్వామీ! ఇది కథయేకాదు. సగములోనే నిలిచిపోయినది.

నవ్వి జడభరతుఁడిట్లనెను:- మహారాజా! ఇదియాధ్యా త్మిక కథ. ఇది ప్రేమపరిణయ కథకాదు. దీనిలో ప్రేమ,సరస సల్లాప, మనోరంజక శృంగార విషయముకాదు."

రహూగణమహారాజిట్లనెను:– "ప్రేమ, శృంగారము లకు సంబంధించిన కథ కాకపోయినను కథకు కొంచెము రూపు రేఖలుండవలెనుగదా! తాత్పర్యము రావలెనుగదా! ఆవణిజుఁ డెవఁడు? దట్టమైన వనమేది? ఈసంగతినిఁ జెప్పుడు."

జడభరతుఁడు శీఘ్రముగ నిట్లనెను:– "రాజా! ఆవణి జుఁడవు నీవే"

ఆశ్చర్యముతో రాజిట్లనెను:– "స్వామీ! మీరెట్టిపలు కులు పలుకుచున్నారు? నన్ను వణిజుఁడనుచున్నారా? స్వామీ! నేను శుద్ధ క్షత్రియవంశజుఁడను."

జడభరతుఁడు ఉదాసీన స్వరమున నిట్లనెను:– "ఏమ య్యా రాజా! అదే పిచ్చిమాటలు. ఒక పండితుఁడుండెడు వాఁడు. ఒక యజమానివద్ద సంవత్సరమంతయును నాతఁడు రామాయణ కథను బురాణము చెప్పెను. సంవత్సరముపూర్తి కాఁగానే కథ సమాప్తమయ్యెను వైభవముగఁ బూజ జరి గెను. బాగుగా కానుకలు వచ్చెను. కానుకలు తీసుకొని పండి తుఁడు పోఁబోయెను. గ్రామము బయటకువచ్చెను వెనుక నుండి యజమాని పరుగెత్తుకొనివచ్చి "పండితులవారూ! ఒక్కమాట అనెను. పండితుఁడు నిలుచుండి యిట్లనెను:– ఏమిటండి శ్రేష్ఠిగారు?"

యజమాని యిట్లనెను:—అయ్యా! నాకొకసందేహము మీరు చాలసార్లు రాక్షసుఁడు రాక్షసుఁడు అన్నారే, ఆరాక్ష సుఁడు రావణుఁడా రాముఁడా!"

పండితుఁడు తనసత్తినిబాదుకొని యిట్లనెను:—"అయ్యా! రాముఁడును రాక్షసుఁడు కాఁడు. రావణుఁగును రాక్షసుఁడు కాఁడు. నీబోటి బుద్ధిమంతునకు సంవత్సరమంతయును వ్యర్థముగఁ బురాణమును జెప్పిన నేను రాక్షసుఁడను, సంవత్సరమంతయును వినియు నెవఁడు రాక్షసుఁడో ఇంతమాత్రము తెలియని నీవును రాక్షసుఁడవే." కావున రాజా! ఆత్మ బ్రాహ్మణుఁడు గాని, క్షత్రియుఁడుగాని, వైశ్యుఁడుగాని, శూద్రుఁడుగాని కాదని నీవిప్పటికైనను దెలియక పోయితివే. అది నిత్య శుద్ధ బుద్ధ స్వరూపము. ఉపాధి రహితమైనది. ఈ దేహము వ్యవహారిక మిథ్యోపాధి.

రహూగణ మహారాజిట్లనెను:- "స్వామీ! మీరీకథను జాల గూఢభావములో, జెప్పితిరి. వణిజుఁడెవఁడో, గహనవనమేదో, ధనమేదో, మార్గమున నాతనికి సంభవించిన క్లేశములేవో దయయుంచి నాకీ భావార్థమును జెప్పవలయును. మీ విజ్ఞానమయ వచనములను దీక్షబుద్ధిగల సూక్ష్మ దర్శులగు కవులే గ్రహింప గలరు. మాయామోహమున బద్ధుఁడైన సాంసారికుఁడునైన నావంటి వాఁడిట్టి రహస్యమయ విషయములను స్వతఁ తెలిసికొనుటకెట్లు సమర్థుఁడనగుదును? కావున మీరు ఆధిభౌతికార్థమునుఁజెప్పుడు.

శుకదేవుఁడిట్లనెను:— "రాజా! రహూగణ మహారాజీ విధముగ శ్రద్ధాపూర్వకముగఁ బ్రశ్నింపఁగా నవ్వుచు నవధూత శిరోమణి యగు భరతుఁడీ భవాటవీ కథా తాత్పర్యమును జెప్పుట కుద్యుక్తుఁడయ్యెను.

# భవాటవీ భావార్థము.

(౩౮౧)

శ్లో॥ రహూగణ త్వమపి హ్యధ్వనోఽస్య
సంన్యస్త దండః కృతభూత మైత్రః ।
అ సజ్జితాత్మా హరి సేవయా శితమ్
జ్ఞానాసి మాదాయ తరాతి పారమ్ ॥
శ్రీ భాగం. ౫ స్కం. ౧౩ అ. ౨౦ శ్లో॥

---- శిబికయందు రాజనని యెడి యభిమానంబు గలిగి నీవున్న వాఁడవు ఇట్టి శోచ్యుత్రై కష్టదశం బొందిన జనుల దయలేక నిగ్రహించి నీవు ప్రజా పాలనంబు సేయుచున్న వాఁడవను గర్వంబున మాకంటి మహాత్ముల సభలలోఁ సంబూజ్యుండవు గాకున్న వాఁడవు, మాయచేత సంసార మార్గంబైన రాజ భావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపుగనుమని పలికెను.

శ్రీ మదాంధ్ర భాగవతము

రాత్రి భోజనమైన తర్వాత పిల్లలు తమ తల్లిదగ్గఱఁ బరుండునపుడు పరస్పరము కట్టుకథలు వేసికొందురు. తల్లియు నీకార్యములో సహాయము కావించును. అది యిట్లుండును- ఒక పిల్లవాఁడిట్లడుగును-"ఇంత పిట్టను గోస్తే యిల్లంత నెత్తురు" రెండవ పిల్లవాఁడిట్లనును:- "దీనిభావమేమో తెలియఁ జెప్పు" అనిపలికి అనేక పేర్లను జెప్పును. కాని అర్థమురాదు. కాని చివరకు దీపమని జెప్పును ఇదైన తర్వాత వీరు మొదటి వారి నిట్లడుగును:-

గీ॥ కాష్ఠ ధాతువు గాదు కడకు జీవము లేదు
ఆసిగాని మాంస మసలె లేదు
కత్తిచేయు పనినిఁ గావించు, జలముల
వాసమెపుడు చెప్ప వలయు నేమొ?"

పాపము పిల్లలందఱును నాలోచించెదరు, కొయ్యతోఁ గాని, లోహములతోఁ జేయఁబడనిది, జీవము లేనిది, ఎముకలు గాని, మాంసముగాని లేనిది కత్తివలెఁ గోయునది, జలములో నుండునది, ఎదోనని చాలగ నాలోచించినను దొఱకదు. చివరకు కట్టుకథ వేసినవాఁడే 'కుమ్మరవాని కుండలు కోయు దారము" అనఁగానే అరెరే మనకు తోఁచలేదురా? అని పిల్లలందరు ఇట్టి కట్టు కథల వలన బుద్ధి తీక్ష్ణమగును. జ్ఞానవృద్ధి కలుగును. ఆలోచనాశక్తి వృద్ధి పొందును. కౌతూహలముండును. అందుకనియే దేవతలను బరీక్షా ప్రియులందురు ముసుఁగులోని ముఖము బాగుండుగాక లేక నల్లఁగా, మచ్చలతో ననాకారిగా నుండుఁగాక చూడవలయునని అందఱకును గౌతూహలము జనించుట స్వాభావికము. అందువలన రాజును గుతూహలమునఁ బడవేయుటకై జడభరతుఁడు భవాటవీ కట్టు కథను జెప్పి "రాజా! ఏమైన దెలిసినదా?" అని యడిగెను.

చేతులు జోడించుకొని రహూగణ మహారాజిట్లనెను:— "స్వామీ! నేను మీ రహస్యమయ కథయొక్క అభిప్రాయమును దెలిసికొనఁజాలకున్నాను మీరు వర్ణనమంతయును నాలంకారిక రహస్యమయ గూఢభాషలోఁ జేసితిరి."

నవ్వి భరతుఁడిట్లనెను:— "చెప్పుమనినఁ జెప్పెదను" విన

యముతో రాజిట్లనెను:-"సద్గురువుగాక గూఢజ్ఞాన రహస్యము
నెవరు చెప్పఁగలరు? ఆచార్యుఁడుగాక దివ్యరహస్యోద్ఘాటన
మెవరు చేయఁగలరు? శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడుగాక
చిక్కును విడఁదీయఁగల వాఁడెవఁడు? ప్రభూ! ఈ రహస్య
మయమగు కథను మీరే తాత్పర్యమును జెప్పవలయును"

ఇది విని జడభరతుఁడిట్లనెను:- "రాజా! శుభాశుభ
కర్మలద్వారా దేహమును బొందిన యీ జీవుఁడే వణిజుఁడు.
ప్రారబ్ధ ప్రేరణచే భగవన్మాయా వశీభూతుఁడై దుర్గమ పట
ముగల యీ సంసారరూప ఘోరారణ్యమందు సుఖమును ధన
ప్రాప్తి కొఱకు తిరుగుచున్నాఁడు. పరివారము, ఇష్ట మిత్రులు,
సంబంధులే వణిక్సమూహమువలె నీతని యనుచరులు, ఈ
జీవుఁడను వ్యాపారి లాభేచ్ఛచే వ్యాపార రూపమగు కర్మల
నొనర్చును; కాని సర్వత్ర యీతఁడు హానినే పొందుచున్నాడు
లాభములేదు. సాంసారిక విషయములలో సుఖమెక్కడిది,
శాంతి యెక్కడిది? విజయమెక్కడిది? అచ్చట చింత, దుఃఖ
ములు, హాహాకారము, పరాజయమే. మధులోలుపభ్రమ
రములగు భక్తజనుల పథానుసరణ మొనర్చుచో దివ్యగంధ
యుత స్వచ్ఛ నిర్మల సరోవర సమీపమునకుఁ జేరి, వాసన
చూచుటకు కమల సుగంధములు లభించుచో, తినుటకుఁ
గమలనాళము, కమలఫలము దొఱకినచోఁ ద్రాగుటకు స్వచ్ఛ
సుందరామృత సదృశ జలము లభించినదాయనిన లభింపలేడు.
పైగా నీఁగలు దోమలు, కందిరీఁగలుండు మార్గముననుసరిం
చుచున్నాడు. పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు ఈ ఆఱును

దొంగలు. వణిజుఁడు కష్టపడి సంపాదించిన ధనమును దొంగలు నిర్దయతో దొంగిలింతురో అట్లే యీ మనస్సును, పంచేంద్రియములును మాయామోహిత జీవుని సర్వస్వమును నపహరించును. ప్రతివత్సరము పొలమును దున్ని, నాటి, కలుపుతీయుచున్నను వర్షారంభము కాఁగానే మరలఁ దృణ వీరుధ గుల్మాదులుత్పన్నమైనట్లు ఈ గృహస్థాశ్రమమును గర్మభూమియే ఇందులోఁ గర్మలకంతే యుండదు; ఏలననఁగాఁ గర్మ బీజముల నాదివి. నీరు మరల పడఁగానే అంకురించును.

ఈ గృహమను వనమందు ఈఁగలు, దోమలు, కందీగల వంటివారు దుర్మార్గులు, వీరు భవాటవీ పథికులకుఁగష్టమును గలిగించుచుందురు. విషయభోగములను సత్యమనుకొనుటయే గంధర్వనగరము. వీనియందుగల సుఖేచ్ఛకే మృగతృష్ణ యనిపేరు. మెఱయుచున్న నెత్తి నెత్తినిఁ గొఱవి దయ్యము వంటిది సువర్ణము. దీని మెఱుఁగునకును జూకచక్యమునకును మోహితుఁడై జీవి ఆశవలనఁబాప మొనర్చుచున్నాఁడు. దీనిని బొందుటకు సదా ప్రయత్నించు చుండును."

మూఢయగు మృగనయనయే సుడిగాలివంటిది. దాని వలలోఁబడి మానవుఁడు దాని కనుసన్నలలో నాట్యమొనర్చుచుండును. దానిపైగల ననురాగమే-ఆసక్తియే యీసుడిగాలిలోని ధూళి అది నేత్రములలోఁబడెనా జీవుఁడంధుఁడగును. వానికి దిక్కులు తెలియవు. సాధుపురుషుల మర్యాదపోఁగొట్టుకొనును శీల, సంకోచ, లజ్జాదులకు తిలాంజలులొసంగును. భోజన, పాన, మైథునాది సాంసారిక సుఖములందాసక్తినిఁ

జెందిన యాతఁడు తృప్తిఁజెందక ఆశావశమున మృగతృష్ణరూపమగు మిథ్యావిషయముల వైపు పరువిడుచుండును. ఒక్కొక్కప్పుడు అగ్నియొక్క స్వరూపమగు సువర్ణమును బొందుటకై చెడిగుడులాడును. ఒక్కొక్కప్పుడిది లేదు, అది లేదనుచు నటు నిటుఁబరువిడుచుండును. అసత్పురుషుఁడే జలములేనినది. గృహయుద్ధమే తోడివారితో యుద్ధము. చిత్తము నుద్విగ్నింపఁజేయు శోకాగ్నియే దావానలము. దుర్మార్గుఁడగు రాజు, రాజ్యాధికారులు రాక్షసులవలె సర్వస్వము నపహరించువారు.

గొప్పగొప్ప కోరికలు, వైభవోపేతమైన యజ్ఞములు, యజ్ఞవాంఛలే పర్వతారోహణము వానిలోఁగల నానావిఘ్నబాధలే కంకర రాళ్లు ముళ్ళవంటివి నిద్రియే అజగరము. నిద్రిలోఁబడినవాఁడు అచేతనుఁడగును; అంధకారమునఁబడును. వివేకశక్తి క్షీణించుటయే అంధకార కూపములోఁబడుటవంటిది. పరనారీ, పరధనములే తేనెతుట్టెలు వానిమీఁదఁ జేతిని వేసితిమో లేదో నలువైపులను శరీరమున కంటుకొనును. అసహ్యవేదన ననుభవింపవలసివచ్చును. లౌకిక వైదిక కర్మలే జననమరణరూపమగు బీజములు మరల నుత్పన్నముగావించు తృణములు శీత వాయు, వర్షములే ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక క్లేశములు. రాజా! సంసారమే గహనవనము. మార్గము మైనది. ఇఁక్కిలి దురూహమైనది. దీనిలో మాయాప్రేరణచేఁ జేరు జీవసమూహమును దొలిగించుకొనుట అత్యంత కఠినము. మహారాజా! నీవును నీ మాయాజాలమునఁ బడితివి. నీవును నీసాంసారిక వణిజులతోఁబాటు వణిజుఁడవైతివి. సంసారములో పరమార్థమెక్కడిది? కేవలమాత్మానంద మందు బ్రవేశించిన

తప్ప మిగిలినదంతయును వణిగ్వృత్తియే. నీవు నన్నుఁ బోషిం తువు నేను నీసేవను జేయుదును. నీవు నన్నుఁ బ్రేమించిన నేను నిన్ను బ్రేమింతును. నేను దేవతకొఁక ఫలము నొసంగినచో దేవతలు నాకు అనేకజన్మముల ననంతఫలము లొసంగెదరు. ఈ ఫలాశచేతనే మానవుఁడు ఫలదాతయగు సర్వేశ్వర జగత్పతి విశ్వంభరుని మఱచి తానే సర్వస్వమని తలఁచుచుండును. మాయామోహితుఁడై శోక, మోహ, భయకారణమున విషాద, రోదన హర్షాదులందుఁ బడిపోవుచున్నాఁడు. ఒకొ్కక్కప్పుడేడ్చును, ఒకొ్కక్కప్పుడు పాడును, ఒకొ్కక్కప్పుడటు నిటుఁబోవును. ఈ భవాటవికి అంతములేదు. భగవద్భక్తుఁడైనచో దీనిని భగవచ్చరణారవింద పరిభావముచే దాఁటి పోవును. మిగిలిన వన్నియును దీనియందు నటునిటుఁదిరిప్పి నానా-క్లేశములను గలిగించును. రాజా! ఇది యీ భూమిపై ననే అనుకొనకుఁడు బ్రహ్మలోక పర్యంతమీ యావాగమున చక్రమేకావును రాజా! నీవు నావ్రేలు పట్టుకొని యీభవాట విని దాఁటుము."

(శ్రీ) శుకదేవుఁడిట్లనెను:— "ఉత్తరానందవర్ధనా! మహారాజా! ఈ విధముగ రహూగణ మహారాజున కుపదేశ మొసంగి యూరకుండెను.

# రహూగణ జడభరత సంవాద సమాప్తి

౩౮వ

శ్లో॥ నమో మహద్భ్యోఽస్తు నమః శిశుభ్యో
నమో యువభ్యో నమ ఆవటుభ్యః
యే బ్రాహ్మణా గామవధూత లింగా
శ్చరంతి తేభ్యః శివమస్తు రాజ్ఞామ్॥

శ్రీభాగ. ౫. స్కం. ౧౩ అ. ౩౩ శ్లో॥

క॥ ధరణీ సురవర నీ శ్రీ
చరణాంబుజ యుగళ రేణు సంస్పర్శము నా
దురితంబు లడఁచె నింతటు
హరిభక్తియు నంతి కంత కధికం బయ్యెన్॥

మఱియును విప్రవరులందు యోగీశ్వరు లవధూత వేషంబున జరియించు చుందురు గావున విప్రులు పిన్నపెద్దలనక యందఱకును నమస్కారంబు

శ్రీ మదాంధ్రభాగవతము.

ఈ జగత్తులోనికివచ్చి అందఱికంటె ముందుండవలెనను నభిమానమును వదలి, మిక్కిలి స్నేహముతోఁ గలియవలెనను సాధువుల వాక్యము. నారాయణుఁడే రూపమున వచ్చునో తెలియదు. నారాయణుఁడన్ని రూపములను ధరింపఁగలఁడు. ఆతఁడు నిర్గుణమునుండి సగుణుఁడగుట కేమియును కష్టము లేదు. ఆతనికి నీచోచ్చ భేదములును లేవు. ఆతఁడు చండాలుఁడును గాఁగలఁడు భూసురుఁడును గాఁగలఁడు. రాజై జగత్తును శాసించను గలఁడు వడుగు వామనుఁడై భిక్షము నెత్తఁగలఁడు.

డాతను బ్రశంసించి యాతనిని బ్రసన్నమును గలిగింపఁగలఁడు ఆతఁడు శిశువై రోదనమును జేయఁగలఁడు గురువై యుపదేశ మును నీయఁగలఁడు. ఆతఁడు దొంగవలె స్వయముగ బుద్ధుఁ డును గాఁగలఁడు. శరణువేఁడిన బద్ధ జీవులను సంసార బంధన మునుండి విడిపింపను గలఁడు సారాంశ మేమనఁగా నాతని కొక్క రూపము లేదు. ఆతఁడు సర్వగతుఁడు, అన్నియు నాతని రూపములే. సుందరమైనదియు సర్వ ప్రసిద్ధమైనదియునగు నొక కథ కలదు.

ఒక సాధువు భోజనము తయారుచేసికొను చుండెను. తయారైన తర్వాతఁ దినఁబోవుచుండఁగా నొక బలముగల కుక్కవచ్చి రొట్టెలనన్నిటిని నోటఁగఱచుకొని పరుగిడిపోయెను ఆ మహాత్ముని నిష్ఠను జూడుఁడు. మఱచియైనను నాతఁడా యపకారియగు శ్వానము వెంట కఱ్ఱతీసికొని పరువిడ లేదు. నాకపకారియగు నీ శ్వాన ము నా సర్వాంతర్యామియగు స్వామికి అన్యమైనదని ఇ సు మం తై న ను లే దు. ఆహారి యే సర్వమును జేయించుచుండును చేయుచుండుననియు నాతఁడే స్వయముగఁ దినుచున్నాఁడను భావమాతనికి నగమునరమున వ్యాపించెను. ఒక చేతిలోఁబప్పుగిన్నెను బట్టుకొని, ఇంకొక చేతిలో నేతిగిన్నెను బట్టుకొని కన్నులనీరుగార్చుచు దానివెంటఁ బరువిడుచు నిట్లనెను:- "నాథా ! నా స్వామీ ! కాల్పుడు రొట్టె నెట్లు తిందువు? కొంచెము నేయిరాయనిమ్ము. ఈపప్పును గూడ స్వీకరించుము. నా సర్వస్వమా ! నా అర్ధసేవలనే స్వీక రించెదవు. ఇదికూడ నీకొఱకు చేసినదే. ఈపప్పులో నాయహం

మనోవాక్కాయములఁ బ్రణామము గావించును. దీనికి విపరీత
ముగ నహంభావమున్న తవఱకు ఇతరులచేఁ దన పల్లకీని
మోయించును, వారిని కసరును. చివాట్లుపెట్టును. ఇదియే
జ్ఞానికిని అజ్ఞానికిని భేదము.

శుకదేవుఁడిట్లనును:- "రాజా! రహూగణమహారాజు
బ్రహ్మజ్ఞానికి అధికారి యని భావించి భరతుఁడు గూఢ జ్ఞాన
మును గూర్చి ఉచ్చాది ఉపదేశమును గావించెను.
ఆ యుపదేశమును శ్రవణముకావించి కృతజ్ఞతా కారణమున
హృదయముప్పొంగి రహూగణమహారాజు జడభరతుని యెడలఁ
దన కృతజ్ఞతను బ్రదర్శించెను. ఆతఁడిట్లనెను:- "స్వామీ!
సమస్తయోనులలో మానవజన్మయే శ్రేష్ఠమనియు, సమస్త
లోకములలో భూలోకమే శ్రేష్ఠమైనదనియు, సమస్తమానవు
లలో నావంటి వ్యక్తి శ్రేష్ఠుఁడనియు నేననుకొనుచున్నాను,

ఇది విని జడభరతుఁడు నవ్వుచు నిట్లనెను:- "రాజా!
ఎంతో పుణ్యముచే లభించు దేవతాజన్మనువదలి మనుష్య
జన్మను బ్రశంసించుచున్నావేల? సర్వదా దివ్యసుఖములు
ప్రాప్తించుచుఁ, బానమొనర్చుటకు అమృతము లభించుచు,
విహరించుటకు బహుమూల్యమగు విమానములు లభించియు,
రమించుటకు మనోహరులగు రంభాదిరమణులు గలిగిన స్వర్గ
లోకమును వదలి దుఃఖపూర్ణమను మృత్యుధర్మము కలిగిన
మర్త్యలోకము నేలఁబ్రశంసించుచుంటివి ఇతర విషయము
లను బోనిమ్ము. నీవు నీవిషయమునుగూర్చి యింతగా నేలఁ
బ్రశంసించుకొనుచున్నావు?"

అంత దృఢతా స్వరమున రాజిట్లనెను:- "స్వామీ! భోగములుతప్ప సత్సంగ ప్రాప్తిలేని యీ దేవతా జన్మమును నేను నిందించుచున్నాను స్వర్గాదిలోకములకు సాధారణముగఁ బుణ్యాత్ములే వెళ్ళుచుందురు. అచ్చట వారు దివ్యభోగము లందే తన్మయులగుచుందురు. వారికి సత్సంగేచ్ఛయేయుండదు. అచ్చటికి మీబోటి సాధువులు వెళ్ళనే వెళ్ళరు మీవంటి సరళ సర్వగత సాధుసాంగత్యము దొఱకని దేవతాజన్మము హేయమైనదే ఈ విధముగ మీవంటి అవధూతల దర్శనము దొఱకని బ్రహ్మలోకమైనను త్యాజ్యమైనదే

"నన్ను నేను శ్రేష్ఠుఁడను, అదృష్టవంతుఁడనని యేలఁ జెప్పుకొని నానఁగా నేను నాప్రయత్నమువలనను, నాసాధనములవల్లను నెన్నటికిని మీబోటి సాధువులను దర్శింపఁజాలను నేను నామమాత్రముగ నల్పభూఖండమునకు మిథ్యాస్వామినై మీ బోటివారి నెవరిని గుర్తింపఁజాలనంతటి యధికగర్వమును బొందియుంటిని. నాలుగైదుస్వర్ణరజత నాణెములున్నవో లేవో బుద్ధి భ్రష్టమైనది మేము మా ముందఱ నందఱను దృణముగఁదలఁచుచుందుము. అందఱనవమానించుచుందుము, అందఱను దుచ్ఛముగ భావించుచు వారివైపు చూచుటకును నవమానమును బొందినటులు భావించుచున్నాము. ఇట్టి యైశ్వర్యమదిరాపాన మొనర్చి మున్మత్తుఁడనై యుండి పామరుఁడనైన నాయందును మీరు కృపనఁజూపితిరి నాయపరాధముల నిసుమంతైన మనస్సులో నుంచుకొనలేదు? అట్టి నాకంటె భాగ్యశాలి ప్రపంచములో నెవఁడుండఁగలఁడు

ఎవరినిఁగాంచి, సాధువులు ప్రసన్నులైరో, సాధువులెవరినిఁ దమవారినిఁగాఁ జేసికొనిరో, ఏదో కారణమున వారియనుగ్రహ మును బొందిరో అట్టివారే శ్రేష్ఠులు. వారే యీ సంసార సాగరమును శాశ్వతముగ దాటఁగలవారు. ఎన్నియశ్వమే ధాది యాగముల నొనర్చినను, నెన్నిపశువుల నాహుతియొనర్చి నను, బుణ్యమున బ్రహ్మలోకమును జయించినను, నెనుబది నాలుగు లక్షల జీవయోనులనుండి తప్పించుకొన లేఁడు. జననమరణ భయమట్లేయుండును."

జడభరతుఁడు శిష్టాచారమునను సరించి యిట్లనెను:— "నాయనా! నీవు మొదటినుండియు జిజ్ఞాసువవే. భగవద్భక్తుఁ డవు. అట్టి వాఁడవు కాకున్నచో నింతటి ధనైశ్వర్యమును వీడి తత్త్వజ్ఞాన జిజ్ఞాసచేఁ గపిలభగవానుని చరణసన్నిధికేల వెళ్ళె దవు ? రాజా ! యువావస్థలో మానవుఁడంధుఁడగునుఁ. నర నరములలోఁ గామము వ్యాప్తించియుండును. ఏదో సంస్కా రముగలిగిన భాగ్యవంతుని మాట వేఱు. కాకున్న యువావ స్థలో వివేకమునంతను బోఁగొట్టుకొనునంతటిదిగాఁ గాఁమ ముండును. యువకుఁడై యుండి, పైగా ధన సంపత్తియుండి, వివేకములేకున్నచో నిఁక వానివిషయమడుగనేరాదు. తిప్ప తీఁగె వేఁపచెట్టుమీఁదకు ప్రాకుటవంటిది. ఇట్టివాఁడు సంసార బంధనమును రోజు రోజుకు దృఢమొనర్చుకొనుచుండును. అధికారమున మానవుఁడు వివేక విహీనుఁడగును. నీవు దీని నింతగాఁ జిక్కుపట్టుట భగవదుపాసనాఫలమే. ఈ సంసార జాలము మంచిగట్టిగా నల్లఁబడినది నీవీజాలమునఁ బడితివి.

సాధారణాస్త్రములచే నీజాలము తెగదు. లోహఖడ్గముతోఁ దెగునదికాదు, అందుకనియే నేను నీకుజ్ఞానరూపమగు ఖడ్గము నొసంగితిని, దానిని భగవద్భక్తియను సానకెక్కించుము. దాని నతి తీక్ష్ణము గావించి, యీజగజ్జాలబంధనములను-గుణమయ జాలములను గోసివేయుము. ఈ సాగరమునుండి దాఁటి పొమ్ము. మంచిది. ఇఁక నేను వెళ్ళెదను."

ఇది వినఁగానే రహూగణమహారాజు పరువిడిపోయి, తనపల్లకీనుండి గంగాజలపాత్రను గొనివచ్చి, సమీపమున నున్న వృక్షములనుండి స్వయముగఁ బుష్పములను గోసికొని వచ్చి, ఫలములను దెచ్చెను. మిక్కిలి శ్రద్ధతో నాతని చరణ ప్రక్షాళనమును గావించి యథాలబ్ధోపచారములచే, స్నేహ భరితహృదయముతో నాతని పూజగావించి అశ్రువులను రాల్చుచుఁ జేతులను జోడించి యిట్లనెను:- "ప్రభూ! నేను నిన్నేమని స్తుతింపఁగలను? మీకొక్క రూపము లేదు. ఒక్కొక్కప్పుడు మీరు బాలురవలెఁ బరువిడుచుందురు. ఒక్కొక్కప్పుడు యువక వేషమును ధరించి ఱొమ్మువిఱుచుకొని వెళ్లుచుందురు, ఒక్కొక్కప్పుడు కఱ్ఱను ధరించి వృద్ధుని వలెఁదిరుగుచుందురు. ఒక్కొక్కప్పుడు జడలతోడను గడ్డముల తోడను దుప్పటిని గప్పుకొని, మృగచర్మమును, దండ కమండలువులను ధరించి బ్రహ్మచారి యగుదురు. మఱొ కప్పుడు వివాహ మొనర్చుకొని, అగ్నిహోత్రము లొనర్చుచుఁ, బుత్రోత్పాదన మొనర్చి, ధర్మాచరణ మొనర్చుచుందురు. ఒక్కొక్కప్పుడు మీరుగృహత్యాగమునుగావించి, వనములలో

నుండి వానప్రస్థధర్మమును బాలించుచుందురు. కందమూలా దులమీఁదనే జీవించెదరు. పంచాగ్నిలోఁ దపించెదరు, శీతోష్ణములను సహించి, అగ్నిహోత్రములొనర్చుచుఁ దపోనిరతులగుచుందురు ఒక్కొక్కప్పుడు దానినిఁగూడ త్యజించి అవధూతవేషమును వేసికొందురు. దండీ, ముండీయై తిరుగుచు బరమహంస వృత్తిని దర్శింపఁజేతురు. మీరు యేరూపములతోఁ దిరుగుచుందురో యెవ్వరికినిఁ దెలియదు. నీగతి విధులనెవ్వఁడును స్వయముగఁ దెలియఁజాలఁడు. మీ కృపచే నెవనికి మీరు తెలియఁదలఁచితిరో వారే తెలిసికొనఁగలరు. స్వామీ! నా యాచన మొక్కటికలదు. నావంటి యజ్ఞానులును రాజ్యమదోన్మత్తులగు రాజులయెడల మీరు కృపఁజూపవలయును. వారు మీ యెడలఁజేసిన యపరాధములను, మీ కృపాళుస్వభావకారణమున క్షమింపవలయును.”

శుకుఁడు పరీక్షిత్తుతో నిట్లనెను:- “రాజా ! ఈ విధముగఁ బరమ ప్రభావశాలియు, బ్రహ్మర్షియునగు జడభరతుఁడు సింధు సౌవీరదేశపు రాజగు రహూగణునకు మిక్కిలి కరుణావశమున నాత్మతత్త్వమునుగూర్చి సారాతి సారోపదేశము నొసంగి, రాజులద్వారా సత్కృతుఁడై, పూజితుఁడై పరిపూర్ణ సముద్రమువలెఁ దన మనస్సును నింద్రియములను శాంతి పఱచికొని యీ పృథివియందు స్వచ్ఛందుఁడై చరింపసాగెను. రహూగణ మహారాజును గృతార్థుఁడై తన దేశమునకుఁ బోయెను. అతఁడు జడభరతుని యుపదేశమును శ్రద్ధాసహితముగ హృదయమున ధరించెను. అతఁడా సత్సంగ ప్రభావ

ముచే నవిద్యావశమున నేర్పడిన దేహాత్మబుద్ధిని యథార్థమగు జ్ఞానముద్వారా నాశము కావించి బ్రహ్మభూతుఁడయ్యెను. కాలాంతరమున జడభరతుఁడును నీద్విజచరమ శరీరమును ద్యజించి తన సత్స్వరూపమందు లీనమయ్యెను. రాజా! నేనత్యంత సంక్షేపముగ నీ భరతుని పుణ్యమయ చరిత్రమును నీకు వినిపించితిని. ఇఁకనిప్పుడు చెప్పుము, ముందునీ కేమి చెప్పవల యునో."

శ్రీ సూతుఁడిట్లనెను:- "మునులారా! నాగురుదేవుని ముఖమునఁ బరీక్షిన్మహారాజు భరత చరిత్రమునువిని అత్యంత ప్రసన్నుఁడై రాఁబోవు ప్రసంగమును సాగించుటకు భరతుని వంశప్రశ్నమును జేయసాగెను.

## రాజర్షి గయుని చరిత్రము

౩౮౩

శ్లో॥ గయో నృపః కః ప్రతియాతి కర్మభిః
యజ్వాభి మానీ బహు విద్ధర్మగోప్తా
సమాగతశ్రీః సదసస్పతిః సతామ్
సత్సేవకోఽన్యో భగవత్కలామృతే ॥

శ్రీభాగ. ౫. స్కం. ౧౫ అ. ౯ శ్లో॥

సీ॥ ధర్మమార్గంబున ధారుణీ జనులను బ్రేమతోఁబోషణ పేర్మిఁబోషి
లాలనశాసన లక్షణాదులచేతఁ బోషించుచును యజ్ఞములను యజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్తమునవిల్పి సేవించి స్వాంతమందున్నయీశ్వరునిఁగాంచి
యఖిల జీవతతికి నానంద మొసఁగుచు నిరభిమానతిమెయి ధరణి నేలె

ఆ॥ సత్యమందు మిగులు సత్సేవయందును
ధర్మమందు మజ్జ కర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని
మానవుండుగాఁడు మానవేంద్ర!

శ్రీమదాంధ్ర భాగవతము.

సత్కులములో నుత్పన్నమగుటచేతనే మానవుఁడు కులీనుఁడని పిలువఁబడుచున్నాఁడు. పూర్వకాలమునఁ గులీనత యందు మిక్కిలి శ్రద్ధయుంచెడువారు. కులీనుఁగు నిర్గుణుఁడైనను వందనీయుఁడుగ నెన్నుచుండెడువారు, అకులీనుఁడు గుణియైనఁ కులాగతాచారాను సారముగ వాని గుణములకుఁ బ్రశంసకలదు, కాని యాతఁడు కులీనగుణవంతునివలె నాదరణీయుఁడుకాఁడు. సత్కులమందును గ్రూరులును, దుష్టులును బుట్టినఁ బుట్టుదురుగాక, అయినను సామాన్యముగఁ గులాగత గుణములు కొంచెమో గొప్పయోవచ్చితీరును. అందుకనియే రాజు పుత్రుఁడు రాజగును. మంత్రిపుత్రుఁడు మంత్రియగును. వైద్యుని పుత్రుఁడు వైద్యమునేచేయును. కలికాలమున నీయాచారము పాపవృద్ధివలన నిలువలేదు. కావున్న ధర్మాత్ముల వంశావళిని విన్నను ననంతమాహాత్మ్యము కలదని చెప్పఁబడు చుండుఁకు?

పరీక్షిన్మహారాజు వినయముతో నిట్లడిగెను:—
"స్వామీ! మీరు స్వాయంభువ మనువంశమును వర్ణించుచుంటిరి. మనవునకుఁ బ్రియవ్రత, ఉత్తానపాదులను నిద్దరు పుత్రులుండి రంటిరి. ఉత్తానపాదుని వంశమును ధ్రువునిదగ్గఱ

నుండి దక్షుని వఱకు వంశాభివర్ణనమును గావించితిరి. తర్వాతఁ
బ్రియవ్రతునకు అగ్నీధ్రాది యేడుగురు పుత్రులుండిరనియు
వారు సప్తద్వీపముల కధిపతులైరని చెప్పితిరి. అగ్నిధ్రమహారాజు
నకు నాభి, కింపురుష హరి వర్షాది తొమ్మిదిమంది పుత్రులుద
యించిరి. వారి పేరులతోడనే నవవర్షములు ప్రసిద్ధములయ్యెను
గదా! నాభికి స్వయముగ సాక్షాద్భగవంతుఁడగు ఋషభ
దేవుఁడవతరించెను దానిని మీరు వర్ణించితిరి. ఋషభదేవు
నకు భరతాది నూర్గురు పుత్రులుదయించిరి. అందఱిలో భర
తుఁడు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుడును. భరతునిప్రసంగమున మీరా
తని మూఁడుజన్మముల కథనుజెప్పితిరి భరతుఁడు హరిణమయ్యెను.
హరిణమునుండి జడభరతుఁడయ్యెను. జడభరతునకును రహూ
గణ మహారాజునకును జరిగిన సుందర ఆధ్యాత్మిక సంవాదమును
గూడ నీప్రసంగమున నభివర్ణించితిరి. ఇప్పుడు నేను భరతుని
తర్వాత మనుపుత్రుఁడగు ప్రియవ్రత మహారాజుయొక్క వంశ
వర్ణనమును వినఁగోరుచున్నాను. భరతునితర్వాత నాతని వంశ
మందింకెవరు ప్రతాపశాలురగు రాజులుదయించిరి. రాజు
లెందఱో యుండియుండవచ్చును. వారితో మాకుప్రయోజన
మేమి? వీరిలో భగవద్భక్తులెవరో వారి చరిత్రలను వినిపింప
వలయును."

ఇది వినఁగానే శుకుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై రాజును
ప్రశంసించుచు నిట్లనెను:- "రాజా! నీవు యదార్థమగు శ్రో
తవు. శ్రోతయొక్క విశేషత యెట్లుండవలయుననఁగా నాతఁడు
కథాప్రవాహమునఁబడి పోగూడదు. కథయొక్క పుట్టుకను

విస్మరింపనూరాదు. కథలోనెన్ని శాఖోపశాఖలు బయలు వెడలి నను మూలమును బోనీయరాదు. నీకు కథాప్రసంగమంత యును జ్ఞాపకమున్నది. మంచిది, ఇఁక నేను భరతుని తర్వాత వంశవర్ణమును గావించెదను. మనువంశ మనంతమైనది దేవ తలును వేలకొలఁది సంవత్సరములు వర్ణించినను బూర్తికా నిది; కాని నేను నీకత్యంత సంక్షేపముగ నిర్దేశము మాత్రము కావించెదను. వీరిలో విశేష జ్ఞానులు, కర్మకాండులు, భగవ ద్భక్తులు గలరు. వీరి సంబంధమున గొంచెముగ సాధారణ ముగ విస్తరించెదను. కొకున్న నామనిర్దేశము చేయుచుఁ బో యెదను. ఇఁక సావధానముగ వినుము."

భరతునకు సుమతి, రాష్ట్రభృత్, సుదర్శన, ఆవరణ, ధూమ్ర కేతు అను నైదుగురు పుత్రులు పుట్టిరి. ఈ విషయమును నేనిదివఱకే భరతచరిత్ర ప్రసంగమునఁ జెప్పియే యుంటిని. ఈ యైదుగురిలో సుమతి శ్రేష్ఠుఁడు, ఆతఁడును ఋషభదేవుని వలె అవధూత దిగంబరుఁడయ్యెను. కలియుగములోఁ బ్రచార ముగు జైన సంప్రదాయులు రాజర్షి సుమతినే జిన లేక అర్హ త్‌గా భావించి పూజించెదరు. సుమతి జిన కు దేవాజిన్నామ కుఁడగు ఋతుఁడుదయించెను. దేవజిత్తునకు దేవద్యుమ్నుఁడు, ఆతనికిఁ బరమేష్ఠి, పరమేష్ఠికి ప్రతీహారుఁడు పుత్రుఁడయ్యెను. ఆఁతడు గొప్పధర్మాత్ముఁడును, ఆత్మవిద్యావిశారదుఁడు నయ్యెను. ఆతఁడు స్వయముగ జ్ఞానియేకాక జ్ఞానోపదేష్ట యును, ఆచార్యుఁడును. ఆతఁడనేకుల కాత్మవిద్యోపదేశమును గావించి, స్వయముగ శుద్ధచిత్తుఁడై స్వయముగ సాక్షాచ్ఛ

మన్నారాయణుని సాక్షాత్కార మొనర్చుకొనెను.

ఆ ధర్మాత్ముఁడగుఁ బ్రతీహునకు సువర్చలయను బత్ని యందు ప్రతిహర్త, ప్రస్తోతుఁడు, ఉద్గాతలను బుత్రులు దయించిరి. వారు కర్మకాండయందు నిష్ణాతులైరి. యజ్ఞాది కర్మలందత్యంత నిపుణుఁడని ప్రసిద్ధినిఁజెందెను. వారిలోనందఱ కంటె శ్రేష్ఠుఁడగు బ్రతిహర్త స్తుతియను రాజపుత్రిని వివాహమాడెను. ఆమె గర్భమునుండి అజ, భూములను నిద్దరు సుతులుదయించిరి. పెద్దరాకుమారుఁడగు నజుఁడూర్ధ్వరేతుఁడై బ్రహ్మచారియయ్యెను. అందువలన భూముని వంశమే విస్తృత మయ్యెను.

భూముని భార్య ఋషికుల్య. ఆమెగర్భమునుండి ఉద్గీథుఁడను బుత్రుఁడుదయించెను. ఉద్గీథునకు దేవకుల్యయను బత్ని యందు ప్రస్తావుఁడుదయించెను. ప్రస్తావునకు విభుఁడు, విభునకు పృథుషేణుఁడు, ఆతనికి నక్తుఁడు, నక్తునకు ద్రుతియను బత్ని యందు ఉదారకీర్తియు, పరమయశస్వియు రాజర్షి ప్రవరుఁడగు గయుఁడుదయించెను. ఆతనికీర్తి యింతవఱకును బ్రపంచమున వ్యాపించియున్నది. ఈ తఁడు గొప్ప కర్మిష్ఠియు, దాతయు, నుదారుఁడును, మహామనస్వియునయ్యెను. ఈతఁడు తన సర్వస్వమును యజ్ఞయాగాది శుభకర్మలందు వినియోగించి సదుపయోగ మొనర్చెడువాఁడు. ఆతఁడు తన ప్రజలను నౌరస పుత్రులవలెఁ బోషణ, లాలన, పాలన, ప్రీణన, మనోరంజనము నొనర్చెను. ఆతఁడు నిరంతరము యజ్ఞయాగాదులందు నిమగ్నుఁడై యుండెనుగాని స్వయముగ నాయజ్ఞములచే

సాంసారిక కామనలనుంచు కొనెడువాఁడు కాఁడు. చేసిన దంతయు నాక్షణముననే కృష్ణార్పణమనెడువాఁడు. "నాయీ యజ్ఞాది కర్మలచే సర్వాంతర్యామియగు శ్రీకృష్ణుఁడు ప్రసన్నుఁడగుఁగాక !" అని యీ విధముగ నిష్కామకర్మ మొనర్చుటచే నాతని యంతఃకరణము నిర్మలాదర్శమువలె స్వచ్ఛమయ్యెను. ఆతఁడు సదా సత్పురుష, సాధు, మహాత్ములను జ్ఞానులను భగవద్భక్తులను నవ్యగ్రభావముచేఁ జరణసేవ లొనర్చుచుండెను. సాధుసజ్జనులను శ్రద్ధతో సేవించిన, వారి సేవలకు సంతుష్టులై సాధువులు తమవద్దనున్న సర్వశ్రేష్ఠవస్తువును బ్రసాదించెదరు. సాధుపురుషులవద్దనున్న సర్వశ్రేష్ఠమగు నిధియేమి? త్రైలోక్యపావనమగు సుమధుర మనోహర భగవన్నామము" రాజర్షియగు గయుఁడును సాధువుల వలన భగవన్నామమునుబొంది, నామకీర్తన మొనర్చుచు, ధ్యానము చేయుచుండెను, ఆమూలమున నాతనిచిత్తము విశుద్ధమయ్యెను. ఇప్పుడాతనికి దేహాది అనాత్మ పదార్థములందు ఆత్మబుద్ధిలేదు. ఆతని యహంభావము తొలఁగిపోయెను. ఆతఁడు యథార్థమగు నాత్మస్వరూపమును దెలిసికొని, దానిని బ్రహ్మరూపముగ ననుభవించుచుండెను ఇంతటి జ్ఞానియు ధ్యానియు, విరక్తుఁడు నయ్యు నాతఁడు కర్తవ్యమునకు వశీభూతుఁడై సాంసారిక భోగములందిసుమంతైన స్పృహ లేకయే రాజ్యకార్యములను మిక్కిలి సావధానముగఁ జేయుచుండెడువాఁడు.

రాజర్షియగు గయుఁడొక్క యజ్ఞమునుగాదు అసంఖ్యాకములగు యజ్ఞముల నొనర్చెను. కృత, త్రేతాది యుగము

లందు యజ్ఞసమయమున దేవతాగణము స్వయముగ సాక్షాత్తుగఁ దమతమ స్వరూపములతో వచ్చి, యజమానుఁడొసంగిన హవిర్భాగములను దివ్యశరీరములతోఁ బంక్తిలోఁగూర్చుండి గ్రహించెడువారని వినికిడి. ఒకసారి గయుఁడొక గొప్ప సోమయాగము నొనర్చెను. ఆ యజ్ఞమందు సోమలతలోని రసమును బ్రాగెదరు. ఈ లత కలియుగములో లుప్తప్రాయమగును. అన్యయుగములందది యుండును. దీని నమ్మెడు బ్రాహ్మణుఁ డధముఁడుగ నెంచఁబడెడువాడు. ఈ లతయొక్క విశేషమేమనఁగా అమావాస్యనాఁడు దీనియందొక పత్రమైన నుండదు. పాడ్యమినాఁడొక యాకువేయును. విదియనాఁడు రెండును, తదియనాఁడు మూఁడును ఇట్లు ప్రతినిత్యము పెరుగుచు పూర్ణిమకు పదునైదు పత్రములు వేయును. తర్వాత నొక్కొక్కటి రాలిపోవుచుండును. అమావాస్యకు అన్నియు రాలిపోవును. సోమవిక్రేతలగు విప్రులు దీనిని మంత్రముల ద్వారా కోసి యమ్మెదురు. దీనినినొక్కి రసము తీయాదరు. అది దీపిగను, మత్తుగను నుండును. దాని నధికముగ సేవించుచో మానవుఁడు సురాపానము చేసినవానివలె మత్తుఁడగును. గయుని యజ్ఞమందు సోమరసమెక్కుడుగఁ దీయఁబడినది. దాని చసక పానపాత్రలందు నింపి విధ్యుక్తమగు మంత్రములతో దేవతల నాహ్వానించి వారికీయఁబడినది. ఆయజ్ఞమందు దేవేంద్రుఁడు సంతోషమున నున్మత్తుఁడగునంతగ సోమరసమును బానము చేనాఁడని వినికిడి.

ఆ యజ్ఞములందు యజ్ఞపతియగు వాసుదేవుఁడు ప్రత్యే

క్షమై రాజర్షి యొసంగిన హవిర్భాగమును గ్రహించెను. భగవంతుఁడు నిత్యతృప్తుఁడే అయిన నుపచారముచే యజ్ఞములలో నాతఁడు తృప్తుఁడై సంతోషించినచో దేవతలు, మానవులు, పశుపక్ష్యాదులు, కీట, పతంగ, తిర్యక్, జలచర, స్థలచర, నభచర, తృణ, వృక్ష, లతాగుల్మాదులన్నియును దృప్తిఁజెంది సంతోషించును. రాజర్షియగు గయుఁడు భగవంతుని కళావతారము.

దక్షుని పుత్రికలును, ధర్ముని పత్నులును, సమస్త లోకమాతలునగు, శ్రద్ధా, మైత్రి, దయ, శ్రీ మొదలగువారు గంగాయమునా సరస్వత్యాది పుణ్యసరిత్తులతో స్వయముగ రాజ్యాభిషేక మొనర్చిరి. ఆ రాజర్షియగు గయుని మహాత్తు నెవరు వర్ణింపఁగలరు? పృథివి ఆతని రాజ్యమందు కోరిన సమస్త వస్తువులను బ్రసాదించెడిది. ఇంద్రుఁడవసరము వచ్చినపుడంతయు వర్షమును గురిపించుచుండెను. వాయువు సమయానుసారముగ శీతోష్ణ మంద తీవ్ర సుగంధితుఁడై వీఁచుచుండెను. ప్రజలు తమ తండ్రివలెను, దేవతలవలెను, ఇష్టదేవతవలెను సన్మానించెడువారు. ఆతఁడు సమస్త కర్మలను ఫలేచ్ఛలేక నిష్కామ భావముతోఁ జేయుచున్నను నాతని సమస్త కోరికలు నెఱవేరుచుండెను. ఆతఁడు కోరిన వెంటనే కోరికలు నెఱవేరెడివి. ఆతని శస్త్రములమోఘములు. ఆతని బాణములు విశ్వవిజయములు ఆతఁడేయుద్ధమునకుఁ బోయినను విజయమును బొంది వచ్చెడువాఁడు. ఆతనికి పృథివిలో శత్రువులనెడు వారెవ్వరును లేకుండిరి. అందరును మిత్రులే. రాజులం

బును దా నలంకరించెను
విను మిందాృ వరజుఁడయిన విష్ణుని మాడ్కిన్ ॥
(శ్రీమదాంధ్ర భాగవతము.

పౌరాణిక కథలకుఁ బ్రాచీన పరిపాటి యేమనఁగా– నేవిషయమును వర్ణించినను యథాశక్తిగఁ బూర్ణము కావించెదరు; ఏలననఁగా– నాప్రభువు బూర్ణుఁడు. యథాశక్తియని యేల ననవలసి వచ్చినదనఁగానే వస్తువును యథార్థముగని బూర్ణముగ వర్ణించుట నేఁటి వఱకును జరుగలేదు, జరుగఁబోదు. పూర్ణముగ వర్ణింపఁబడుచో దానిలో నింక మిగులునది యుండదు, మన పాత్రలోని పాలు త్రాగిన యెడలఁ బాత్ర ఖాళీయగును, కొంచెమైనను మిగులదు; కాని బ్రహ్మ సంబంధమునఁ బూర్ణములోఁ బూర్ణమును దీనివేసినచోఁ బూర్ణమే మిగులును. అది యెన్నటికిని నపూర్ణము, నిశ్శేషమును గాదు.

శుకదేవుఁడిట్లనెను:– "రాజా! నేను నీకు రాజర్షి గయుని చరిత్రమును వినిపించితిని. ఇప్పుడు గయమహారాజు నుండి తర్వాత ధర్మాత్ముఁడగు మనుపుత్రుఁడగు బ్రియవ్రతుని వంశమును వినుము. గయుని ధర్మపత్నియగు గయంతి యందు చిత్రరథుఁడు, సుగతి, అవరోధనుఁడును ముగ్గురు పుత్రులుదయించిరి. చిత్రరథుని భార్యయగు ఊర్ణయందు మహారాజును సామ్రాట్టును నతఁడుదయించెను. సమ్రాట్టునకు ఉత్కలయను బత్నియందు మరీచియను సుతుఁడుదయించెను మరీచికి బిందుమతి యను నామెయందు బిందుమంతుఁడను దేజస్వి పుత్రుఁడుదయించెను. బిందుమంతునకు సరఘు

యాను స్త్రీయందు మధువను రాజర్షియుదయించెను. మధువు
నకు సుమనయను ధర్మపత్నియందు వీరపుత్రుఁడను సుతు
డుదయించెను వీరవ్రతునకు భోజయను భార్యయందిరువురు
పుత్రరత్నములుదయించిరి. వారు జగత్తులో మంథు, ప్రమంథు
లను పేరఁబ్రసిద్ధులైరి. మంథు సత్యయను భార్యను బాణిగ్ర
హణ మొనర్చుకొని ఆమె వలన ధర్మపూర్వకముగ భౌవనుఁ
డను జక్రవర్తి పుత్రునిఁగనిరి. భౌవనుఁడు దూషణవలనఁ
ద్వష్టయు, త్వష్టకు విరోచన వలనఁ బరమ యశస్వియును.
తేజస్వియును, భగవద్భక్తుఁడునగు బుత్రుఁడు విరజుఁడను
వాఁడు పుట్టెను. ఆవిరజునకు విషూచియను పత్నియందు శత
జిద్వాది నూరుగురు పుత్రులును, నొక కన్యయుఁగలిగెను.
విరజుని తర్వాత నీవంశములో నింకను జాలమంది రాజులుద
యించిరి; కాని విరజుఁడందులో నద్వితీయుఁడు. రాజర్షియగు
విరజుఁడీ వంశములోఁ జివర పరమ ధార్మికుఁడును, శ్రేష్ఠమగు
కీర్తికలవాఁడును బ్రసిద్ధ చక్రవర్తియయ్యెను. రాజా! నేన
త్యంత సంక్షేపముగ రాజర్షియు మనుపుత్రుఁడగు ప్రియవ్ర
తుని వంశమును వర్ణించితిని. ఇప్పుడింక నేమి వినఁగోరుచు
న్నావు?"

శుకుని యీ సుఖకర వచమును విని పరీక్షిత్తు ఇట్ల
నెను:— "ప్రభూ! మను వంశచరిత్రము నంతయుఁ బూర్ణవిస్తా
రముగ వినవలయునని నాకోరిక. ఈపృథివియంతయును బూర్వ
మొక్కటియేననియు, ప్రియవ్రతుఁడు తన తేజోమయ విమా
నము నెక్కి యేడుసార్లు పరిక్రమ మొనర్చెనని యిది వఱకు చెప్పి

తిరి. దానివలననే సప్త సముద్రములును, సప్త ద్వీపములయ్యె నని నేనాద్వీపముల సమగ్ర వృత్తాంతమును వినఁగోరుచు న్నాను. ఆ ద్వీపములలోఁ బ్రియవ్రతుని వంశజులెవరెవరు రాజ్యమొనర్చిరో, వారి వృత్తాంతమునంతయును సవిస్తార ముగఁ జెప్పుడు."

నైమిశారణ్యమందు సూతుఁడు శౌనికాది మునులతో నిట్లనెను:– "మునులారా! పరీక్షిన్మహారాజిట్లడుగఁగా నా గురు దేవుఁడగు శుకమహర్షి సప్త సముద్రములు, సప్తద్వీపములు, నవఖండములు, భూలోక స్థానములు, భువర్లోక, స్వర్గలోక ములోని నక్షత్ర, తారాసూర్య, చంద్రాది గ్రహములను, క్రిందనున్న అతల, వితలాది సప్తలోకముల వృత్తాంతమును జెప్పెను. మునులారా! ఈ కథా ప్రసంగమందు నేను వాటి నన్నిటి వృత్తాంతమును జెప్పను. మునులారా! వీనియొక్క విస్తార వర్ణనము వీలైనచో భూగోళ, ఖగోళ ప్రకరణమునఁ జెప్పెదను. నేను రాఁబోవు కథను వర్ణింప నాజ్ఞయిండు." శౌనకుఁడిట్లనెను:– "సూతా! మాకీ నీరస విషయమందేమంత పట్టుదల యేమియును లేదు మీాయిష్టము. కథను గలుపుటకీ విషయమును సంక్షేపముగనే చెప్పుడు."

అంత సూతుఁడిట్లనెను:– "మంచిది స్వామీ! వినుఁడు మను పుత్రుఁడగు ప్రియవ్రతునకు అగ్నీధ్రుఁడు, ఇధ్మజి హ్వుఁడు యజ్ఞబాహువు, మహావీరుఁడు, హిరణ్యారేతుఁడు, ఘృతపృష్ఠుఁడు, సవనుఁడు మేధాతిథి, వీతహోత్రుఁడు కవి యను బదుగురు పుత్రులుండిరని యిదివఱకే చెప్పితిని. వీరిలోఁ

గవి. మహావీరుఁడు, సవనుఁడు వీరు ముగ్గురును సూర్య కేత
స్కులగు బ్రహ్మచారులు, వారు గృహస్థాశ్రమమును స్వీక
రించలేదు. ద్వైతము లేక సృష్టిలేదు. వంశములేక వేదము
లేదు. అదే విధముగ భార్యలేక వంశవృద్ధిలేదు. అందువలన
వీరి వంశము వృద్ధిపొందనులేదు. వీరే దేశమునకును రాజులును
గాలేదు వీరెన్నటికిని నశింపని అఖండరాజ్యమును బొందిరి.
ఇఁక నేడుగురు మిగిలిరి, వీరేడుగురును గ్రమముగ సప్తద్వీప
ములకధిపతులైరి. జంబూద్వీపమునకు అగ్నీధ్రుఁడు రాజ
య్యెను. ప్లక్ష ద్వీపమునకు ఇధ్మజిహ్వుఁడును. శాల్మలమునకు
యజ్ఞబాహుఁడును, కుశద్వీపమునకు హిరణ్యరేతుఁడును,
క్రౌంచ ద్వీపమునకు ఘృతపృష్ఠుఁడును, శాకద్వీపమునకు
మేధాతిథియు, పుష్కర ద్వీపము వీతహోత్రుఁడును రాజులైరి
అగ్నీధ్రుని వంశవర్ణనమును జేసియేయుంటిని. ఇప్పుడు మిగిలిన
ఆఱుగురు సోదరుల వంశవర్ణనమును వినుము, ఒక్క విషయ
మును జ్ఞాపకముంచుకొనుఁడు, మానవోత్పత్తి కేవలము
భారత వర్షమందే. భారత వర్షమందు తప్ప మిగిలిన నాలు
ద్వీపములు, ఎనిమిది ఖండములందు యోగులు తప్ప మానవు
లెవరును భౌతిక సాధనములతోఁ బోజాలరు. ఇవి భౌమ
స్వర్గమని యెన్నఁబడినవి. వీనియందల్లే ఉపాసనలోనర్చెదరు.
సాధారణముగ వర్ణాశ్రమ వ్యవస్థ సామాన్యముగఁగలదు;
కాని యీ ద్వీపములలోనికి మానవులు స్వర్గశేష సుఖముల
ననుభవింపవచ్చుచుందురు. వీరికి వేలకొలఁది సంవత్సరముల
ఆయుస్సు ఉండును వీరు దేవతలవలె విషయ సుఖముల నను

భవించెదరు. ఈ ద్వీపములందు జీవన చింతయుండదు. నదులు, వృక్షములు సమస్త జీవనోపయోగ సామగ్రిని స్వయముగఁ బ్రసాదించును. ఇచ్చట వృద్ధావస్థయుండదు. ఎక్కువ సంతానముండదు. స్త్రీలు జీవితములో నొక్కసారియే గర్భధారణ మొనర్చెదరు. సారాంశమేమనఁగా-నీ ద్వీపములందు స్వర్గసుఖములన్నియునుండును. అచ్చట యుగములకల్పన లేదు త్రేతాయుగమువలె సర్వదా కాలముండును, ప్లక్ష ద్వీపాధిపతియగు నిధ్మ జిహ్వునకేడ్గురు పుత్రులుదయించిరి. వారు శివ, యవస, సుభద్ర, శాంత, క్షేమ, అమృత అభయులనువారు. ఇధ్మ జిహ్వామహారాజు తన ద్వీపము నేడు భాగములుగ నొనర్చి, తన యేడ్గురు పుత్రులపేర నొసంగెను. ఈ యేడు ఖండములు వీరిపేర విఖ్యాతినిఁజెందెను. శాల్మలీద్వీపాధిపతి మనుపుత్రుఁడగు యజ్ఞబాహువు, ఆతనికిని నేడ్గురు పుత్రులుదయించిరి. వారు సురేచన, సౌమనస్య, రమణక, దేవవర్ష, పారిభద్ర, ఆప్యాయన అవిజ్ఞాతులనువారు వీరి తండ్రియును వీరనామములచేఁ దన ద్వీపమునుగూడ ఏడు ఖండములుగ నొనర్చెను. వారి నామములతోడనే అవి విఖ్యాతినిఁ జెందెను కుశద్వీపాధిపతి మనుపుత్రుఁడగు హిరణ్యరేతుఁడు. ఆతనికి వసు, వసుదాన, దృఢరుచి, నాభిగుప్త, సత్యవ్రత, వివిక్త, వాసుదేవులను యేడ్గురు పుత్రులుదయించిరి. వారును దమ ఖండమును నేడుభాగములు నొనర్చి. ఆ యేడ్గురపేర్లచే సప్తవర్షములు ప్రసిద్ధములయ్యెను

క్రౌంచద్వీపాధిపతి మనుపుత్రుఁడగు ధృతపృష్ఠుఁడు

సంయోగవశమున నాతనికిని ఆమ, మధురుహ, మేరుపృష్ఠ, సుధామ, భ్రాజిష్ఠ, లోహితార్ణ, వనస్పతియను నేడ్గురు పుత్రు లుదయించిరి. వారి తండ్రి యాజ్ఞచేఁ దమ ద్వీపమును నేడు భాగములుగ నొనర్చి, వారివారి నామములచే వర్షములను స్థాపించిరి. శాకద్వీపాధిపతి మనుపుత్రుఁడగు మేధాతిథి, ఆతని కిని బురోజవ, మనోజవ, పవమాన, ధూమ్రానీక, చిత్రరేఫ, బహురూప, విశ్వాధారులను నేడ్గురుపుత్రు లుదయించిరి. వారిపేరట శాకద్వీపమందు నేడు వర్షములు విఖ్యాతముల య్యెను. చివరవాఁడగు వీతహోత్రుఁడు పుష్కరద్వీపాధిపతి. ఆతనికి రమణక. ధాతకి యను నిద్దరుపుత్రు లుదయించిరి. వారి ద్దరిపేర్లతో నాద్వీపమునకు రెండువర్షములేర్పడెను. ఇప్పటికిని ఆ ద్వీపములందు వారేరాజ్యమొనర్చుచున్నారు. వారిపుత్రపౌ త్రులునుండిరి. మునులారా! ఈ విషయము నాకు తెలియదు. నాకు గుర్తున్నంతవఱకు వారే రాజులుగ నుండియుందురు,

జంబూద్వీపాధి పతియగు నగ్నీధ్రునకు నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాల అను తొమ్మిదిమంది పుత్రులుదయించిరని నేనిది వఱకే చెప్పియుంటిని. వారిలో నాభియే యీనాభీవర్షమునకు రాజయ్యెను. చివరకు భరతుని ప్రస్తావమున భరతవర్షము, భరత ఖండమను పేరఁబ్రసిద్ధినిఁజెందెను. ఆనాభి వంశచరిత్రమును నేను చెప్పియేయుంటిని. జంబూద్వీపమునకుఁ దొమ్మిది ఖండ ములు. ఈ ద్వీపమన్నిటికిని మధ్యనున్నది. మిగిలిన నాఱుఖండ ములను, ఆఱుసముద్రములచేఁ జుట్టుకొనఁబడిన, ఒకదాని

తర్వాత నొకటి యీ విధముగనున్నవి. ఈ జంబూద్వీపమం దును నన్నిటికిని మధ్య ఇలావృతవర్షమున్నది. ఈ యిలావృత ఖండమందు దివ్యసువర్ణమయమగు మేరుపర్వతముకలదు. అది పృథివికి క్రిందకునున్నది, స్వర్గము, ధ్రువలోకమువఱకు వెళ్ళి పోయినది. ఈ సుమేరువుయొక్క యెనిమిది శిఖరములందు అష్టదిక్పాల పురములున్నవి. కమల మధ్యమునఁ గర్ణికార ముండి, చుట్టును దళములున్నట్లు, ఇలావృతఖండము మధ్యము నను, మిగిలిన నెనిమిది చుట్టును దాని నానుకొనియుఁగలవు. భరతవర్షముగాక మిగిలిన నెనిమిది ఖండములు భూస్వర్గములు.

అంతశౌనకుఁడిట్లడిగెను:- "సూతా ! ఈ చర్మ చక్షు వులతో నేమీ మిగిలిన నెనిమిది వర్షములను సుమేరు పర్వత మును జూడఁజాలకున్నాము. ఆ ఖండములును, ఆ వర్షము లును నున్నవని మేమెట్లు నమ్మవలెను. మాకు లవణసముద్ర ముతప్ప ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జల సముద్రములు కనఁబడుటలేదు. ఇవిదూరమున నుండుఁగాక. ఈ యెనిమిది ఖండములు జంబూద్వీపము నానుకొనియున్నవి. వీనిలోనికిఁ బ్రవేశింపవలయుననిన నీద్వీపములకుఁ బోవుటకు భారతవర్షము నుండి మార్గమేమియునులేను. భారతవర్షమే కనఁబడును, మిగి లినద్వీపములు కనబడవని నీవనుచో సముద్రమున కావలనున్న తెల్లగనున్న దస్యూదేశములందును, చీనాది దేశములును భారతదేశమునకు వేఱైనవిగదా ! ఇవి యే వర్షములలోనికి వచ్చినవి.?"

అంతసూతుఁడిట్లనెను:- "మహాభాగా ! ఈ విషయ

మును గుఱించి విస్తారపూర్వకముగ వర్ణనము భూగోళ, ఖగోళ సంబంధమునఁజేసెదను. నేఁడుకనఁబడు ద్వీపములు ఉపద్వీపములును,మానవులు చేరఁగలిగినంతవఱకు కనబడునవి అన్నియును భారతవర్షాంతర్గతములే.మనకుఉప్పునీటితోఁగనబడునదిసముద్రముకాదు, సాగరము. మహాసముద్రముచాలదూరముననున్నది. అఱువదివేలమంది సగరపుత్రులు తమ యాగాశ్వము నన్వేషించుటకై నాల్గువైపులను దిలివ్విరి, అందువలన దీనిసంబంధము మిగిలిన అష్టవర్షములభూమితోఁ బూర్తిగా విచ్ఛేదము చెందినది. ఇప్పుడు భారతవర్షమునకు నలువైపులను సాగరమేర్పడెను అందువలన పదిపండ్రెండు గొప్పగొప్పద్వీపములేర్పడి, వానిలో సముద్రముమీఁద బ్రతుకు నిషాద, ఆభీరులు వర్ణాశ్రమేతరులు నివసించుచుండిరి, ఆద్వీపములందధికముగ శీత ముండుటచే నచ్చటివారి చర్మము తెల్లగనయ్యెను. కొందఱు పచ్చగనుండిరి. వాస్తవమున నివియన్నియును భారతవర్షమునకు సంబంధించిన ద్వీపోపద్వీపములే. ఏలననఁగా వీనిలో వర్ణాశ్రమస్థులు నివసించక పోవుటచేఁ గన్యాకుమారినుండి హిమాలయప్రదేశము వఱకే భారతవర్షమనఖ్యాతి యేర్పడినది. అనఁగా వర్ణాశ్రమధర్మముగల భారతవర్షమన్నమాట, కలియుగమందీ దస్యులే రాజులయ్యెదరు, వీరే తమభౌతికబుద్ధిచే భౌతికావిష్కారణమొనర్చి తామే సమస్తవిషయములలోఁ బండితులమనిచెప్పుకొనుచుందురు. ఈ యనార్యులబుద్ధియెంత సంకుచితముగానుండుననఁగా వీరు మహాభారతేతిహాసమునకుఁ బూర్వపుచరిత్రము నంగీకరింపరు, వీరు భారతవర్షమునే ప్రపంచమనుచు నీయితి

హాసమునే కృతిమరూపమునఁజెప్పెదరు. స్వామీ ! ఇదియుగ ధర్మము. ఇందెవరి దోషమును లేదు. ఇప్పుడింక ముందు నేను మరలఁ బ్రసంగానుసారముగ దృష్టిసారించెదను సత్యము,కల్ప నమునుగూర్చిన విషయమున్నది చాలమంది అద్వైతవేదాంతా చార్యులీదృశ్య జగత్తును త్రికాలములందును నున్నదని అంగీక రింపరు. వారిమతమున నీ దృశ్యజగత్తు ఇదివఱకు లేదు, ఇప్పు డుండలేదు, ముందుండఁబోదు. ఇది వంధ్యాపుత్రివలెను, శుక్తి రజతమువలెను, రజ్జు సర్ప భ్రాంతివలె మిధ్యగానున్నది. స్వామీ! ఈ పూర్ణ ప్రపంచమే కల్పితమైనప్పుడు, మాయా ఖేలనమైనపుడు, ఈ ద్వీపఖండములును, వర్షాదులును గల్పిత ములు కాకపోవునా? ఈనదీ, నద, నగ, నీరథి, నగర గ్రామా దులు సత్యములగుచో ద్వీప, ఖండ, సముద్రాదులును సత్య ములే. ఈజీవుఁడు తనకర్మములద్వారా నానాయోనులలో భ్ర మించుచు సుఖ దుఃఖము లనుభవించును ఎనుఁబదినాల్గు లక్షల యోనులలో భ్రమించుచుండును ఒక్కొక్కప్పుడు స్వర్గము నకుఁబోయి భోగములనుభవించును ఒక్కొక్కప్పుడు నరక మునకుఁబోయి నానా యాతనల ననుభవించును. నరక స్వర్గ ములనుండి బయటకువచ్చి భూమిపై జన్మించును. ప్రారబ్ధ కర్మానుసారముగ నానా యోనులలో భ్రమించుచుండును. దీనినే సంసార చక్రమందురు. భూ ర్భువ, స్సువ, మహా, జన, తప, సత్యలోకము లూర్ధ్వలోకములు. అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళములను నేడును నధో లోకములు. ఈ పదునాల్గు లోకములు ఒక బ్రహ్మాండమగును

ఇట్లసంఖ్యాకములగు బ్రహ్మాండములీ విశ్వమందు వ్యాపించియు న్నవి. పృథివియందెనిమిది ఖండములు, ఆఱు ద్వీపములు భూ స్వర్గములు. క్రిందనున్న భూవివర స్వర్గము అనఁగాఁ బాతాళ స్వర్గమందురు, ఈ క్రింది లోకములలో స్వర్గమునకంటెను నధిక సుఖమున్నది. భూలోకమునకుఁబైన దివ్య స్వర్గమున్నది ఇవిగాక భూమికి క్రింద చాల నరకములు కలవు. వాటిలోఁ బాపులు పాపము ననుభవించెదరు."

ఇది విని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! నరక మేమిటి? ఈ లోకము వాస్తవముగ నున్నదా? లేక భయపెట్టుటకై కల్పింపఁబడినదా? ఇవియున్నచో నివి యెచ్చటనున్నవో చెప్పుఁడు."

ఈమాటను విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! ఈ విషయమును బరీక్షిన్మహారాజు మాగురు దేవుఁడగు శుకమహర్షిని అడిగినాడు. ఆ ప్రసంగమును నేనిప్పుడు నీకు వర్ణించెదను. మీరందఱును దత్త చిత్తులరై యీ ధర్మ మర్మము నెఱింగించు నీయావశ్యక విషయమును శ్రవణ మొనర్పుఁడు"

పూర్తి



# శాశ్వత మహారాజ పోషకులు - రు. 101

1) శ్రీ ప్రభుదత్తజీ బ్రహ్మచారిగారు, బృందావనము
2) శ్రీ అవధూతేంద్ర సరస్వతీస్వాములవారు
3) శ్రీ సత్యజ్ఞానానందేంద్ర సరస్వతీస్వాములవారు
4) శ్రీ ఈవర రామస్వామిగారు, వంకాయలపాడు
5) శ్రీ పాలడుగు సుబ్బారావు, జయపురము
6) శ్రీ బాచు లక్ష్మీనాంచారయ్యగారు, V. కొత్తపాలెం
7) శ్రీ రాగం ఆంజనేయులుగారు, గుంటూరు
8) శ్రీ మావులేటి ఈశ్వరరాజుగారు, గుండుగొలను
9) శ్రీ మొవ్వ గోవిందుగారు, రావిపాడు
10) శ్రీ ముందుండి వేంకట్రాజుగారి భార్య సత్యవతమ్మగారు, పాలకోడేరు
11) శ్రీ కె. రామచంద్రరావు, విశాఖపట్టణము
12) శ్రీ బి. నాగరాజుగారు, విశాఖపట్టణము
13) శ్రీ యస్. గురువులుగారు, విశాఖపట్టణం
14) శ్రీ యమ్. వి. సూర్యప్రకాశంగారు, గుంటూరు
15) శ్రీ పి. జి. సి. రంగరాజుగారు, విజయనగరం
16) శ్రీ డా॥ కె. రాజేశ్వరిగారు, విశాఖపట్టణం
17) శ్రీ కంబంపాటి వెంకటప్పయ్యగారు ,,
18) శ్రీ డి. వి. యన్. ఆర్. కృష్ణయ్యగారు ,,
19) శ్రీ డా॥ బెండపూడి పేర్రాజుగారు ,,
20) శ్రీ హరి లక్ష్మీపతిగారు, శ్రీకాకుళం
21) శ్రీ దాసు ఆదినారాయణగారు విశాఖపట్టణం
22) శ్రీ ఘంటా బ్రహ్మయ్యగారు, తెనాలి
23) శ్రీ దంటు కృష్ణమూర్తిగారు, విశాఖపట్టణం
24) శ్రీ వి. ఆర్. శర్మగారు, ,,
25) శ్రీ డా॥ పి. నీలాద్రిరావుగారు, ,,
26) శ్రీ చెరువు లక్ష్మీనరసింహంగారు, ,,
27) శ్రీ సి. వి. రమణమూర్తిగారు ,,
28) శ్రీ జె. ఎస్. ప్రకాశరావుగారు, బొంబాయి
29) శ్రీ డబ్ల్యు. వి. రామారావుగారు, విశాఖపట్టణం
30) శ్రీ కడియాల వెంకటరావుగారు ,,
31) శ్రీ వి. ఆర్ శర్మగారు, ,,
32) శ్రీ గజ్జల లక్ష్మీనరసింహారావుగారు అండ్ పూర్ణచంద్రరావు, బందరు.